# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 11 సంచిక : 8 హైదరాబాద్ 145 ఆగస్ట్ 2013 పేజీలు : 68 రు. 15

* ఇష్రత్ హత్య - ఎన్‌కౌంటర్ల నిజానిజాలు
* చెరిపెయ్యలేని గంటి ప్రసాదం ముద్ర
* అమెరికా నిఘా గుట్టు రట్టు
* వ్యవసాయ సంక్షోభం - ఆహార భద్రత
* తెలంగాణ - దిగ్విజయ్ మాయాజాలం
* మార్క్స్‌తో అమెరికా విలేఖరి సంభాషణ
* వ్యవస్థీకృతమవుతున్న అవినీతి

## విడి ప్రతి కొనుగోలుదారులకు గమనిక

తీవ్రమైన ఆర్థిక ఇబ్బందుల వల్ల వీక్షణం ఖర్చులు తగ్గించుకొనే కార్యక్రమంలో భాగంగా అచ్చువేసే ప్రతుల సంఖ్య తగ్గించబోతున్నాం. చందాదారులకు మినహా ఇతరులకు పత్రిక అందడంలో రానున్న రెండు మూడు నెలల్లో ఇబ్బందులు రావచ్చు. విడి ప్రతి ఏ నెలకానెల కొనుక్కునే వారికి పత్రిక క్రమం తప్పకుండా దొరకకపోవచ్చు. వీలయినంత వరకు అటువంటి పాఠకులందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాం.

– సర్క్యులేషన్ మేనేజర్

ISSN 2231-6892

145

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఆగస్టు 2013

సంపుటి : 11

సంచిక : 8

| వ్యవస్థాపక సంపాదకులు: | సంపాదకులు: | కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్: | కంపోజింగ్: | సబ్ ఎడిటర్ : | ఆఫీస్ అసిస్టెంట్ : |
|---|---|---|---|---|---|
| వి. హనుమంతరావు | ఎన్. వేణుగోపాల్ | వై. రామచంద్రం | సి. రాజశేఖర్ | ఎ. మల్లేశ్ | ఎస్. వెంకటేష్ |

## లోపలి పేజీల్లో...



### అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు

ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ద్యామర రేణుక; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నల్గొండ – గొడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; నెల్లూరు – బాలగురువయ్య; విజయనగరం – డి. సుధాకర్; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – డి. రవికుమార్



ప్రింటర్స్
డక్కన్ ప్రెస్ /
చరితా ఇంప్రెషన్స్
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
ఆనంద్ ఏజన్సీస్
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

వీక్షణం
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

### వీక్షణం చందా వివరాలు

| | సంస్థలకు / లైబ్రేరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ - **01391101100217**5

ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

ఇతర బ్యాంకులలో వేసేవారు ANDB 000/0139 నెంబర్ రాసి వేయవచ్చు.

**జూ**న్ 2013 వీక్షణం సంచికలో వరవరరావు రాసిన 'మళ్లీ నెత్తుటి మడుగులో విత్తనాల పండుగ' ఘటన చదువుతుంటే రాజ్యాంగ వ్యతిరేక, అరాచక రాజ్యంలోని పాలకులు గత చేదు అనుభవాల నుండి కూడ పాఠాలు నేర్చుకోలేని నిర్లక్ష్యంతో, నీతి లేకుండా వ్యవహరిస్తున్నారని స్పష్టమవుతుంది. సార్కెగూడ హత్యాకాండ జరిగి ఏడాది కూడ కాకముందే మళ్లీ విత్తనాల పండుగ సమయంలో అమాయకులైన ఎడ్సమెట్ట ఆదివాసులపై అమానుషంగా పోలీసులు కాల్పులు జరపడం అత్యంత హేయమైన అరాచక చర్య. నిరాయుధులైన ఆదివాసులను చంపడమూ, ఆ తర్వాత ఆ సంఘటనపై కంటి తుడుపు న్యాయ విచారణకు ఆదేశించడమూ మామూలై పోయింది. ఇకనైనా భవిష్యత్తులో ఇలాంటి దురదృష్టకర సంఘటనలు పునరావృతం కాకుండా చూడడం ప్రజాస్వామ్యవాదులందరి బాధ్యత. అంతకంటే ముందు చత్తీస్‌గఢ్ ప్రభుత్వ కనీస బాధ్యత.

జూలై సంచికలో పాలకుల దుర్మార్గానికి వేల ప్రాణాల బలి రాజవరం పార్థసారథి రాసిన వ్యాసం చదివితే ఉత్తరాఖండ్‌లో జూన్ రెండవ వారంలో జరిగిన బీభత్సానికి కారణం కేవలం మనిషే అనే అనామకజీవి కాదు అనే నిజం తెలుస్తుంది. ఆ మనిషి పేరు చెప్పి ఉద్దేశ పూర్వకంగా పాలక వర్గ కుటిల నీతి, అవినీతి, ప్రజా వ్యతిరేక విధానాలే కారణం. అక్కడి ప్రకృతి సమతౌల్యాలను ఘోరంగా దెబ్బతీసే విధంగా వందల జల విద్యుత్ కేంద్రాలను ప్రైవేటు పారిశ్రామిక, వ్యాపారవేత్తలకు అప్పగించడం ఒక కారణమయితే, ఖనిజ వనరుల అక్రమ తవ్వకాలు, దట్టమైన అడవులను నిర్దాక్షిణ్యంగా నరికి వేసి కాసుల కోసం పర్యాటక రంగాన్ని ఇబ్బడి ముబ్బడిగా విస్తరించడం మరో కారణం. లక్షల సంఖ్యలో యాత్రికులు సందర్శించే చార్‌ధామ్ క్షేత్రాల విషయంలో ఉత్తరాఖండ్ ప్రభుత్వం ముందస్తు జాగ్రత్తలేవీ తీసుకోక పోవడం వల్ల వేల సంఖ్యలో అమాయక ప్రజలు ప్రాణాలు కోల్పోవడం అత్యంత శోచనీయం.

**– పి. నారాయణరెడ్డి**
నాగార్జున సాగర్

**ఇ**ది అన్ని రకాలుగా చాలా ఎక్కువగా దురభిప్రాయాలున్న, ఏకపక్ష, సంకుచితాభిప్రాయాల పత్రిక. ఎప్పుడైనా ఈ పత్రికలో ఏమి ఉండబోతుందో ఎవరైనా సులభంగా ఊహించవచ్చు. ఇది చదవాలంటే పాఠకులు ఈ మూసలోనే ఉండాలి. అసహ్యకరం.

***– శ్రీరామ,*** ఊరిపేరు లేదు

**వీ**క్షణం పత్రిక నేడు వస్తున్న పత్రికలకు భిన్నంగా సమకాలీన విషయాలతో, మంచి విశ్లేషణలతో వస్తోంది. ప్రజా దృక్పథంతో ఉన్న వ్యాసాలను ప్రచురిస్తోంది. ఇది చాలా గొప్ప కృషి.

***– నవీన్,*** ఊరిపేరు లేదు

(ఈ రెండూ వీక్షణం బ్లాగ్www.veekshanam.wordpress.comపై ఇంగ్లిష్‌లో రాసిన వ్యాఖ్యలకు అనువాదాలు)

**జూ**న్, జూలై 2013 వీక్షణం సంచికలలో శ్రమ శక్తి ఉపయోగపు విలువ గురించి రంగనాయకమ్మ వ్యాసం చదివాక నాకు కలిగిన సందేహం. పెట్టుబడిదారుడు, శ్రామికుడు మధ్య ఉన్న సంబంధాలకి, మొట్టమొదటిసారి వివరించే సందర్భంలో కూడా అమ్మడం, కొనడం, సరుకు అన్న మాటలు వాడకూడదన్నారు రంగనాయకమ్మ గారు, అవి తప్పు అవగాహనని కలగజేసే ప్రమాదం ఉందని. వాటి బదులుగా ఏ పదాలు వాడాలో కూడా సూచిస్తే బాగుంటుంది.

**– డా. కె.ఇ. సూర్యకుమారి**
కాకినాడ

**జూ**లై సంచికలో రంగనాయకమ్మ వ్యాసం మీదా, లోక సంచారికి ఆమె ఇచ్చిన జవాబు మీదా ఎస్. జనార్దన్ రాసింది ఒక విమర్శగా లేదు. ఏదో ద్వేషంతో రాసినట్టు ఉంది. మార్క్స్‌కి మనం మర్యాద ఇవ్వడం అంటే మార్క్సిజాన్ని నేర్చుకోవడమే. అంతే కానీ మార్క్సిజాన్ని అర్థం చేసుకున్న ఒక రచయిత్రి, ఆ సిద్ధాంతంలోని ఒక అంశాన్ని వివరించేటప్పుడు చేసిన సంబోధన గురించి మాట్లాడ్డం కాదు కావలిసింది. వ్యాసం మొదటి భాగంలోనే రంగనాయకమ్మ 'ఈ సందేహాన్ని మార్క్స్ మీద విమర్శగా ప్రారంభించడం లేదు నేను. ... చర్చించవలసిన విషయంగా...' అన్నారు. ఈ మాటలేవీ పట్టించుకోకుండా 'మార్క్స్ పొరపాటు చేశాడని ఆమె అన్నారనీ, ఆమెకి ఆత్మవిశ్వాసం మితిమీరిందనీ' రాస్తే అర్థం లేదు. ఇలాంటి పైపై వ్యాఖ్యలు కాక అసలు పాయింట్ మీద రాసుంటే రంగనాయకమ్మతో సహా పాఠకులు కూడా నేర్చుకుని ఉండేవారు. ప్రకృతి శాస్త్రాల విషయాల్లో గత శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన విషయాల మీద సందేహాలుంటే, తరవాతి శాస్త్రజ్ఞులు ఏం చేస్తారు? ఆ సందేహాలకి సరైన జవాబులు దొరికితే వాళ్లు మిగతా వారితో పంచుకోవడం అప్పుడప్పుడూ పేపర్లలో చూస్తూ ఉంటాం కదా. ఒక సామాజిక శాస్త్రం విషయంలో రంగనాయకమ్మ అదే చేశారు. అది తప్పైతే, జనార్దనో, ఇంకొకరో వ్యాసం ద్వారానో, లేఖ ద్వారానో ఇదే పత్రికకి రాయాలి. అది ఒదిలేసి, సందు దొరికింది కదా అని 'గడ్డం పెంచుకున్నాడు, చేపలు తినవచ్చన్నాడు కాబట్టి మార్క్స్‌కి మార్క్సిజం తెలియదు' వంటి చెప్పని విషయాలు కూడా ఆమె రాసినట్టు రాయడం భావ్యం కాదు. ఇలాంటి మాటలు రాసి పాఠకుల్లో ఆమె పట్ల దురభిప్రాయం పెంచడమే ఉద్దేశ్యమే అయితే అది ఫలించదు. ఎందుకంటే రంగనాయకమ్మ గురించి తెలిసినవారు ఎలాగా నమ్మరు. మిగతావారు తెలుసుకున్న తరువాత ఇలాంటి రాతల్ని ఇక మీదట నమ్మకూడదనుకుంటారు.

**– జె.ఆర్. నాగభూషణం**
హోసూరు, తమిళనాడు

**జూ**లై సంచికలో లోకసంచారి, ఎస్.జనార్దన్‌ల లేఖలు చూసి ఇది రాస్తున్నాను. తను చెప్పేదంతా పరమ సత్యాలని, వాటిని గుడ్డిగా నమ్మాలని, తనను ప్రశ్నించకూడదని రంగనాయకమ్మ చెపుతున్నారని లోకసంచారి ఆరోపణ. అసలు రంగనాయకమ్మ అడిగిన ప్రశ్నలు ఇవి!

1) నేరాల్లో పెద్ద నేరాలు, చిన్న నేరాలు ఉండవా? జేబు దొంగతనాలూ, హత్యలూ ఒకటేనా? వాటికి పడే శిక్షలు కూడా తేడాగా ఉండవా? 2) ఢిల్లీ అత్యాచార సంఘటన గురించి మాట్లాడేటప్పుడు, వేరే దేశాల్లో వ్యభిచారులకు లైసెన్స్‌లు ఉన్నాయని చెప్పడం ఎందుకు? ఈ రెండిటికీ సంబంధం ఏమిటి? అంటే విదేశాల్లో వ్యభిచారులకు లైసెన్స్‌లు ఉంటాయి కాబట్టి, అక్కడ మగవాళ్లు తమ కోరికలు తీర్చుకోవడానికి వ్యభిచార కొంపలకి వెళ్తారు. మన దేశంలో అలాంటి అవకాశం లేదు కాబట్టి ఇక్కడి మగవాళ్లు ఇలా అత్యాచారాలు చేస్తారు అని చెప్పడం కాదా? 3) 'అత్యాచారం చేసినవాడు ధనవంతుడైతే ఉరి తీసి, పేదవాడైతే వాణ్ణి నెత్తిన పెట్టుకోవాలనే సంచారి వాదం అడ్డగోలు వాదం అవుతుంది' అన్నారు. అవును, అందులో తప్పు ఏం ఉంది? పేదవాడు అయినంత మాత్రాన పేదలు చేసిన తప్పులన్నిటినీ సమర్థిస్తామా? అలా అయితే ఈనాడు దొంగతనాలూ, హత్యలూ, దోపిడీలూ, దౌర్జన్యాలూ చేసే వాళ్లలో చాలా మంది పేదవాళ్లే ఉంటారు. వాళ్లు చేసే పనులన్నిటినీ క్షమిస్తారా? పేద శ్రామికులు శ్రమ దోపిడీకి గురవుతున్నారనే సానుభూతి ఎంతయినా ఉండవచ్చు. వాళ్ల పోరాటాల్ని ఎంతయినా సమర్థించవచ్చు. అంతేగానీ, అడ్డమైన వికృతమైన నేరాలన్నీ సమర్థించాలా? 4) 'ఎక్కువగానే నేనూ స్పందించవచ్చు. నాకు భాషా సమస్య ఏమీ లేదు' అని అంటున్నారు లోకసంచారి.

చర్చకి భాషే సరిపోతుందా? మన దగ్గిర మంచి వాదం ఉంటే, ఎలాంటి భాషతో అయినా చెప్పుకోగలం. అత్యాచారానికి, వ్యభిచారానికి లంకె పెట్టారు

*(మిగతా 63వ పేజీలో...)*

గురజాడ 115వ జన్మదిన సందర్భంగా విజయనగరంలో 21 సెప్టెంబర్ 2013న సాయంత్రం 6 గంటల నుండి రాత్రి 2 గంటల వరకు 'సంపూర్ణ కన్యాశుల్కం' ఎనిమిది గంటల నాటక ప్రదర్శన చేయనున్నామని 'సహజ' సాంస్కృతిక సంస్థ తెలియచేసింది. గురజాడ అభిమానులు, నాటకాభిమానులు, సాహిత్యాభిమానులు ఈ నాటక ప్రదర్శనకు తరలిరావల్సిందిగా సంస్థ పిలుపునిచ్చింది. భారీ వ్యయంతో తలపెట్టిన ఎనిమిది సంపూర్ణ నాటకానికి హార్థిక ఆర్థిక సహకారాన్ని అందించాలని సంస్థ నిర్వాహకులు కోరుతున్నారు. చెక్కులు, డిడిలను 'సహజ కల్చరల్ సొసైటీ' విజయనగరం వారి పేరిట అధ్యక్షులు, సహజ కల్చరల్ సొసైటీ, సమీరా రెసిడెన్సీ, రాజ్యలక్ష్మి థియేటర్ దరి, లింగధారపేట, విజయనగరం చిరునామాకు పంపవలసిందిగా సంస్థ అధ్యక్షులు విజ్ఞప్తి చేస్తున్నారు.

సంప్రదించవలసిన ఫోన్ నెం. : 9246368777

# వరదలూ వరాలూ వాదనలూ వాగ్దానాలూ

వీక్షణం

రాష్ట్రాన్ని హఠాత్తుగా ఒక్కుమ్మడిగా ఎన్నో వరదలు ముంచెత్తుతున్నాయి. నీటి వరదలూ, పంచాయతీ ఎన్నికల వరాల వరదలూ, రాష్ట్ర విభజన వ్యతిరేక వాదనల వరదలూ, 2014 ఎన్నికల వాగ్దానాల వరదలూ ప్రజల్ని అతలాకుతలం చేస్తున్నాయి. ఈ వరదలన్నిటిలోనూ కొట్టవచ్చినట్టు కనబడే విషయం జరగవలసిన పనులు జరగక పోవడం, జరగగూడని పనులు జరగడం. పాలకవర్గ ప్రయోజనాలు మాత్రమే నెరవేర్చే, ప్రజావ్యతిరేకంగా నడిచే ఏ వర్గ సమాజంలోనైనా ఇటువంటి తలకిందుల వ్యవహార సరళి సర్వసాధారణమే. భారతదేశం, ఆంధ్రప్రదేశ్ వంటి అత్యంత దుర్మార్గ పాలకవర్గాలు ఉన్న అంతరాల సమాజంలో ఇది మరింత ఎక్కువగా జరుగుతుంది.

రుతువులు సరిగా ఉండవు, అయినా వరదలొస్తాయి, ఆ వరద నీటిని ఆదా చేసే మార్గాలుండవు, వరద బీభత్సానికి కకావికలయ్యే ప్రజాజీవితాన్ని ఆదుకునే సహాయ చర్యలుండవు. ప్రజాస్వామ్యం ఉండదు. అయినా ఎన్నికలు వస్తాయి. అవి ప్రజలను మరింతగా భ్రమలకు గురిచేస్తాయి. మరింతగా చీలుస్తాయి. న్యాయమైన ప్రజా ఆకాంక్షను పరిష్కరించడం జరగదు. కాని ఆ ఆకాంక్షను పరిష్కరిస్తున్నట్టు భ్రమాజనిత ఉద్వేగాలు రెచ్చగొట్టే ప్రచారం ఉంటుంది. అలా తామే పెంచిన ఆశలు అడియాసలైతే సమాజ జీవితానికి ఎంత హాని వాటిల్లుతుందో పాలకులకు ఇసుమంత నెనరు కూడ ఉండదు. ప్రజాజీవితంలో నిజమైన అభివృద్ధి ఏమీ లేకపోయినా వయసు వచ్చినట్టు ఎప్పటికప్పుడు ఎన్నికలు వస్తూనే ఉంటాయి. వేల సంవత్సరాలుగా ప్రజల్ని నిజజీవిత సమస్యల నుంచి మళ్లించి జోకొట్టే మత్తుమందులా మతం నిర్వహించిన పాత్రను పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నిర్వహిస్తుంది. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరిట పాలకవర్గ ధనస్వామ్యం ఊరేగుతుంది.

ఈ సంవత్సరం నైరుతి రుతుపవనాలు మామూలుగానే జూన్ మొదటి వారంలో రాష్ట్రంలో ప్రవేశిస్తాయని అంచనాలు ఉన్నప్పటికీ అవి అరకొరగా వచ్చాయి. వర్షాకాలం ప్రవేశించి ఆరు వారాలు గడిచినా రుతుపవనాలు సక్రమంగా రాలేదు. కాని బంగాళాఖాతంలో అల్పపీడనాల వల్ల రెండు వారాలకు పైగా దాదాపు అన్ని జిల్లాల్లోనూ భారీ వర్షాలు కురిసి వాగులూ వంకలూ నదులూ పొంగి పొర్లి జలాశయాలన్నీ అసాధారణంగా నిండిపోయాయి. ఎన్నో చోట్ల కట్టలు తెగిపోయాయి. ఆస్తి నష్టం, ప్రాణ నష్టం వాటిల్లింది. లక్షల క్యూసెక్కుల నీరు చేతికి అందకుండా సముద్రంలో కలిసిపోయింది. ఇంకా ఎక్కువ భారీ నీటిపారుదల ప్రాజెక్టులు ఉంటే ఈ నీటిని ఆవి వినియోగించుకోగలిగే వాళ్లమని, భారీ ప్రాజెక్టుల అనుకూల వర్గాలు, ప్రత్యేకించి పోలవరం అనుకూల వర్గాలు ఇదే అదునుగా వాదిస్తున్నాయి. నిజానికి కావలసింది భారీ ప్రాజెక్టులు కాదు, గతకాలపు వివేకం. గోదావరి, కృష్ణ రెండు నదులూ రాష్ట్రంలో ప్రవేశించిన దగ్గరినుంచి సముద్రంలో కలిసేదాకా కాకతీయుల కాలంలో మొదలైన గొలుసు చెరువుల వ్యవస్థ అర్ధ శతాబ్ది కింది దాకా ఉండేది. ఎంత ఎక్కువ వర్షాలు పడినా వాగులూ వంకలూ పారి ఒక చెరువు నిండి, మత్తడి పడి, దాని కింద చెరువు నిండి అలా వందల కిలోమీటర్ల దూరం చిన్న చిన్న జలాశయాల్లో నీరు నిండుతూ ఎక్కడా బీభత్సానికి తావు లేకుండా, ప్రతి గ్రామానికీ నీరు సమృద్ధిగా అందేది. అన్ని చెరువులూ నిండిన తర్వాతనే నీరు నదులలోకి వెళ్లేది. భూగర్భ జల సంపదకు ఏ లోటూ వచ్చేది కాదు. కాని భారీ ప్రాజెక్టుల లాబీ, కాంట్రాక్టర్లు, రాజకీయవేత్తలు, సిమెంటు, ఉక్కు పారిశ్రామికాధిపతులు, సామ్రాజ్యవాద ద్రవ్య సహాయ సంస్థలు కలిసి మన నేలమీది ఈ వివేకవంతమైన నిర్మాణాన్ని ధ్వంసం చేశారు. వెయ్యి చెరువులను చంపి ఒక ప్రాజెక్టు కట్టారు. ఒక నది మీద నాలుగు చోట్లనో ఐదు చోట్లనో నీరు నిలిపి మిగతా ప్రాంతమంతా వట్టిపోయేలా చేశారు. సమగ్ర జల విధానం స్థానంలో తమ బొక్కసాలు నింపుకునే పథకాలు రచించారు. ప్రకృతి మీద పాలకవర్గాలు సాగించిన ఆ అక్రమానికి ప్రకృతి ఇప్పుడు ప్రతీకారం తీర్చుకుంటున్నది. కాకపోతే ఆ ప్రతీకారానికి బలి అవుతున్నది సాధారణ ప్రజానీకం.

అలా వరదలు వచ్చినట్టుగానే రాష్ట్రంలోకి పంచాయతీ ఎన్నికలూ వచ్చాయి. ప్రజాస్వామ్యం, స్థానిక స్వపరిపాలన, అధికార వికేంద్రీకరణ వంటి ఆదర్శాలు సరిగా పనిచేయక పోయినా గ్రామాల మీద పెత్తందారీ అధికారం కోసం, గ్రామ ప్రజల మధ్య అనవసరమైన, అర్ధరహితమైన విభజన కోసం పంచాయతీ ఎన్నికలు జరుగుతున్నాయి. పార్టీల ప్రాతిపదిక మీద జరపడం లేదని ఎంత చెప్పినా గ్రామ స్థాయిలో పార్టీల ప్రాతిపదిక మీదనే ప్రజల మధ్య విభజన జరుగుతున్నది. ఏ పార్టీ పాలనలోనైనా తమ ప్రయోజనాలు నెరవేరని సాధారణ ప్రజానీకం ఐక్యంగా అన్ని పార్టీలను నిలదీయడానికి బదులు చీలిపోయి, ఆయా పార్టీల వెనుక చేరి హింసకూ, విద్వేషాలకూ, హత్యలకూ దిగే పరిస్థితి వచ్చింది. గ్రామ సర్పంచి పదవి కోసం లక్షల రూపాయలూ కోట్ల రూపాయలూ ఖర్చుపెడుతూ, విపరీతమైన పోలీసు బందోబస్తు మధ్య, కులం, మతం, మద్యం, ఆకర్షణలు, హింస వంటి అన్ని ప్రజాస్వామ్య వ్యతిరేక సాధనాలతో ఈ 'ప్రజాస్వామ్యాన్ని' నిలబెట్టడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఎన్నికల బూటకత్వాన్ని, భారత సమాజంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్య నాటకాన్ని గుర్తించడానికి ఇంతకన్న పెద్ద రుజువు అవసరం లేదు.

ఈ వరదల మధ్యనే హైదరాబాదుకూ ఢిల్లీకీ రాజకీయ నాయకుల వరదలు సాగుతున్నాయి. అరవై సంవత్సరాల ప్రజా ఆకాంక్ష, ప్రజాస్వామిక, చట్టబద్ధ ఆకాంక్ష, స్వయంగా కేంద్ర ప్రభుత్వమే అంగీకరించి అమలు చేస్తానన్న ఆకాంక్ష స్వరూప స్వభావాలేమిటో మళ్లీ ఒకసారి మొదలుపెట్టి వాదించుకునే ప్రహసనాన్ని పాలకపక్షం ప్రారంభించింది. ప్రజల కోరికను నెరవేర్చాలనే ఆసక్తి లేదు. నెరవేరుస్తున్నట్టు నటిస్తూ పబ్బం గడుపుకోవడం ఉంది. ఈ ప్రహసనానికి తోడుగానే మరొక తొమ్మిది నెలల్లో రానున్న సాధారణ ఎన్నికల్లో తిమ్మిని బమ్మిని చేసి అయినా తామే గెలవాలని అన్ని రాజకీయ పక్షాలూ చేస్తున్న వాగ్దానాల, ఆకర్షణల, వాదనల, మాయాజాలాల వరదలు కూడ ప్రవహిస్తున్నాయి. ఈ మురుగునీటి వరదలన్నిటినీ ఆపగల ఏకైక శక్తి సంఘటిత ప్రజా చైతన్య ఆచరణ మాత్రమే. దాన్ని ప్రోది చేయడమే బుద్ధిజీవుల ఏకైక కర్తవ్యం కావాలి. వీ

# దళారీల పాలనలో ప్రజల బతుకు మాయం

**భా**రత ఆర్థిక వ్యవస్థ సంక్షోభంలో ఉన్నదని, వృద్ధి రేట్లు వెనుకపట్టు పడుతున్నాయని, డాలర్‌తో రూపాయి మారకపు విలువ నానాటికీ దిగజారిపోతున్నదని భారత ప్రభుత్వానికి హఠాత్తుగా తెలిసి వచ్చింది. రోగ నిర్ధారణ సరిగానే ఉంది. కాని ఔషధ సూచనే సరిగా లేదు. మరింతగా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను ఆహ్వానిస్తేనే ఈ వ్యాధి నివారణ జరుగుతుందని ప్రభుత్వం నమ్మబలుకుతున్నది. దేశ ఆర్థిక వ్యవస్థను పూర్తిగా పరాధీనం చేయడానికి, సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థల దుర్మార్గానికి దేశాన్ని అప్పగించడానికి, జీ హుజూర్ జో హుకుం అని ఎల్లప్పుడూ సిద్ధంగా ఉండే మన్మోహన్ సింగ్ – చిదంబరం దళారీ పాలకవర్గాల కుట్ర ఇది. ఈ నిర్ణయం ప్రకారం టెలి కమ్యూనికేషన్స్ రంగంలో వంద శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడిని అనుమతిస్తారు. పన్నెండు రంగాల్లో గతంలో ఉన్న పరిమితిని పెంచారు. ఆర్థికశాఖ కార్యదర్శి అరవింద్ మాయారామ్ నాయకత్వంలో నలుగురు సభ్యుల కమిటీ ఇచ్చిన సూచనల ప్రకారమే ఈ విధాన మార్పు జరిగిందంటున్నారు. దేశాన్ని అమ్మివేసే కార్యక్రమాన్ని ఈ పాలకవర్గాలు ఎంత హడావిడిగా జరుపుతున్నాయో ఈ ఉదంతం స్పష్టంగా రుజువు చేస్తుంది. ఆర్థిక వ్యవస్థ మీద మహా ప్రభావం వేయబోయే ఈ కమిటీ నియామకం మార్చ్ 14న జరిగితే మూడు నెలల్లో జూన్ 17 నాటికి నివేదిక తయారయింది. ఆ నివేదికను పేరుకు చర్చా పత్రం అన్నారు గాని, దాన్ని అక్షరాలా అమలు చేయబోతున్నామని చెప్పడానికి, 'ఈ దేశం మీదేనండి, మీ రాజ్యం మీరేలండి' అని పిలవడానికి ఆర్థిక మంత్రి చిదంబరం జూలై 9న అమెరికా వెళ్లాడు. పేరుకు ఏదో సమావేశంలో ప్రసంగించడానికి వెళ్లాడని అన్నప్పటికీ పర్యటన అసలు ఉద్దేశం అమెరికా ఆర్థిక కార్యదర్శిని కలవడం. లాక్ హీడ్ మార్టిన్, వాల్ మార్ట్, మైక్రో సాఫ్ట్, బోయింగ్ వంటి బహుళజాతి సంస్థల అధిపతులతో రహస్య మంతనాలు జరపడం. వారి మొట్టికాయలు తిని, దీవనలూ కోరికలూ విని, అవన్నీ నెరవేరుస్తామని తల ఊపి రావడం. అలా జూలై 13న తిరిగి వచ్చాడో లేదో జూలై 17న బహుళజాతి సంస్థల కోరికలన్నీ కేంద్ర మంత్రివర్గ నిర్ణయాలుగా బైటికి వచ్చాయి. భారత పాలకులు ఇంత వంగి నడుస్తున్నా ఇంకా నేల మీద పాకాలనీ, సాష్టాంగ ప్రణామం చేయాలనీ బహుళజాతి సంస్థలు కోరుతున్నాయి. ప్రపంచ బ్యాంకు ప్రతి సంవత్సరం ఏ దేశంలో ఎంత సులభంగా వ్యాపారం చేసుకోవచ్చునో, ఏ దేశంలో ఎంత సులభంగా, ఏ ఆంక్షలూ లేకుండా వ్యాపారం ప్రారంభించవచ్చునో తెలిపే సూచికలు విడుదల చేస్తుంది. ఆ సూచిక ప్రకారం భారతదేశం వ్యాపార సౌలభ్య సూచికలో 132వ స్థానంలో, వ్యాపార ప్రారంభ సౌలభ్య సూచికలో 173వ స్థానంలో ఉంది. దేశాన్ని ఈ అట్టడుగు నుంచి పైకి లాక్కుపోవడమే భారత పాలకుల కర్తవ్యం. పైకి వెళ్తే ఏమవుతుంది? దేశదేశాల సంపన్న కంపెనీలు ఇక్కడికి వచ్చి పెట్టుబడులు పెట్టి, తమ సరుకులు అమ్ముకుని, లాభాలు చేసుకుని తరలిపోతాయి. దేశానికీ, దేశ ప్రజలకూ ఏం ఒరుగుతుంది? వారిని పేదరికం నుంచి పైకి లాగనక్కరలేదా? దేశం గురించీ, ప్రజల గురించీ అడిగేదెవరు? ప్రధాని ప్రపంచ బ్యాంకు ఉద్యోగి, ఆర్థిక మంత్రి బహుళజాతి సంస్థల వకీలు. కావాలంటే పేదరికాన్ని కొత్తగా నిర్వచించి పేదలు తగ్గిపోయారని గప్పాలు కొట్టుకుంటారు. ఇది దేశమా, ఇది ప్రభుత్వమా, ఇది ప్రజాస్వామ్యమా అని ఇంకా ప్రశ్నలు తలెత్తని వాళ్లున్నారా? వీ

# ప్రజా ఉద్యమాలకు ఈజిప్ట్ పరిణామాల హెచ్చరిక

**రెం**డు సంవత్సరాల కింద ప్రపంచానికి ఆశాజ్యోతిగా కనబడిన అరబ్ వసంత వెల్లువ, ఆ తర్వాత బూటకపు ప్రజాస్వామిక ఎన్నికల వలలో చిక్కి, ఇవాళ సైనిక పదఘట్టనల కింద నలిగిపోతున్నది. అసాధారణంగా వ్యక్తమైన ప్రజా ఆకాంక్షలు, ఆ ఆకాంక్షలను తీరుస్తామనే కల్లబొల్లి వాగ్దానాలతో గద్దెనెక్కే అవకాశవాద రాజకీయ నాయకులు, ప్రజల మౌలిక సమస్యలు తీరకపోవడం, ప్రజాజీవితం అస్తవ్యస్తం కావడం, సాయుధ సైనిక బలగాలు అధికారం చేజిక్కించుకోవడం, ప్రజల బతుకు పెనం మీది నుంచి పొయ్యిలో పడిపోవడం–మన కళ్ల ముందర జరిగిపోయిన ఈ పరిణామాలు ప్రజాశక్తులు ఎంత జాగరూకంగా ఉండాలో హెచ్చరిస్తున్నాయి. అధికారంలో ఉన్న నియంతలను కూలదోస్తే సరిపోదు, ఆ స్థానంలో నిలపదగిన వాళ్లెవరు, తక్షణమే పరిష్కరించవలసిన సమస్యలేమిటి, ఏ ప్రజల మీద ఆధారపడి, ప్రత్యామ్నాయ పాలన, ప్రత్యామ్నాయ జీవనవిధానం స్థాపించాలి అని కూడ ఆలోచించక తప్పదని ఈజిప్ట్ రక్తసిక్త పాఠం నేర్పుతున్నది. విప్లవం సాధించడం మాత్రమే కాదు, విప్లవానంతర పాలన తీసుకోవలసిన జాగ్రత్తలను కూడ చైతన్యయుతంగా గ్రహించకపోతే ఈనగాచి నక్కల పాలు చేసినట్టవుతుంది. ముప్పై సంవత్సరాలు సాగిన హోస్నీ ముబారక్ నియంతృత్వ పాలనను కూలదోయడానికి వెల్లువెత్తిన లక్షలాది మంది విభిన్న ప్రజా సమూహాలకూ, విభిన్న ప్రయోజనాలకూ చెందినవారు. ఆ బహుళ సమాజపు ఆకాంక్షలను నెరవేర్చడం అంత సులభమేమీ కాదు. కాని వారందరి సారభూతమైన ఆకాంక్షలు ఆర్థిక సంక్షోభం, అవినీతి, నిరుద్యోగం, ధరల పెరుగుదల, తక్కువ వేతనాలు వంటి సమస్యలను పరిష్కరించే సైనికేతర పాలన, నిర్బంధ రహితమైన పాలన. ఒక్క మాటలో చెప్పాలంటే ఈజిప్షియన్లు ప్రపంచీకరణ విధానాలను వ్యతిరేకించారు. ప్రత్యక్షంగా అమెరికా పాలకవర్గాల కనుసన్నలలో నడిచిన ముబారక్ ప్రభుత్వ విధానాలను కూలదోయదలిచారు. కూలదోశారు. కాని పునర్నిర్మాణంలో ప్రజాశక్తులు వెనక్కి వెళ్లి సైన్యం అధికారం చేపట్టింది. అవకాశవాద, మతవాద, రాజకీయ నాయకులదీ, అమెరికన్ సామ్రాజ్యవాద దళారులదీ పైచేయి అయింది. తాత్కాలిక ప్రభుత్వ పాలనలో పాత ఆర్థిక విధానాలే కొనసాగి ప్రజాజీవనం మరింత కల్లోలానికి గురయింది. ఆ తర్వాత ఎన్నికలలో గెలిచిన ముస్లిం బ్రదర్‌హుడ్ నాయకుడు మహమ్మద్ ముర్సి అధ్యక్షుడుగా ఏడాదిగా సాగుతున్న పాలన ప్రజల ఆకాంక్షలను ఎంత మాత్రం తీర్చలేక పోయింది. ముర్సి నిరంకుశంగా మారి రాజ్యాంగాన్నే మార్చదలిచాడు. లౌకికవాదులమని చెప్పుకునే ప్రతిపక్షాలు ప్రజలను సంఘటితం చేయడంలో విఫలమయ్యాయి. సైన్యం ఏక్షణాన విరుచుకు పడడానికైనా సిద్ధంగా ఉంది. ఈ కుమ్ములాటలో ప్రజల మౌలిక సమస్యలు యథాతథంగా ఉండిపోయాయి. ఈ నేపథ్యంలో మళ్లీ గద్దెనెక్కిన సైన్యాన్ని ఖండిస్తూనే, ముర్సి పాలనను కూలదోసిన ప్రజా వెల్లువను సమర్థించవలసి ఉంది. ఈజిప్షియన్ నవలా రచయిత నావల్ ఎల్ సాద్వి రాసినట్టు 'స్త్రీ పురుష, మత, వర్గ వివక్ష లేని సమానత్వం అనే విప్లవ లక్ష్యం ఇంకా సాకారం కాలేదు. మళ్లీ ఒకసారి మనం ఎన్నికల కోసం పరుగెత్తగూడదు. గుర్రాన్ని బండివెనుక కట్టగూడదు. పాత తప్పులు మళ్లీ చేయగూడదు. ప్రజాస్వామ్యం అంటే ఎన్నికలు కాదు. సాధికారత అంటే బాలట్ పెట్టె కన్న ఎక్కువగా ప్రజలశక్తి' అని అర్థం చేసుకోవాలి. వీ

# చరిత్ర గమనం - రాజకీయార్థిక పరిచయం

**మ**న జీవితాలలో ప్రతి క్షణం జరిగే పరిణామాలన్నీ విడివిడిగా జరిగిపోయేవీ, ఒకదానికొకటి సంబంధం లేనివీ కావు. అవన్నీ ఒక నిరంతర ధారలో భాగం అనీ, ఒకదానితో ఒకటి అన్యోన్య సంబంధంలో ఉంటాయనీ రాజకీయార్థిక శాస్త్రం భావిస్తుంది. అంటే ప్రజాజీవనమంతా రాజకీయార్థిక శాస్త్ర పరిధిలోకి వచ్చేదే. మనిషి మనుగడకు అత్యవసరమైన ఉత్పత్తి ప్రక్రియను మూలాధారంగా భావించి, దానిమీద నిర్మాణమయ్యే సకల మానవసంబంధాలనూ అర్థం చేసుకోవడానికి రాజకీయార్థిక శాస్త్రం ప్రయత్నిస్తుంది. మనచుట్టూ జరిగే ఘటనలు, మనం పాల్గొనే ఘటనలు, మనను ఆలోచింపజేసే ఘటనలు, మన మీద ప్రభావం వేసే ఘటనలు అన్నీ కూడ రాజకీయార్థిక శాస్త్ర ఆవరణలోకి వస్తాయి.

ప్రస్తుతమైతే విద్యారంగంలో రాజకీయాలనూ అర్థశాస్త్రాన్నీ విడదీసి చెపుతున్నారు గాని ఒకప్పుడు ఆ రెండూ కలిసే ఉండేవి. రాజకీయాధిపత్యం ఉన్న శక్తులే ఆర్థిక వ్యవస్థను నిర్వహిస్తాయి. ఆర్థిక వ్యవస్థ నిర్వాహకులే రాజకీయాలను శాసిస్తారు. ఈ రెంటి మధ్య అవినాభావ సంబంధం ఉంది. అంతమాత్రమే కాదు, పాత రాజకీయార్థిక శాస్త్రం ప్రస్తుత సామాజిక శాస్త్రాన్నీ, మానవ సంబంధాలనూ, చరిత్రనూ, ప్రభుత్వ పాలననూ కూడ ఒకే సమాహారంగా చూసేది. నిజానికి ఇప్పుడు ఇవన్నీ వేరువేరు శాస్త్రాలుగా విడిపోయి, స్వతంత్ర పారిభాషిక పదజాలాన్ని అభివృద్ధి చేసుకుని, ఒకదానితో ఒకటి సంబంధం లేనట్టు కనిపిస్తున్నాయి గాని, ఇవన్నీ కలిసి చేసే పని, అంటే రాజకీయార్థిక శాస్త్రం చేసే పని మనిషి గురించీ, సమాజం గురించీ, మనుషుల మధ్య సంబంధాల గురించి ఆలోచించడమే. జీవిత గమనం గురించి చెప్పడమే.

భిన్నంగా కనిపించే సమకాలీన సామాజిక పరిణామాలను ఏరి రాజకీయార్థిక దృక్పథంతో పరిచయం చేయడం, అంతస్సంబంధాలను విశ్లేషించడం లక్ష్యంగా మొదలవుతున్న కొత్త శీర్షిక ఇది. ఈ శీర్షికను రాసే బాధ్యతను సంపాదకవర్గం తరఫున ఒకరు తీసుకుంటారు గాని, పాఠకులెవరైనా రచయితలు కావచ్చు. ఇది ఉమ్మడి శీర్షికగా నడపవచ్చు. తమకు ఆసక్తికరంగా, ఆశ్చర్యకరంగా, నిగూఢంగా, ఇతరులతో పంచుకోవలసినదిగా అనిపించిన ఏ సమకాలీన సామాజిక పరిణామాన్నైనా పాఠకులెవరైనా ఈ శీర్షిక కోసం సూచించవచ్చు. లేదా దాన్ని తామే విశ్లేషించవచ్చు. ప్రతి పరిణామమూ ఈ శీర్షికలో విశ్లేషించడానికి తగినదే గాని ఈ శీర్షిక స్థల పరిధి రెండు పేజీలు గనుక ఎక్కువలో ఎక్కువ మూడు నాలుగు పరిణామాలను మాత్రం ఇందులో భాగం చేయడం జరుగుతుంది.

డాలర్‌తో రూపాయి మారకపు విలువ గత రెండు మూడు నెలలుగా రోజురోజుకూ తరిగిపోతూ వస్తోంది. కొద్ది రోజుల కింద ఒక డాలర్ విలువ 62 రూపాయల దాకా కూడ వెళ్లి, ఇది రాసే సమయానికి 59 రూపాయల దగ్గర ఉంది. రూపాయి పతనం గురించి ప్రధాన స్రవంతి పత్రికలలో చాల వార్తలే వస్తున్నాయి గాని ఇది ఇలా ఎందుకు జరుగుతున్నదో, భారత ఆర్థిక వ్యవస్థ మీద దీని ప్రభావమేమిటో, ప్రజల వైపు నుంచి దీన్ని ఎలా అర్థం చేసుకోవాలో మాత్రం చాల తక్కువగా వస్తున్నది.

రూపాయి విలువ తగ్గింపు అనే మాటకు సాంకేతిక అర్థాలు ఎన్నో ఉన్నాయి. స్థూలంగా చెప్పాలంటే ఒక రూపాయికి గతంలో కొనగలిగిన వాటికన్న తక్కువ సరుకులను, సేవలను కొనగలగడం అనేది ఒక అర్థం. ఆర్థిక వ్యవస్థ బలం, ఎగుమతి–దిగుమతులు, వాణిజ్య లోటు, రాజకీయార్థిక విధానాలు, ఉద్యోగ, ఆదాయ స్థాయి, ధరల పెరుగుదల, విదేశీమారక నిలువలు వంటి ఎన్నో కారణాలు ఈ విలువను నిర్ణయిస్తాయి. వీటిలో ప్రతి ఒక్క కారణాన్నీ వివరంగా అర్థం చేసుకోవలసి ఉంది గాని ప్రస్తుత డాలర్–రూపాయి మారకపు విలువ విషయంలో వాణిజ్య లోటు, రాజకీయార్థిక విధానాలు అనే రెండు అంశాలు చూస్తే చాలు.

భారత ఆర్థిక వ్యవస్థ సాధారణంగా తాను ఎగుమతి చేస్తున్న సరుకులు–సేవల కన్న ఎక్కువ సరుకులు–సేవలను దిగుమతి చేసుకుంటున్నది. అందువల్ల వాణిజ్య లోటు ఏర్పడుతున్నది. విదేశాల నుంచి భారత ఆర్థిక వ్యవస్థకు వచ్చే దిగుమతేతర రాబడులు కూడ ఎక్కువగాలేవు. అందువల్ల మొత్తంగా తక్షణ వాణిజ్య ఖాతా (కరెంట్ అకౌంట్) లో లోటు కనబడుతున్నది. ఈ లోటును తీర్చడానికి అంతకంతకూ ఎక్కువ డాలర్లు కావాలి. అలా డాలర్లకు డిమాండ్ పెరిగినప్పుడు వాటి ధర కూడ పెరుగుతుంది. అందువల్ల రూపాయలలో చెప్పినప్పుడు గతంలో కన్న డాలర్ ధర పెరిగిపోతున్నది. పాలకవర్గాలు, ప్రధాన స్రవంతి పత్రికలు, అర్థశాస్త్రవేత్తలు కూడ ఇంతవరకూ చెపుతారు.

కాని పాలకవర్గ రాజకీయార్థిక విధానాల చరిత్రను అర్థం చేసుకుంటే గాని, ఎంత సుదీర్ఘ పరిణామాలు ఇవాళ్టి ఈ స్థితికి కారణమయ్యాయో తెలియదు. భారతదేశంలో వలస పాలన ముగిసిన 1947లో ఒక డాలర్‌కు ఒక రూపాయి మారకపు విలువ ఉండేది. ఆ నాటికి భారతదేశానికి వాణిజ్య లోటు లేదు. విదేశీ రుణాలు లేవు. వాటికోసం డాలర్లు కొనుక్కోవలసిన అవసరం లేదు. ఆ తర్వాత నాలుగు దశాబ్దాలలో డాలర్ విలువ 17 రూపాయలకు చేరి, 1990 తర్వాత మరింత వేగంగా 1995 నాటికి 34 రూపాయలకు, 2006 నాటికి 48 రూపాయలకు చేరింది.

గడిచిన అరవై సంవత్సరాలలో అమలైన పాలనా విధానాలన్నీ కూడ దిగుమతులు అవసరం లేని, లేదా దిగుమతులు తగ్గే స్వయంసమృద్ధ, స్వావలంబన ఆర్థిక వ్యవస్థను నిర్మించలేదు. ఇంకెవరూ ఉత్పత్తి చేయజాలని సరుకుల–సేవల ఉత్పత్తి నైపుణ్యాన్ని అభివృద్ధి చేసుకొని, ఆ సరుకులు–సేవల ఎగుమతులు పెంచి, విదేశీ మారక ద్రవ్యం సంపాదించలేదు. కమిషన్ల ద్వారా తమ బొక్కసాలు నింపుకోవడానికి, రక్షణ సామగ్రి–ఆయుధాలు, విలాస వస్తువుల కొనుగోళ్లకు, వృథాఖర్చులకు లక్షల కోట్ల రూపాయల విదేశీ రుణాలు తెచ్చారు. ఆ రుణాల వడ్డీలు చెల్లించడానికి మళ్లీ రుణాలు తెచ్చారు. ఈ చారిత్రక నేపథ్యంలో డాలర్లు మరింత ఎక్కువ అవసరమవుతున్నాయి. సాధారణంగా మార్కెట్ చలనాలు డాలర్ మారకపు విలువను మారుస్తుంటాయి గాని, చాలసార్లు ప్రభుత్వమే స్వయంగా రూపాయి విలువను తగ్గించి డాలర్ ముందర దాసోహం అని ప్రకటించింది. అంటే డాలర్ తో పోలిస్తే రూపాయి విలువ దిగజారడం వెనుక సాంకేతిక, మార్కెట్ అదృశ్య కారణాలు కాదు, స్పష్టంగా భారత పాలకవర్గాల దివాళాకోరు, దళారీ రాజకీయార్థిక విధానాలు ఉన్నాయి.

ఈ పాలకవర్గాల దివాళాకోరుతనం ఇవాళ సమాజంలో సవాలక్ష రూపాలలో కనబడుతుంది. వాటిలో ఒకటి దేశానికి, ఆర్థిక వ్యవస్థకు

సంబంధించిన గణాంకాలను తప్పుల తడకలుగా తయారు చేయడం. అబద్ధాలనూ అర్ధసత్యాలనూ దొంగలెక్కలనూ గణాంకాలుగా ప్రచారం చేయడం.

భారత ఆర్థిక వ్యవస్థ బలపడకపోవడానికి కారణం ఇక్కడ ప్రజాస్వామిక విప్లవం జరిగి ఉత్పత్తి విధానంలో పరివర్తన రాకపోవడం. ఆ పరివర్తన జరగకపోవడంతో, యథాస్థితితో, అంటే అర్ధభూస్వామ్య, అర్ధవలస స్థితితో ప్రయోజనం పొందే వర్గాలు ఆ స్థితి లేనే లేదని చెప్పడానికి దొంగలెక్కలను వాడుకుంటున్నాయి. విస్పష్టమైన దళారీ విధానాలను అమలు చేస్తూ, స్వతంత్ర పెట్టుబడిదారీ విధాన అభివృద్ధిని కూడ సాధించని పాలకవర్గాలు ఇది అర్ధవలస కాదనీ, స్వతంత్ర దేశమనీ నమ్మబలుకుతున్నాయి. భూస్వామ్యాన్ని రద్దు చేసే ప్రజాస్వామిక సంస్కరణలను ఏ ఒక్కరంగంలోనూ నిజాయితీగా, సంపూర్ణంగా అమలు చేయని పాలకవర్గాలు భూస్వాములు రద్దయిపోయారనీ, పేదలు తగ్గిపోయారనీ ఎప్పటికప్పుడు తప్పుడు గణాంకాలు విడుదల చేస్తుంటాయి.

తాజా ఉదాహరణలు చెప్పాలంటే రాష్ట్రంలో భూకమతాల గురించీ, దేశంలో పేదరికం గురించీ వెలువడిన గణాంకాలు చూడవచ్చు. రాష్ట్ర అర్థ గణాంక శాఖ ఐదు సంవత్సరాలకొకసారి ప్రచురించే భూకమతాల గణన తాజా నివేదిక ప్రకారం ఇరవై ఐదు ఎకరాల కన్న ఎక్కువ భూకమతాలు తగ్గిపోయాయట. భూగరిష్ఠ పరిమితి చట్టం అమలయిందట. ఇది ఎంత నిజమో గ్రామీణ ప్రాంతాలలో ఎవరైనా చెపుతారు. కుటుంబాలలో పంపకాలు జరగడం వల్ల, వ్యవసాయ కుటుంబాలు ఇతర ఆదాయ మార్గాలకు మళ్లినందువల్ల, ఇంతవరకూ సొంత వ్యవసాయం లేని వర్గాలు చిన్న కమతాలు కొనుగోలు చేయడం వల్ల కాగితాల మీద పెద్ద కమతాలు తగ్గిపోయిన మాట కొంతవరకు నిజమే. కాని చట్టంలోని లొసుగులనూ మినహాయింపులనూ ఉపయోగించుకుని, తోటలు, జలాశయాలు, వాణిజ్య పంటల భూములు, వ్యవసాయేతర భూములు, ఫార్మ్ హౌజులు వంటి పేర్ల మీద పెట్టుకుని, కుటుంబాలు విడిపోయినట్టు నటించి పెద్ద కమతాలు యథాతథంగా ఉంచుకున్న సందర్భాలు వేలాదిగా ఉన్నాయి. అసలింతకీ, భూస్వామ్యం అనేది కేవలం ఎన్ని ఎకరాలు కలిగి ఉన్నారనే ఏకైక అంశం మీద నిర్ణయమయ్యేది కాదు. భూమి ఒక ప్రధాన ఉత్పత్తి సాధనం కావడం వల్ల దాని పరిమాణం ఒక సూచికే గాని, ఇతర ఉత్పత్తి సాధనాలలో, ఉత్పత్తి సంబంధాలలో భూస్వామ్యాన్ని గుర్తించడానికి అనేక చిహ్నాలున్నాయి. కనుక కేవలం అంకెల గారడీతో భూస్వాములు తగ్గిపోయారనడం పాలకవర్గ రాజకీయార్థిక విధానాల అమలుకు మేలిముసుగుగా పనికి వస్తుందేమో గాని వాస్తవానికి ప్రతిబింబం కాదు.

సరిగ్గా అలాగే తలసరి ఆదాయం/వినియోగం ఎంత ఉంటే పేదలు కారో ఒక తప్పుడు లెక్క, హాస్యాస్పదమైన అంకె ప్రకటించి, అంతకన్న తక్కువ ఆదాయం/వినియోగం ఉన్నవారు తగ్గిపోయారు గనుక పేదరికం తగ్గింది అని ప్రణాళికా సంఘం ప్రకటించింది. పట్టణాల్లో రు. 33.30, గ్రామాల్లో రు. 27.20 కన్న తక్కువ తలసరి రోజువారీ ఖర్చు పెట్టగలిగిన వాళ్లు మాత్రమే పేదలని ప్రణాళికా సంఘం ప్రకటించడం క్రూరమైన పరిహాసం. వారు ప్రకటించిన డబ్బు రెండు పూటలు కాదు, ఒక్క పూట తిండికైనా సరిపోదని స్వయంగా మంత్రులే అంటున్నారు. ఇక ఇతర ఖర్చులు సరేసరి. నూతన ఆర్థిక విధానాలతో పేదరికం తగ్గిందని చెప్పదలచుకున్న ప్రపంచబ్యాంకు దళారీ ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు మాంటెక్ సింగ్ అహ్లువాలియా అంకెల గారడీ ఇది. ఇదే అహ్లువాలియా తన కార్యాలయంలో సొంత వినియోగానికి బాత్‌రూం మరమ్మత్తుకు రు. 35 లక్షల ప్రజాధనం ఖర్చు పెట్టుకున్నాడు. దేశ ప్రజలు మాత్రం ఐదుగురు ఉన్న కుటుంబం నెల గడపడానికి గ్రామాల్లో రు. 4,080, పట్టణాల్లో రు. 5000 సరిపోతాయని ప్రకటిస్తున్నాడు.

ఇటువంటి దగాకోరు, దివాళాకోరు, దళారీ పాలకవర్గాల పాలనలో దేశ ప్రజానీకానికి కనీస సౌకర్యాలేవీ అందవని, కనీస మానవ జీవనం గడపడం సాధ్యం కాదని, ఈ పాలకవర్గాలను కూలదోసి, సమాజ పరివర్తన జరిపే నూతన ప్రజాస్వామిక విప్లవం జరగవలసి ఉందని నాలుగున్నర దశాబ్దాల కింద నక్సల్బరీ పంథా ప్రకటించింది. ఆ మార్గంలో క్రమక్రమంగా పురోగమిస్తున్న విప్లవోద్యమం ఒక ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను, ప్రజల ప్రజాస్వామిక పాలనా వ్యవస్థను ఏర్పాటు చేసుకుని, 'దేశ అంతర్గత భద్రతకు పెనుప్రమాదం' అని పాలకవర్గాలు అభివర్ణించే స్థాయికి ఎదిగింది. ఆ విప్లవోద్యమాన్ని అణచివేసే వ్యూహాలు రచించడానికి పాలకవర్గాలు సమావేశాల మీద సమావేశాలు నిర్వహిస్తున్నాయి. ఒక తాజా సమావేశం గురించి కాస్త తెలుసుకోవాలి.

జూలై 3న జార్ఖండ్‌లో మావోయిస్టులు పేల్చిన మందుపాతరలో పాకూర్ జిల్లా పోలీసు సూపరింటెండెంట్ అమర్ జిత్ బలిహార్ చనిపోయిన నేపథ్యంలో కేంద్ర హోం మంత్రిత్వ శాఖ దేశంలోని 27 నక్సలైట్ ప్రభావిత జిల్లాల ఎస్పీలతో ఈ సమావేశం ఏర్పాటు చేసింది. మహారాష్ట్ర లోని గడ్ చిరోలి జిల్లా ఎస్పీ మహమ్మద్ సువెజ్ హక్ నక్సలైట్లను అణచివేయడంలో గణనీయమైన విజయం సాధించాడని, అందువల్ల ఆయన ఈ సమావేశంలో ఒక ప్రెజెంటేషన్ ఇస్తారని ఒక వార్త వెలువడింది. ఈ సమావేశం జూలై 26-27ల్లో ఢిల్లీలో జరుగుతుందని, బస్తర్, బిజాపూర్, దంతెవాడ, సుక్మా, లాతెహార్, పాలమూ, గయ, కోరాపుట్, మల్కన్ గిరి వంటి 27 జిల్లాల ఎస్పీలు పాల్గొనే ఈ సమావేశానికి కేంద్ర హోంశాఖ కార్యదర్శి అనిల్ గోస్వామి అధ్యక్షత వహిస్తారని, ఇంటిలిజెన్స్ బ్యూరో, సి ఆర్ పి, ఛత్తీస్‌గఢ్, జార్ఖండ్, మహారాష్ట్ర, ఒడిశా రాష్ట్రాల ఇనస్పెక్టర్ జనరల్ లు పాల్గొంటారని ఆ వార్త తెలిపింది.

కాని ఇటువంటి కీలక సమావేశం ఎన్నడు ఎక్కడ జరుగుతుందో, ఎవరు పాల్గొంటారో బహిరంగం చేస్తే మావోయిస్టులు వారిమీద మార్గమధ్యంలో దాడి చేయవచ్చునని, అందువల్ల సమావేశ స్థలకాలాలు చెప్పబోమని హోంమంత్రిత్వ శాఖ ఒక ప్రకటన చేసింది. చివరికి ముందు చెప్పిన తేదీలకు ఒకరోజు ముందుగా సమావేశం జరిపారు. కార్యక్రమమంతా ముందు చెప్పినట్టే జరిగింది. అదనంగా ఆంధ్రప్రదేశ్ అనుభవాలను గురించి ఒక గ్రేహౌండ్స్ అధికారి కూడ వివరించాడట. ఏవో కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు గాని బైటికి ప్రకటించినది మాత్రం బహిరంగ ప్రజాజీవితంలో ఉన్నవారికి బెదిరింపు. మావోయిస్టు ఉద్యమాన్ని సమర్థించే, ఆర్థిక, హార్దిక, చట్టపరమైన సహాయం అందించే వ్యక్తులను చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం (యుఎపిఎ) కింద విచారించాలని నిర్ణయం తీసుకున్నారట. 'సిపిఐ (మావోయిస్టు) భావజాలపు హింసా స్వభావాన్ని కప్పిపుచ్చే ముసుగులుగా పనిచేస్తూ, వారి ప్రచార, తప్పుడు సమాచార యంత్రాంగంగా ఉన్న విద్యావంతులైన మేధావుల నాయకత్వం' లోని ప్రజాసంఘాల మీద దాడి జరుపుతామని ప్రకటించారు. మరో మాటల్లో చెప్పాలంటే ఈ దేశ పౌరులకు ఇష్టం వచ్చిన భావజాలాన్ని నమ్మే, ప్రచారం చేసుకునే కనీస మానవ హక్కు లేదని ప్రకటించారు. రాజ్యాంగం ఆమోదించిన వాక్స్వాతంత్ర్యాలను వినియోగించుకోవడం నేరమని పోలీసు అధికారులందరూ కూడి తీర్మానించారు.

భారత రాజకీయార్థిక ముఖచిత్రాన్ని అర్థం చేసుకోవడానికి ఇంతకన్న వేరే ఆధారాలు కావాలా?

వీ



❖ **వజ్ర సంకల్పం తెలంగాణ దీర్ఘ కవిత**–చీపెల్లి బాపు, తెలంగాణ రచయితల వేదిక ప్రచురణ– 63 పేజీలు, 1/8 డెమీ, రు: 50, ప్రతులకు: భారతి బాపు చీపెల్లి, ఇ.నెం.12-01, శ్యాంనగర్, పోస్టు: శ్రీరాంపూర్, మండలం: మంచిర్యాల, జిల్లా: ఆదిలాబాదు-504303, ఫోన్: 9849863034, 931932310.



❖ **ప్రవహించే పాదాలు కవిత్వం**– మంత్రి కృష్ణ మోహన్, చందు ప్రచురణలు– 95 పేజీలు, 1/8 డెమీ, రు:60, ప్రతులకు:మంత్రి రవి కుమార్, 7-662(కె.43), ఎదురుగా: శ్రీనివాస థియేటర్, మార్కపురం, జిల్లా: ప్రకాశం-523316, ఫోన్: 9441028186



❖ **ప్రజా యుద్ధం – ప్రజాతంత్రం అవిభాజ్యం – నేటి దండకారణ్యం (2001-2011)** – పి. శంకర్, విప్లవ రచయితల సంఘం – 198 పేజీలు, 1/8 డెమీ, రు : 100, ప్రతులకు: దిశ పుస్తక కేంద్రం; సహచర బుక్‌మార్క్ నవోదయ బుక్‌హౌస్



❖ **ప్రతిజ్ఞ – యాభై ఏండ్ల వివక్ష** – సంపాదకుడు: ఎలికట్టె శంకర్ రావు, నోముల సాహిత్య సమితీ ప్రచురణ, 68 పేజీలు, 1/8 డెమీ, రు: 30, ప్రతులకు : ఎన్.ఎస్. ఆరుణ, నోముల సాహిత్య సమితి, సాయి టవర్స్, నాగార్జున కాలనీ, నల్లగొండ, ఫోన్: 9346359268



❖ **తియ్యని వేప రావికంటి కథలు** – వేముల ప్రభాకర్, ప్రచురణ: పాలపిట్ట బుక్స్– 160 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/ 1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్-500036; ఫోన్: 27678430 ఇమెయిల్:palapittabooks@gmail.com



❖ **మల్లెలు తూరుపెత్తిన వేళ** – కవిత్వం – సి.వేణు, స్వచ్ఛత ప్రచురణ– 124 పేజీలు, 1/4 క్రౌన్, రు : 166, ప్రతులకు : సి. వేణు గోపాల్‌రెడ్డి, మండి కృష్ణపురం, నంగమంగాలెం, పోస్టు: నంగమంగాలెం, చిత్తూరు



❖ **మూడు యాభయిల అడుగుజాడ** – కూర్పు : సింగంపల్లి అశోక్‌కుమార్ – శ్రీశ్రీ సాహిత్య నిధి ప్రచురణ – 55 పేజీలు, 1/8 డెమీ, రు : 25, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ – 520004, ఫోన్ : 0866-6617375, సెల్:9246277375, ఇమెయిల్: srisri_sahityanidhi@yahoo.com



❖ **సాంఘిక విప్లవ రచయితలు** – డా. కత్తి పద్మారావు, లోకాయత ప్రచురణలు– 188 పేజీలు, 1/8 డెమీ, రు: 100, ప్రతులకు: కత్తి స్వర్ణకుమారి, లోకాయత ప్రచురణలు, లుంబినీ వనం, అంబేద్కర్ కాలని, పొన్నూరు – 522 124 ఫోన్: 08643 421421 ఇమెయిల్: padmaraokathi@yahoo.co.in



❖ **దాలర్ల రక్త పిపాస అమెరికా బందిపోటు రాజకీయాలు** – ఎ.నర్సింహారెడ్డి, 141 పేజీలు, 1/8 డెమీ, రు : 70



❖ **ప్రపంచ ఆర్థిక సంక్షోభం ప్రజా ఆందోళనలు** – ఎ.నర్సింహారెడ్డి, 134 పేజీలు, 1/8 డెమీ, రు : 70, ప్రతులకు : ఎ. నర్సింహారెడ్డి, 4-6-84/2, వెంకన్న కుంట, జనగాం, వరంగల్ – 506 167



❖ **ఒక వేకువ కోసం కవిత సంకలనం** – బెల్లంకొండ సంపత్ కుమార్, ప్రచురణ: సింగిడి తెలంగాణ రచయితల సంఘం, 118 పేజీలు, 1/8 డెమీ, రు: 60, ప్రతులకు : బి. మాధవి, శివగంగా అపార్ట్‌మెంట్స్ – 303, మంజీర నగర్ కాలనీ, ఓల్డ్ అల్వాల్, సికింద్రాబాద్ – 500 010, సెల్: 9908519151



❖ **ఆదర్శరత్న శ్రీ పలకలూరి శివరావు** (సామాజిక స్పృహ తత్పరులు) – శ్రీ వసంత రామకృష్ణారావు, ప్రచురణ: శ్రీ జి. నళిని, 86 పేజీలు, 1/8 డెమీ, రు: 50, ప్రతులకు : శ్రీ పలకలూరి నరేష్ ఎం.ఎస్.సి, డోర్ నెం: 16-32-80, యాదవ బజారు, పాత గుంటూరు, గుంటూరు – 522 001, ఫోన్: 9291610557



❖ **అపస్మారక స్థితిలో** (దీర్ఘ కవిత) – మోదు రాజేశ్వరరావు– ప్రచురణ : సత్య-మూర్తి ఛారిటబుల్ ట్రస్టు(రి), 39 పేజీలు, 1/8 డెమీ, రు: 40, ప్రతులకు : మోదు రాజేశ్వరరావు, కావ్య సమీక్ష, తెలుగు మాసపత్రిక, 15-6, శారదానగర్, పెందుర్తి, విశాఖపట్నం-531173; ఫోన్: 9391811226



❖ **జస్టిస్ ఒ. చిన్నప్పరెడ్డి ఎ లెజెండ్** – తరిమెల నాగిరెడ్డి మెమోరియల్ ట్రస్టు, 280 పేజీలు, 1/8 డెమీ, రు: 200, ప్రతులకు: మైత్రి బుక్ హౌస్, జలీల్ స్ట్రీట్, ఆరండల్‌పేట్, కార్ల్ మార్క్స్ రోడ్, విజయవాడ-520 002, సెల్: 9848631604



❖ **చూస్తుండగానే...,కవిత్వం**– రాజేందర్ జింబో, 115 పేజీలు, 1/8 డెమీ, రు: 60, ప్రతులకు: పోయెట్రీ ఫోరమ్, 305, సౌందర్య రెసిడెన్సీ, స్ట్రీట్ నెం.8, హిమాయత్‌నగర్, హైదరాబాద్-500 029, ఫోన్:040-27610182, సెల్:9440483001, ఇమెయిల్: rajenderzibo@yahoo.com



❖ **బహిష్కారం** – సంపాదకులు: నల్లెల్ల రాజయ్య, దండ్రె రాజమౌళి, వరంగల్లు రచయితల సంఘం, 101 పేజీలు, 1/8 డెమీ, రు: 50, ప్రతులకు: నల్లెల్ల సుగుణ, ఇ.నెం. 7-1-384/6, పద్మాక్షి కాలనీ, హన్మకొండ, వరంగల్, ఫోన్ : 9989415571; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలు

## న్యూడెమోక్రసీ బాటన్న మృతి

సిపిఐ (ఎం.ఎల్) న్యూడెమోక్రసీ ఖమ్మం జిల్లా కమిటీ సభ్యులు బాటన్న (85) (వీసం రావయ్య) క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ జూన్ 16న చనిపోయారు. ఆయన స్వగ్రామం ఖమ్మం జిల్లా, గుండాల మండలం, కోటవటంచ గ్రామం. ఆయన 1968లో పార్టీలో చేరి గోదావరి లోయ ప్రతిఘటనోద్యమంలో క్రియాశీల పాత్ర పోషిస్తూ, రెండు దశాబ్దాలకు పైగా అజ్ఞాత జీవితం గడిపారు.

## ఎపిటిఎఫ్ నాయకులు బుచ్చిరెడ్డి మృతి

ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్ (ఎపిటిఎఫ్) నాయకులు నల్గొండ జిల్లా మాజీ అధ్యక్షులు జి. బుచ్చిరెడ్డి (77) (బుచ్చన్న) జూన్ 26న చనిపోయారు. ఆయన స్వగ్రామం నల్గొండ జిల్లా, వలిగొండ మండలం, సుంకిశాల గ్రామం. ఆయన 1936 జూలై 7న రైతు కుటుంబంలో జన్మించారు. ఆయన సాయుధ పోరులో సుంకిశాల, నా జీవన గమనం, జ్ఞాపకాలు–అనుభవాలు–అనుభూతులు అనే పుస్తకాలూ రాశారు.

## తెలంగాణ సాధన సభ

తెలంగాణ కాంగ్రెస్ నాయకులు తెలంగాణ రాష్ట్ర సాధన కోసం జూన్ 30న హైదరాబాద్‌లోని నిజాం కాలేజీ గ్రౌండ్స్‌లో భారీ బహిరంగ సభ జరిపినారు. ఈ సభలో తెలంగాణ కాంగ్రెస్ ఎం.ఎల్.ఎలూ, ఎం.పిలూ, మంత్రులూ, నాయకులూ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. భారీ సంఖ్యలో ప్రజలు సభకు హాజరయ్యారు.

## గంటి ప్రసాదం హత్య

అమరవీరుల బంధుమిత్రుల సంఘం రాష్ట్ర గౌరవాధ్యక్షులు గంటి ప్రసాదంను జూలై 4న నెల్లూరులో గుర్తు తెలియని వ్యక్తులు వేటకొడవళ్లతో నరికి, తపంచతో కాల్చినారు. ఆయన నెల్లూరులోని నారాయణ ఆస్పత్రిలో చిక్సిత్స పొందుతూ అర్ధరాత్రి చనిపోయారు. ఈయనది విజయనగరం జిల్లా బొబ్బిలి స్వగ్రామం.

## మద్యానికి వ్యతిరేకంగా మహిళల ఆందోళన

గ్రామాల్లో బెల్టు షాపులను నిరోధించాలని ఐద్వా ఆధ్వర్యంలో జూలై 5న కృష్ణా జిల్లా వీరులపాడు మండలం అల్లూరు గ్రామంలో రాస్తారోకో చేశారు. మద్యం వ్యాపారులకు అండగా నిలిచిన పోలీసులపై ఆగ్రహం వ్యక్తం చేస్తూ, మద్యం బాటిళ్లను పగుల గొట్టారు. ఈ కార్యక్రమంలో ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి స్వరూపరాణి, జిల్లా నాయకులు యార్లగడ్డ జోయతో పాటు గ్రామ మహిళలూ పాల్గొన్నారు.

## సిటీ లైట్ హోటల్ దుర్ఘటన

సికింద్రాబాద్‌లోని రాష్ట్రపతి రోడ్‌లో ఉన్న సిటీ లైట్ హోటల్ జూలై 8న అకస్మాత్తుగా కుప్పకూలిపోయింది. ఈ ప్రమాదంలో 17 మంది చనిపోయారు. 18 మందికి గాయాలైనాయి. భవనం శిథిలమవడమే కూలడానికి కారణమని మున్సిపాలిటీ అధికారులు అంటున్నారు.

## జర్నలిస్టు హసన్ ఫారూఖ్ మృతి

సీనియర్ జర్నలిస్టు, కవి, రచయిత హసన్ ఫారుఖ్ (70) అనారోగ్యంతో బాధపడతూ హైదరాబాద్‌లోని మహవీర్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ జూలై 15న మరణించారు. ఈయన ఉర్దూ అకాడమీ ప్రజా సంబంధాల అధికారిగా, ఈ టివి ఉర్దూ ఛానల్ విలేఖరిగా పని చేశారు. ఉర్దూలో పుస్తకాలు రాశారు.

## డా. మాకినేని రామారావు మృతి

ప్రముఖ ప్రజా వైద్యుడు, ఆంధ్రప్రదేశ్ ప్రజా నాట్యమండలి రాష్ట్ర నాయకులు డా. మాకినేని రామారావు (73) అనారోగ్యంతో విజయవాడ లోని ఒక ప్రైవేట్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ జూలై 17న చనిపోయారు. ఆయన 1940 ఫిబ్రవరి 1న కృష్ణా జిల్లా, తోట్లవల్లూరు లో జన్మించారు. ఆయన వరంగల్ వైద్యకళాశాల 1958కి సంబంధించిన తొలి బ్యాచ్ విద్యార్థి. 1967లో నెల్లూరు రామచంద్రారెడ్డి ప్రజా వైద్యశాలలో శిక్షణ పొందారు. అలాగే ఆంధ్రప్రదేశ్ ప్రజానాట్య మండలికి నాయకుడిగా, ఐక్య విద్యార్థి పత్రికకు సంపాదకునిగా పని చేశారు.

## తెలంగాణ కోసం మరో వేదిక

సిపిఐ ఆధ్వర్యంలో జూలై 18న సిపిఐ రాష్ట్ర కార్యాలయం మఖ్దూం భవన్‌లో సిపిఐ (ఎంఎల్) న్యూడెమోక్రసీ, సిపిఐ (ఎంఎల్) లిబరేషన్, తెలంగాణ కమ్యూనిస్టు పార్టీ, ఫార్వర్డ్ బ్లాక్‌లతో కలిసి తెలంగాణ సాధన కోసం వామపక్ష వేదిక ఏర్పాటయింది. ఈ సమావేశంలో సిపిఐ రాష్ట్ర కార్యదర్శి నారాయణ, సిపిఐ (ఎంఎల్) న్యూడెమోక్రసీ కేంద్ర కమిటీ సభ్యులు సూర్యం, ఫార్వర్డ్ బ్లాక్ రాష్ట్ర కార్యదర్శి బండా సురేందర్‌రెడ్డి, తెలంగాణ కమ్యూనిస్టు పార్టీ నేత జంగారెడ్డి, సిపిఐ (ఎంఎల్) లిబరేషన్ నేత మూర్తి పాల్గొన్నారు.

## గంటి ప్రసాదం సంస్మరణ సభ

అమరుల బంధుమిత్రుల సంఘం ఆధ్వర్యంలో జూలై 18న హైదరాబాద్ లోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో గంటి ప్రసాదం సంస్మరణ సభ జరిగింది. ఈ సభకు హాజరైన వక్తలు గంటి ప్రసాదాన్ని ప్రభుత్వమే హత్య చేసిందని ఆరోపించారు. ఈ సభలో జార్ఖండ్ ప్రజా కళాకారుడు జీతేన్ మరాండి, పౌర హక్కుల నేత హరగోపాల్, విరసం సభ్యులు వరవరరావు, ప్రముఖ కవి డాక్టర్ శివారెడ్డి పాల్గొన్నారు. అలాగే గంటి ప్రసాదం హత్యను ఖండిస్తూ జూలై 19న ప్రజా సంఘాల ఐక్య వేదిక ఆధ్వర్యంలో ఇందిరా పార్క్ వద్ద ధర్నా నిర్వహించారు. ఈ ధర్నాలో వివిధ ప్రజా సంఘాల నాయకులు పాల్గొని ప్రభుత్వం తీరు పట్ల తమ నిరసనను వ్యక్తంచేశారు.

## గిడుగు రాజేశ్వరరావు మృతి

ప్రముఖ కవి, రచయిత, గిడుగు రాజేశ్వరరావు (82) జూలై 20న ఢిల్లీ రైల్వే స్టేషన్‌లో గుండెపోటుతో చనిపోయారు. ఆయన 1933లో విజయనగరం జిల్లా పర్లాకిమిడి గ్రామంలో జన్మించారు. పూలతేరు, కాశిందిలో వెన్నెల, మల్లెపందిరి మొదలైన కథల సంపుటాలూ, భావవీచికలు, రాగవీచికలు వంటి గేయ సంపుటాలు రచించారు. ఆయన ప్రముఖ రచయిత గిడుగు రామ్మూర్తి మనువడు.

## ప్రొఫెసర్ ఉపేందర్ మృతి

ఉస్మానియా యూనివర్సిటీ అర్థశాస్త్ర విభాగాధిపతి, సీనియర్ ప్రొఫెసర్ ఉపేందర్ (57) అకాలంగా జూలై 23న మరణించారు. ఆయన ప్రస్తుత ఉస్మానియా యూనివర్సిటీ పాలక మండలి (ఈసి) సభ్యునిగా, ప్రొఫెసర్ జి. రాంరెడ్డి సెంటర్ ఫర్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ డైరెక్టర్‌గా పదవి బాధ్యతలు నిర్వహిస్తున్నారు. వీ

# ప్రైవేటీకరణకే ఈ స్వాతంత్ర్యం

*స్వాతంత్ర్యం వచ్చి ఆరు దశాబ్దాలు దాటినా సామాన్య ప్రజలకు స్వాతంత్ర్య హక్కులు అందలేదనీ, మరోసారి స్వాతంత్ర్య పోరాటం జరపాల్సిన అవసరం ఉందనీ అంటున్నారు* **వి. హనుమంతరావు**

మరో పదిహేను దినాల్లో స్వతంత్ర దినోత్సవాలు జరుగబోతున్నాయి. ఆగస్ట్ 15న మనకు స్వాతంత్ర్యం వచ్చిందని అనే కన్నా బ్రిటిష్ సామ్రాజ్యవాదులు దేశంలో వేడి గాలులు వీస్తున్నాయని గ్రహించి కాంగ్రెస్ పార్టీకి పరిపాలనా పగ్గాలు అప్పగించి దేశం నుంచి నిష్క్రమించారు అని అంటే వాస్తవానికి దగ్గరగా ఉంటుంది. రెండవ స్వాతంత్ర్య పోరాటం కోసం పోరాడాలనే మాట దేశంలో వినిపిస్తోందంటే, స్వాతంత్ర్య ఫలితాలు ప్రజల అనుభవంలోకి రాలేదనే భావన ఏర్పడిందని భావించాలి. లేదా 1991లో ఆర్థిక సంస్కరణల దుష్ఫలితాలతో, ప్రభుత్వం మీద విశ్వాసం సన్నగిల్లిందని అనుకోవచ్చు. గాంధీజీ ఆశించిన, కలలు కన్న స్వరాజ్యం, గ్రామీణులకు విముక్తి లభించ లేదని అనుకోవాలి. ఈ అభిప్రాయంతో ఏకీభవించని వారుండవచ్చు. మనకు స్వాతంత్ర్యం వచ్చింది కాని స్వరాజ్యం రాలేదంటే అంగీకరిస్తారా? పోనీ, అభివృద్ధి ఆరోహణ – ఆమ్ ఆద్మీ అవరోహణ అనయినా అంగీకరిస్తారా? గ్రామాలు కళావిహీనమవుతున్నాయని అంగీకరిస్తారా? ఇక్కడ వెనక్కు పోయి, రాష్ట్రంలో 1956 నుంచి ఏం జరిగిందో విశ్లేషించుకొందాం.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 1956 నవంబర్ 1న అవతరించిన నాటి నుంచి రాష్ట్రం కడుపులో నీళ్లు కదలకుండా మెల్లగా, చల్లగా అభివృద్ధి పథంలో పయనం ప్రారంభించింది. రాష్ట్రం ప్రధానంగా వ్యవసాయిక రాష్ట్రం కావడంతో మొదటి దశకంలో ఆంధ్ర ప్రాంతంలో నాగార్జున సాగర్, తెలంగాణ ప్రాంతంలో పోచంపాడు (శ్రీరాంసాగర్) ప్రాజెక్టులతో అభివృద్ధికి శ్రీకారం చుట్టింది. 60వ దశకంలో కేంద్ర ప్రభుత్వ సహకారంతో పారిశ్రామికీకరణకు ఓనమాలు దిద్దుకుంది. 70వ దశకంలో సస్యవిప్లవం (భూసంస్కరణల మోసం తప్ప) తో మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లింది. 80వ దశకంలో అంతకు ముందు జరిగిన అభివృద్ధిని ఒడిదుడుకులకు లోనైంది. సస్య విప్లవం పెద్ద భూకామందులు మరింత ధనవంతులు కావడంతో పేద గ్రామీణ ప్రజలకు ఒరిగిందేమీ లేదు. అదే సమయంలో అప్పటి దేశ ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ముఖ్యమంత్రులను మార్చి మార్చి వారితో పేకాట ఆడింది. ఈ నేపథ్యంలో రాజకీయాల్లో ప్రవేశించిన ఎన్.టి. రామారావు, రెడ్డి రాజ్యం పోయి కమ్మ రాజ్యం స్థాపించాలనే ధ్యేయంతో ఆ లక్ష్య సాధనకు రెండు రూపాయల కిలో బియ్యం అనే ముసుగు తొడిగి, సినిమా రంగంలో తాను సాధించిన పాప్యులారిటీ తోడు రాగా రాష్ట్రం లోనే కాక దేశమంతటా సంచలనాన్ని సృష్టించారు.

90వ దశకంలో ప్రపంచ బ్యాంక్ దేశంలో కాలు పెట్టి, ఆర్థిక సంస్కరణలు ప్రవేశపెట్టి అంతవరకు సాధించిన అభివృద్ధిని మట్టిపాలు చేసింది. ఈ దుస్థితికి మన తెలుగువాడు పివి నరసింహారావే కారకుడు కావడం, రాష్ట్రంలో చంద్రబాబు ముఖ్యమంత్రి కావడం, ఆంధ్రప్రదేశ్ దురదృష్టం. ఏలిన నాటి శని ఈ నాటికీ వెంటాడుతూనే ఉంది. కేంద్రంలో ప్రస్తుత ప్రభుత్వం సాగినంత కాలం శని వెంటాడుతూనే ఉంటుంది. అభివృద్ధికి ఫుల్‌స్టాప్, అధోగతికి పచ్చజెండా. 1956తో పోలిస్తే అభివృద్ధి సాధించిన మాట వాస్తవం. అభివృద్ధి ఫలితాలు అందనిది ప్రజలే. 'భారతదేశం ధనవంతమైనదే. భారతీయులు పేదవారు' అని బ్రిటిష్ ఆర్థికవేత్త అన్నమాట గుర్తుకువస్తోంది. అప్పుడు అదెంత నిజమో, ఈ రోజున కూడా అంతేనని ఒకపక్క బిలియనీర్లు, మరోపక్క బికారీలు వర్ధిల్లుతూండడమే నిదర్శనం. ఈ పరిణామానికి కాంగ్రెస్, తెలుగుదేశం అప్పుడూ ఇప్పుడూ బాధ్యత వహించాల్సి ఉంటుంది.

ఆర్థికంగా అటు దేశం, ఇటు రాష్ట్రం కుప్పకూలిపోతున్న పరిణామాన్ని చూసుకొని, 'మీరేమీ దిగులు పడనక్కర్లేదు, మేమున్నాం' అంటూ చంద్రబాబు పాలనలో ప్రపంచబ్యాంక్ రంగప్రవేశం చేసి, తాము సూచించే ఆర్థిక సంస్కరణలు అమలుపరిస్తే సహాయం చేస్తామనే షరతుతో, భారత ప్రభుత్వాన్ని మెడలు వంచి, అంతవరకూ ఆసియా దేశాల్లో సంస్కరణలను తెగనాడిన మన్మోహన్‌సింగ్‌ను బుట్టలో వేసుకొని, దేశంలో కాలుపెట్టింది. అయితే ఆ ప్రవేశం కేంద్ర ప్రభుత్వ స్థాయికే పరిమితం కావడం, రాష్ట్రాలు ఇంకా తమ ఉచ్చులోకి ప్రవేశపెట్టక పోవడాన్ని గ్రహించిన ప్రపంచ బ్యాంక్ దుర్భిణీ వేసి చూడగా, అప్పుడే ఎన్‌టి రామారావును వెన్నుపోటు పొడిచి ముఖ్యమంత్రి కిరీటాన్ని ధరించిన చంద్రబాబు కనిపించారు. మొదటి విడత పాలనలో తెలుగుదేశం ప్రవేశపెట్టిన రెండు రూపాయల బియ్యం జనరంజకమైనదే అయినా అది బడ్జెట్‌లో ప్రవేశపెట్టిన రు. 1100 కోట్లు లోటు, ప్రణాళికా ప్రాధాన్యతకు మార్చుడం. గ్రామీణ పరిపాలనా వ్యవస్థలో అభిలషణీయమైన మార్పు (కరణం మునసబుల వ్యవస్థ రద్దు) తీసుకొని వచ్చినా ఆ వ్యవస్థస్థానే మరో వ్యవస్థ ఏర్పాటు చేయకపోవడం, మద్యపాన నిషేధంతో ఆదాయం కోల్పోవడం రామారావు అధికారం చేపట్టినప్పటి నుంచి రెవెన్యూ లోటు బడ్జెట్ లాంటి పరిణామాలు చంద్రబాబు ఎదుర్కోవాల్సి వచ్చింది. ఏం చేయాలో తోచక దిక్కులు చూస్తున్న చంద్రబాబును తన వలలో వేసుకొంది. రాష్ట్రంలో ప్రపంచబ్యాంక్ అనే శనీశ్వరుడు ప్రవేశించాడు. వివిధ దేశాల్లో ప్రపంచ బ్యాంక్ కాలు పెట్టింది కాని, మొదటిసారిగా రాష్ట్ర స్థాయిలో ప్రవేశించడం బ్యాంక్ చరిత్రలో ఇదే మొదటిసారి. అనుభవం చెపుతున్నదేమంటే ఆ సంస్థ ఎక్కడ కాలు పెట్టిందో, అక్కడ మసి మసి.

రాష్ట్ర ప్రభుత్వ వనరులు, రాష్ట్రం వాటాగా కేంద్రం అందచేస్తున్న నిధులు, మార్కెట్ రుణాలు, ఆర్థిక సంస్థల నుంచి తెచ్చిన అప్పులు, ప్రణాళికకు కేంద్ర నిధులు అన్నీ ఖర్చు చేసినా రాష్ట్రానికి ముక్తి, మోక్షం కలుగలేదు. ఈ స్థితిని గమనించిన బ్యాంక్ నిన్ను కష్టాల్లోంచి బయట పడేస్తాం. అందుకోసం స్ట్రక్చరల్ అడ్జస్ట్‌మెంట్ (సంస్థాగత సర్దుబాటు)

అనే మందు వేసుకోవాలంది. ప్రజల చేత మింగించాల్సిన ఈ మందుకు పంచదార పూసే కార్యక్రమాన్ని ముఖ్యమంత్రి చంద్రబాబుకు అప్పచెప్పింది. కాలగమనంలో ప్రవరాఖ్యుని వేపనం కరిగిపోయినట్లు కరిగిపోయింది. పన్నులు, ఫీజులు, ఛార్జీలు పెరగడం ప్రారంభమైంది. బ్యాంకు మింగించిన గుళికల ఫలితం 2000 ప్రారంభం నాటికే కనిపించింది.

- ప్రభుత్వ ఆస్తి కన్నా అప్పులు పెరిగాయి.
- రెవెన్యూ పద్దు కింద ఆదాయం కన్నా వ్యయం పెరిగింది.
- కేంద్రం నుంచి వచ్చే నిధుల శాతం తగ్గింది.
- రెవెన్యూ బకాయిలు పెరిగాయి.
- అభివృద్ధి ఖర్చు తగ్గి, అభివృద్ధేతర ఖర్చు పెరిగింది.
- విద్య, వైద్యం లాంటి సామాజిక సేవల మీద ఖర్చు మొత్తం రెవెన్యూ ఖర్చులో ఏ సంవత్సరంలోను 10 శాతం మించలేదు.
- పెట్టుబడి పద్దు కింద ఆదాయం, ఆస్తుల సృష్టికి కాకుండా రోజువారీ ఖర్చులకు మళ్లించారు. ఈ ఖర్చు తగ్గితే అభివృద్ధి కుంటు పడుతుంది.
- విదేశీ నిధుల మీద ఆధారపడడం ఎక్కువైంది.
- ద్రవ్యలోటు ప్రతీ సంవత్సరం పెరుగుతూ వచ్చింది.
- ధరలు పెరుగుతూనే ఉన్నాయి.
- తలసరి ఆదాయం విషయంలో కేంద్రానికి, రాష్ట్రానికి మధ్య అంతరం పెరుగుతూనే వచ్చింది.

రాష్ట్ర ప్రభుత్వ ప్రణాళికా సంఘం ఉపాధ్యక్షుడు హెచ్చరికలు జారీ చేయాల్సిన పరిస్థితి ఏర్పడింది. విదేశీ రుణాల మీద ఆధార పడడం ఎంతవరకు పోయిందంటే, విదేశాల నుంచి రుణం నేరుగా రాష్ట్రాలు తెచ్చుకొనేలా రాజ్యాంగాన్నే సవరించాల్సినదిగా కేంద్రానికి సిఫార్సు చేశారు. అయితే ఐటి రంగానికి పునాదులు వేసిన ఘనత చంద్రబాబుకే దక్కుతుంది. కాని సేవా రంగమైన ఐటిని పారిశ్రామికాభివృద్ధిగా చూపించడం పారిశ్రామిక రంగంలో ప్రభుత్వ వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవడమే.

రాష్ట్రం సంస్కరణలనే జగన్నాథ రథచక్రాల కింద నలిగిపోయింది. అన్ని రంగాల్లో అభివృద్ధి కుంటుపడింది. వ్యవసాయదారులకు దక్కింది చంద్రబాబు ఉపన్యాసాలు మాత్రమే. చంద్రబాబు శకం విశ్లేషణను ఒక బ్రిటిష్ కాలమిస్టు జార్జి మాన్ బియాత్ వెలిబుచ్చిన అభిప్రాయంతో ముగిస్తా. 'ఆంధ్రప్రదేశ్‌ను డిఎఫ్‌డిఐ అనే బ్రిటిష్ సంస్థ 34.2 కోట్ల పౌండ్లు (పౌండు అంటే సుమారుగా 70 రూపాయలు) సాయంగా అందించింది. కరువు సాయంగా ఇథియోపియా (ఎపుడూ కరువుతో అల్లల్లాడే ఆఫ్రికా దేశం) కు ఇచ్చిన దానికంటే 15 రెట్లు ఎక్కువ. ఇంత ఎక్కువ సహాయం ఎందుకిచ్చారంటే రాష్ట్ర సిఇఒగా రాష్ట్రాన్ని బహుళజాతి సంస్థలకు వెండిపళ్లెంలో పెట్టి అప్పగించినందుకు. సిఇఒ అంటే చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ అంటే పై నుంచి వచ్చిన ఆదేశాలను అందుకొని అమలుపరిచే ప్రధాన అధికారి. అంటే ప్రపంచ బ్యాంక్ నుంచి వచ్చిన ఆదేశాలను అమలుపరిచే అధికారిగా చంద్రబాబు వ్యవహరించాడన్న మాట. కేంద్ర ప్రభుత్వం నుంచి వచ్చే ఆదేశాలను అమలు పరచడం వేరు, అమెరికా పెంపుడు కుక్క అయిన ప్రపంచ బ్యాంక్ ఆదేశాలను అమలు పరచడం వేరు. ఒక రాష్ట్ర ముఖ్యమంత్రి అయి కూడా ఈ బాధ్యతను వహించడానికి అంగీకరించిన వ్యక్తిని ఏమనాలి?

రాష్ట్ర ప్రజల బాగోగులను, ముఖ్యంగా గ్రామీణ ప్రజల ప్రయోజనాలను విస్మరించినందుకు ఆయనను గద్దె దించి కాంగ్రెస్‌ను 2004లో గెలిపించారు. 1400 కిలోమీటర్ల పాదయాత్రను పెట్టుబడిగా పెట్టిన కాంగ్రెస్ నాయకుడిని గెలిపించారు. గ్రామీణ ప్రాంతాన్ని ఎనిమిదేళ్లుగా ఎండపెట్టడం ద్వారా కాంగ్రెస్ గెలుపుకు పరోక్షంగా చంద్రబాబు తోడ్పడ్డారు. ఎన్‌టి రామారావు రెండు రూపాయల కిలో బియ్యం నిర్ణయాన్ని ప్రకటించి ఎలా సంచలనం సృష్టించారో, వైఎస్ కూడా ఉచిత విద్యుత్, బాకీల మాఫీ ప్రకటించి ఆ ప్రకటన వెనువెంటనే జలయజ్ఞం పథకాన్ని ఆవిష్కరించి రైతుల అభిమానాన్ని చూరగొన్నారు. అయిదేళ్లు పూర్తిచేసి ఆరవ సంవత్సరంలో విమాన ప్రమాదంలో మరణించారు. ఆ సందర్భంలో ఆ వార్త విన్న వెన్వెంటనే రాష్ట్ర ప్రజల స్పందన అపూర్వం. ఆయన పరిపాలన ప్రారంభ దినాల్లోనే రాష్ట్రంలో పర్యటించినపుడల్లా ఏదో ఒక ప్రజానుకూల ప్రకటన చేస్తూ వచ్చారు. ఆయన ప్రకటించిన పథకాలకయ్యే ఖర్చు లెక్కలు వేసిన ఆర్థిక మంత్రి రోశయ్య ఇంత డబ్బు ఎక్కడ నుంచి తేవాలి అని బహిరంగంగానే తన భయాందోళనను వ్యక్తం చేశారు. రైతులకు కనీస ధర వెయ్యి రూపాయలు ఇవ్వాలని రెండేళ్లుగా డిమాండ్ చేస్తున్నా దానిని సాధించలేక పోయినా, రెండో పక్క జలయజ్ఞం పేరుతో నీటి సరఫరా పథకాన్ని ప్రకటించి జోగొట్టారు. విద్యాధికుల నిరుద్యోగ నివారణ మీద దృష్టి సారించలేదు. అదే సమయంలో నెలకు నూరు రూపాయల ఉపాధి పథకాన్ని చూపించి సమస్యను పరిష్కరించేస్తున్నా అంటూ జోకొట్టారు. అనేక ప్రజాకర్షక పథకాలను ప్రవేశపెట్టి వాటి ఫలితాలు ప్రజలకు అందకుండా దారిలోనే భోంచేస్తున్న అధికారులు, పార్టీ కార్యకర్తలపై ఎటువంటి చర్యా తీసుకోకుండా అదే సమయంలో జనాకర్షక పథకాల ప్రచార హోరు సృష్టించి పబ్బం గడుపుకొంటూ వచ్చారు. ఇలాంటి ఉదాహరణ లెన్నయినా ఇవ్వవచ్చు. చేసినా, చేయకపోయినా ప్రజల హృదయాల్లో చోటు చేసుకొన్నారని ఆయన మరణించిన రోజునే ఎవరి పిలుపూ లేకుండానే రాష్ట్రమంతా ప్రజలు సానుభూతిని ప్రదర్శించారు. నా అరవై సంవత్సరాల జర్నలిస్టు జీవితంలో ఏ ముఖ్యమంత్రికీ ఇలా నీరాజనాలు పట్టిన దాఖలాలు లేవు. ఇది బొమ్మ, బొరుసు చిత్రం. కాంగ్రెస్ పార్టీకి సంబంధించినంత వరకు, ఆయనకు ఎదురుగా నిలిచిన మొనగాడు లేడు. ఎందరు ముఖ్యమంత్రులు మారినా (తెలుగుదేశం హయాం తప్ప) ఆర్థిక శాఖ రోశయ్య చేయి జారిపోలేదు. ప్రస్తుత ముఖ్యమంత్రి పాప్యులిస్ట్ పథకాలు ప్రకటించే ముఖ్యమంత్రిగా, వాటిని అమలు పరచడం, ఆ పథకాల ఫలితాలు ప్రజలకు అందుతున్నాయో లేదో అని పట్టించు కోకుండా ఉన్న ముఖ్యమంత్రిగా చరిత్రలో నిలిచిపోతాడు.

ప్రజలకు సంబంధించినంత వరకూ ఆయన పాలన పూల పాన్పు ఏమీ కాదని నేడు రాష్ట్రాన్ని విహంగ వీక్షణం చూస్తే తెలుస్తుంది. అటు చంద్రబాబు, ఇటు వైఎస్ ఇద్దరూ సమాజంలో ఒకే వర్గానికి ప్రాతినిధ్యం వహించారనేది నిష్ఠురసత్యం. ఇద్దరూ బూర్జువా వర్గానికి, వారి ప్రయోజనాలను కాపాడుతూ వచ్చిన వారే. తరతమ బేధాలతో ఇద్దరూ ప్రపంచబ్యాంక్ వలలో తలదూర్చిన వారే. ఇద్దరి పరిపాలన, ఆమాటకొస్తే ఏ ప్రభుత్వం కాదు? తీవ్ర విమర్శలకు, ప్రజా వ్యతిరేకతకు, నిరసన ప్రదర్శనలనెదుర్కొన్న వారే. వైఎస్ ఫ్యూడల్ కుటుంబ నేపథ్యం నుండి వచ్చిన వారైనా బూర్జువా వర్గ పోకడలను, పద్ధతులను బాగానే పుణికిపుచ్చుకొన్నారు. ఒకపక్క నాలుగైదు లక్షల ఎకరాల భూమి (అదెంత లోప భూయిష్టమైనా) పంచి పెట్టారు, రెండో పక్క సెజ్‌ల కోసం, పరిశ్రమల కోసం వేల ఎకరాలను పారిశ్రామికవేత్తలకు కట్టబెట్టారు.

భూమి లేని వ్యవసాయ కూలీలకు చారెడు భూమి ఇవ్వలేకపోయినా, పెంచిన కూలీ ఇమ్మని అడిగితే భూకామందులకు కోపం వచ్చినా గప్‌చుప్‌గా ఊరుకున్నారు. రైతులకు రుణమాఫీ పథకం అమలు చేశారు, కొంతమందికి నష్టం వస్తే దానిని భర్తీ చేశారు. రెండో పక్క వడ్డీ వ్యాపారస్తుల వద్ద పేదలు తీసుకొన్న రుణాల మాఫీ గురించి ఎటువంటి చర్యా తీసుకోలేదు. ఆయనకు ముందు ముఖ్యమంత్రి అభివృద్ధిని నగరాలకు, ముఖ్యంగా హైదరాబాద్ నగరానికి పరిమితం చేయగా, వైఎస్ తన దృష్టిని గ్రామీణ ప్రాంతాలపై కేంద్రీకరించారు. ఆరోగ్యశ్రీతో పేదలకు వైద్యం అందజేస్తూనే, అదే సమయంలో కార్పొరేట్ వైద్యశాలలకు కోట్ల రూపాయలు సమర్పించుకొన్నారు.

రాష్ట్రంలో, దేశంలో బ్రిటిష్ పాలకుల పరిపాలన పద్ధతులు, వారు ప్రవేశపెట్టిన మెకాలే విద్యా విధానం, వారి కట్టూ, బట్టా, వారు ప్రవేశపెట్టిన చట్టాలు, వారి భాషా సంస్కృతులు ఇక్కడే వదిలి పెట్టి పోయారు. సంస్కరణలు ప్రవేశపెట్టిన తర్వాత పైన ఉదహరించినవన్నీ వెర్రితలలు వేస్తున్నాయి. జుగుప్స కలిగిస్తున్నాయి. మాతృభాష స్థానే ఇంగ్లిష్ దేశ భాషగా మారిపోయింది. ఎప్పుడో 1894 నాటి భూమికి సంబంధించిన చట్టం ఇంకా అమలులో ఉంది. బానిస బుద్ధికి ఉన్న శక్తి అలాంటిది. అందుకనే కాబోలు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల స్థానే అమెరికన్ సామ్రాజ్యవాదులను ఎర్రతివాసీ పరిచి ఆహ్వానిస్తున్నారు. అమెరికా తన కోసం వండివార్చిన ఆలోచనలే పరిపాలనా తీరును ప్రభావితం చేస్తున్నాయి. ఈ ధోరణి చూస్తే మనలను వాజ్‌పేయ్, మన్మోహన్‌సింగ్ సర్వస్వతంత్రులుగా పరిపాలించారా? లేక అమెరికా ఆదేశాలను అమలు పరిచే గుమస్తాలుగా మారిపోయి అస్వంత్రులుగా పాలించాలా? అనే సందేహం రాక మానదు. అమెరికాలో 52 రాష్ట్రాలున్నాయి. దేశం 53వ రాష్ట్రమా అనే సందేహం కలుగుతుంది. ఇదీ ఆగస్ట్ 15 స్వతంత్ర దినోత్సవ నేపథ్యం. దేశం, రాష్ట్రాలు 67 సంవత్సరాలు వెనక్కి నడుస్తున్నాయి.

మనకొచ్చిన స్వాతంత్ర్యం మిథ్య; బ్రిటిష్ సామ్రాజ్యవాదులు నిష్క్రమిస్తే, ఆ స్థానంలో అమెరికా ప్రవేశించింది. అయితే, బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్లాగ నేరుగా పాలించకుండా, ఆర్థికంగా, పరోక్షంగా పెత్తనం చలాయిస్తుంది. స్వతంత్రం పాలకులకు వచ్చింది కాని ప్రజలకు కాదు. అలాగే కేంద్రం నిజం, రాష్ట్రాలు మిథ్య. ఎన్‌టిఆర్ అన్న మాట గుర్తుకొస్తుంది. స్వతంత్రం వచ్చేసిందని అంతా అనుకొంటున్న సందర్భంలో, అది రాష్ట్రాలకు వచ్చిందా అని ప్రశ్నించుకొంటే రాష్ట్రాలకు ఆ నామమాత్రమైన స్వాతంత్ర్యం రాలేదని, అధికారాలు కేంద్రంలో కేంద్రీకృతమవుతున్నాయని గత 66 సంవత్సరాల అనుభవం చెపుతోంది. మనది ఫెడరల్ వ్యవస్థ అని రాజ్యాంగంలో రాసుకొన్న విషయం కాగితం మీదే ఉండిపోయిందని అనుభవం చెపుతోంది. మూడే మూడు కార్యకలాపాలు కేంద్ర పరిధిలో ఉంటాయని, మిగతా అధికారాలు రాష్ట్రాల చేతుల్లోనే ఉంటాయని నెహ్రూ ప్రకటించారు. కాని అనుభవం చెపుతున్నదేమంటే కొన్ని అధికారాలను పేరుకు మాత్రం రాష్ట్రాలకిచ్చి, ఆచరణలో కేంద్రం పెత్తనం చేయడం మొదలుపెట్టింది. కస్టమ్స్, ఎక్సయిజ్ సుంకాలను రాష్ట్రాల్లో వసూలు చేసి తన బొక్కసంలో వేసుకొంటోంది. ప్రతి అయిదేళ్లకు కేంద్రం నియమించే ఆర్థిక సంఘాల ఎజెండాను కేంద్రానికి అనుకూలంగా విస్తరిస్తూ పోతోంది. పార్టీలు తమ విధానాలను పక్కన పెట్టి, కేంద్రం వసూళ్లలో సగభాగం రాష్ట్రాలకు బదలాయించాలని డిమాండ్ చేస్తూ వచ్చినా, ఒకటి లేదా రెండు శాతం మాత్రమే పెంచుతూ వచ్చింది. తాజాగా ఫైనాన్స్ కమిషన్ అధ్యక్షులు ఈ రాష్ట్రం నుంచే వెళ్లినవారు కాబట్టి, రాష్ట్రాల ఇబ్బందులేమిటో ఈ రాష్ట్ర అధికారిగా పనిచేశారు కాబట్టి, న్యాయం జరుగుతుందని ఆశించాలి. రాష్ట్రాలను బలహీనం చేసే ఉద్దేశంతో కేంద్ర ప్రతిపాదిత పథకాల పేరుతో కొన్ని పథకాలను సృష్టించి, వీటి అమలుకు కావాల్సిన నిధుల్లో 75 శాతం రాష్ట్రాలకిస్తామని షరతు విధించి, తన పెత్తనాన్ని విస్తరించుకొంటూ వస్తోంది.

ఇటీవల 12వ పంచవర్ష ప్రణాళిక ఎజెండాగా జాతీయ అభివృద్ధి సంస్థ సమావేశం జరిగినపుడు తమిళనాడు ముఖ్యమంత్రి వాకౌట్ చేశారు. ఆ సమావేశానికి అధ్యక్షత వహించిన ప్రధాని జయలలిత మాట్లాడడానికి కేవలం పది నిమిషాలు మాత్రమే కేటాయించినందుకు నిరసనగా ఆమె బయటకు వెళ్లిపోయారు. రానున్న అయిదేళ్ల భవిష్యత్తును నిర్ణయించే సమావేశం అది. అలాంటపుడు లోతైన చర్చ అవసరం. రాష్ట్రాలకు అనేక సమస్యలుంటాయి. ఈశాన్య ప్రాంతం, ఉత్తరాది, దక్షిణాది రాష్ట్రాల మధ్య వైవిధ్యం ఉండనే ఉంది. నేషనల్ డెవలప్‌మెంట్ అనే అధికార సంస్థ తరచుగా సమావేశాలు జరుపుతుంది. అలాంటి పరిస్థితుల్లో తూతూ మంత్రంగా లాంఛనంగా ఒక్కరోజు మాత్రమే కేటాయించడమే తప్పు. ఇది పరోక్షంగా కేంద్రం తన నిర్ణయాలను రాష్ట్రాలపై రుద్దడమే అవుతుంది. ప్రణాళికా సంఘం రాజ్యాంగేతర సంస్థ. అలాంటి సంస్థ చేసిన నిర్ణయాలను రాష్ట్రాలపై రుద్దడం రాజ్యాంగ విరుద్ధం; ఫెడరల్ వ్యవస్థ స్ఫూర్తికి పూర్తి వ్యతిరేకం. కేంద్ర – రాష్ట్ర సంబంధాలను మరింత జటిలం చేస్తుంది. సహజంగానే రాష్ట్రాలు, ముఖ్యంగా రాష్ట్రాల్లో కాంగ్రెసేతర ప్రభుత్వాలు ఆందోళన చేయగా 1983 జూన్‌లో సర్కారియా కమిషన్‌ను కేంద్ర – రాష్ట్ర సంబంధాలను సమీక్షించమని నియమించగా, ఆ కమిషన్ రాష్ట్రాల ప్రయోజనాలకు ప్రాముఖ్యం ఇవ్వాలని, రాష్ట్రాలను సంప్రదించకుండా (ఇప్పుడు కాంగ్రెస్ తలపొగరుతో మంత్రి మండలిలోని ఇతర పార్టీలను సంప్రదించడమే అరుదు) కేంద్రం ఏకపక్షంగా నిర్ణయాలు తీసుకోరాదని, రాష్ట్ర ప్రభుత్వాలను రద్దు చేసేందుకు ప్రయోగించే 356వ అధికరణ దుర్వినియోగం కాకుండా నివారించాలని సిఫారసు చేసింది. ఆర్థిక వనరుల కల్పనకు సంబంధించి కేంద్రం తన పట్టును సడలించి, రాష్ట్రాలకు మరింత స్వతంత్రం ఇవ్వాలని కమిషన్ సూచించింది. ఈ సూచనలు, సిఫారసులన్నీ చెత్తబుట్టలో వెళ్లిపోయాయనడానికి ఇటీవల మరొక కమిషన్‌ను నియమించాల్సి రావడమే నిదర్శనం.

చిన్నా, పెద్ద సమస్యలు పరిష్కరించడం ఇష్టం లేనప్పుడు, అదే సమయంలో కమిషన్లు చేసిన సూచనలను అమలు చేస్తున్నట్లు కనిపించడానికి కమిటీలు, ఉపసంఘాలు వేసి తాత్సారం చేయడం కాంగ్రెస్‌కు వెన్నతో పెట్టిన విద్య. అలాగే సర్కారియా కమిషన్ సూచనలను అమలు చేస్తున్నట్లు కనిపించడానికి లాంఛనంగా ప్రాంతీయ అంతర్రాష్ట్ర మండళ్లను ఏర్పాటు చేసిందే కాని అవి పని చేస్తేగా? ప్రతి ప్రాంతీయ మండలి తమ జోన్లలో ఉన్న రాష్ట్రాల ముఖ్య కార్యదర్శులతో స్థాయీ సంఘాలను ఏర్పాటు చేసినా అవి అలంకార ప్రాయంగానే ఉండిపోయాయి. నిర్ణీత వ్యవధిలో స్థాయీ సంఘాలు కాని, ప్రాంతీయ కమిటీలు కాని పనిచేయాలి కదా? ఉదాహరణకు 2005 నుంచి తూర్పు ప్రాంతీయ మండలి సమావేశమే కాలేదు. దక్షిణ ప్రాంతీయ మండలి 2006 నుంచి సమావేశాల్లేవు. పశ్చిమ ప్రాంతీయ మండలి 2006 నుంచి సమావేశాల్లేవు. రాష్ట్రాల మధ్య ఏర్పడే వివాదాలు అపరిష్కృతం

గానే మిగిలిపోతున్నాయి. కేంద్రంపై ఆధారపడుతున్నాయి. పేరుకే ఫెడరల్ వ్యవస్థ గాని ఆచరణలో యూనిటరీ స్వభావమే కొనసాగుతోంది. అందుకే రాష్ట్రాలపై కేంద్రం పెత్తనం నిరాఘాటంగా కొనసాగుతోంది. అంతర్రాష్ట్రీయ మండళ్ల పనితీరు అలానే ఉంది. సర్కారియా కమిషన్ గుర్తు చేసిన తర్వాతనే ఏర్పడ్డాయి. ప్రధాని అధ్యక్షునిగా ఉండే ఈ మండళ్లలో ఆరుగురు కేంద్ర మంత్రులు, ఆ ప్రాంతపు ముఖ్యమంత్రులు సభ్యులుగా ఉంటారు. అయితే ఈ మండళ్లు కూడా నిద్రమత్తులో ఉన్నాయి. ఇటీవల కొత్తగా ఏర్పాటు చేసిన కేంద్ర – రాష్ట్ర సంబంధాల ఈ కమిటీలను పని చేయించాలని సిఫార్సు చేసింది. అంతర్రాష్ట్ర మండళ్లు గత 22 సంవత్సరాల్లో కేవలం పదిసార్లే సమావేశ మయ్యాయంటే కేంద్ర ప్రభుత్వ ధోరణి ఏమిటో స్పష్టమవుతుంది. ఫెడరల్ వ్యవస్థను యూనిటరీ వ్యవస్థగా మార్చి రాష్ట్రాల ప్రయోజనాలను పరిమార్చడమే దాని లక్ష్యం.

రాజ్యాంగం ఆదేశించిన మేరకు ఏర్పాటు చేయాల్సిన వ్యవస్థలు ఇంత సొంపుగా పనిచేస్తూండగా కొత్తగా సోనియా గాంధీ ఆధ్వర్యాన జాతీయాభివృద్ధి కౌన్సిల్ పేరిట మరో రాజ్యాంగేతర సంస్థ ఏర్పాటైంది. ఈ కౌన్సిల్ ఏం పనిచేస్తుందనే ప్రశ్న పక్కన పెడితే (ఇది ప్రధాని మీద నిఘా? పోటీ సంస్థా?) ఇలా రాజ్యాంగేతర వ్యవస్థలకు పెద్దపీట వేయడం చట్టబద్ధ పరిపాలనేనా అని అడగాల్సి వస్తుంది. ఒకటి ప్రణాళికా సంఘం, రెండు ఈ కౌన్సిల్ రెండూ దేశాన్ని శాసిస్తున్నాయి.

తామేమో రాజ్యాంగాన్ని, చట్టాలను నేలరాస్తూ, మరోపక్కన ఢిల్లీలో జరిగిన దారుణ మానభంగం విషయం వచ్చేసరికి నిందితులను శిక్షించాలా? ఉరి తీయాలా? ఎలా శిక్షించాలి? ఏ చట్టం ప్రకారం కేసును నడిపించాలి అని మీనమేషాలు లెక్కిస్తోంది. మావోయిస్టులనే పేరుతో అమాయక గిరిజనులను వరసపెట్టి చంపేస్తుంటే, వారి నాయకులను ఎన్‌కౌంటర్లు చేసేస్తుంటే, ఆ చావులన్నీ చట్ట ప్రకారమే జరిగాయా? మరో ఉదాహరణ, రాజీవ్‌గాంధీ పంచాయతీలను చట్టబద్ధ సంస్థలుగా ప్రకటించి 27 రకాల కార్యక్రమాలను, నిధులతో, అధికారాలతో, అధికారులతో సహా పంచాయతీలకు దఖలు పరచాలని రాజ్యాంగాన్నే సవరించాడు. ఈ విషయాన్ని ఎవరూ సుప్రీంకోర్టులో ఎందుకు ఛాలెంజ్ చేయలేదు?

కాంగ్రెస్ పార్టీ భారతదేశాన్ని బహుళజాతి సంస్థలకు, దేశంలో కార్పొరేట్లకు అమ్మేసింది. ఈ నెల 14న మంత్రి మండలి తీసుకొన్న నిర్ణయాల సారాంశం ఇది. కొంతకాలం క్రితం 'అమ్మకానికి ఆంధ్రప్రదేశ్' పేరుతో 'వీక్షణం' మాసపత్రిక సంపాదకులు ఒక పుస్తకం ప్రచురిస్తే ఎవరైనా రాష్ట్రాన్ని అమ్మేస్తారా, ఈ రచయిత హద్దు మీరి రాస్తున్నాడేమో అని అనిపించింది. ఆ రచయిత ఆ పుస్తకాన్ని రచించే నాటికే కీ ఇస్తే బొమ్మ తిరిగినట్లు, అమెరికా ఏజెంటుగా పనిచేస్తున్న ప్రపంచ బ్యాంక్ దేశాన్ని కమ్మేసుకుంటూ వస్తోంది. మన్మోహన్‌సింగ్ ఎపుడో కొంప ముంచుతాడనే హెచ్చరికలు వినపడుతూ వచ్చాయి. ఇపుడు గాలిలోను, భూమ్మీద, భూగర్భంలో ద్వారాలు తెరిచిన తర్వాత మన్మోహన్ ప్రధాని కాదు, సిఇఒ మాత్రమే. చంద్రబాబు గుర్తుకొస్తున్నాడు. ఇపుడు తీసుకొన్న నిర్ణయాలు ఈనాటివి కావు, గత సంవత్సరంగా ప్రభుత్వ స్థాయిలో, ఆర్థిక శాస్త్రవేత్తల స్థాయిలో చర్చలో ఉన్న విషయమే. సంస్కరణలు రెండో విడత ప్రవేశపెట్టాలని కార్పొరేట్ సంస్థలు చెవి నోర్లు కట్టుకొని పోరుతున్న విషయమే. బహుళజాతి సంస్థలు, ముఖ్యంగా రిటైల్ అమ్మకాలకు అవకాశమివ్వాలని ఒత్తిడి తీసుకొస్తున్న విషయమే. ఇటు ప్రజలు, అటు వ్యాపారస్తులు ఆందోళన చేస్తున్న విషయమే. కాని చిదంబరం ఆర్థిక మంత్రి బాధ్యత చేపట్టిన రెండు వారాల్లోనే తుది నిర్ణయం ప్రకటించడం గమనార్హం. రిటైల్ రంగంలో ప్రవేశానికి అనుమతించాలని గత రెండు సంవత్సరాలుగా బహుళజాతి సంస్థలు ఒత్తిడి తీవ్రతరం చేయడం, ఆ ఒత్తిడి వెనుక అమెరికా హస్తం ఉండడం కూడా గమనించాలి. రాజకీయంగా కాంగ్రెస్ భ్రష్టుపట్టి ప్రజలంతా మొఖం మీద ఉమ్మేస్తున్నారు. నిండా మునిగిన వానికి చలేమిటన్నట్లు, ప్రజల శాపనార్థాలు కొత్తగా బరువేమీ కాదు. ఈ ఆలోచన తోటే సందట్లో సడేమియా అన్నట్లు డీజిల్ ధరలు కూడా పెంచేశారు. ఇంకో విషయం. 2014లో కాంగ్రెస్ ఎలాగూ గెలిచేది లేదు. ఇప్పుడు తీసుకొన్న నిర్ణయాల వల్ల ప్రజలు ఎలాగూ ఓటు వెయ్యరు. కనీసం ఇన్ని సంవత్సరాలూ ప్రత్యక్షంగా, పరోక్షంగా ధన, కనక వస్తు వాహనాలతో దన్నుగా నిల్చొన్న కార్పొరేట్ రంగానికి తన కృతజ్ఞతలు చెప్పుకోవడానికి ఇదే ఆఖరు అవకాశం అనుకొని ఈ నిర్ణయాలు తీసుకొన్నదని అనుకోవడం సత్య దూరం కాబోదు.

ఒకవేళ కాంగ్రెస్ జక్కయ్యను, బుక్కయ్యను ప్రలోభ పెట్టో, లేదా చిల్లర గానో, టోకుగానో గెలిచిన పార్లమెంట్ సభ్యులను లేదా చిన్న, చితకా పార్టీలను ఇప్పటి లాగే వలలో వేసుకొని ప్రభుత్వం ఏర్పాటు చేసిందే అనుకొందాం. కొవలిషన్ ధర్మం పేరుతో వారి కోర్కెలను నెరవేరుస్తూ పోతే, వాళ్లు (మమతలా) బెదిరిస్తుంటే, పరిపాలన కొనసాగించడం కన్నా ఏ నుయ్యో, గొయ్యో చూసుకోవడం మేలు.

ఇప్పుడు తీసుకొన్న నిర్ణయాలన్నీ ప్రధానంగా ఆర్థికపరమైనవి. కార్పొరేట్లు మెచ్చుకొన్నవి. ఇందువల్ల తయారీ రంగం పుంజుకోవచ్చు. బాగా రొక్కం ఉన్న ప్రభుత్వ రంగ సంస్థల ధిపతులతో చిదంబరం కలిసి మీ వద్దనున్న డబ్బు పెట్టుబడులు పెట్టండి. లేకపోతే ఆ డబ్బు మీ చేతుల్లో ఉండదు (ఇన్వెస్ట్ ఆర్ లూజ్) అని హెచ్చరించారు. మరికొన్ని ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో వాటాలు ప్రైవేట్ రంగానికి అమ్మి సొమ్ము చేసుకోవచ్చు. చిదంబరం తిరిగి ఆర్థికమంత్రి అయిన రోజు నుంచి బడ్జెట్ లోటు, ద్రవ్యలోటు, కరెంట్ ఎకౌంటు లోటు, వీటన్నిటిని చక్క దిద్దడానికి కఠిన నిర్ణయాలు తీసుకోవడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు. (ప్రణబ్‌ను దెప్పిపొడవడానికి కావచ్చు). ఈ చర్యలన్నిటి వల్ల, ప్రస్తుత నిర్ణయాల ఫలితంగా మన్మోహన్ కలలు కనే జిడిపి పెరగవచ్చు. అలా ఆర్థిక విధాన దృక్పథం నుంచి చూస్తే ప్రస్తుత నిర్ణయాలు కొంత తెరుపు ఇవ్వవచ్చు.

మాన్యుఫాక్చరింగ్ రంగం పుంజుకొని ఉత్పత్తిని వేగిర పరచవచ్చు. అయితే విద్యుచ్ఛక్తి ఉంటేనే అది సాధ్యం. విద్యుదుత్పత్తి పెరగాలంటే బొగ్గు సరఫరా ఏది? వినియోగ, విలాస వస్తువుల ఉత్పత్తి పెరిగితే, దానికి స్థానికంగా డిమాండ్ పరిమితం. యూరప్ సంక్షోభంతో ఎగుమతులు సన్నగిల్లాయి. దైనందిన అవసరాలను ఉత్పత్తి పెంచితే స్థానికంగా మార్కెట్ ధరలు పెరగడంతో, ఆ మార్కెట్టూ కుంచించుక పోతుంది. అయినా పారిశ్రామికవేత్తలు చాలా మంది విదేశాల్లో పెట్టుబడులు పెట్టడం, పరిశ్రమలను కొనేయడం పట్ల ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారని గణాంకాలు తెలియజేస్తున్నాయి. చిన్న, చిట్టి పరిశ్రమల ఉత్పత్తులు ఎగుమతుల్లో గణనీయమైన వాటా కలిగి ఉన్నాయి. కాని వారు ఉత్పత్తి చేయడానికి కరెంట్ లేదు. హైదరాబాద్ నగరంలో పెద్ద, మధ్యమ, చిన్న పరిశ్రమల యజమానులు వీధుల్లో ప్రదర్శన చేయడం, నినాదాలివ్వడం అపూర్వం. కార్మికుల ఆందోళనలను నిరసించే పారిశ్రామికవేత్తలే ఆందోళనకు దిగడం, పరిస్థితి తీవ్రతను తెలియజేస్తుంది. పర్మనెంట్‌గా పనిచేసే కార్మికులు ఇలా అల్లాడిపోతుంటే,

అసంఘటిత కార్మికుల సంగతి వేరే చెప్పాల్సిన పనిలేదు.

సామాన్యునికి సంబంధించినంత వరకు బహుళజాతి సంస్థలు వచ్చి పెట్టుబడులు పెడితే, మంచిదే కదా, ఉపాధి, ఉద్యోగాలు లభిస్తాయి అని అనుకోవచ్చు. మరీ నిరుపేదలైతే, వారికి ఆ రోజు, ఆ పూట తిండి గింజలు లభిస్తే చాలు. ప్రపంచం తలకిందులైనా వాళ్లకు పట్టదు. చిల్లర వ్యాపారంలో విదేశీ సంస్థలు వచ్చి దుకాణాలు తెరిస్తే, చిల్లర దుకాణదారులు నష్టపోతారనే విమర్శ ఒక పార్శ్వం నుంచి చూసినట్లయితే తెలిసే విషయం. కాని తెలుసుకోవాల్సిన మరో ముఖ్య విషయమేమంటే వారు వచ్చి దుకాణాలు తెలిచి, దేశంలో ఉన్న ధరల కన్నా తక్కువ ధరలకు అమ్మడం ప్రారంభించి, దేశంలో వర్తకుల అమ్మకాలను దెబ్బతీసి, వాళ్ల తలుపులు మూసేసిన తర్వాత ధరలు పెంచేస్తారు. ఉదాహరణకు చైనా నుంచి వస్తున్న వస్తువులు చాలా తక్కువ ధరలకు లభిస్తున్నాయి. కాలక్రమంలో మన మార్కెట్ బహుళజాతి పరం అవుతుంది. రాజకీయంగా చూస్తే సామ్రాజ్యవాదులు నేరుగా పరిపాలించే విధానాన్ని మానుకొని, ఆర్థికంగా దేశాలపై దురాక్రమణ కొనసాగిస్తున్నారు. ప్రధాని మన్మోహన్ సింగ్ వారిని రెండు చేతుల్తో ఆహ్వానిస్తున్నారు. కటువుగా చెప్పాలంటే మన దేశాన్ని అమ్మేస్తున్నారు. దేశంలో ఏ మంత్రిత్వ శాఖనైనా చూడండి. ప్రపంచ బ్యాంక్ ప్రవేశించని రంగం లేదు. బీహార్‌లో అనుకొంటా పంచాయతీ భవనాల నిర్మాణానికి ప్రపంచ బ్యాంక్ రుణం తీసుకొంటున్నారు. మన రాష్ట్రంలో చెరువులు తవ్వడానికి, కాలువలు బాగుచేయడానికి, బస్సులు కొనడానికి, హాస్పిటల్ భవనాలు నిర్మించ డానికి ప్రపంచ బ్యాంక్ నుంచి రుణం తెచ్చుకుంటున్నాం. ఎంత సిగ్గు చేటు! పంచాయతీ భవన నిర్మాణంతో ప్రారంభించడం అంటే గ్రామాల్లో వారి స్థావరాలు ఏర్పరుచుకోవడం, గ్రామీణ వ్యవస్థ మీద పట్టు సంపాదించడమే. ఈ చొరబాటును పంచాయతీ స్థాయి నుంచి విదేశీయు లను అనుమతించడమంటే దేశాన్ని అమ్మేయడం కాక మరేమిటి?

నిన్న బొగ్గు మంటలు, ఇవాళ డీజిల్ మంటలు. ధరల మంటలు మూడు సంవత్సరాల నుంచి మండుతూనే ఉన్నాయి. ఈ మంటల్లో దేశం మండిపోతోంది. దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్ అన్న గురజాడ సూక్తిని కాంగ్రెస్ ప్రభుత్వం మార్చి దేశమంటే మంటలోయ్ అంటోంది. రైతు కడుపులో మంటలు రేపుతోంది. ఎరువుల ధరలు రేపిన మంటలు మండుతుండగా, అగ్నికి ఆజ్యం పోసినట్లు డీజిల్ ధరల అగ్గిపుల్ల గీసి మంత్రి మండలి సభ్యులు చలిమంటలు కాసుకొంటున్నారు. ఇదేమంటే ఆయిల్ కంపెనీలకు నష్టాలొస్తున్నాయంటున్నారు. నిజమా? గ్యాస్ సిలిండర్లు మాత్రమే ఇస్తారట. ఇదేమంటే రిలయన్స్ ఒప్పందం ప్రకారం గ్యాస్ సరఫరా చేయడం లేదంటున్నారు. ప్రైవేట్ రంగం సమర్థవంతంగా పని చేస్తుందంటున్నారే ఇదే నా సమర్థత? ఇది సమర్థత కాదు, చట్టుబండలూ కాదు. రిలయన్స్‌కు ఆంధ్ర అంటే కడుపు మంట. వైఎస్ అధికారంలో ఉన్నప్పుడు మా రాష్ట్ర తీరంలో సహజ సంపద ముందు మా అవసరాలు తీర్చాలని కేంద్రంతో లడాయి వేసుకొన్నారు. పార్లమెంట్‌కు నలభై మంది సభ్యులనిచ్చినా, కేంద్రానికి రిలయన్స్‌దే రుచి అనిపించింది. వైఎస్ విమానం కూలిపోయి మరణించినపుడు అప్పటి వార్తా పత్రికల్లో ఆ కూల్చివేతలో రిలయన్స్ హస్తం ఉందని వార్తలొచ్చాయి. ఏదో తూతూ ఎంక్వయిరీ జరిపి అబ్బే, అదేమీ లేదంది కేంద్రం. ఏ పుట్టలో ఏ పాముందో ఎవరికెరుక? ఇక్కడి నుంచి కొన్ని రాష్ట్రాలకు (గుజరాత్) పైపులేస్లు వేసి మరీ చమరును తరలిస్తోంది కాని మనకు ససేమిరా అనడం, కేంద్రం గప్‌చిప్‌గా ఉండిపోవడం క్షంతవ్యం కాదు. ఇకపోతే

## వీఎచ్ కాలమ్

# చిదంబరం మాయాజాలం

బడ్జెట్ సీజన్ ఇంకా ముగియలేదు. పార్లమెంటు ఆమోద ముద్ర ఇంకా వేయాల్సి ఉంది. చిదంబరం మాత్రం 2013-14 బడ్జెట్ గురించి ప్రజలను ఊహాగానాల ఊయల్లో ఊగిస్తున్నారు. ద్రవ్య లోటు (మొత్తం ఆదాయం మైనస్ రుణాలు) 4.8 శాతం సాధించగలమంటున్నారు. 2012-13 బడ్జెట్‌లో అదే స్థాయిలో సాధించినట్లు బడ్జెట్ ఉపన్యాసంలో చెప్తున్నారు. కాని అది ఎలా సాధించారో చెప్పలేదు. బడ్జెట్ పరిభాషలో చెప్పి ఉండవచ్చు. అది సామాన్యులకు అర్థం కాదు. 2012-13లో ద్రవ్యలోటు సాధించిన మాట నిజమే కాని ఆ సంవత్సరంలో బడ్జెట్‌లో చేసిన కేటాయింపు లను తెగ్గోసి ఆదాయన్ని తక్కువగా చూపించి ఆవిధంగా ఆదాయనికి, రుణానికి మధ్య తేడాను తగ్గించి ద్రవ్యలోటును ఐదు శాతం నుంచి 4.8 శాతానికి తగ్గించానని చెప్పారు. కాని ఏయే పద్దుల కింద కోత విధించారో వివరాల్లోకి పోయి చూస్తే చిదంబరం అసలు రంగు బయట పడుతుంది. అదెలా అంటే ముందు ఈ పట్టిక చూడండి.

**ప్రణాళిక బడ్జెట్‌లో కోతలు-2012-13**

| | కేటాయింపులకు సవరించిన అంచనా తేడా (రు. కోట్లు) | తగ్గింపు శాతం |
|---|---|---|
| వ్యవసాయం, తత్సంబంధిత రంగాలు | 1670 | 9.5 |
| గ్రామీణాభివృద్ధి | 5181 | 12.7 |
| నీటిపారుదల | 847 | 66.4 |
| విద్యుచ్ఛక్తి | 5490 | 43.1 |
| పరిశ్రమలు, ఖనిజాలు | 5060 | 29.3 |
| రహదారులు | 19419 | 44.6 |
| శాస్త్ర విజ్ఞానం, టెక్నాలజీ, పర్యావరణం | 4472 | 27.0 |
| **సామాజిక సేవలు** | | |
| విద్య | 3997 | 8.1 |
| సాంకేతిక విద్య | 713 | 11.6 |
| వైద్యం | 2226 | 15.2 |
| ఫామిలి వెల్‌ఫేర్ | 2789 | 16.5 |
| మంచినీరు, పారిశుద్యం | 825 | 6.5 |
| గృహవసతి | 2013 | 19.4 |
| ఎస్‌టి, ఎస్‌సి, మైనారిటీ | 1450 | 15.9 |
| ఈశాన్య రాష్ట్రాలు | 5674 | 20.3 |
| రాష్ట్రాలకు సహాయం | 17996 | 13.8 |
| కేటాయింపుల మొత్తంలో తగ్గింపు | 91838 | 17.6 |

ఈ పట్టికను గమనిస్తే, పేదలకు అందాల్సిన రు. 24279 కోట్ల మేర కోత విధించబడింది. గతం సంవత్సరం అంతా విద్యుత్ కోతతో, ఇటు ప్రజల జీవితాలు, వ్యవసాయం, పరిశ్రమలు నానాపాట్లు పడ్డాయి. అలాంటి బడ్జెట్ రు. 5490 కోట్ల కోతా మౌలిక సౌకర్యాల గురించి లక్ష్యాలు నెరవేరడం లేదని నెత్తి నోరు కొట్టు కోండి ప్రభుత్వం ఆపద్దు కింద (రహదారులు) సుమారు 20 వేల కోట్ల కోతా? పై పట్టికలో తగ్గింపులు బడ్జెట్ కేటాయింపుకు సవరించిన అంచనాకు మధ్యనున్న తేడా మాత్రమో కోతా విధించారో, 2012-13 ఖర్చులు ఫైనల్‌గా 2014-15 బడ్జెట్ ప్రవేశ పెట్టినప్పుడు తెలుస్తాయి. అప్పుడే అసలు ద్రవ్య లోటు ఎంతో నికరంగా లేలుతుంది. ఇది చిదంబరం నిజ స్వరూపం.

ఆంధ్రప్రదేశ్ ప్రణాళిక కేటాయింపులు, ఖర్చు గురించిన గణాంకాలు ప్రతి సంవత్సరం బడ్జెట్ పుస్తకాల్లో లభిస్తాయి. ఏ సంవత్సరంలోనూ బడ్జెట్లో చేసిన కేటాయింపులు పూర్తిగా ఖర్చు కాలేదు. చూపించే ఖర్చు లెక్కలు కూడ బోగస్ లెక్కలే. అధికారుల స్థాయి నుంచి పై స్థాయి నుంచి కింద వరకు అన్ని స్థాయిల్లో 'ప్రజా ప్రతినిధులు' కైంకర్యం చేసేదేంతో కూడ తీసివేస్తే నిజంగా ప్రజలకు అందేది 15 శాతం మాత్రమేనని మాజీ ప్రధాని రాజీవ్ గాంధీయే అంగీకరించారు. ధరల పెరుగుదల ఆచరణలో మరింత కోతకు దారితీస్తుంది. బడ్జెట్‌లో కేటాయించిన నిధులు చాలువు. కాని ప్రాజెక్టు పూర్తి కావడం ఆలస్యమైతే, ప్రాజెక్టు ఖర్చు అంతా పెరుగుతుంది. ప్రజల్లో అసంతృప్తి భాండం ఎప్పుడో బద్దలవుతుంది. వీ

# ఇష్రత్ హత్య - ఎన్‌కౌంటర్ల నిజానిజాలు

***కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాలు సామాన్య ప్రజలను అమానవీయ రీతుల్లో చంపుతూ, వాటిని కప్పిపుచ్చుకోవడానికి ఎన్‌కౌంటర్ల కట్టుకథలు అల్లుతున్న స్థితిలో ఇష్రత్ హత్యలో వెలుగు చూసిన నిజాలను వివరిస్తున్నారు ఎల్. అరణ్య***

ఎన్‌కౌంటర్ అనేది తప్పుడు చర్య అని, కనీస మానవీయ విలువలు లేకుండా ఒక మనిషిని చంపేయడాన్ని మానవీయ సమాజాలు అంగీకరించవనే ఉన్నత చైతన్య స్థాయిని వదిలేసి బూటకపు ఎన్‌కౌంటర్లు నిత్యచర్యలైపోయిన నేటి సమాజంలో కూడ ఒక ఎన్‌కౌంటర్ బూటకమని తెలిసినపుడు మనుషులలో ఎప్పుడో ఒక సారైనా 'అయ్యో పాపం' అనే మాట వినపడుతుండడం చూస్తే ఇవాళ కాకుంటే రేపైనా ఈ సమాజాలు రాజ్య హింసలను, రాజ్యహత్యలను నిరసించే స్థాయికి చేరుకుంటాయనే ఆశ కలుగుతుంది. అంతవరకూ ఎన్‌కౌంటర్ల పేరిట ప్రభుత్వాలు చేస్తున్న హత్యలను సమాజం ముందుంచడం శాస్త్రీయజ్ఞానం ఉన్నవారు చేయాల్సిన పని. దేశవ్యాప్తంగా హక్కుల సంఘాలూ, విప్లవ సంఘాలూ చేస్తున్నదదే.

ఇష్రత్ జహాన్ అనే విద్యార్థినిని గుజరాత్ పోలీసులు చంపిన విషయంలో ఇటీవల సిబిఐ చార్జిషీటు దాఖలు చేయడం దేశవాప్తంగా చర్చకు వచ్చింది. దాదాపు తొమ్మిది సంవత్సరాల కిందట జరిగిన ఇష్రత్ ఎన్‌కౌంటర్ ఇప్పుడు ఈ సంఘటనతో న్యాయాన్యాయాలను చర్చకు పెట్టింది. 2004 జూన్ 15న మహారాష్ట్రలోని థానే జిల్లాలో ముంబ్రాకు చెందిన ఇష్రత్ జహాన్ అనే పందొమ్మిదేళ్ల విద్యార్థినిని అహ్మదాబాద్ శివార్లలో గుజరాత్ పోలీసులు కాల్చి చంపారు. ఇష్రత్ ముంబాయిలో గురునానక్ ఖల్సా కళాశాలలో రెండవ సంవత్సరం సైన్స్ గ్రాడ్యుయేషన్ చేస్తోంది. ఆమెతో పాటు మరో ముగ్గురు ప్రాణేశ్ పిళ్లై అలియాస్ జావెద్ షేక్, అంజన్ అలీ రాణా, జీషన్ జోహార్‌లను కూడ కాల్చి చంపారు. ఆయుధాలతో సంచరిస్తున్న ఈ నలుగురూ పోలీసులను చూసి మొదటగా కాల్పులు జరిపారని, ఆత్మరక్షణ కోసం పోలీసులు జరిపిన కాల్పులలో ఆ నలుగురూ మరణించారని పోలీసులు మీడియాకు చెప్పారు. ఆ నలుగురికీ పాకిస్తాన్ సంబంధిత ఉగ్రవాద సంస్థ లష్కర్-ఎ-తోయిబాతో సంబంధాలున్నాయని పోలీసుల ఆరోపణ. గుజరాత్ ముఖ్యమంత్రి నరేంద్రమోడీని చంపడానికి లష్కర్ చేస్తున్న ప్రయత్నాలలో భాగంగా ఈ ముగ్గురూ అహ్మదాబాద్‌లో అనుమానాస్పదంగా తచ్చాడుతుండగా గమనించామని కూడా చెప్పారు.

అయితే ఇష్రత్ ఎన్‌కౌంటర్ బూటకమని, ఆమె అమాయకురాలని ఆమె కుంటుంబ సభ్యులు మొదటి నుంచీ వాదిస్తున్నారు. వారికి దేశ వ్యాప్తంగా ఉన్న హక్కుల సంస్థలూ, కార్యకర్తలు బాసటగా నిలిచారు. నిజ నిర్ధారణ బృందాలకు కూడ ఇష్రత్‌ది బూటకపు ఎన్‌కౌంటరేననే విషయం తెలిసిపోవడంతో నిరసనలు ఎక్కువయ్యాయి. దాంతో ఇష్రత్ ఎన్‌కౌంటర్‌పై విచారణ ప్రారంభమైంది. సుదీర్ఘ విచారణ తర్వాత 2009లో అహ్మదాబాద్ మెట్రో కోర్టు ఇష్రత్‌ది ఎన్‌కౌంటర్ కాదని, ప్రణాళికా బద్ధంగానే ఇష్రత్‌ను చంపారని తీర్పిచ్చింది. మెట్రోపాలిటన్ మెజిస్ట్రేట్ ఎస్.పి.తమాంగ్ దాదాపు 243 పేజీలతో ఒక రిపోర్టును కూడా విడుదల చేశాడు. 2009 సెప్టెంబరు 7న ఇచ్చిన ఆ రిపోర్టు ఇష్రత్‌తో సహా నలుగురినీ పోలీసు కస్టడీలోనే చంపారని స్పష్టంగా చెప్పింది. ఎన్‌కౌంటర్ స్పెషలిస్టు డి.జి. వంజారా టీమ్ చేసిన 'కోల్డ్ బ్లడెడ్ మర్డర్'గా దాన్ని వర్ణించింది. 2004 జూన్ 12న ముంబాయిలో ఇష్రత్‌తో సహా నలుగుర్ని కిడ్నాప్ చేసి గుజరాత్ క్రైం బ్రాంచ్ పోలీసులు 14వ తేదీన పోలీసు కస్టడీలో చంపేశారని, 15న పొద్దున అహ్మదాబాద్ సరిహద్దులోకి తీసుకెళ్లి కాల్చివేసి ఎన్‌కౌంటర్ కథ అల్లారని రిపోర్టు పేర్కొంది. లష్కర్‌తో సంబంధాలున్నాయని కానీ, వాళ్లు మోడీ హత్య కోసమే గుజరాత్ వచ్చారనడానికి ఎలాంటి ఆధారాలూ లేవని రిపోర్టు అభిప్రాయ పడింది. ఇంకా కారులో దొరికినట్లు చెప్తున్న తుపాకులూ, ఆయుధాలూ, పేలుడు పదార్థాలన్నీ పోలీసుల సృష్టే అని భావించింది. ముఖ్యమంత్రి మెప్పుకోసం, ప్రమోషన్ల కోసం పోలీసులే ఈ ఎన్‌కౌంటర్

---

ఆయిల్ కంపెనీలకు నష్టాలొస్తున్నాయన్న విషయానికి వస్తే, అది వాస్తవం కాదని ఆ కంపెనీల బాలన్స్ షీట్లు చెపుతున్నాయి. ప్రభుత్వ చమురులు సంస్థ ఒఎన్‌జిసి 2011-12లో రు. 25,122 కోట్లు, ఈ ఏడాది రెండో త్రైమాసికంలో 45.46 శాతం మేరకు, అలాగే ఇండియన్ ఆయిల్ కంపెనీ నికర లాభం రు. 4265.37 కోట్లు. హిందూస్తాన్ పెట్రోలియం రు. 911 కోట్లు లాభాలు ప్రకటిస్తే, నష్టాలొస్తాయంటారేమిటి? ఎక్కడైనా మంటలు వేస్తే ఫైర్ స్టేషన్ వాళ్లు వచ్చి నీళ్లతో ఆర్పేస్తారు. కాని మన ప్రభుత్వం ధరలు మండుతున్నాయని గగ్గోలు పెడుతూంటే, మంటలార్పే బదులు పెట్రోల్ డీజిల్ ధరలనే అగ్నికి ఆజ్యం పోస్తోంది. ఈ మంటలార్పాలంటే ఈ ప్రభుత్వాన్ని బంగాళాఖాతంలో ముంచాల్సిందే.

మన రాష్ట్రానికి వస్తే ప్రపంచ బ్యాంక్ ముసుగులో అమెరికా వేలు పెట్టని మంత్రిత్వ శాఖ లేదు. మంచి నీళ్ల నుంచి, చెరువులు రిపేరు కాల్వలు పూడిక తీయడానికి, పంచాయతీలకు భవన నిర్మాణం నుంచి ప్రపంచ బ్యాంక్ వేలు పెట్టని శాఖ లేదు. విద్య, వైద్యం లాంటివన్నీ ప్రైవేట్ పరమే. రాష్ట్రాన్ని ఎదుర్కొంటున్న సమస్యలన్నింటికీ ప్రైవేటీకరణ, ప్రైవేట్ - పబ్లిక్ జంటే పరిష్కారం ఎందుచేత? ప్రస్తుత ముఖ్యమంత్రికి ఢిల్లీ-హైదరాబాద్ మధ్య చక్కర్లు కొట్టడానికే సమయం చాలడం లేదు. కాగా ప్రజల సమస్యలను వారే పరిష్కరించుకోవాలి. ఎలాగో వారికి తెలుసు. 2014 ఎన్నికలొస్తున్నాయి కదా.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

కథ అల్లారని రిపోర్టు చెప్పింది. దాంతో గుజరాత్ ప్రభుత్వం తమాంగ్ రిపోర్టును చాలెంజ్ చేస్తూ హైకోర్టుకు వెళ్లింది. గుజరాత్ హైకోర్టు 2009 సెప్టెంబరు 9న ఈ కేసు విచారణ కోసం సిట్(స్పెషల్ ఇన్వెస్టిగేషన్ టీమ్) ను కర్నైల్‌సింగ్ నేతృత్వంలో ఏర్పాటు చేసింది. ఆయన ప్రొఫెసర్ టి.డి. డోగ్రా, డా. రాజిందర్‌సింగ్‌ల నేతృత్వంలో పరిశోధనలో సహాయకంగా ఒక బృందాన్ని నియమించాడు. 2011 నవంబరు 21 ఇష్రత్ ఎన్‌కౌంటర్ బూటకమని సిట్ హైకోర్టుకు నివేదిక ఇచ్చింది. దాని ఆధారంగానే హైకోర్టు డి.జి. వంజారా, ఎన్.కె.అమన్ (సొహ్రాబుద్దీన్ కేసులో వీరిద్దరూ ఇప్పుడు జైల్లో ఉన్నారు) పి.పి.పాండేలతో సహా 21 మంది పోలీసులపై 302 (హత్య కేసు) పెట్టాలని ఆదేశిస్తూ కేసును సిబిఐకి అప్పగించింది. సిబిఐ ఈ ఫిబ్రవరిలో ఆనాటి క్రైమ్ బ్రాంచ్ ఎస్.పి. సింఘాల్‌ను అరెస్టు చేసింది. పాండేపై అరెస్టు వారెంట్ జారీ చేసింది. జూన్ 4న వంజారాను అరెస్టు చేసింది. అతన్ని జూన్ 10 దాకా సిబిఐ కస్టడీలోనే ఉంచాలని అహ్మదాబాద్ కోర్టు ఆదేశించింది. ఎన్‌కౌంటర్ బూటకమని భావిస్తూ సిబిఐ ఏడుగురు పోలీసులపై తన తొలి చార్జిషీట్‌ను జూలై 3న తెరిచింది.

ఇదీ ఇష్రత్ ఎన్‌కౌంటర్ చరిత్ర 2004 నుంచి 2013 దాకా ఏ విచారణ బృందానికైనా విచారణ ప్రారంభించిన తొందరలోనే ఈ ఎన్‌కౌంటర్ బూటకమనే విషయం తెలిసి పోయింది. విచారణల్లో ఇంకా అసలు విషయాలు వెలుగులోకి వచ్చాయి. ఇష్రత్ చాలా అమాయకు రాలైన సాదాసీదా అమ్మాయి. తండ్రి చనిపోయాక కుటుంబ భారం ఇష్రత్‌పై పడడంతో ప్రతి రోజూ కాలేజి అయిపోయాక ప్రైవేటుగా ట్యూషన్‌లు చెప్తూ కుటుంబాన్ని ఆదుకునేది. ఆమె ట్యూషన్ల ద్వారా సంపాదించిన కొద్ది పాటి మొత్తమే ఆ కుటుంబానికి ఆసరా అయ్యేది. అలా ఆర్థిక ఇబ్బందులను నెట్టుకుంటూ వస్తున్న ఇష్రత్‌కు వేసవి సెలవులు రాగానే మరో ఇబ్బంది ఎదురైంది. వేసవి సెలవులలో పిల్లలెవరూ ట్యూషన్‌కు రారు. దాంతో దాదాపు మూడు నెలలు డబ్బు ఉండని పరిస్థితి. కనుక ఆ మూడు నెలలు కుటుంబం గడవడం కోసం మరో పని ఏదైనా వెదుక్కోవాలనుకుంది. స్థానికంగా ఉండే ఒక అబ్బాయి ద్వారా పని కోసం జావెద్‌షేక్‌తో పరిచయం ఏర్పరుచుకుంది. అంతకు మించి ఇష్రత్ చేసిన నేరమేమీ లేదు. కానీ గుజరాత్ పోలీసులు జావెద్ ఒక టెర్రరిస్టు, అతనితో ఉంటూ ఇష్రత్ మోడీ హత్యకు కుట్ర పన్నిందనే అసత్య కథనం అల్లారు. చిత్రమైన విషయం ఏమిటంటే జావెద్ షేక్ ని కూడా టెర్రరిస్టు అనడానికి ఎలాంటి ఆధారాలు ఇప్పటికీ లేవు. జావెద్ తండ్రి రోజూ బాధపడుతూ ఇదే మాట చెప్తున్నా గుజరాత్ ప్రభుత్వానికీ, పోలీసులకూ కనికరం కలగలేదు. ఇక తరచూ కలిసినట్లే ఇష్రత్ 2004 జూన్ 11న జావెద్‌ను కలువడానికి ఇంటి నుంచి వెళ్లింది. అప్పుడే ఆమెను కిడ్నాప్ చేసిన పోలీసులు మరో ముగ్గురితో కలిపి నాలుగు రోజుల పాటు పోలీసు కస్టడీలో ఉంచుకుని చిత్రహింసలు పెట్టి 14 రాత్రే కస్టడీలో చంపివేసి 15 పొద్దున అహ్మహదాబాద్ శివార్లకు తీసుకుపోయి కాల్చివేశారు. పోలీసుల దగ్గర ఉండే నేరస్తుల ఆయుధాలను మృతుల పక్కన పడేసి నిరాయుధులను సాయుధులుగా నిరూపించే ప్రయత్నం చేశారు. సిబిఐ ప్రకారమైతే 15న జరిగిన ఎన్‌కౌంటర్‌కు 10 రోజుల ముందే అంటే 5వ తేదీనే ఎఫ్ఐఆర్ డ్రాఫ్ట్ సిద్ధమైంది. అంటే దాదాపు ఎన్‌కౌంటర్ జరగక ముందే పది రోజుల ముందు నుంచే ఎన్‌కౌంటర్ మృతులలో కొందరైనా పోలీసు కస్టడీలో ఉండి ఉంటారు.

ఇష్రత్ బూటకపు ఎన్‌కౌంటర్ లోతుల్లోకి వెళ్లి చూస్తే చాలా విషయాలు అర్థమవుతాయి. గోద్రా ఘటనకు ప్రతీకారంగా 2002లో గుజరాత్‌లో జరిగిన ఊచకోత గురించి అందరికీ తెలిసిందే. ప్రజలను కాపాడవలసిన, వారికి సుపరిపాలన అందించాల్సిన ప్రభుత్వం మతం మత్తులో జోగుతూ, మతపరంగా ప్రజలను, సమాజాన్ని విడదీసి ఆ విభజన ఏర్పరచిన అడ్డు గోడలను పెంచే పాత్రను నిర్విఘ్నంగా పోషించింది. నరేంద్ర మోడీ గుజరాత్‌లో సాధించిన ఈ ఘన విజయం ఫలితాలు ఏ స్థాయికి చేరాయంటే మనిషి అంటే హిందువో, ముస్లిమో, క్రైస్తవుడో అని మాత్రమే భావించడం తప్పితే ఎవరైనా మనుషులే, మనుషులంతా సమానమే అనే ఉన్నత భావాలు గుజరాత్ ప్రజలకు అందనంత దూరంగా ఉన్నాయి.

మోడీ తన చర్యల ద్వారా ప్రసంగాల ద్వారా మత ఛాందస భావాల పెంపుదల ద్వారా ప్రజల మనుషులలో నింపుతున్న ఈ మత విష బీజాలు సహజంగానే మెజారిటీలు, మైనారిటీల మీద హింసాకాండకు దిగడానికి ఊతమిస్తున్నాయి. దేశవ్యాప్తంగా జరిగే మత కలహాలకు, మోడీ తరహా మతహత్యలకు తేడా ఏమిటంటే దేశ వ్యాప్తంగా ఒక మతస్తులు మరో మతం వారిపై దాడి చేస్తుంటారు. అంటే మత కలహాలు ప్రజల మధ్యన జరుగుతుంటాయి. అక్కడి ప్రభుత్వాలు వాటిని పెంచడం గానీ, చూడనట్లు నటించడంగానీ చేస్తుంటాయి. కానీ గుజరాత్‌లో నరేంద్రమోడీ తరహా కలహాలు ఎలా ఉంటాయంటే ప్రభుత్వమే మత హత్యలు చేస్తోంది. అంటే నేరుగా ప్రభుత్వం, పోలీసులు వ్యవస్థీకృతంగా మత హత్యలు చేస్తారు. 2002, ఆ తర్వాత జరిగిన ముస్లింల హత్యలన్నీ ఈ విధానంలో జరిగినవే. ప్రజలు సామరస్యంగా ఉంటున్న సమయంలో ప్రభుత్వమే మత పరమైన సెన్సిటివిటీని రెచ్చగొట్టి ప్రజల మధ్య దూరం, వైషమ్యాలు పెంచి తానే నేరుగా రంగంలోకి దిగి హత్యలు చేస్తోంది. తన అధికార గణంతో తనకు వ్యతిరేకమని భావించిన వారందరినీ మట్టు బెట్టిస్తుంది. ఈ వ్యవస్థీకృత మత హత్యలను గత పన్నెండేళ్లుగా మోడీ నిరాటంకంగా గుజరాత్‌లో నిర్వహిస్తున్నాడు. పైగా సిగ్గు లేకుండా 'నేను ఆ సమయంలో (2002) సరైన పనే నిర్వహించాను' అని మోడీ ప్రకటించుకున్నాడు అంటే ప్రభుత్వమే హత్యలు చేసి, తానే ఆ హత్యలు చేశానని, తాను చేసింది సరైన పనే అని బాహటంగా ప్రకటించు కుంటోంది. మోడీ మార్కు పాలన ఇది. ఇక ఆయన ఇప్పుడు దేశానికి ప్రధాని అవుతారట.

ఇష్రత్ జహాన్ హత్య కూడ ఈ మోడీ మార్కు పాలనలో భాగంగానే వ్యవస్థీకృత మత హత్యలలో భాగంగానే జరిగిందనే విషయాన్ని మనం గుర్తించాలి. ముస్లింలంతా ఉగ్రవాదులేననే సాధారణీకరణను తానే సృష్టించి తానే అనేక సార్లు ప్రజలపై రుద్దడం ద్వారా మోడీ, అదే నిజమనుకునే స్థితికి ప్రజలను తీసుకువచ్చాడు. ముస్లిం అయితే చాలు చంపడానికి ఒక అధికారం లభిస్తుందని, సమర్థించుకోవడానికి వారిపై పాకిస్థాన్ ఉగ్రవాది అనే నెపం మోపే ఒక చట్టబద్ధత దొరుకుతుందనే ఉన్మాదంతో దొరికిన ముస్లింనల్లా చంపుతూ పోతున్న ఒక హంతకునికి

దేశ ప్రధానమంత్రి రేసులో ఉండేంత స్థాయి లభించడం ప్రజాస్వామ్య విలువలకే పెద్ద ప్రమాదం.

ఇక ఇష్రత్ కేసును కాంగ్రెస్ పార్టీ తన సొంత రాజకీయాల కోసం వాడుకుంటోంది. నిజానికి కాంగ్రెసుకు ఒక అమాయకురాలు అన్యాయంగా చంపబడ్డదని కాకుండా మోడీని ఇరుకున పెట్టవచ్చు కదా అనే సంకుచిత బుద్ధితోనే కేసును ఇంత ముందుకు రానివ్వగలిగింది. సిట్, సిబిఐలు ఎన్నడూ లేనంతగా ఇంత నిజాయితీతో రిపోర్టులివ్వడం వెనుక ఉన్నది వృత్తి నిబద్ధతతో, పారదర్శకతతో కాదు. కేవలం మోడీని ఇరికించాలని చూసే కాంగ్రెసు ప్రభుత్వానికి భక్తితో సాయం చేసి పెట్టడమే. ఇంత స్పష్టమైన విచారణలు జరిపేలా దేశంలోని అనేక హత్యలపై సిబిఐని పురమాయిస్తే ఈ దేశంలో జరిగిన అనేక హత్యలకు కాంగ్రెసు ప్రభుత్వమే కారణమని తేలుతుంది. అందుకే ఇంకెక్కడా కాకుండా గుజరాత్‌లో మాత్రమే సిబిఐని పరుగెత్తిస్తోంది. చత్తీస్‌గడ్‌లో ఉన్నది కూడా బిజెపి ప్రభుత్వమే కదా, మరి అక్కడి అమాయక గిరిజనులపై హత్యల మీద ఇంతే నిజాయితిగా సిబిఐని ఎందుకు ప్రయోగించలేదు? ఎందుకంటే మావోయిస్టులనూ, గిరిజనులనూ ఆ రాష్ట్రంలో కాంగ్రెస్, బిజెపిలు కలిసికట్టుగా హత్యలు చేస్తున్నాయి కనుక. ఒక రాష్ట్రంలో ఒక విధానం, మరో రాష్ట్రంలో ఇంకో విధానం అమలు చేస్తూ కాంగ్రెసు హత్యా రాజకీయాలను అవకాశవాదంతో తనకు అనుకూలంగా మలచుకునే పని చేస్తున్నది. ఇష్రత్ హత్య విషయంలోనూ ప్రస్తుతం అదే తీరుగా వ్యవహరిస్తోంది.

మీడియా మొదటి నుంచీ ఇష్రత్ కేసును సంచలన ప్రదర్శనల కోసం మాత్రమే వినియోగించుకుంటోంది. 2004లోనే లాహోర్‌కు చెందిన గజ్వా టైమ్స్ అనే లష్కరే తోయిబా అనుబంధ పత్రిక ఇష్రత్‌ను లష్కర్ సహాయకురాలిగా పేర్కొంది. తర్వాత లష్కర్ రాజకీయ, విభాగమైన జమాత్ ఉద్దవా ఆ వార్తను ఖండించి ఇష్రత్ కుటుంబానికి క్షమాపణలు చెప్పింది. 2010లో కొన్ని మీడియా సంస్థలు కూడా ఎలాంటి ఆధారాలు లేకుండానే ఇష్రత్ టెర్రరిస్టు కార్యకలాపాలకు పాల్పండిందని చెప్పాయి. 2013 జూన్‌లో ఇండియాటుడే, హెడ్‌లైన్స్ టుడేలు మరో వార్తను ప్రసారం చేశాయి. డేవిడ్ హెడ్లీ అనే ఉగ్రవాది ఎఫ్‌బిఐ విచారణలో ఇష్రత్, లష్కర్ ఉగ్రవాద సంస్థకు చెందిన ఉగ్రవాది అని అంగీకరించాడని కథనాలు ప్రసారం చేశాయి. తర్వాత అవి కూడా తప్పుడు కథనాలని తేలాయి. ఇష్రత్ కేసులోని నిజాలను నిగ్గుతేల్చే పని కాకుండా ఆ ఘటనపై అధికారులూ, నాయకులూ మాట్లాడిన మాటలకు మసాలాలు దట్టిస్తూ వార్తలు ప్రసారం చేసి రేటింగ్‌లు పెంచుకోవడానికి మీడియా ఇష్రత్ వార్తను వాడుకుంటున్నది. ఇష్రత్ ఎన్‌కౌంటర్ బూటకమని మొదటి నుంచి పరిశోధనాత్మక సమాచారాన్ని ఇస్తున్న పత్రిక ఒక్క తెహెల్కా మాత్రమే.

ఎన్‌కౌంటర్ల విషయంలో ప్రజల అవగాహనలో మార్పు రావసిన అవసరముంది. ఒక మనిషి నేరం చేసినంత మాత్రానే అతన్ని చంపడం అనేది తప్పుడు చర్య అని, అతనిలో పరివర్తన కలిగించడం మాత్రమే ప్రభుత్వాల పనిగా ఉండాలిగానీ చంపడం కాదనే విధంగా ప్రజల ఆలోచనలు మార్పు చెందాలి. సోహ్రబుద్దిన్, తుల్సి ప్రజాపతి, ఇష్రత్ జహాన్ వంటి అడపాదడపా ఎన్‌కౌంటర్లే కాకుండా ఇవాళ దండకారణ్యంలో, నిన్న తెలంగాణ, ఉత్తరాంధ్ర, నల్లమలల్లో అన్యాయంగా వేలాది ప్రజలు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఎన్‌కౌంటర్ల పేరిట చేసే హత్యలకు గురయ్యారు. వేలాది మంది ఆదివాసిలు అసలు అడ్రస్సే లేకుండా గల్లంతవుతున్నారు. కనీసం శవాలనైనా కుటుంబీకులకు అప్పగించనంత క్రూరంగా ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి. అజ్ఞాతంలో ఉన్న వ్యక్తులను ఎన్‌కౌంటర్ చేయడం సబబే అనేటట్లుగా ఎన్‌కౌంటర్లను ప్రభుత్వాలు చట్టబద్ధం చేశాయి. ప్రభుత్వం ఎన్‌కౌంటర్ చేసిందంటే అవతలి వ్యక్తి ఏదో ఒక తప్పు చేసే ఉంటాడని, అందుకే ఎన్‌కౌంటర్ చేశారనే భావన ప్రజలలో నెలకొనేలా ప్రభుత్వాలు తప్పుడు ప్రచారాలు చేస్తూనే ఉన్నాయి. తప్పు చేస్తే మాత్రం ఎన్‌కౌంటర్ చేయడమేమిటి? చంపడమేమిటి? అని అడిగే వారిని మావోయిస్టులంటున్నాయి. రాజద్రోహులంటున్నాయి. ఎన్‌కౌంటర్లే కాదు. అసలు ఏ సంజాయిషీ ఇచ్చుకోనవసరం లేకుండా ప్రభుత్వాలు ముసుగు మనుషులకు విచ్చలవిడి అధికారాలిచ్చి కూడా హత్యలు చేస్తున్నాయి. డా. రామనాథం నుంచి గంటి ప్రసాదం హత్యల దాకా కోబ్రా, టైగర్, సల్వాజుడుం వంటి అరాచక శక్తులకు ఆయుధాలిచ్చి మనుషుల మీదకు వదిలి చంపిస్తున్నాయి. ఇదంతా కళ్లముందరి చరిత్రే. ఇష్రత్ హత్య సందర్భంగా ప్రజలూ, ప్రజాస్వామికవాదులూ ప్రభుత్వాల హత్యలనూ, ఎన్‌కౌంటర్లనూ నిరసించే చైతన్య స్థాయిని అందిపుచ్చుకోవాలి. చంపే హక్కు వ్యక్తులకు గానీ, ప్రభుత్వానికి గానీ లేదని, ఎన్‌కౌంటర్ల పేరిట జరిగేవన్నీ హత్యలేనని, ఆ హత్యలు జరిగిన అధికార్లను వాటికి ప్రోత్సాహమిచ్చిన ప్రభుత్వ పెద్దలందరినీ హత్యానేరం కింద అరెస్టు చేయాలనే డిమాండ్‌లతో ఉద్యమించాలి. ఒక్క ఇష్రతే కాకుండా దేశ వ్యాప్తంగా ఎన్‌కౌంటర్ల పేరిట జరుగుతున్న పాశవిక హత్యలను ముక్తకంఠంతో ఖండించే ఒక సందర్భానికి ఇష్రత్ హత్యానంతరం జరుగుతున్న ఈ చర్చ ఒక ప్రారంభాన్ని అందిస్తుందేమో, వేచి చూడాలి!

*(రచయిత ఉపాధ్యాయులు)*

**రాబోయే సంచికలలో...**

- **లెనిన్ ప్రసిద్ధ రచన 'సామ్రాజ్యవాదం' - ఎన్‌విఎస్ నాగభూషణ్**
- **నేటి అనంతపురం - కె. నాగేశ్వరాచారి**
- **అరణ్య రోదనలో మన్యం - మైపతి అరుణ్‌కుమార్**
- **కులం గురించి - ప్రీతమ్**
- **అంతరించిపోతున్న అడవి - బి. వేణుగోపాల్‌రెడ్డి**

# నేను చేసింది పొరపాటు కాదు

***అమెరికా ప్రభుత్వం, దాని గూఢచారసంస్థ సి ఐ ఎ సాగిస్తున్న అక్రమ, చట్టవ్యతిరేక నిఘా గుట్టు బయటపెట్టి, అమెరికా దమననీతి నుంచి తప్పించుకొని తిరుగుతున్న ఎడ్వర్డ్ స్నోడెన్ జూలై 12, 2013న రాసిన బహిరంగ లేఖ***

నమస్కారం. నా పేరు ఎడ్ స్నోడెన్. ఒక నెల రోజుల కింద నాకు ఒక కుటుంబం ఉండేది. స్వర్గంలో ఇల్లుండేది. అద్భుతమైన సౌకర్యాలలో జీవిస్తుండేవాణ్ని. అప్పుడు నాకు ఎటువంటి అనుమతీ లేకుండా మీ సొంత సమాచారాన్ని, ఉత్తరాలను వెతికే, జప్తు చేసే, చదివే అధికారం కూడ ఉండేది. ఎవరి ఉత్తరాలైనా సరే, ఏ సమయంలోనైనా సరే. అది ఆయా మనుషుల భవిష్యత్తును మార్చేయగల అధికారం.

అది దారుణమైన చట్ట ఉల్లంఘన కూడ. నా దేశపు రాజ్యాంగంలో నాలుగో, ఐదో సవరణలు, అంతర్జాతీయ మానవ హక్కుల ప్రకటనలో అధికరణం 12, మరెన్నో లెక్కలేనన్ని చట్టాలు, ఒప్పందాలు అటువంటి మూకుమ్మడి, సాధారణ నిఘా వ్యవస్థలను నిషేధించాయి. అమెరికా రాజ్యాంగం అటువంటి కార్యక్రమాన్ని చట్టవ్యతిరేకమైనదిగా ప్రకటిస్తుండగా, ఏవో రహస్య న్యాయస్థానాల తీర్పులు ఈ చట్టవ్యతిరేక వ్యవహారానికి సాధికారతను ఇచ్చాయని మా ప్రభుత్వం అంటున్నది. ఆ న్యాయస్థానాల తీర్పులేమిటో చూడడానికి ఎవరికీ అనుమతి లేదు. అటువంటి తీర్పులనేవి ఉంటే అవి, చేసేదేదైనా బహిరంగంగా అందరికీ కనబడేలా చేయాలనే న్యాయ భావననే సమాధి చేస్తున్నాయి. ఒక రహస్య చట్టాన్ని ఉపయోగించి అనైతిక చర్యను నైతికంగా మార్చడం కుదరదు.

'వ్యక్తులకు అంతర్జాతీయ బాధ్యతలు ఉంటాయి. అవి జాతీయ విధేయతా విధులను అధిగమించి ఉంటాయి. అందువల్ల శాంతికీ మానవతకూ వ్యతిరేకంగా జరగబోయే నేరాలను అరికట్టడానికి పౌరులు వ్యక్తిగతంగా తమ స్థానిక, దేశీయ చట్టాలను ఉల్లంఘించే బాధ్యత తీసుకోవలసి ఉంటుంది' అని 1945లో న్యూరెంబర్గ్‌లో ప్రకటించిన సూత్రంలో నాకు విశ్వాసం ఉంది.

అందువల్లనే నేను నాకు సరైనదని అనిపించిన పని చేశాను. జరుగుతున్న తప్పును సరిచేసే కార్యక్రమం చేపట్టాను. దానితో నాకేదో ఒనగూరుతుందని కాదు. ధనం సంపాదించడానికి కాదు. నేను అమెరికా రహస్యాలను ఎవరికీ అమ్మడానికి ప్రయత్నించలేదు. భద్రత కోసం ఏదో ఒక విదేశీ ప్రభుత్వంతో చేతులు కలపలేదు. నేను చేసిందల్లా నాకు తెలిసినది ప్రజల దగ్గరికి తీసుకుపోవడం మాత్రమే. మనందరినీ ప్రభావితం చేయబోయే విషయాలను మనందరమూ పట్టపగటి వెలుగులో చర్చించాలని నేననుకున్నాను. ప్రపంచాన్ని నేనడిగిందల్లా న్యాయం మాత్రమే.

మనందరినీ ప్రభావితం చేసే గూఢచర్యం గురించి ప్రజలకు విప్పి చెప్పాలని నేను తీసుకున్న నైతిక నిర్ణయానికి చాల మూల్యం చెల్లించవలసి వస్తోంది. అయినా అది సరైన చర్యేనని నేననుకుంటున్నాను. నాకేమీ పశ్చాత్తాపం లేదు.

అప్పటినుంచీ అమెరికా ప్రభుత్వమూ గూఢచార సంస్థలూ నన్ను ఒక ఉదాహరణగా చూపడానికి ప్రయత్నిస్తున్నాయి. నాలాగ మాట్లాడగలిగిన వాళ్లందరికీ నన్ను ఒక హెచ్చరికలా చూపదలచుకున్నాయి. ఒక రాజకీయ వ్యక్తీకరణకు గాను నన్ను దేశం లేని వ్యక్తిగా మార్చేశారు. నన్ను వెంటాడుతున్నారు. అమెరికా ప్రభుత్వం విమానం ఎక్కించుకోవడానికి వీలులేని వ్యక్తుల జాబితాలో నా పేరు చేర్చింది. హాంకాంగ్‌లో అమలయ్యే చట్టాలకు వ్యతిరేకంగా నన్ను అక్కడినుంచి వెళ్లగొట్టమని అడిగింది. ఆయా దేశాలలో వారి చట్టాలు వర్తిస్తాయనే సూత్రానికి ఇది ప్రత్యక్ష ఉల్లంఘన. నా మానవహక్కులను పరిరక్షించి, ఐక్యరాజ్యసమితి శరణార్థి విధానానికి కట్టుబడదలచుకున్న దేశాల మీద ఆంక్షలు విధిస్తానని అమెరికా బెదిరించింది. ఒక రాజకీయ కాందిశీకుడు ఉన్నాడనే అనుమానంతో ఒక లాటిన్ అమెరికన్ అధ్యక్షుడి విమానాన్ని దింపి సోదా జరపమని కనీవినీ ఎరగని రీతిలో సైనిక మిత్రులను ఆదేశించారు. ఈ ప్రమాదకర చర్యలు కేవలం లాటిన్ అమెరికా గౌరవానికి మాత్రమే కాదు, ప్రతి వ్యక్తికీ, ప్రతి జాతికీ ఉండే మౌలిక హక్కులకు కూడ భంగకరం. ప్రతి వ్యక్తికీ, ప్రతి జాతికీ బెదిరింపులు లేకుండా స్వేచ్ఛగా జీవించడానికీ, మరొక దేశంలో శరణు పొందడానికీ హక్కు ఉంది.

చారిత్రకంగా దారుణమైన అసమానతతో కూడిన దౌర్జన్యం ఇలా సాగుతున్నప్పటికీ, ప్రపంచంలోని ఎన్నో దేశాలు నాకు మద్దతు తెలిపాయి, శరణార్థిగా అంగీకరిస్తామని ప్రకటించాయి. రష్యా, వెనిజువెలా, బొలీవియా, నికరాగువా, ఈక్వడార్ వంటి ఈ దేశాలన్నిటికీ నా ధన్యవాదాలు. శక్తివంతమైన దేశాలు మానవ హక్కులను ఉల్లంఘిస్తున్నప్పుడు ఎదిరించడానికి లేచి నిలిచిన తొలి దేశాలుగా ఈ దేశాలను నేను గౌరవిస్తున్నాను. బెదిరింపులు సాగుతున్నప్పటికీ తమ సూత్రాల మీద రాజీపడకుండా నిలిచిన ఈ దేశాలు ప్రపంచ గౌరవాన్ని చూరగొంటున్నాయి. ఆయా దేశాల ప్రజలకూ నాయకులకూ నా వ్యక్తిగత ధన్యవాదాలు తెలపడానికి ఆ దేశాలన్నిటికీ ప్రయాణం చేయాలని నా ఉద్దేశం.

శరణార్థి హోదా ఇవ్వడానికీ మద్దతు ఇవ్వడానికీ ముందుకు వస్తున్న దేశాలకూ, భవిష్యత్తులో ముందుకు రానున్న దేశాలకూ ఇవాళ నేను నా లాంఛనప్రాయమైన అంగీకారం తెలుపుతున్నాను. ఇప్పటికే వెనిజువెలా అధ్యక్షుడు మదురో నాకు శరణార్థి హోదా ఇచ్చారు, ఇప్పుడు దాన్ని నేను అంగీకరిస్తున్నానంటే అక్కడ నా శరణార్థి హోదా

# అమెరికా నిఘా గుట్టు రట్టు

***బ్రాడ్లే, అసాంజె, స్నోడెన్ ఇలా ఒక్కొక్కరూ అమెరికా చేస్తున్న దారుణ ఆగడాలను, వ్యక్తి స్వేచ్ఛా చౌర్యాన్ని బయటపెడుతూ దాని నిజస్వరూపాన్ని ప్రపంచానికి తెలుపుతున్నారని అంటున్నారు*** **ఎ. నర్సింహారెడ్డి**

ప్రపంచ వ్యాప్తంగా ఇంటర్నెట్‌తో సహా సకల సమాచార సాధనాలపై అమెరికా చేపట్టిన నిఘా చర్యల రహస్యాన్ని నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో పనిచేస్తోన్న ఎడ్వర్డ్ స్నోడెన్ జూన్ 7న హాంగ్‌కాంగ్‌లో రట్టు చేసిన విషయం తెలిసిందే. హాంగ్‌కాంగ్‌తో నేరస్థుల అప్పగింత ఒప్పందం నేపథ్యంలో స్నోడెన్‌ను తనకు అప్పగించాలని అమెరికా డిమాండ్ చేస్తోంది. స్నోడెన్‌పై ప్రభుత్వ సంపదను దొంగిలించడం, జాతీయ రక్షణ సమాచారాన్ని అనధికారంగా బహిర్గతం చేయడం, అనధికార వ్యక్తికి బుద్ధిపూర్వకంగా ప్రభుత్వ గూఢచర్య సమాచారాన్ని వెల్లడించడం, అమెరికాకు వ్యతిరేకంగా గూఢచారిత్వానికి పాల్పడం లాంటి కేసులను అమెరికా బనాయించి ఆయన వీసానూ రద్దు చేసింది. అయితే రష్యా, చైనాల సహకారంతో స్నోడెన్ మాస్కోకు వెళ్లి తాత్కాలిక ఆశ్రయం పొందారు. ఆయనకు ఆశ్రయం ఇవ్వడానికి వెనిజులా, ఈక్వెడార్ దేశాలు ముందుకొచ్చాయి.

మొన్న బ్రాడ్లే మానింగ్, నిన్న జూలియన్ అసాంజె, నేడు ఎడ్వర్డ్ స్నోడెన్ అమెరికా చీకటి సామ్రాజ్యాన్ని ఒక్కొక్కరూ చీల్చి చెండాడుతోంటే ప్రపంచాధిపత్యానికై అర్రులుచాస్తున్న 'పెద్దన్న' గంగవెర్రులెత్తుతున్నాడు. ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజల, దేశాధినేతల వ్యక్తిగత, అధికారిక సమాచారం మొత్తాన్ని 'ప్రిజం' అనే కార్యక్రమం ద్వారా తన దేశం రహస్యంగా సేకరించి ప్రతినిత్యం పరిశీలిస్తోందని ఎడ్వర్డ్ స్నోడెన్ అనే 29 సంవత్సరాల అమెరికన్ యువకుడు ఇటీవల లోకానికి వెల్లడించాడు. ప్రపంచంలోని ఇంటర్నెట్ సమాచారం మొత్తం అమెరికా సర్వర్ల గుండా ప్రయాణించాల్సిందే కాబట్టి తన దేశంలోని సర్వర్లకు 'బౌండ్‌లెస్ ఇన్‌ఫర్మేషన్' అనే సమాచారం వెలికితీసే (డేటా మైనింగ్) ఒక టూల్‌ను ఏర్పాటు చేసి అన్ని దేశాల సమాచారాన్ని తోడేస్తోంది. ఈ టూల్ విశేషమేమిటంటే కంప్యూటర్, టెలిఫోన్ నెట్‌వర్క్‌లకు ఈ టూల్ (ఒక రకమైన సాఫ్ట్‌వేర్ ప్రోగ్రాం) అమర్చడం ద్వారా ప్రపంచ దేశాల్లో ఏ దేశానిది కావాలంటే ఆ దేశ సమాచారమంతా వచ్చి అమెరికా జాతీయ భద్రతా వ్యవస్థ ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకున్న సర్వర్లలోకి వచ్చి చేరిపోతుంది. దీన్నే మెటా డెటా అంటారు. వ్యక్తి స్వేచ్ఛ, స్వాతంత్ర్యాల గురించీ, మానవ హక్కుల గురించీ నిత్యం ఇతరులకు సుద్దులు చెప్పే అమెరికా ఈ విధంగా ప్రతిక్షణం ప్రపంచ ప్రజల స్వేచ్ఛను హరించే దురాగతానికి పాల్పడుతోందన్న విషయం వెల్లడికావడం దానికి మింగుడు పడడం లేదు. సామ్రాజ్యవాద ప్రచార సాధనాలు, కార్పొరేట్ మీడియా ఎంతగా తొక్కిపడదామని ప్రయత్నిస్తున్నా ఈ అంశం అమెరికా పరువు తీసి పందిరేస్తూనే ఉంది.

ప్రధాన టెలికామ్ ఆపరేటర్ల ఖాతాదారులకు చెందిన టెలిఫోన్ రికార్డులను అమెరికా జాతీయ భద్రతా ఏజెన్సీ (ఎన్ఎస్ఎ) రహస్యంగా సేకరిస్తోంది. వెరిజోన్‌తో సహా తొమ్మిది అతి పెద్ద ఇంటర్నెట్ కంపెనీలు, ప్రపంచ వ్యాప్తంగా ఆర్థిక సంస్థల ఖాతాదారుల టెలిఫోన్ రికార్డుల వివరాలను ఏజెన్సీ సేకరిస్తోంది. ఎన్ఎస్ఎకు చెందిన స్నోడెన్ క్లాసిఫైడ్ అమెరికా భద్రతా ఏజెన్సీ పత్రాలను బ్రిటన్ దినపత్రిక 'ది గార్డియన్'లో 2013 జూన్ 7న వెల్లడించారు. ఆ తర్వాత ఇందుకు సంబంధించిన వివరాలను వాషింగ్టన్ పోస్ట్ పత్రిక ప్రచురించింది. ఈ పత్రాలను లీక్ చేసిన తరువాత అతడు హాంకాంగ్‌కు వెళ్లి పోయాడు. హాంకాంగ్ కోర్టుల్లో సంప్రదాయంగా వస్తున్న భావప్రకటన స్వేచ్ఛ తనను ప్రాసిక్యూట్ చేసే నిమిత్తం అమెరికాకు పంపకుండా కాపాడగలదన్న ఆశా భావం వ్యక్తం చేశాడు. ప్రజలకు తెలియకుండా ఇంతటి విస్తృత స్థాయిలో వారి వ్యక్తిగత వివరాలను సేకరించడం ప్రజల స్వేచ్ఛ స్వాతంత్ర్యాలను హరించడమేనని ఆయన పేర్కొన్నాడు. అందువల్లనే ఇంటలిజెన్స్ ఏజెన్సీల క్లాసిఫైడ్ డాక్యుమెంట్లను లీక్ చేసి విజిల్ బ్లోయర్ పాత్ర పోషించే సాహసం చేసినట్లు ఆయన పత్రికల వారితో చెప్పాడు.

వికీలీక్స్ వ్యవస్థాపకుడు అస్సాంజే తర్వాత అంతటి సంచలనం

---

సుస్థిరమైపోయినట్టే. ఆ శరణార్థి హోదాను అనుభవించే నా హక్కును పరిమితం చేయడానికీ, అందులో జోక్యం చేసుకోవడానికీ ఏ దేశానికీ ఎటువంటి పునాదీ లేదు. కాని, పాశ్చాత్య యూరప్ లో, ఉత్తర అమెరికాలో కొన్ని ప్రభుత్వాలు చట్టానికి వ్యతిరేకంగా పనిచేయడానికి సిద్ధపడుతున్నాయి. ఇవాళ్టికి కూడ వాళ్ల చట్టవ్యతిరేక ప్రవర్తన సూచనలు కనబడుతున్నాయి. ఆ చట్టవ్యతిరేక బెదిరింపు వల్ల నా లాటిన్ అమెరికా ప్రయాణం అసాధ్యంగా మారుతున్నది. మన సామూహిక హక్కులకు అనుగుణంగా నేను పొందిన శరణార్థి హోదాను అనుభవించడం అసాధ్యమవుతున్నది.

బలమైన రాజ్యాలు ఇలా చట్టాతీతంగా ప్రవర్తించడం మనందరికీ ఒక పెద్ద ప్రమాదం. ఈ ప్రయత్నం గెలవకుండా చూడవలసి ఉంది. అందువల్ల నా లాటిన్ అమెరికా ప్రయాణం సురక్షితంగా జరిగేలా ఆయా దేశాల నుంచి హామీలు పొందడంలో మీ సహాయాన్ని అర్థిస్తున్నాను. అలాగే ఆ దేశాలు చట్టానికి కట్టుబడి ఉంటామని, నా చట్టబద్ధ ప్రయాణాన్ని సాగనిస్తామని హామీ ఇచ్చేవరకూ రష్యా ఆశ్రయం కోరడానికి నాకు సహకరించండి. నేను ఇవాళే నా విజ్ఞప్తిని రష్యా ప్రభుత్వానికి సమర్పిస్తున్నాను. సానుకూలమైన సమాధానం వస్తుందని ఆశిస్తున్నాను. వీ

సృష్టించిన ఘనత స్నోడెన్‌కే దక్కింది. మొదట అమెరికా ప్రజల హక్కుల్ని హరిస్తోన్న ఎన్‌ఎస్‌ఎ నిఘా కార్యకలాపాల్ని స్నోడెన్ బయటపెట్టారు. ఆ తర్వాత బ్రిటన్‌కి చెందిన జిసిహెచ్‌క్యు (గవర్నమెంట్ కమ్యూనికేషన్స్ హెడ్ క్వార్టర్స్), అమెరికాకు చెందిన ఎన్‌ఎస్‌ఎ (నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీ) సంస్థలు కోట్ల మంది ప్రజల ఫోన్‌కాల్స్, ఈమెయిల్, ఫేస్‌బుక్ సందేశాలు, బ్రౌజింగ్ హిస్టరీతో సహా సకల సమాచారాన్ని దొంగతనంగా సేకరిస్తోన్న సంగతి జూలై 7న వెలుగులోకి వచ్చింది. చైనాలోని అత్యున్నత విద్యా, పరిశోధన సంస్థ జిన్హువా విశ్వ విద్యాలయంలోని పరిశోధనా సమాచారామంతటినీ సిఐఎ హ్యాక్ చేస్తోందని ఆయన మీడియాతో చెప్పారు. ఇంటర్నెట్ సమాచార చౌర్యంలో అమెరికాను 'అతిపెద్ద విలన్'గా అభివర్ణిస్తూ, చైనా మొబైల్ కంపెనీలను హాక్ చేయడం ద్వారా లక్షల కొద్దీ మెసేజ్‌లను అమెరికా సేకరించిందని స్నోడెన్ మార్నింగ్ పోస్ట్ పత్రికకు వెల్లడించారు. చైనాలో టెక్స్ట్ మెసేజింగ్ అతి పెద్ద సమాచార అనుసంధాన ప్రక్రియ. సామాన్యుల నుంచీ ప్రభుత్వ అధికారులు సమాచారాన్ని ఈ విధానంలో ఇచ్చిపుచ్చుకుంటూరు. అమెరికా దీనితో పాటు సింగ్వా యూనివర్సిటీ కంప్యూటర్లు, సర్వర్లను హాక్ చేసి అక్కడి రీసెర్చ్ కార్యకలాపాల సమాచారాన్ని కూడా సేకరించిందని చెప్పారు. ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాల్లో ఉన్న కీలక నెట్‌వర్క్ ఇలాంటి కూడళ్లను సిఐఎ హ్యాక్ చేస్తున్న విషయాన్ని స్నోడెన్ వెల్లడించారు. ఇంటర్నెట్ కార్యకలాపమంతా నడిచే ఫైబర్ ఆప్టిక్ కేబుల్స్‌ను ఆ రెండు సంస్థలు టాపింగ్ చేయడం ద్వారా వ్యక్తిగత సమాచారామంతటిని సేకరించి, దాన్ని వడపోసి, నిల్వ చేస్తోన్న విషయాన్ని ఎన్‌ఎస్‌ఎ విజిల్ బ్లోయర్, ఎడ్వర్డ్ స్నోడెన్ వెల్లడించారు.

ఎడ్వర్డ్ స్నోడెన్ అమెరికా సైనిక గూఢచార యంత్రాంగం కప్పుకున్న ముసుగును తొలగించడం ద్వారా అమెరికా పౌరులకే కాక, ప్రపంచ ప్రజలందరికీ ఎనలేని సేవ చేశాడు. అమెరికా రాజ్యాంగ చట్టం పౌరులకిచ్చిన మౌలిక హక్కులను గూఢచార యంత్రాంగం కాలరాచి వేస్తోన్న తీరును బయటపెట్టాడు. స్నోడెన్ బయటపెట్టిన సమాచారమేమిటి ? అమెరికా జాతీయ భద్రతా సంస్థ టెలికాం కంపెనీ వెరిజాన్ వినియోగదారులందరి టెలిఫోను సమాచారామంత అందించవలసిందని ఒక కోర్టు నుండి రహస్య ఆజ్ఞను పొందింది. దీనిని డ్రాగ్‌నెట్ అని పిలుస్తున్నారు. అమెరికా సామ్రాజ్యవాదం దృష్టిలో దేశాలకు సార్వభౌమత్వం లేదు. ఆ దేశాల ప్రజలు పౌరులుకారు. వారికి హక్కులుండవు. ఒక కోర్టు ఉత్తర్వు కూడా లేకుండా ఇతర దేశాల ఫోను, ఇంటర్నెట్ వాడకం దారుల సమాచారామంతా అది సేకరిస్తోంది. దీనిని 'హద్దులు లేని సమాచారం'అని పిలుస్తున్నారు.

ఇలా ఇప్పటికే సేకరించిన సమాచారం ద్వారా అమెరికా ప్రభుత్వం అమెరికా పౌరులందరి సాంఘిక, రాజకీయ వ్యక్తిత్వాలను సవివరంగా చిత్రించగలదు. ఇది అతి వ్యాఖ్యానం కాదు. అమెరికా సివిల్ లిబర్టీస్ యూనియన్ ఇలా చెప్పింది. 'ఈ గూఢచారి కార్యక్రమం ద్వారా మాలాంటి సంఘాల సమగ్ర సమాచారమంతా ప్రభుత్వం పొందుతుంది. మా కుటుంబ, రాజకీయ, వృత్తిపర, మత, వ్యక్తిగత సన్నిహిత సంబంధాల సవివర సమాచారం సేకరిస్తుంది. ఈ కార్యక్రమానికి గురవుతోంది అమెరికా ప్రజలే కాదు. 'హద్దులులేని సమాచారం' అన్న కార్యక్రమంతో అమెరికా జాతీయ భద్రతా సంస్థ 2013 మార్చ్ నెలలోనే 9700 కోట్ల సమాచార అంశాలను ప్రపంచమంతటి నుండీ సేకరించింది. దీనిలో 300 కోట్లు అమెరికా ప్రజల నుండి రహస్యంగా సేకరించగా, ఇరాన్ నుండి 1400 కోట్లు, పాకిస్తాన్ నుండి 1350 కోట్లు, జోర్డాన్ నుండి 1270 కోట్లు, ఈజిప్టు నుండి 760 కోట్లు, భారత్ నుండీ 630 కోట్లు, యూరపు దేశాల నుండీ 300 కోట్లు రహస్యంగా సేకరించింది. 'హద్దులు లేని సమాచారమన్న' ఈ రహస్య గూఢచారి కార్యక్రమం ప్రతి వ్యక్తి హక్కులనూ కాలరాచేసేదిగా ఉండడంతో పాటు, ప్రతి దేశపు సార్వభౌమత్వ, జాతీయ హక్కులను కూడా నిరాకరించేదిగా ఉంది.

స్నోడెన్ బయటపెట్టింది సముద్రంలో నీటి బిందువు మాత్రమే. ఈ గూఢచారి కార్యక్రమం ఇంకా లోతుగా సాగుతోంది. దీనిని స్నోడెన్ 'అణచివేత నిర్మాణం' అన్నాడు. 'ఇలాంటి పనులన్నీ చేసే సమాజంలో నేను జీవించలేను. నేను మాట్లాడే ప్రతి మాటా, చేసే ప్రతి పనీ రికార్డు చేసే లోకంలో జీవించాలని నేను కోరుకోవడం లేదు' అన్నాడు. అమెరికా రాజకీయ వ్యవస్థలో నిజమైన ప్రజాస్వామ్యం లేదని ఇది తెలుపుతోంది. ఇది ప్రజలను ప్రతిపక్ష శక్తిగా చూస్తోంది. ఇది ప్రతి పౌరుడినీ శత్రువుగా పరిగణిస్తోంది. అది మొత్తం సమాజాన్ని వేధించడం, బ్లాక్ మెయిల్ చేయడం లక్ష్యంగా పెట్టుకుంది. స్నోడెన్ బయటపెట్టిన సమాచారం మరొక అంశాన్ని కూడా తెలుపుతోంది. అమెరికా ప్రజల హక్కులకు ప్రమాదం వాటిల్లుతోంది టెర్రరిస్టుల నుంచి కాదు, అది అమెరికా గుత్త పెట్టుబడి ఆధీనంలోని ప్రభుత్వం నుంచి, అమెరికా పాలక వర్గాలు దేశంలో అనుసరిస్తోన్న పొదుపు చర్యలకూ, దేశం బయట సాగిస్తోన్న అంతంలేని యుద్ధాలకూ కార్మికవర్గం నుండి వస్తున్న వ్యతిరేకతను అణచి వేసేందుకు పోలీసు రాజ్యపు చర్యలను బుష్ పాలన ప్రారంభించగా, ఒబామా ప్రభుత్వం వాటిని విస్తరిస్తోంది.

ఈ దుష్ట గూఢచారి కార్యక్రమం బయటపడడంతో అమెరికా రాజకీయ నాయకత్వం ఆగ్రహావేశాలతో ఊగిపోయింది. టెర్రరిస్టు దాడుల నుండి అమెరికా ప్రజలను రక్షించడానికి అవసరమని గూఢచారి కార్యక్రమాన్ని అధ్యక్షుడు బారక్ ఒబామా సమర్థించుకున్నాడు. అమెరికా పార్లమెంటు ఆమోదంతోనూ, ఒక కోర్టు ఆదేశంతోనూ సాగుతున్నందున ఈ గూఢచారి చర్యలు చట్టబద్ధమైనవని సమర్థించుకున్నాడు. వాస్తవమేమిటంటే అమెరికా పార్లమెంటు ఆమోదించింది, విదేశీ గూఢచార భద్రతా చట్టం, ఈ చట్టం పరిధిని దాటి గూఢచారి సంస్థలు వ్యవహరిస్తున్నాయి. రెండు టెలికాం కంపెనీలు సమాచారాన్ని కోరడం చట్ట వ్యతిరేకమని కోర్టులకు వెళ్లాయి. ఈ చట్టం పరిధిలో రహస్యంగా పని చేసే కోర్టు రబ్బరు స్టాంపు మాత్రమే.

నేరారోపణ చేసి అరెస్టు చేసేందుకు అనువుగా స్నోడెన్‌పై నేర పరిశోధనను ఒబామా ప్రభుత్వం ప్రారంభించింది. డెమోక్రటిక్, రిపబ్లికన్ పార్టీలకు చెందిన నాయకులు రహస్యాలను స్నోడెన్ బయటపెట్టడాన్ని 'దేశ ద్రోహ' నేరంగా ఖండించారు. వారిలో కొందరు అతన్ని ఉరితీయాలని కూడా డిమాండ్ చేశారు. గూఢచారి కార్యక్రమ రహస్యాలను బయటపెట్టిన వారందరిపైనా నేరాలు మోపి విచారణ చేస్తానని జాతీయ గూఢచారి సంస్థ అధిపతి జేమ్స్ క్లాపర్ ప్రకటించాడు. ఇలా వెల్లడించడం వల్ల అమెరికా జాతీయ భద్రతకు 'తిరిగి సరి చేయలేని, దీర్ఘకాలిక హాని జరుగుతుంద'ని చెప్పాడు. పాలకవర్గాలకు చెందిన ఉదారవాదులనేవారూ, వారి బాకాలైన వాషింగ్‌టన్ పోస్టు, న్యూయార్క్

టైమ్స్ పత్రికలు రహస్య గూఢచార కార్యక్రమాన్ని విమర్శించాయి తప్ప దాన్ని ఖండించలేదు, రద్దు చేయమని అడగలేదు.

అమెరికా ఎక్కువగా సమాచారం సేకరిస్తోన్న ఐదు దేశాలలో భారత్ కూడా ఉంది. ఈ-మెయిల్స్ మొదలుకొని ఫోన్ సంభాషణల వరకు పౌరులను గూఢచార సంస్థలు కనిపెట్టి ఉండడం ప్రజాస్వామ్యం అనిపించుకోదు. ప్రతి రాజ్యంలో మెజారిటీ, మైనారిటీ వర్గాలుంటాయి. భిన్న భావజాలాల ప్రజలుంటారు. భిన్న రాజకీయ పక్షాలుంటాయి. ప్రభుత్వం పట్ల, వ్యవస్థ మీద అసంతృప్తి ఉన్న వర్గాలు ఉంటాయి. అసమ్మతిని, భిన్నత్వాన్ని గౌరవించడమే ప్రజాస్వామ్యం. 20వ శతాబ్దం చివరి నాటికే పౌరుల వ్యక్తిగత జీవితంలోకి రాజ్యం చొచ్చుకుపోకూడదనే నీతి ప్రపంచమంతా ఆమోదం పొందింది. ఇప్పుడున్న ఆధునిక వ్యవస్థకు, వ్యక్తి శ్రేయోవాద, ఉదారవాద భావజాలానికి వందల ఏళ్ల చరిత్ర ఉంది. ఉదారవాదాన్ని స్వీకరించిన అమెరికా, ఇతర పాశ్చాత్య దేశాలు నాటి సోవియట్ యూనియన్, మావో చైనా తదితర రాజ్యాలను నిరంకుశ వ్యవస్థలుగా అభివర్ణించాయి. ఇక్కడ సామ్యవాదం అమలవుతున్నప్పటికీ, తమ సమాజాల్లో వ్యక్తి స్వేచ్ఛకు పట్టం కట్టినట్లు చెప్పుకున్నాయి.

ప్రపంచీకరణ నేపథ్యంలో సంక్షేమ పథకాలు పత్తా లేకుండా పోయాయి. సోషలిజం లేకున్నా కనీసం వ్యక్తి హక్కులకైనా హామీ ఉండాలె. కానీ అమెరికాలో కానీ, యూరోపియన్ దేశాలలో కానీ, ప్రపంచీకరణ విధానాలు అమలు చేస్తోన్న 'వర్ధమాన' దేశాలలో కానీ వ్యక్తి హక్కులకు కూడా దిక్కు లేకుండా పోయింది. సామ్యవాదానికి ఎక్కడ చోటు లేదు. కనీసం ఇంత కాలం స్వేచ్ఛా ప్రపంచంగా చెప్పుకున్న దేశాలు వ్యక్తి స్వేచ్ఛను కూడా గౌరవించనప్పుడు, మరి ఈ వ్యవస్థలకు ఉన్న నైతిక ప్రాతిపదిక ఏమిటి అనే ప్రశ్న తలెత్తుతోంది. తమ జీవితానికి భద్రత ఇవ్వనప్పుడు, తమ హక్కులకు పూచీ లేనప్పుడు ఈ పాలక వ్యవస్థలను పౌరులు ఎందుకు అంగీకరిస్తారనేది ఆలోచించవలసిన విషయం.

బయటి ప్రమాదం బూచి చూపించి, తమ పౌరుల హక్కులను హరించడం నిరంకుశ రాజ్య స్వభావం. కానీ ప్రజాస్వామ్య వ్యవస్థలో పౌరుల హక్కులను, వ్యక్తి స్వేచ్ఛను ఏ కారణంగా కూడా హరించకూడదు. ఇతర దేశాల నుంచి ఇంతగా ఉగ్రవాద ప్రమాదం పొంచి ఉందీ అంటే దానికి కారణం అమెరికా అనుసరిస్తోన్న విధానాలే. సైన్యంపై భారీగా ఖర్చు చేయడం, ఇతర దేశాలపై దురాక్రమణకు దిగడం మొదలైనవన్నీ నిరంకుశ రాజ్య విధానాలే. సమాజంలో అసమానతలను ప్రభుత్వమే పెంచి పోషించడం వల్లనే, బహుళత్వాన్ని గౌరవించకపోవడం వల్లనే ఇవాళ అమెరికాలో అడుగడుగునా ప్రజలను కెమెరా కన్నులతో నిరంతరం గమనించవలసి వస్తోంది. ఈ నిరంకుశ విధానాల కొనసాగింపుగానే ఇప్పుడు ఈ-మెయిల్స్ మొదలుకొని ఫోన్ సంభాషణల వరకు అన్ని వివరాలను సేకరిస్తూ, పౌరుల ప్రతి కదలికపై గూఢచర్యం జరిపే దశ వచ్చింది. వ్యక్తి స్వేచ్ఛను పణంగా పెట్టి ఏ వ్యవస్థ మనలేదు. సాంకేతిక పరిజ్ఞానాన్ని, అత్యాధునిక ఆయుధాలను చేత బూని ప్రజల హక్కులను హరిస్తే ఆయా వ్యవస్థల మనుగడే ప్రమాదంలో పడుతుంది.

గతంలో బ్రాడ్లే మానింగ్ అనే అమెరికా యువ సైనికుడు ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్‌లలో ప్రజలపై అమెరికా సైన్యం జరిపిన అమానుష హత్యాకాండనూ, దమనకాండనూ వివరించే రహస్య పత్రాలను పత్రికలకు వెల్లడించాడు. 25 ఏళ్ల ఈ యువసైనికుని సాహసం అమెరికా యుద్ధకాండ నిజ స్వరూపాన్ని లోకానికి వెల్లడించింది. 2007లో బాగ్దాద్ వైమానిక దాడిలో జరిగిన మారణకాండ, 2009లో ఆఫ్ఘనిస్తాన్‌లోని గ్రాన్యయ్ ప్రాంతంలో జరిగిన వైమానిక దాడిలో అమాయకుల ప్రాణాలు హరించిన తీరును మానింగ్ వికీలీక్స్‌కు ఇచ్చిన 5 లక్షల పత్రాల ద్వారా వెల్లడించాడు. మానవాళికి ఈ సాహసికుడు చేసిన సేవకుగాను అమెరికా ప్రభుత్వం ఆయనను 2010లో అరెస్టు చేసి జైల్లో పెట్టింది. అలాగే వికీలీక్స్ వ్యవస్థాపకుడైన జూలియన్ అసాంజె 2010 నవంబరు 28 నుండి వరుసగా కొన్ని వేల అమెరికా రహస్య దౌత్య పత్రాలను ప్రపంచానికి వెల్లడించాడు. తన దౌత్య కార్యాలయాల ద్వారా, దౌత్య వ్యవహారాల ద్వారా అమెరికా ఏ విధంగా ఇతర దేశాల అంతరంగిక వ్యవహారాల్లో తలదూర్చి తిమ్మిని బమ్మిని చేస్తోందో ఆయన ఆధారాలతో వెల్లడించడంతో అమెరికా దౌత్య (అవి)నీతి బండారం బయటపడింది. ఆస్ట్రేలియా దేశస్థుడైన అసాంజేను పట్టుకుని శిక్షించడానికి అమెరికా అరెస్టు వారెంటు జారీ చేసింది. దాంతో ఆయన గత ఏడాది నుండి లండన్‌లోని ఈక్వెడార్ దౌత్య కార్యాలయంలో రక్షణ పొందుతున్నాడు. ఇప్పుడు వారి కోవలోనే ఎడ్వర్డ్ స్నోడెన్ అమెరికా ప్రిజమ్ కార్యక్రమాన్ని లోకానికి వెల్లడించి పెద్దన్న ఆగ్రహానికి గురైనాడు. దేశ ద్రోహ నేరం కింద ఆయనను అరెస్టు చేయడానికి అమెరికా ప్రయత్నిస్తుండడంతో స్నోడెన్ తొలుత హాంగ్‌కాంగ్‌కూ, అక్కడి నుండి రష్యాకూ పారిపోయాడు. ఇంతకాలం ప్రజాస్వామ్యంపై, మానవ హక్కులపై ప్రపంచానికి నీతులు చెప్పిన అమెరికా ఒకప్పుడు సోషలిస్టు దేశాల నుంచి అసమ్మతివాదులకు ఆశ్రయం కల్పించి 'ఉదారత'ను చాటుకున్న అమెరికా ఇప్పుడు తన నిజ స్వరూపాన్ని బయట పెట్టుకుని హాంకాంగ్ మొదలుకొని ఈక్వెడార్ వరకు చిన్న దేశాలపై చిర్రుబుర్రు లాడుతోంది! స్నోడెన్‌ను అప్పగించాలంటూ అమెరికా చేసిన అభ్యర్థనను తిరస్కరించిన హాంకాంగ్ అతడిని స్వేచ్ఛగా రష్యాకు వెళ్లనిచ్చింది. ఇందుకు హాంకాంగ్‌ను సహకరించిన రష్యాను అభినందించాల్సిందే.

ప్రచ్ఛన్న యుద్ధకాలంలో అమెరికా, సోవియట్ రష్యాలు పరస్పరం సాగించిన అంతులేని గూఢచర్యాలు, కుట్రలు సమసిపోవడంతో తాత్కాలికంగా ఉపశమించాం. అయితే 2001 సెప్టెంబర్ దాడుల తర్వాత ఉగ్రవాదం మీద యుద్ధం పేరిట ప్రజలపై, ఇతర దేశాలపై అమెరికా అంతులేని నిఘా వేస్తోంది. అమెరికా 9/11 ప్రపంచ వాణిజ్య సంస్థపై దాడుల అనంతరం అప్పటి అధ్యక్షుడు బుష్ టెలిఫోన్ రికార్డులపై నిఘా పెట్టింది. టెలిఫోన్ నిఘా గురించి 2006లో తొలిసారిగా వెలుగులోకి వచ్చింది. సమాచార స్వేచ్ఛ కోసం పోరాడే వారు ఆనాడే ఆందోళన వ్యక్తం చేశారు. వ్యక్తుల ప్రైవేట్ జీవితాల్లోకి ప్రభుత్వం అక్రమంగా చొచ్చుకు వచ్చి జోక్యం చేసుకుంటోందని వారు తీవ్రంగా ఖండించారు. ప్రపంచానికి ప్రజాస్వామ్య విలువల గురించి వల్లిస్తున్న ప్రపంచ పోలీసు అమెరికా, దాని మిత్ర దేశం బ్రిటన్‌లు ప్రపంచ ప్రజల స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు హరించే పనికి ఒడిగట్టాయి. సైనిక రహస్యాలు, శాస్త్రీయ పరిశోధనలు, దేశాధినేతల సంభాషణలు, వ్యక్తుల అంతరంగిక విషయాలు వంటి సర్వ విషయాలను అంతర్జాతీయ గోప్యతా నియమావళికి విరుద్ధంగా తాము సొంతం చేసుకున్నట్టు అమెరికా అధికారులు చేసిన ప్రకటన ప్రపంచాన్ని దిగ్భ్రాంతి పరచింది.

భారతదేశంపై ప్రత్యేక నిఘా వేసినట్లు స్నోడెన్ ఉదంతంలో ప్రముఖంగా వెలుగులోకి వచ్చింది. గతంలో చైనాపై నిఘా వేసేందుకు నందాదేవి శిఖరంపై అమెరికా అణు పరికరం అమర్చేందుకు భారత పాలకులు సహకరించారు. అయితే చైనాపై నిఘా వేసిన అమెరికా మన విషయంలో కూడా అలాగే వ్యవహరిస్తుందన్న విషయం మన పాలకులు అర్థం చేసుకోలేక పోయారు. చైనాకు వ్యతిరేకంగా భారత్‌ను తనకు అనుకూలమైన ప్రాంతీయ శక్తిగా తయారు చేయాలని ప్రయత్నిస్తున్న అమెరికా మన దేశానికి సంబంధించిన కీలక సమాచారాన్ని క్షుణ్ణంగా సేకరిస్తోంది. భారత-అమెరికా పౌర అణు ఒప్పందానికి పార్లమెంటులో ఆమోదం కోసం దేశ సార్వభౌమత్వాన్ని భంగపరిచే రీతిలో జరిగిన తతంగం మనం ఇంకా మరిచిపోలేదు. అమెరికాను దిక్కరించే శక్తి మన్మోహన్‌కు ఉందా? అనేది అనుమానమే.

ఈ రకంగా అమెరికా రహస్యంగా సమాచారం సేకరించిన దేశాల జాబితాలో ఇరాన్ ప్రథమ స్థానంలో ఉండగా, పాకిస్థాన్ రెండో స్థానంలో, భారత్ అయిదో స్థానంలో ఉన్నాయి. నిజానికి ఈ రకంగా అమెరికా చేస్తోన్న పని సామాన్యమయినది కాదు. ప్రపంచ దేశాల, ప్రజల అంతరంగిక సమాచార వ్యవస్థల్లోకి చొచ్చుకుపోయి వారి రహస్య సమాచారాన్ని సేకరించడం అంతర్జాతీయ నేరం. ఈ నేరంలో ఒక్క అమెరికా జాతీయ భద్రతా సంస్థ మాత్రమే కాదు, అమెరికా గూఢచారి సంస్థ సిఐఎ, బహుళజాతి ఇంటర్నెట్ కంపెనీలు గూగుల్, మైక్రోసాఫ్ట్, యాహూ, ఫేస్‌బుక్, పాల్‌టాక్, ఎ.ఓ.ఎల్, స్కైప్, యూట్యూబ్, ఆపిల్‌లు కూడా పాల్గొన్నాయి. ఈ కంపెనీలన్నీ తమ సర్వర్లలో నిక్షిప్తమైన సమాచారాన్ని అమెరికా భద్రతా సంస్థకు ఎప్పటికప్పుడు వెల్లడిస్తున్నాయని స్నోడెన్ సోదాహరణంగా వెల్లడించాడు.

అమెరికా తను చేస్తున్న ఇంత పెద్ద నేరాన్ని మాత్రం ఒక్క మాటలో సమర్థించుకోంటుంది. 'ఉగ్రవాదంపై యుద్ధం' చేయడానికి ఇటువంటి చర్యకు పాల్పడక తప్పడం లేదనేది దాని వాదన. నిజానికి 'ఉగ్రవాదంపై యుద్ధం' అనేది అమెరికా దుష్ట చర్యలకు ఒక సాకు మాత్రమే. ఆఫ్ఘనిస్తాన్, ఇరాక్ తదితర దేశాల మీద దాడులకు అమెరికా ఇదే వాదన ఉపయోగించుకుంది. దేశభక్త చట్టం (పేట్రియాట్ యాక్ట్)గా పిలుస్తున్న విదేశీ గూఢచర్య చట్టం (ఫిసా) చేసి అమెరికా పౌరుల, ప్రపంచ పౌరుల ప్రాథమిక హక్కులు, మానవ హక్కులు కాల రాస్తోంది. పేట్రియాట్ చట్టం కింద అమెరికా ప్రపంచంలోని అనేక దేశాల పౌరులను బంధించి, రహస్యంగా తెచ్చి, రహస్య కోర్టుల్లో రహస్య విచారణలు చేసి, రహస్య జైళ్లలో చిత్రహింసలు పెడుతోంది. అటువంటి జైళ్లలో ఇరాక్‌లోని అబూ గ్రాయిబ్, క్యూబాలోని గ్వాంటినామోబేలోని అమెరికా జైళ్ళు పేరెన్నికగన్నాయి. ఈ జైళ్లలో మానవ హక్కుల ఉల్లంఘనలపై ప్రపంచమంతా నిరసన తెలుపుతున్నా అమెరికాకూ, దాని తైనాతీలకూ చీమ కుట్టినట్లయినా లేదు.

సిస్టమ్ అడ్మినిస్ట్రేటర్‌గా స్నోడెన్‌కు ఎన్ఎస్ఎ అక్రమంగా సేకరిస్తోన్న రహస్య సమాచారమంతటితో సాంగత్యమేర్పడింది. వ్యక్తి స్వేచ్ఛ గురించి చెప్పే తమ ప్రభుత్వం ప్రజల పేరు చెప్పి ప్రజలకు వ్యతిరేకంగా ఎలా పనిచేస్తోందో కళ్లారా చూసిన స్నోడెన్ దాన్ని సహించలేక పోయాడు. తన వద్ద ఉన్న సమాచారం మొత్తాన్ని కొన్ని సిడిల్లోనూ, లాప్ టాపుల్లోనూ సేకరించి హవాయిలో తన గర్ల్ ఫ్రెండ్ ఇంటి నుండి బయలు దేరాడు. అయినా గుండె దిటవు చేసుకుని అక్కడి నుండి బయలు దేరి హాంగ్‌కాంగ్ వెళ్లే విమానం ఎక్కాడు. హాంగ్‌కాంగ్‌లో దిగిన తరువాత తన వద్ద నున్న సమాచారాన్ని ఎవరికి చెబితే ప్రపంచ మంతా వెల్లడవుతుందా అని ఆలోచించాడు. అమెరికా మీడియా నైజమేమిటో ఆయనకు తెలుసు. అది కార్పొరేట్ ప్రయోజనాల కోసం పనిచేసే మీడియా. కీలక విషయాల్లో ప్రభుత్వ చెప్పుచేతుల్లో నడుస్తుంది. అందుకే ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉండి, కొంత స్వతంత్రత ఉన్న పత్రికల ద్వారా ప్రపంచానికి ఈ విషయాలు వెల్లడించాలనుకున్నాడు. దానికి గాను గార్డియన్ పత్రిక విలేకరి గ్లెన్ గ్రీన్‌వాల్డ్, ఫ్రీలాన్స్ జర్నలిస్టు ఇవెన్ మాకాస్కిల్‌లతో మాట్లాడాడు. తొలుత వీరిద్దరూ ఆయన చెప్పింది నమ్మలేకపోయారు. కాని తరువాత ఆయనతో ఇంటర్వ్యూ చేయడానికి డాక్యుమెంటరీ ఫిల్మ్ నిర్మాత, జర్నలిస్టు లారా పోయిట్రాస్‌తో కలిసి జూన్ 1న హాంగ్‌కాంగ్ వెళ్లారు. అక్కడ హోటల్‌లో ఉంటున్న స్నోడెన్‌ను కలిసి వారం రోజుల పాటు ఆయన ఇంటర్వ్యూలు తీసుకున్నారు. ఆయన దగ్గరున్న ఆధారాలు సేకరించారు. జూన్ 10వ తేదీన గార్డియన్ పత్రికలో స్నోడెన్ ఇంటర్వ్యూ మొదటి భాగం ప్రచురితమైంది. తరువాత వరుసగా నాలుగు కథనాలు వెలువడ్డాయి. ఇవే కథనాలను మెకాస్కిల్ 'వాషింగ్టన్ పోస్ట్' పత్రికకు ఇచ్చాడు. ఆ పత్రిక కూడా వీటిని ప్రచురించింది. ఈ కథనాలు పెద్ద సంచలనం కలిగించడంతో అమెరికాలో గగ్గోలు ప్రారంభమైంది. ఒకవైపు స్నోడెన్ దేశద్రోహి అని తెగనాడే వారు కొందరైతే, ఆయన స్వేచ్ఛా పిపాసనూ, మానవత్వాన్నీ పొగిడేవారు మరికొందరు. అమెరికా ప్రభుత్వం స్నోడెన్‌ను పట్టుకుని దేశానికి తెచ్చి విచారించేందుకు సన్నాహాలు ప్రారంభించింది. దాంతో ఆయన హాంగ్‌కాంగ్ హోటల్ నుండి రష్యా రాజధాని మాస్కో వెళ్లి పోయాడు. అక్కడి నుండి ఆయన ఈక్వెడార్‌లో రాజకీయ ఆశ్రయం కోరాడు. గతంలో వికీలీక్స్ వ్యవస్థాపకుడు జూలియన్ అసాంజేకు ఆశ్రయం ఇచ్చింది కూడా ఈ దేశమే. నాటో, అమెరికా దురాక్రమణలను అడ్డుకోలేక ప్రపంచమంతా భయపడుతున్న ఈ కాలంలో ఈక్వెడార్ ప్రభుత్వం స్నోడెన్‌ను ఆహ్వానించడం సాహసమే కాదు ఘనత కూడ.

నేను తప్పు చేయలేదు కనుక దాక్కోవాలనుకోవడం లేదు అని స్నోడెన్ ధైర్యంగా చెప్పాడు. నేను చేసిన పని వల్ల నాకు కష్టాలు తప్పవని తెలుసు. కానీ నేను ఎంతో ప్రేమించే ఈ లోకంలో రహస్య చట్టాల దాష్టీకాలూ, శిక్షల్లో అసమానతలూ, ప్రపంచాన్ని పరిపాలించే నిరంకుశ అధికారం ఇవి ఒక్క క్షణం ప్రపంచానికి వెల్లడైనా అదే నాకు చాలు అంటాడాయన. తన వద్ద నున్న పత్రాలను పత్రికలకు విడుదల చేసేటప్పుడు స్నోడెన్ ఒక నోట్‌ను ఇచ్చాడు. అందులో ఆయన ఇలా పేర్కొన్నాడు. ప్రజల పేరుతో ప్రజలకు వ్యతిరేకంగా జరుగుతున్న తతంగాన్ని ప్రజలకు వివరించడమే నా ఏకైక లక్ష్యం. 'అమెరికా ప్రభుత్వం తను రహస్యంగా నిర్మించిన ఈ విస్తారమైన గూఢాచారి వ్యవస్థ ద్వారా వ్యక్తుల ఏకాంతాన్నీ, ఇంటర్నెట్ స్వాతంత్ర్యాన్నీ, ప్రపంచ ప్రజల మౌలిక స్వేచ్ఛనూ హరించడాన్ని నేను సహించలేను. ప్రభుత్వ గూఢాచారి వ్యవస్థ గురించి ప్రపంచానికి వెల్లడించే రహస్య పత్రాలను విడుదల చేయడం ద్వారా తను తన స్థిరమైన, విజయవంతమైన జీవితాన్ని 'త్యాగం చేయడానికి సిద్ధపడ్డాను' అని స్నోడెన్ పేర్కొన్నాడు.

అమెరికా గూఢచర్యం నెరుపుతున్న దేశాల్లో భారత్ అయిదో స్థానంలో

ఉంది. చైనా, రష్యాల కన్నా కూడా ఎక్కువ రహస్యాలను భారతదేశం నుండి సేకరిస్తోందని స్నోడెన్ అందించిన సిడిలలోని సమాచారం తెలుపుతోంది. కాని భారత ప్రభుత్వం మాత్రం అమెరికా చర్యను ఖండించకుండా కుక్కిన పేనులా ఉండి పోయింది. భారతీయ కార్పొరేట్ మీడియా అయితే దీన్ని ఒక వార్తగానే పరిగణిస్తున్నట్లు లేదు. తెలుగు మీడియా కూడా వారి అడుగుజాడల్లోనే నడుస్తున్నట్లున్నది. ఈ సందర్భంలోనే భారతదేశంలోని పరిస్థితిని కూడా మనం గమనించాలి. దేశంలోని పరిస్థితి అమెరికాలోని పరిస్థితి కంటే మరింత హీనంగా ఉంది. అమెరికాలో నిఘా ద్వారా సమాచారం సేకరించాలంటే రహస్యంగా కోర్టు అనుమతి పొందుతారు. మన దేశంలో టెలికాం కంపెనీలకు జారీ చేసిన లైసెన్సులోని నిబంధనల ప్రకారం పోలీసులు అడిగిన వెంటనే మొత్తం సమాచారాన్ని అందించాల్సి ఉంది. ప్రతిపక్ష పార్లమెంటు సభ్యుల ఫోన్లు టాపింగ్ చేశారన్న ఆరోపణలు విన్నాం. టాపింగ్‌కు పాల్పడిన వారిపై చర్యలు తీసుకుంటానన్న శుష్క హామీ తప్ప చేసింది ఏమి లేదు. అంతే కాకుండా భారత ప్రభుత్వం 'జాతీయ రహస్య సాంకేతిక సంస్థ' (ఎన్‌టిఆర్‌ఒ)ను ఏర్పాటు చేసింది. ఇది పార్లమెంటుకు జవాబుదారీ కాదు. ఇది ఇంటలిజెన్స్ బ్యూరో ఆధ్వర్యంలోనే పని చేస్తోంది. ఇది భారత ప్రజలపై నిఘా పెట్టే పనులు చేస్తోంది. 2006-07లో గూగుల్, స్కైపీల సర్వర్లలోకి చొరబడే ప్రయత్నాలు చేసింది. కానీ సఫలం కాలేదు. సిఫి, రిడిఫ్‌మెయిల్ సర్వర్లలోకి చొరబడగలిగింది. కేంద్ర ప్రభుత్వ ఉన్నతాధికారుల ఈ మెయిళ్లలోని సమాచారాన్ని ఎన్‌టిఆర్ఒ ఎవరి అనుమతి లేకుండానే రహస్యంగా సేకరిస్తున్నదని ఎలక్ట్రానిక్స్, ఐటి మంత్రిత్వ శాఖ తెలిపింది. దేశవ్యాప్తంగా నిరసన వ్యక్తమవుతోంది. కేంద్ర నిఘా పర్యవేక్షక వ్యవస్థ (సిఎంఎస్)ను, జాతీయ గూఢచారి గ్రిడ్ ఏర్పాటు చేయనున్నట్లు 2011లో కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. అయితే సిఎంఎస్ ఎలా పనిచేస్తోంది? పౌర హక్కులకు విఘాతం కలుగకుండా ఇది ఎలా విధులు నిర్వహిస్తుంది? అన్న విషయంలో ప్రభుత్వం పెద్దగా చెప్పిందేమీ లేదు. దీనిపై ప్రజా బాహుళ్యంలో కూడా చర్చ జరగలేదు. సిఎంఎస్‌ను పర్యవేక్షిస్తున్న టెలికమ్యూనికేషన్స్ శాఖ అధికారులు దీనిపై స్పందించడానికి నిరాకరిస్తున్నారు. ఈ నూతన నిఘా విధానం ప్రకారం ప్రభుత్వం లక్షిత వ్యక్తుల ఫోన్ సంభాషణలను వినగలదు. ట్యాప్ చేయగలదు. ఈమెయిల్స్, సంభాషణలను వినగలదు. ట్యాప్ చేయగలదు. ఈమెయిల్స్, టెక్ట్స్ మెసేజ్‌లను చదవడం, ఫేస్‌బుక్, ట్విట్టర్, లింకెడ్‌ఇన్‌లలో పోస్టులను పర్యవేక్షించడం, గూగుల్‌లో వారి సెర్చ్ వివరాలను సేకరించగలదు. ఇందుకు ఎలాంటి కోర్టు అనుమతి ముందుగా తీసుకోదు. ఈ నిఘా విధానాన్ని హక్కుల సంఘాల కార్యకర్తలు, మేధావులు తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. నిఘా సేకరణ విధానాన్ని పారదర్శకంగా చేపట్టాలని డిమాండ్ చేస్తున్నారు.

ఇటీవల అమెరికా పర్యటనకు వెళ్లిన భారత హోం మంత్రి షిండే భారత-అమెరికా దేశాల భద్రతా చర్యలను చర్చించారు. అమెరికాలోనే వెబ్ కంపెనీల కేంద్రాలన్నీ ఉండడంతో తన చట్టాల ప్రకారం నాటి నుండి నేటి వరకు అన్ని దేశాల్లోని ప్రజల సమాచారాన్ని అది సేకరిస్తోంది. అమెరికాలో ఉన్న సర్వర్లను భారత్‌కు అందుబాటులోకి తేవాలని షిండే కోరగా తమ దేశ చట్టాలు అందుకు అనుమతించవని అమెరికా సున్నితంగా తిరస్కరించింది. అయితే ఏ చట్టం ప్రకారం అన్ని దేశాల ప్రజల మీద అమెరికా నిఘా పెడుతుంది? ఇతర దేశాల ప్రభుత్వాలు అలాంటి నిఘాను ఎట్టి పరిస్థితుల్లోను అంగీకరించవన్న అంశాన్ని అలా పెడితే, భారత ప్రజలపై నిఘా పెట్టాలని భారత పాలకులెంతగా తహతహలాడుతున్నారో ఇది తెలియజేస్తుంది. ఒక రకంగా చెప్పాలంటే ఆధార్ కార్డు అందులో భాగంగానే వచ్చింది.

అమెరికా ఈ విధంగా ప్రపంచ ప్రజలందరిపైనా నిఘా నేత్రం ప్రసరింప జేయడానికి కారణం ఇంటర్నెట్ దాని చేతుల్లో ఉండడమే. ఇంటర్నెట్ మొత్తంగా అమెరికా వాణిజ్య మంత్రిత్వ శాఖ నియంత్రణలో నడుస్తోంది. దాని ఆధారంగానే అది అంతర్జాతీయ కేబుల్ నెట్‌వర్కులు, సర్వర్ల నుండి వివిధ దేశాల సమాచారాన్ని తోడేస్తోంది. అందుకో ఇంటర్నెట్ నియంత్రణను అమెరికా వాణిజ్య శాఖ చేతిలో నుండి తొలగించి అంతర్జాతీయ టెలి కమ్యూనికేషన్స్ యూనియన్ (ఐటియు) చేతిలో పెట్టాలని గత ఏడాది దుబాయ్‌లో జరిగిన అంతర్జాతీయ టెలి కమ్యూనికేషన్స్ ప్రపంచ సదస్సు (డబ్ల్యుసిఐటి 2012) పిలుపు నిచ్చింది. 89 దేశాలు సంతకాలు చేసిన ఈ సంయుక్త ప్రకటనపై అమెరికా సంతకం పెట్టలేదు.

ప్రజల హక్కులను, జాతి ప్రయోజనాలను భంగపరిచిన వివిధ ప్రభుత్వాల తప్పుడు నిర్ణయాలను బయటపెట్టిన నిజాయితీ గల అధికారులు వివిధ సందర్భాల్లో కీలక పాత్ర నిర్వహించారు. గతంలో వియత్నాం యుద్ధంలో అమెరికా ప్రభుత్వం తీసుకున్న వివాదాస్పదమైన నిర్ణయాల గురించి 1971లో 'పెంటగాన్ పేపర్స్' పేరుతో బయటపెట్టిన డేనియల్ ఎల్స్‌బెర్గ్, ఇరాక్‌లో అమెరికా సైనిక అకృత్యాలను వికీలీక్స్ సంస్థకు వెల్లడిస్తున్నాడని అరెస్టయిన బ్రాడ్లీ ఎడ్వర్డ్ మానింగ్ తదితరులను అమెరికా కఠినంగా శిక్షించింది. ప్రపంచ వ్యాప్త నిరంకుశ ప్రభుత్వాల మానవ హక్కుల హననాలను, ప్రజా వ్యతిరేక, అవినీతికర విధానాలను బయట పెట్టేందుకు అస్సాంజే సారథ్యంలో వికీలీక్స్ సంస్థలోని సభ్యులు కూడా చారిత్రక పాత్ర నిర్వహించారు. అదే కోవలో తన ప్రాణాలకు ప్రమాదమున్నప్పటికీ ప్రపంచ ప్రజల హక్కుల్ని హరిస్తోన్న అమెరికా దుశ్చేష్టలను బయట పెట్టేందుకు స్నోడెన్ సిద్ధపడడం గొప్ప విషయం. ఆయన సాహసం ప్రపంచ వ్యాప్త హక్కుల సంస్థలకు, ప్రభుత్వ నీతి బాహ్యతను బయటపెట్టేందుకు సిద్ధపడే విజిల్ బ్లోయర్‌లకు స్ఫూర్తిదాయంగా నిలుస్తుంది.

అమెరికన్ సామ్రాజ్యవాదుల అతి నికృష్ట గూఢచర్యంపై ఎడ్వర్డ్ స్నోడెన్ అందచేసిన సమాచారం ప్రపంచ ప్రజల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం పెంచడానికి తోడ్పడుతుందనడంలో సందేహం లేదు. నిజానికి అమెరికా యువకుల్లోనే సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చైతన్యం పెరుగుతోందడానికి నిన్న మానింగ్, నేడు స్నోడెన్‌ల ఉదంతాలు ఉదాహరణలుగా నిలుస్తాయి. ఆఫ్ఘనిస్థాన్, ఇరాక్‌లలో తమ దేశం సాగిస్తోన్న అమానుషాలను వెల్లడించిన మానింగ్ జైలులో అమెరికా పోలీసుల చిత్ర హింసలు ఎదుర్కొంటున్నాడు. ఇప్పుడు స్నోడెన్ ప్రపంచ ప్రజల స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలపై అమెరికా సాగిస్తోన్న దురాగతాన్ని ప్రపంచానికి వెల్లడించేందుకు తన జీవితాన్నే ఫణంగా పెట్టాడు. ఇదంతా యువతలో వస్తున్న చైతన్యం. సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యం. ఇది రానున్న కాలంలో మరింత పెరుగుతుంది. అంతిమంగా సామ్రాజ్యవాదం పతనం కాక తప్పదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు, రాజనీతిశాస్త్ర విద్యార్థి)* వీ

# చెరిపెయ్యలేని గంటి ప్రసాదం ముద్ర

***రాజ్య హింసలో భాగంగా పథకం ప్రకారం హత్యకు గురైన ప్రజాసంఘాల నాయకుడు గంటి ప్రసాదం జీవితాన్ని, కృషినీ వివరిస్తున్నారు ఎన్. వేణుగోపాల్***

సుప్రసిద్ధ మావోయిస్టు సిద్ధాంతకర్త, కార్మికవర్గ నాయకుడు, రచయిత, వక్త గంటి ప్రసాదంను నెల్లూరులో జూలై 4న హత్య చేయడం ద్వారా ప్రజల మీద జరిగే దుర్మార్గాలను ప్రశ్నించేవారందరినీ బెదిరించ గలిగానని రాజ్యం అనుకుంటున్నట్టుంది. ప్రజాస్వామిక వేదికల ద్వారా బహిరంగ ప్రజాకార్యకలాపాలలో ఉన్నవారికి హెచ్చరికగానే ఈ దారుణ హత్యకు పథక రచన జరిగినట్టుంది. కాని ఆయన పొత్తి కడుపులోకి, వెన్నెముకలోకి దూసుకుపోయిన మూడు బుల్లెట్లను తొలగించడానికీ, కొబ్బరికాయల కత్తితో మెడమీద నరికిన గాయానికీ రెండు శస్త్ర చికిత్సలు జరుగుతుండగానే, మరణశయ్య మీదనే ఆయన ఆ హంతకులు తనను వ్యక్తిగా చంపగలరేమో గాని తన స్ఫూర్తిని చంపలేరని అన్నాడు. అంటే ఆ హంతకులూ, వారి వెనుక ఉన్నవారూ తమ దుర్మార్గ చర్య జరిపిన కొద్ది గంటల్లోనే విఫలమయ్యారన్న మాట. అంతే కాదు, ఆ హత్యా స్థలానికి 750 కి.మీ. దూరంలోని బొబ్బిలిలో ఆ మర్నాడు పెద్ద ఎత్తున, ఆశయదీక్షతో జరిగిన అంతిమయాత్ర ఆయన స్ఫూర్తి కొనసాగుతుందని మరొకసారి రుజువు చేసింది.

నిజంగా గంటి ప్రసాదం జీవితం మానవ వైవిధ్యానికీ, బహుముఖ ప్రజ్ఞకూ ఉదాహరణ కాగా ఆయన హత్య రాజ్య హింసకూ, క్రూరత్వానికీ ఉదాహరణ. ఆయన 64 సంవత్సరాల జీవితంలో 45 సంవత్సరాల కన్న ఎక్కువ బహిరంగ, చట్టబద్ధ, ప్రజాస్వామిక సంస్థలలోనూ పనిచేశారు, రహస్య, అజ్ఞాత సంస్థలలోనూ పనిచేశాడు. ఆయన మీద డజన్ల కేసులు బనాయించినప్పటికీ అందులో ఎన్నిటినో న్యాయస్థానాలు కొట్టివేశాయి. దాదాపు మూడు సంవత్సరాలు ఆయన జైలు జీవితం అనుభవించారు. శ్రీకాకుళం జిల్లా (ప్రస్తుతం విజయనగరం జిల్లా) బొబ్బిలి పట్టణంలో 1972లో కార్మికవర్గ కార్యకర్తగా సామాజిక జీవితాన్ని ప్రారంభించిన ప్రసాదం కార్యకలాపాలు దాదాపు అన్ని సామాజిక రంగాలకూ, రాష్ట్రం మొత్తానికీ విస్తరించాయి. ఆయన విద్యార్థులలో, యువజనులలో, రచయితలలో, కార్మికులలో, అమరుల బంధు మిత్రులలో, పార్టీలో, అజ్ఞాత, ప్రత్యామ్నాయ పత్రికలలో, ప్రజాస్వామిక హక్కుల రంగంలో, రాజకీయ ఖైదీలలో పనిచేశారు. మరణించేనాటికి ఆయన ఆంధ్రప్రదేశ్‌లో అమరుల బంధుమిత్రుల సంఘం గౌరవ అధ్యక్షుడిగా, దేశ వ్యాప్తంగా రెవల్యూషనరీ డెమొక్రటిక్ ఫ్రంట్ (ఆర్‌డిఎఫ్) ఉపాధ్యక్షుడిగా, కమిటీ ఫర్ రిలీజ్ ఆఫ్ పొలిటికల్ ప్రిజనర్స్ (సిఆర్‌పిపి) కార్యవర్గ సభ్యుడిగా ఉన్నారు.

బలిజపేట మండలం చాకరపల్లెలో ఒక మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబంలో 1949లో పుట్టిన ప్రసాదం బొబ్బిలి పట్టణంలో తల్లి పుట్టింట చదువుకున్నారు. బైటి ప్రభావాలకు గురయ్యే తొలి యవ్వనంలో ఉండగానే 1960ల చివర ఆయన ఇరుగుపొరుగులలో శ్రీకాకుళ విప్లవోద్యమం ప్రాబల్యంలో ఉండింది. 1970లో డిగ్రీ చదువు పూర్తి చేసుకున్న ప్రసాదం చాల సహజంగా ఆ ఉద్యమంతో ప్రభావితు లయ్యారు. ఆ ప్రాంతంలో తొలి పారిశ్రామిక కేంద్రమైన బొబ్బిలి పట్టణం అప్పుడు చక్కెర, జనుపనార మిల్లులలోనూ, వ్యాపార కార్యకలాపాల లోనూ పనిచేసే వేలాది కార్మికులతో ఉండేది. ఆ నేపథ్యంలో 1972 నాటికే ప్రసాదం ఆ పట్టణంలో కీలకమైన కార్మికవర్గ కార్యకర్తగా మారి మొట్టమొదట కళాసీ సంఘాన్ని స్థాపించారు.

కార్మిక సంఘాల రాజకీయాలలోకి ప్రసాదం ప్రవేశిస్తున్న సమయం లోనే, శ్రీకాకుళంలో విప్లవోద్యమం ఎదుర్కొన్న భారీ నష్టాల తర్వాత నక్సలైట్ శక్తుల పునర్నిర్మాణ ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆ ప్రయత్నాలలో భాగంగా 1970లో ఆవిర్భవించిన విప్లవ రచయితల సంఘం, 1972లో పుట్టిన జననాట్యమండలి నక్సల్బరీ రాజకీయాల నిప్పు చల్లారిపోకుండా కాపాడాయి. సహజంగానే గంటి ప్రసాదం ఈ రెండు సంస్థలలో క్రియాశీలంగా పాల్గొన్నారు. చారుమజుందార్ అనుచరుడైన మామిడి అప్పలసూరి గంటి ప్రసాదానికి రాజకీయ గురువు. అప్పలసూరి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ లెనినిస్ట్) 1970 కాంగ్రెస్‌లో ఎన్నికైన కేంద్ర కమిటీ సభ్యుడు. చారు మజుందార్ మరణం తర్వాత ఆ పార్టీ చీలికలకు గురై, వివిధ రాష్ట్రాల మధ్య సంబంధాలు దెబ్బతిన్నప్పటికీ అప్పలసూరి, కొండపల్లి సీతారామయ్య కలిసి ఆ పార్టీని కొనసాగించడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. 1974 నాటికి ఆ సంబంధాల పునరుద్ధరణ జరిగి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్ట్ లెనినిస్ట్) కేంద్ర ఆర్గనైజింగ్ కమిటీ (సిఒసి) ఏర్పడింది. కార్మిక సంఘాలలో, విరసంలో, జననాట్యమండలిలో ప్రసాదం కృషి ఈ పార్టీ మార్గదర్శకత్వంలోనే సాగింది.

ఒకటి రెండు సార్లు పోలీసు నిర్బంధం, పోలీసులు, మిల్లు యజమానులు సాగించిన దాడులతో ఎమర్జెన్సీ కాలంలో ప్రసాదం అజ్ఞాతవాసంలోకి వెళ్లవలసి వచ్చింది. ఆ క్రమంలోనే 1977లో అరెస్టయి జైలు పాలయ్యారు. విడుదలయ్యే సమయానికి కె ఎస్ కూ అప్పలసూరికీ మధ్య భిన్నాభిప్రాయాలు పెరిగి, చివరికి అప్పలసూరి సిఒసిలో కొనసాగడం, కెఎస్ బైటికి వచ్చి భారత కమ్యూనిస్టు పార్టీ (మార్క్సిస్టు లెనినిస్టు) ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ పేరుతో పని చేయడం జరిగాయి. కెఎస్ నాయకత్వంలోని పార్టీ 1980లో పీపుల్స్ వార్ కాగా, అప్పలసూరి నాయకత్వంలోని పార్టీ 1982లో పార్టీ యూనిటీ అనే పార్టీలో విలీనం అయింది. ఈ కాలంలోనే ప్రసాదం బొబ్బిలిలో గొప్ప ప్రజాదరణ కలిగిన కార్మిక సంఘ నాయకుడిగా ఎదిగారు. ఒక సమయంలో ఆయన హోటల్

కార్మికులు, సినిమా థియేటర్ల కార్మికులు, చక్కెర, జనుపనార మిల్లుల కార్మికులు, కళాసీలు వంటి విభిన్న కార్మిక రంగాలలో దాదాపు 30 సంఘాలను, ఆ కార్మిక సంఘాలన్నిటికీ కలిపి సమన్వయ సమితిని కూడ స్థాపించారు. మామిడి అప్పలసూరి 1997లో చనిపోవడంతో, 1998లో జాతీయ స్థాయిలోనే పార్టీ యూనిటీ, పీపుల్స్ వార్‌లో విలీనం కావడంతో ప్రసాదం పీపుల్స్ వార్‌లో చేరి మరొకసారి అజ్ఞాత వాసం వెళ్లారు. ఈ లోగా ప్రసాదం తమ్ముడు గంటి సుబ్రహ్మణ్యం (రాజన్న, రమేశ్ పేర్లతో ప్రఖ్యాతుడు) అప్పటివరకూ పీపుల్స్ వార్ నాయకులలో ఒకరుగా ఉండి, 1998 ఆగస్ట్‌లో ఒరిస్సాలోని రాయగడ జిల్లా కోపర్‌డంగ్ ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యారు. ప్రసాదం పీపుల్స్ వార్‌లో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ సభ్యుడిగా అజ్ఞాతవాసంలోని ప్రచురణల బాధ్యత, ప్రధానంగా రాష్ట్ర కమిటీ అధికారపత్రిక క్రాంతి బాధ్యత తీసుకున్నారు. ఆ పార్టీ భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) గా మారినతర్వాత కూడ 2005 మేలో అరెస్టయ్యే వరకూ ప్రసాదం ఆ బాధ్యతలను నిర్వహించారు.

ప్రసాదం అజ్ఞాతవాసానికి వెళ్లినప్పుడు ఆ పార్టీ మీద నిషేధం ఉండింది. కాని ఆ పార్టీతో రాష్ట్ర ప్రభుత్వం చర్చలు జరిపిన సందర్భంలో 2004 జూలైలో ఆ నిషేధాన్ని సడలించారు. ప్రభుత్వానికీ పార్టీకీ మధ్య మొదటి విడత చర్చలు 2004 అక్టోబర్‌లో జరిగాయి. ప్రభుత్వం కాల్పుల విరమణ ఒప్పందాన్ని ఉల్లంఘించి నిర్బంధాన్ని, బూటకపు ఎన్‌కౌంటర్లను ప్రారంభించడంతో నవంబర్‌లో జరగవలసిన రెండో విడత చర్చలు జరగ లేదు. చివరికి తాను కూడ కాల్పుల విరమణ ఒప్పందం నుంచి ఉపసంహరించుకుంటున్నానని 2005 జనవరిలో మావోయిస్టు పార్టీ ప్రకటించింది. ఆ నేపథ్యంలో పార్టీ రాష్ట్రంలోని రాజకీయ, సామాజిక స్థితిగతులను ప్రత్యక్షంగా తెలుసుకుని అంచనా వేసే పనిని ప్రారంభించింది. పార్టీ అధికార ప్రతినిధిగా, క్రాంతి సంపాదకుడిగా ప్రసాదం ఉద్యమ సానుభూతి పరుల నుంచి సమాచారం సేకరించే పని మొదలుపెట్టారు. అప్పటికే రాష్ట్రంలో దమనకాండ పెచ్చరిల్లి పోవడంతో తాను కలవదలచిన వాళ్లను రాష్ట్రంలో కలవలేనని ఆయన అనుకున్నారు. విరసం సభ్యులు నలుగురిని మహారాష్ట్రకు వచ్చి తనను కలవమని ఆహ్వానించారు. మహారాష్ట్రలోని ఔరంగాబాదులో రాష్ట్ర ప్రభుత్వ పర్యాటక శాఖ నడిపే గెస్ట్‌హౌజ్‌లో ఆ మూడు రోజుల సమావేశం రెండో రోజు ముగుస్తుండగా పోలీసులు విరుచుకుపడ్డారు. వారందరి కళ్లకు గంతలు కట్టి, పెడరెక్కలు విరిచికట్టి, మూడు రోజుల పాటు అక్రమ నిర్బంధంలో చిత్రహింసలు పెట్టారు, వేధించారు. ఆ తర్వాత వారి మీద ఔరంగాబాదు కుట్రకేసు బనాయించి నిజామాబాదు జైల్లో నిర్బంధించారు. నిజానికి అప్పటికి పార్టీ మీద నిషేధం లేదు. పార్టీ నాయకులు ఇతరులను కలుసుకోవడం చట్టవ్యతిరేకమూ, కుట్రపూరితమూ కాదు. ఆ కేసులో ఆయన జైల్లో ఉండగానే ఆయన మీద పోలీసు స్టేషన్ల మీద దాడి, పోలీసు అధికారుల మీద హత్యా ప్రయత్నం వంటి మరెన్నో కేసులలో నేరారోపణలు మోపారు. కాని ఔరంగాబాదు కుట్ర కేసులోనూ, ఇతర అన్ని కేసులలోనూ ఆయన నిర్దోషి అని ఆయా న్యాయస్థానాలు ఆ కేసులను కొట్టివేశాయి.

ఆ కేసు విచారణలు జరుగుతుండగానే 2006 చివరిలో ఆయన బెయిల్ మీద విడుదలయ్యారు. అప్పటినుంచీ బహిరంగ జీవితంలోనే పనిచేస్తున్నారు. అమరుల బంధుమిత్రుల సంఘంలో చేరి దాని అధ్యక్షుడయ్యారు. ఆ బాధ్యతలో ఆయన ఎక్కడ బూటకపు ఎన్‌కౌంటర్ జరిగినా వెంటనే అక్కడికి వెళ్లేవారు. ఆ ఎన్‌కౌంటర్ ఎలా బూటకమో, వాస్తవానికి ఉద్దేశపూర్వకంగా పోలీసులు విప్లవ కార్యకర్తలను, ప్రజలను పట్టుకుని చంపి ఎన్‌కౌంటర్ కట్టుకథలు అల్లుతున్నారో నిజాలు విప్పి చెప్పేవారు. మృతుల కుటుంబ సభ్యులకు, బంధుమిత్రులకు ఆశ్వాసం ఇచ్చేవారు. మృతదేహాలకు గౌరవప్రదమైన అంత్యక్రియలు జరిపించేవారు. అమరుల స్మారక సభలు, సమావేశాలు నిర్వహించేవారు. ఆ విధంగా ఆయన, అమరుల బంధుమిత్రుల సంఘంలోని ఆయన సహచరులు పోలీసుల కంట్లో నలుసుగా మారారు. ఆయన అరెస్టయ్యే వరకూ పార్టీ అధికారప్రతినిధిగా ఉండేవారు గనుక, విప్లవ ప్రజా సంఘాలన్నీ కూడ తమ కార్యాచరణలో సలహాలకూ మార్గదర్శకత్వానికీ ఆయన వైపు చూసేవి. ఇదంతా పోలీసులకు కన్నెర్రకు కారణమయింది. ఆయనను మరిన్ని కేసులలో ఇరికించి ఆయన ప్రజా ఉద్యమాలలో లేకుండా చూడడానికి, ఆయన సమయమంతా న్యాయస్థానాల చుట్టూ తిరగడంలోనే వృథా అయిపోవడానికి పన్నాగాలు పన్నారు. కొత్త కొత్త కేసులు పెట్టి ఆయన కదలికలపై ఆంక్షలు విధించి ఆయనను మరింతకాలం జైలు నిర్బంధం పాలు చేయడానికి ప్రయత్నించారు.

భారత కమ్యూనిస్టు పార్టీ (మావోయిస్టు) కేంద్ర కమిటీ సభ్యుడు, 2004 చర్చలలో ప్రధాన పార్టీ ప్రతినిధి రామకృష్ణ సహచరి, మరికొందరు ఒరిస్సా అడవులలోకి వెళ్తుండగా కోరాపుట్ జిల్లా సిమ్లి గూడ దగ్గర 2010 అక్టోబర్ 13న వారిని అడ్డగించి పట్టుకున్నామని చెప్పిన పోలీసులు, వారిని ప్రసాదం పంపుతున్నాడని అబద్ధపు కేసు బనాయించి చట్టవ్యతిరేక కార్యకలాపాల నిరోధ చట్టం కింద మరొకసారి నిర్బంధించారు. ఆయన జైలులో ఉండగానే మావోయిస్టు గెరిల్లాలు మల్కన్ గిరి కలెక్టర్ వినీల్ కృష్ణను బందీగా పట్టుకున్నారు. ఆ తర్వాత చర్చలను కొనసాగించడానికి ఒక ప్రతినిధిగా ప్రసాదం వ్యవహరించ వచ్చునని ప్రతిపాదన వచ్చింది. ఆ సమయంలో మధ్యవర్తులు ప్రొఫెసర్ హరగోపాల్, దండపాణి మొహంతీ భువనేశ్వర్ జైలులో ప్రసాదంను కలిసి మాట్లాడారు. అప్పుడు ప్రసాదం ఎంత సానుకూలంగా, మానవీయంగా స్పందించారో హరగోపాల్ ఇప్పటికే రాశారు. ప్రసాదంను విడుదల చేయాలనేది పార్టీ డిమాండ్లలో ఒకటి కాగా, తప్పుడు కేసులలో తనతోపాటు జైలులో ఉన్న వందలాది మంది ఆదివాసి ఖైదీలు విడుదల కాకుండా తాను విడుదల కాబోనని ప్రసాదం నిక్కచ్చిగా చెప్పారు. అలాగే ఆదివాసులు విడుదలయ్యాకనే కొన్ని నెలల తర్వాత బెయిల్ పై బైటికి వచ్చారు.

ఆతర్వాత అమరుల బంధుమిత్రుల సంఘంలో తన కార్యాచరణను కొనసాగించడం మాత్రమే కాదు, ఆర్‌డిఎఫ్ లోనూ, సిఆర్‌పిపి లోనూ పనిచేయడం ప్రారంభించారు. హైదరాబాదులో 2012 ఏప్రిల్‌లో ఆర్‌డిఎఫ్ తొలి మహాసభలు జరిగినప్పుడు దాని ఇద్దరు ఉపాధ్యక్షులలో ఒకరుగా ఎన్నికయ్యారు. నాలుగు నెలలు గడవకుండానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆ సంస్థను నిషేధించింది. అలాగే ఆయన సిఆర్‌పిపిలో క్రియాశీలంగా పని చేస్తూ రాష్ట్రంలోని జైళ్లలో ఉన్న ఎంతోమంది రాజకీయ ఖైదీలను కలుస్తూ, వారి అవసరాలు తీరుస్తూ వచ్చారు.

ప్రసాదం మంచి రచయిత, సాంస్కృతిక కార్యకర్త కూడ. నిజానికి ఆయన సామాజిక జీవితం తొలిరోజుల్లో ఆయన కవితా రచన చేశారు. వేదికల మీద పాటలు పాడేవారు, క్రమక్రమంగా సైద్ధాంతిక విశ్లేషణాత్మక

చర్చా రచనలోకి మళ్లారు. క్రాంతిలో ఆయన పేరు లేకుండా చేసిన రచనలెన్నిటినో ఆయన శైలి తోనే పోల్చుకోవాలి. వాటితోపాటు ఆయన పేరుతోనో, కలం పేర్లతోనో చేసిన రచనలు ఇతర పత్రికల్లో కూడ అచ్చయ్యాయి.

రెండు సంవత్సరాలకు అటూ ఇటూగా జైలు జీవితాన్ని మినహాయిస్తే, గత ఎనిమిది సంవత్సరాల బహిరంగ ప్రజాజీవితం మొత్తమూ ప్రతి నిమిషమూ ఆయన ప్రజా కార్యాచరణకే వెచ్చించారు. రచించడం, ప్రజలను ప్రోత్సహించడం, ప్రేరణనందించడం, సమీకరించడం, అర్థవంతమైన ఆచరణలోకి వారిని సంఘటితం చేయడం, సభలలో, సమావేశాలలో ఉపన్యసించడం, ధర్నాలలో, నిరసన కార్యక్రమాలలో పాల్గొనడం, ఎన్‌కౌంటర్ మృతుల శవపరీక్షలను పర్యవేక్షించడం, అమరుల మృతదేహాలను స్వాధీనం చేసుకుని వారి కుటుంబాలకు అప్పగించడం, అమరవీరులకు మానవీయమైన, గౌరవప్రదమైన అంత్యక్రియలు జరిపించడం వంటి ఎన్నో కార్యక్రమాల్లో ఆయన తలమునకలుగా ఉండేవారు.

ఆయన జీవితంలోని చివరి మూడు రోజులు చూస్తే ఆయన ఎటువంటి జీవితం గడిపారో అర్థమవుతుంది: జూలై 2న ఆయన హైదరాబాదులో రైల్వే కార్మికుల సమావేశంలో పాల్గొన్నారు. ఆ కార్మికులకూ యాజమాన్యానికీ జరగనున్న చర్చలలో వారు ఎలా వ్యవహరించవలసి ఉంటుందో సలహాలు సూచనలూ అందించారు. ఆ సమావేశం ముగిశాక ఒక బస్సు పట్టుకుని గుంటూరు వెళ్లారు. అక్కడ ఉపాధ్యాయుడిగా పదవీ విరమణ పొందాక విప్లవోద్యమ అజ్ఞాత జీవితంలోకి వెళ్లి అక్కడ రహస్య పత్రికల బాధ్యతలు చూసిన సీనియర్ రచయిత ఆలూరి భుజంగ రావు సంస్మరణ సభలో ఆయన ఉపన్యసించవలసి ఉంది. ఆ సభ అయిపోయాక ఆ రాత్రి గుంటూరులో గడిపి మర్నాడు ఉదయమే మరొక బస్సు పట్టుకుని నెల్లూరు వెళ్లారు. అక్కడ ఎన్నో సంవత్సరాల కింద జరిగిన కూటాలమర్రి బూటకపు ఎన్‌కౌంటర్‌లో మరణించిన అమరవీరుల స్మృతిలో వారి కుటుంబ సభ్యులు, మిత్రులు ప్రతి సంవత్సరం జరిపే సంస్మరణ సభలో ఆయన ఉపన్యసించవలసి ఉంది. జూలై 4 విప్లవ రచయితల సంఘం ఆవిర్భావ దినం కూడ కనుక ప్రతి సంవత్సరం కూటాలమర్రి అమరుల సంస్మరణ సభతో పాటే విరసం కూడ సదస్సు నిర్వహిస్తుంది. ఆ ఉదయం సదస్సులో ప్రసాదం ఆలూరి భుజంగ రావు గురించి మాట్లాడారు. కూటాలమర్రి అమరులలో ఒకరి సోదరి ఆస్పత్రిలో చివరిదశలో ఉన్నదని ఆమెను పరామర్శించడానికి భోజన విరామ సమయంలో ఆస్పత్రికి వెళ్లారు. ఆ ఆస్పత్రి నుంచి బైటికి వచ్చి కొద్ది అడుగులు వేయగానే హంతకులు ఆయనపై దాడి చేశారు. అతి సమీపం నుంచి ఆయన శరీరంలోకి మూడు తుపాకి గుళ్లు దించారు. అప్పటికీ చావును తప్పించుకుంటారేమో అని అనుమానించినట్టుగా పక్కనే ఉన్న కొబ్బరి కాయల బండి మీది నుంచి కత్తి తీసుకుని మెడ నరికారు. ఆయనను వెంటనే ఆస్పత్రికి తరలించగా వైద్యులు వరుసగా రెండు శస్త్ర చికిత్సలు చేసి తుపాకి తూటాలను శరీరం నుంచి తొలగించారు. ఆ శస్త్రచికిత్సలు జరుగుతున్నంతసేపూ ఆయన స్పృహలో, వైద్యులతో మాట్లాడుతూనే ఉన్నారు.

ప్రజా కార్యాచరణలో ఈ నిరంతర కృషి, విప్లవ రాజకీయాల పట్ల అకుంఠిత నిబద్ధత వల్ల ప్రసాదం పాలకవర్గాల ఆగ్రహానికి, ప్రత్యేకించి ఆంధ్ర ప్రదేశ్ పోలీసుల ఆగ్రహానికి గురి కావడం సహజమే. నిజానికి బహిరంగ ప్రజాజీవితంలో తమను వ్యతిరేకించే గొంతులను చట్ట వ్యతిరేకంగా తెగగోయడంలో ఆంధ్రప్రదేశ్ పోలీసుల చరిత్ర కూడ సుదీర్ఘమైనదే. దారుణమైనదే. సాయుధ విప్లవోద్యమ కార్యకర్తలను నిరాయుధంగా ఉన్నప్పుడు పట్టుకుని ఉద్దేశపూర్వకంగా మట్టుపెట్టడానికి వారు ఎన్‌కౌంటర్ అనే పేరు వ్యాప్తిలోకి తెచ్చారు. (నిజానికి 1969లో జరిగిన ఒకానొక తొలి ఎన్‌కౌంటర్ సందర్భంగా స్వయంగా హోం మంత్రి వాడిన మాట 'మట్టు పెట్టండి' అని). ఇక బహిరంగ జీవితంలో ఉన్న ప్రముఖ వ్యక్తులను, తమ పక్కలో బల్లెంలా ఉన్నవారిని హతమార్చడానికి పోలీసులు మరొక పద్ధతి కనిపెట్టారు. నిర్దాక్షిణ్యమైన కిరాయి హంతక ముఠాలను ఉపయోగించి తమ చేతికి మట్టి అంటకుండా ప్రత్యర్థులను మట్టు పెట్టడమే ఆ పద్ధతి. ఈ పద్ధతిలో రాజ్యం హత్య చేసిన బహిరంగ జీవితపు ప్రముఖ వ్యక్తుల జాబితా చాల పెద్దది. అందులో న్యాయవాదులు గోపి రాజన్న, నర్రా ప్రభాకర రెడ్డి, టి పురుషోత్తం, సమాజమంతా గౌరవించిన వైద్యులు డా. ఎ రామనాథం, డా. ఆమెడ నారాయణ, రైతులు, ప్రజా ఉద్యమ నాయకులు జాపా లక్ష్మారెడ్డి, కళింగ రావు, ఉపాధ్యాయులు ఆజం అలీ, కనకాచారి, గాయకులు బెల్లి లలిత, ఐలయ్య, దళిత కార్యకర్తలు మునెప్ప, మన్నెం ప్రసాద్ వంటి ఎందరో ఉన్నారు. డజన్లకొద్దీ హత్యా ప్రయత్నాలు, బెదిరింపులు ఈ జాబితాకు కలుపుకోవాలి. ఈ హత్యల జాబితాలో మొట్టమొదటిది 1984లో జరగగా చివరిది 2005లో జరిగింది. అయితే వీటిలో ఏ ఒక్క సందర్భంలోనైనా నేర పరిశోధన జరగలేదు. న్యాయస్థానంలో విచారణ జరగలేదు. హంతకులకు శిక్షలు పడలేదు. అసలు హంతకులెవరో తెలియలేదు. ప్రతి సందర్భంలోనూ అప్పటికప్పుడు పుట్టుకొచ్చిన ఏదో ఒక సంస్థ పేరుతో ఆ హత్య తామే చేశామని ప్రకటనలు వచ్చాయి. కాని పోలీసులు ఒక్క సందర్భంలో కూడ ఆ ప్రకటనల మీద పరిశోధన జరపలేదు. ఆ సంస్థల వెనుక ఎవరు ఉన్నారో విప్పిచెప్పలేదు. ఈ హత్యల పథక రచయితలు, కిరాయి హంతకుల ప్రోత్సాహకులు, పరిరక్షకులు, పెద్ద దిక్కు పోలీసు పెద్దలు మాత్రమేనని రాష్ట్రంలో ప్రతి ఒక్కరికీ తెలుసు. ఈ చరిత్రనంతా పరిగణనలోకి తీసుకున్నప్పుడు, ఒక కుహనా సంస్థ తామే హత్య చేశామని ప్రకటించినప్పటికీ, గంటి ప్రసాదంను పోలీసులే హత్య చేయించి ఉంటారని ప్రతి ఒక్కరూ అనుమానిస్తున్నారు. ఈసారి మరింత విచిత్రంగా ఆంధ్రప్రదేశ్ పోలీసు అధికారుల సంఘం తమ పాత్రను నిరాకరిస్తూ ఒక ప్రకటన ఇచ్చింది గాని ఆ ప్రకటన నిస్సందేహమైన బెదిరింపుతో ముగిసింది.

రచనలు, ఉపన్యాసాలు, ఒక బలమైన ప్రజా సంఘం, ఆదర్శప్రాయమైన మానవసంబంధాలు వంటి విస్పష్టమైన, సుదీర్ఘకాలం నిలిచి ఉండే వారసత్వాన్ని ప్రసాదం వదిలిపోయారు. 'నన్ను బతికించండి. నాకు బతకాలని ఉంది. విప్లవం కోసం బతకాలని ఉంది' అనీ, 'బహుశా నేను చనిపోతానేమో. కాని అది ఒకానొక వ్యక్తి మరణం మాత్రమే. నా ఆశయం మిగిలే ఉంటుంది' అనీ ఆయన మృత్యుశయ్య మీద పలికిన అత్యంత విలువైన మాటల్లో కూడ ఆయన వారసత్వాన్ని మిగిల్చారు. ఆ మాటలు మిగిలే ఉంటాయి. ఈ హత్యలో నిస్సందేహంగా కనబడుతున్న హంతక రాజ్యపు హస్తం ఆ వారసత్వాన్ని ఎంత మాత్రం చెరిపివేయజాలదు.

*(ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ, జూలై 27, 2013 సంచికలో అచ్చయిన వ్యాసానికి అనువాదం)*

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

వీ

# వ్యవసాయం కార్పొరేట్ శక్తులకు ధారాదత్తం

***ఆహార భద్రత పేరుతో వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్, బహుళజాతి కంపెనీలకు కట్టబెట్టి ఇదే అభివృద్ధిగా ప్రచారం చేసుకుంటూ పాలకులు తమ బాంకు రాజకీయాలను నడుపుతున్నారంటున్నారు*** **పి.వి. రమణ**

కాంగ్రెస్ పార్టీ నాయకత్వంలోని యుపిఎ ప్రభుత్వం జాతీయ ఆహార భద్రతా ఆర్డినెన్స్ విడుదల చేస్తూ పేదరికాన్ని తొలగించడానికి అమలు చేసిన పథకాల్లో ఇది ప్రపంచంలోనే అతి పెద్ద పథకమని ప్రకటించింది. దీనిపై రాష్ట్రపతి జూలై 5న సంతకం చేశారు. దీనిని ఆరు నెలల లోపున పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి ఆమోదముద్ర పొందాల్సి ఉంది. రాబోయే ఎన్నికలలో తిరిగి అధికారంలోకి రావడానికి, పేద ప్రజల నుండి ఓట్లు రాబట్టడానికి ఈ ఆర్డినెన్స్ బ్రహ్మాండంగా ఉపయోగ పడుతుందని, కాంగ్రెస్ పార్టీ దీన్ని విడుదల చేసిందని సులువుగానే అర్థమవుతుంది.

'2009లో కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళికలో చేసిన వాగ్దానాన్ని అమలు చేస్తున్నామనీ, ఈ బిల్లు దేశ ప్రజల జీవితాల్ని రక్షిస్తుందనీ, చాలా మంది జీవితాల్ని మార్చేస్తుందనీ, అమలు ఒక్కరోజు ఆలస్యమైనా ఎన్నో జీవితాలు నాశనమయిపోతాయనీ' కాంగ్రెస్ పార్టీ జనరల్ సెక్రటరీ అజయ్ మాకెన్ అంటూ అసలు రహస్యాన్ని బయటపెట్టారు. 'కాంగ్రెస్ తన వాగ్దానాన్ని నిలబెట్టుకొందనీ, దీంతో ప్రజలకు కాంగ్రెస్‌పై నమ్మకం పెరుగుతుందనీ, మధ్యప్రదేశ్, చత్తీస్‌గడ్, ఢిల్లీ, రాజస్థాన్‌లలో నవంబర్, డిసెంబర్‌లలో జరగబోయే ఎన్నికలలో దీని ఫలితాన్ని చూస్తాం' అన్నారు.

సోనియా గాంధీ ఛైర్‌పర్సన్‌గా ఉన్న దేశంలో అత్యంత శక్తిమంతమైన నేషనల్ అడ్వైజరీ కౌన్సిల్ (ఎన్ఎసి) ప్రతిపాదించిన ఈ ఆహార భద్రతా బిల్లులో ఈ విధంగా పేర్కొన్నారు. గత దశాబ్దాలలో దేశంలో ఎంతో ఆర్థికాభివృద్ధి సాధించినప్పటికీ అది పూర్తిగా విజయవంతమైందని రుజువు కాలేదు. దీనికి కారణం ఇప్పటికీ దేశంలో 22 శాతం ప్రజలు పోషకాహార లోపంతో జీవిస్తున్నారు. నేషనల్ ఫామిలీ హెల్త్ సర్వే 2005-06 ప్రకారం దేశంలో 40.4 శాతం మూడు సంవత్సరాల లోపు పిల్లలు సరైన ఎదుగుదల లేక తక్కువ బరువుతో ఉన్నారు. 15 నుండి 49 సంవత్సరాల వయస్సు గల స్త్రీలలో 33 శాతం ఆరోగ్య స్థితి ఉండవలసిన స్థాయి కన్నా దిగువ స్థాయిలో ఉంది. 6 నుండి 35 నెలల వయస్సు గల పిల్లలు 78.9 శాతం రక్తహీనతతో ఉన్నారు. ఇటువంటి కలవరపరిచే లెక్కలన్నీ పోషకాహార లోపాన్ని స్పష్టం చేస్తున్నాయి. ఈ సమస్యను పరిష్కరించడానికే జాతీయ సలహా సంఘం ఈ జాతీయ ఆహార భద్రతా బిల్లును ప్రవేశ పెడుతుందని, ఈ బిల్లు విప్లవాత్మకమైన మార్పులు తెస్తుందని పేర్కొన్నారు.

**బిల్లు లక్ష్యాలుగా పేర్కొన్న ఇతర అంశాలు**

రాజ్యాంగంలో ఆర్టికల్ 47 ప్రకారం, ప్రజల పోషకాహార అవసరాలను గుర్తిస్తూ, వారి జీవన ప్రమాణాలను, ఆరోగ్య సూచికలను పెంచడం రాజ్యం బాధ్యత. అలాగే ఐక్య రాజ్య సమితి ప్రకటించిన 'మిలీనియం డెవలప్‌మెంట్ గోల్స్' ప్రకారం ఆకలిని, పేదరికాన్ని తొలగించాలి. రాజ్యాంగం అప్పగించిన కర్తవ్యాలను, అంతర్జాతీయ సంస్థలు కోరుతున్న ఆహార భద్రత భారత ప్రభుత్వాన్ని కర్తవ్య నిర్వహణకు పురిగొల్పింది.

సెక్షన్ 39 ప్రకారం, వ్యవసాయ రంగంలో పెట్టుబడులు అధికం చేస్తూ, పరిశోధన, అభివృద్ధితో పాటు, గిట్టుబాటు ధరలు, రైతులకు రుణాలు, పంటల ఇన్సూరెన్స్‌ల ద్వారా వ్యవసాయ రంగాన్ని పునరుజ్జీవింప చేయడమే లక్ష్యం. ఆహార ధాన్యాల కొనుగోలు, నిలవ, రవాణాల విషయంలో శాస్త్రీయ పద్ధతులను అమలు చేయడం.

క్లాజ్ నెం. 18 ప్రకారం ప్రజాపంపిణీ వ్యవస్థను అధునాతన సాంకేతిక, సమాచార పరిజ్ఞానాన్ని జోడించి అభివృద్ధి చేస్తూ, ఆధార్ కార్డ్ ద్వారా లబ్ధిదారులకు చట్టపరంగా అందవలసిన వాటిని సక్రమంగా అందేటట్లు చేయడం. బాధ్యతతో కూడిన ప్రమాణాలతో అవసరమైన తాగునీరు, సానిటరీ సౌకర్యాలు, పోషకాహారం, ఆరోగ్యం, విద్యతో పాటు ఎదుగుతున్న ఆడపిల్లలకు, వృద్ధులకు, అంగవైకల్యం ఉన్నవారికి, ఒంటరి స్త్రీలకు అవసరమైన సహకారాన్ని అందించడం.

సెక్షన్ 31 ప్రకారం ఒకవేళ కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు అవసరమైన సరఫరా చేయలేకపోతే, ఆ మేరకు కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు డబ్బు చెల్లిస్తుంది. రాష్ట్ర ప్రభుత్వాలు కూడా సరఫరా అమలు చేయలేకపోతే లబ్ధిదారులకు 'ఆహార భద్రతా అలవెన్స్'ను చెల్లిస్తారు. దీన్ని ఎంత చెల్లిస్తారో, ఎలా చెల్లిస్తారో, చెల్లించడానికి అవసరమైన వ్యవస్థ ఏమిటో వీటి గురించి బిల్లులో స్పష్టత లేదు.

క్లాజ్ 52 ప్రకారం, వరదలు, తుపానులు, అగ్ని ప్రమాదాలు, భూకంపాలు, యుద్ధాలు కారణంగా ప్రజలకు ఆహార ధాన్యాలు సరఫరా చేయలేకపోయినపుడు, ఆహారం అందించలేకపోయినపుడు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యులు కారు. వారిపై చట్ట ప్రకారం ఎటువంటి చర్యలు తీసుకొనే అవకాశం లేదు.

సెక్షన్ 13 ప్రకారం లబ్ధిదారులు పొందవలసిన ఆహార ధాన్యాలు పొందలేకపోతే వారు రాష్ట్ర ప్రభుత్వాల ద్వారా 'ఆహార భద్రతా అలవెన్స్' పొందడానికి అర్హులు. కేంద్ర ప్రభుత్వం నిర్ధారించిన రేట్ల ప్రకారమే అలవెన్స్‌లు చెల్లిస్తారు గాని లబ్ధిదారులు మార్కెట్‌లో కొనుగోలు చేసే రేట్లను చెల్లించరు.

పేదరికాన్ని తగ్గిస్తామని ఇప్పటికే అనేక సంక్షేమ పథకాలు అమలు చేశారు. అవన్నీ పేదరికాన్ని తగ్గించలేదు సరికదా మరింత పెంచాయని రుజువయింది. ఈ పథకాల పేరుతో వేల కోట్ల రూపాయలు ఖర్చు

చేస్తూ, దాంట్లో అధిక భాగం కాంట్రాక్టర్లు, దళారీలు, రాజకీయ పార్టీల నాయకులు, అధికారులు పందికొక్కుల్లా తినేస్తున్నారు. సంక్షేమ పథకాల ముసుగు తొలగిపోవడంతో కొత్తగా నగదు బదిలీ పథకాలు, ఆహార భద్రతా కార్యక్రమాల రూపంలో మొదలు పెడుతున్నారు. నూతన ఆర్థిక విధానాల పేరిట ఇప్పటికే నాశనం చేసిన వ్యవసాయ రంగాన్ని పేదలకు ఆహార భద్రత పేరుతో, అధికోత్పత్తి పేరుతో సామ్రాజ్యవాద శక్తులకు, బహుళజాతి కంపెనీలకు కాంట్రాక్టు వ్యవసాయం పేరుతో పంట భూములన్నింటినీ అప్పజెప్పాలనే కుట్ర దీనిలో ఉంది.

ఇప్పటికే ఆహార సబ్సిడీల కోసం రు. 67,310 కోట్లు ఖర్చు చేస్తున్నారు. ఈ ఆహార భద్రతా బిల్లు అమలుకు అదనంగా మరో 30 వేల కోట్ల రూపాయలు ఖర్చు పెడతారు. కార్పొరేట్ శక్తులకు కార్పొరేట్ ఇన్‌కం టాక్స్, ఎక్సైజ్ డ్యూటీ, కస్టమ్స్ డ్యూటీలకు సబ్సిడీల రూపంలో 2011-12 ఆర్థిక సంవత్సరంలో 6.22 లక్షల కోట్ల రూపాయలు సమర్పించారు. గత ఆరు సంవత్సరాలలో 23 లక్షల కోట్ల రూపాయలను కార్పొరేట్లకు సమర్పించిన మన పాలకులు ఈ ఆహార భద్రతా బిల్లును బ్రహ్మాండంగా ప్రచారం చేస్తున్నారు. ఈ బిల్లు కయ్యే ఖర్చు కార్పొరేట్లకు సమర్పించే దానిలో కేవలం 5వ వంతు మాత్రమే.

ఇందిరాగాంధీ ప్రధానమంత్రిగా ఉన్నప్పుడు పేద వర్గాలకు గేదెలు, గొర్రెలు లాంటివి ఉచితంగా ఇవ్వడంతో ప్రారంభమైన ఈ తతంగాలు నేడు, టివిలు, గ్రైండర్లు, ల్యాప్‌టాప్‌ల వరకూ చేరుకున్నాయి. రూపాయికి కిలో బియ్యం లాంటి పథకాలతో పాటు ఇతర సంక్షేమ పథకాలకు ఖర్చయ్యే సొమ్మంతా ప్రజల సొమ్మే అనేది మరచిపోరాదు. ఈ విధానాలతో ప్రజలను నిరంతరం ప్రభుత్వం విదిలించే మెతుకుల కోసం ఆధారపడే సమూహాల్ని తయారు చేయడమే ప్రధాన ఉద్దేశం.

ఈ బిల్లుపై స్పందిస్తూ 'ఈ పథకం లబ్ధిదారుల్లో దాదాపు సగం మంది రైతులే. అంటే రైతు వద్ద పండించిన ధాన్యాన్ని రైతులకే ఇస్తారన్న మాట. ఇలా లక్షల కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి చౌకధరలకు తిండి గింజలు అందించే బదులు వ్యవసాయ సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంపొందించుకోవచ్చు. చిన్న చిన్న సాగునీటి ప్రాజెక్టులు నిర్మించవచ్చు. అప్పుడు రైతులు చవకగా లభించే సరుకుల కోసం ఆశించే పరిస్థితికి బదులు, తమను తాము పోషించుకుంటారు' అని భారతీయ కృషక్ సమాజ్ అధ్యక్షుడు అజయ్ ఝాకర్ అన్నారు.

తక్కువ దిగుబడి, సాగునీటి వసతి లేమి, యాంత్రీకరణలో వెసులు బాటు, మౌలిక సదుపాయాల కొరత, వీటన్నిటి నేపథ్యంలో వ్యవసాయం సంక్షోభం ఎదుర్కొంటుంటే, ఈ సమస్యల్ని పరిష్కరించకుండా నేరుగా రైతుల సంచిలో తిండి గింజలు వేసి అదే గొప్పగా చెప్పుకోవడమేమిటని అనేక వ్యవసాయ నిపుణులు ప్రశ్నిస్తున్నారు. బియ్యం, గోధుమలు ఇస్తే సరిపోతుందా? వంట చెరుకు, వంట నూనె, వస్త్రాలు, సబ్బులు, గృహ వసతి, చవుక రవాణా సౌకర్యాలు, తాగునీరు, విద్యుత్తు తక్కువ ధరలకు ఎవరు సమకూరుస్తారని కూడా అడుగుతున్నారు.

ఈ బిల్లు వలన సాధారణ రైతు రూపాయికి కిలో బియ్యం పొందుతున్నప్పుడు, బాధలు పడి వ్యవసాయం ఎందుకు చేస్తాడు? పంటలు సరిగ్గా పండకపోతే అప్పుడేం చేస్తారు? అంటూ సాక్షాత్తూ పాలకవర్గ భాగస్వామి అయిన ఆహార శాఖా మంత్రి శరద్ పవార్ చిరాకు పడ్డారు. లక్షలాది మంది రైతుల ఆత్మహత్యలకు కారణమైన ఈ నాయకుడికి రైతుల పట్ల ఇంతకన్నా మంచి అభిప్రాయముండే అవకాశం లేదని మనకు తెలుసు.

ఈ సంవత్సరం బడ్జెట్‌లో ఆహార భద్రత కోసం అదనంగా కలిపిన పదివేల కోట్ల రూపాయలతో పాటు మొత్తం ఆహార సబ్సిడీ కోసం 90 వేల కోట్ల రూపాయలు కేటాయించారు. కాని ఆహార మంత్రిత్వ శాఖ అంచనా ప్రకారం ఈ బిల్లు అమలు వలన దాదాపు 1.3 లక్షల కోట్ల రూపాయలు ఖర్చు అవుతుందని అంచనా. కమిషన్ ఆన్ అగ్రికల్చరల్ కాస్ట్స్ అండ్ ప్రైసెస్ అంచనా ప్రకారం ఈ పథకం అమలుకు మొదటి సంవత్సరం రు. 2.41 లక్షల కోట్లు, మూడు సంవత్సరాల తర్వాత ఆహార ఉత్పత్తిని పెంచడానికి అవసరమైన ఖర్చు రు. 1.1 లక్ష కోట్లుతో కలిపి రు. 6.82 లక్షల కోట్లు కేటాయించాలి.

### వ్యవసాయ రంగంలో జరిగిన విధ్వంసం

ఎన్‌డిఎ హయాంలో వాజ్‌పేయి అధికారంలోకి రాగానే ప్రపంచ బ్యాంక్ మన దేశ వ్యవసాయ రంగంలో చేయాల్సిన మార్పులు గురించి చాలా స్పష్టమైన ఆదేశాలిచ్చింది. వాటిలో 1) ఎక్కువ లాభాలు రాని పంటలను తగ్గించాలి. 2) ఎగుమతులకు అవసరమైన పంటలు పండించి, అవసరమైన ఆహార ధాన్యాలను దిగుమతి చేసుకోవాలి. 3) వ్యవసాయంలో విదేశాలతో పోటీ పడాలి. 4) ఎరువులు, విత్తనాలు, నీరు, రుణాలు వంటి అంశాలలో ఇస్తున్న సబ్సిడీలను పూర్తిగా తగ్గించాలి. 5) ఇక్కడ పండించిన పంటల ఎగుమతులపై ఎట్టి అడ్డంకులు ఉండరాదు. 6) విదేశాల నుండి వ్యవసాయ ఉత్పత్తుల దిగుమతులపై ఎలాంటి ఆంక్షలు ఉండరాదు. 7) ఆహార ధాన్యాల కొనుగోలు, రవాణా, నిలవ లాంటి అంశాలలో ఫుడ్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఎఫ్‌సిఐ) జోక్యాన్ని తప్పించి ప్రైవేట్ సంస్థలకు అప్పగించాలి.

వ్యవసాయ రంగంలో స్వావలంబనను పూర్తిగా నాశనం చేస్తూ, సామ్రాజ్యవాదులపై ఆధారపడే విధంగా ఉన్న ఈ ఆదేశాలను, మన పాలకులు అత్యంత విశ్వాస పాత్రులుగా అమలు చేశారు. పై ఆదేశాల కనుగుణంగానే 2000లో వ్యవసాయ రంగం అభివృద్ధి కొరకు చాలా గొప్పగా పొగుడుతూ ప్రభుత్వం విడుదల చేసిన 15 పేజీల 'నేషనల్ అగ్రికల్చరల్ పాలసీ' (ఎన్‌ఎపి) ఉంది. అందులో స్పష్టంగా వ్యవసాయ రంగంలో కాంట్రాక్టు వ్యవసాయం చేపట్టి, ప్రైవేట్ పెట్టుబడులను ఆహ్వానించాలని, ప్రపంచ మార్కెట్‌కు అవసరమైన పత్తి, ఆయిల్ సీడ్స్, పూల మొక్కలు లాంటి వ్యాపార పంటలు పండించాలని ఉంది. భూ కమతాల సైజుని విస్తృతం చేయాలని, రైతుల భూములు ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు అప్పచెప్పడానికి అవసరమైన చట్టాలు తీసుకు రావాలని ఉంది. అంతేకాక వ్యవసాయాన్ని అభివృద్ధి చేస్తూ పలు రకాల కొత్త మొక్కల అభివృద్ధికి అవసరమైన పరిశోధనలలో ప్రైవేట్ కంపెనీలకు ప్రోత్సాహం కల్పించాలి. ఈ క్లాజ్ వల్లనే మన దేశంలో ఇప్పటికే బహుళ జాతి సంస్థ మహికో జన్యు మార్పిడి విత్తనాలపై పెత్తనం చేస్తోంది.

'ఆహార భద్రత అంటే గోడౌన్ నిండా ఆహార ధాన్యాలు నిండి ఉండడం కాదు. జేబులు నిండా డాలర్లు కలిగి ఉండడమే. బాగా లాభాలు వచ్చే వ్యాపార పంటలు పండించండి. ఎగుమతులు చేసి సంపాదించి, అవసరమైతే కొంత లాభంలో ఆహారాన్ని దిగుమతి చేసుకోండి' అని సామ్రాజ్యవాదానికి ప్రతినిధి అయిన అమెరికా వ్యవసాయ కార్యదర్శి

సెలవిచ్చారు. ఆ స్ఫూర్తితోనే మన దేశంలో ఆహార ధాన్యాల నిలవ, రవాణాల గురించి ప్రపంచ బ్యాంక్ డాక్యుమెంట్‌లో చేసిన ప్రతిపాదనలు చూడండి. '1) ధాన్యాల కొనుగోళ్లు, వాటి రవాణా, నిలవ చేసే కార్యక్రమాలలో ఆహార సంస్థ (ఎఫ్‌సిఐ) తన ప్రత్యక్ష పాత్ర తగ్గించుకోవాలి. ఈ కార్యక్రమాల్ని సబ్ కాంట్రాక్టుల ద్వారా, లైసెన్స్‌డ్ ఏజెంట్లకు, టోకు వ్యాపారస్తులకు, ప్రైవేట్ వ్యాపారస్తులకు అప్పగించాలి. 2) ధాన్యాల బఫర్ నిల్వలను, వర్కింగ్ స్టాక్‌లతో పేర్చుకొనే బదులు, ఆహార సంక్షోభ కాలంలో భారతదేశం ప్రపంచ మార్కెట్‌ను ఆశ్రయించ వచ్చు. పెద్ద ఎత్తున గోధుమలు, బియ్యం బఫర్ నిల్వలను, వర్కింగ్ స్టాక్‌లను నిల్వ చేసుకోవడమంటే చాలా ఖర్చుతో కూడిన పని. అలా పేర్చుకోవడం అవసరం లేదు. ముఖ్యంగా మార్కెట్ జోక్యం లక్ష్యం మారుతున్న దృష్ట్యా ఈ మార్పులు చాలా అవసరం.'

పై సూచనల కనుగుణంగా 1998 సెప్టెంబర్‌లో కేంద్ర ఆహార మంత్రిత్వ శాఖ వ్యవసాయ రంగంలో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెట్టడానికి ఏర్పాటు చేసిన సారధ్య సంఘం 'గోధుమలు, బియ్యం సేకరణ, వాటి రవాణా నిలవ చేయడం లాంటి వాటి బాధ్యతలు ప్రైవేట్ రంగానికి అప్పగించాలని, ఈ రంగంలోకి ప్రైవేట్ పెట్టుబడులను, విదేశీ పెట్టుబడులను ఆహ్వానించాలని' సిఫారసు చేసింది. వీటిని ప్రభుత్వం ఆమోదించింది.

దేశంలో ఆహార ధాన్యాల నిలవ కోసం అవసరమైన గోడౌన్ల నిర్మాణం లోనూ, నిర్వహణలోనూ నలభై సంవత్సరాల అనుభవం ఉన్న 'భారత ధాన్య గిడ్డంగి నిర్వహణ, పరిశోధనా సంస్థ' (ఇండియన్ గ్రెయిన్ స్టోరేజ్ మేనేజ్‌మెంట్ అండ్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ - ఐడిఎంఆర్‌ఐ)ను కాదని ఆస్ట్రేలియా వ్యవస్థను ప్రవేశ పెట్టాలని ఈ సిఫారసులలో ఉంది. దీనికి అనుగుణంగానే కేంద్ర మంత్రివర్గం 'జాతీయ నిల్వల విధానం' (నేషనల్ గ్రెయిన్ స్టోరేజ్ పాలసీ)ని ప్రకటించింది. మౌలికమైన ఏర్పాట్లు ప్రైవేట్ రంగం ద్వారా ఏర్పాట్లు చేయాలని, అలా ఏర్పడే గిడ్డంగులను ఎఫ్‌సిఐకు అద్దెకివ్వాలని, అనేక రాయితీలు కల్పిస్తూ ప్రైవేట్ పార్టీలకు ఎఫ్‌సిఐ స్థలాన్ని నూటికి నూరుపాళ్లు వాడుకొనే అవకాశం కల్పించాలని, వారు ఐదు సంవత్సరాలు ఆదాయ పన్ను చెల్లించనక్కర్లేదని ప్రకటించారు. దేశవ్యాప్తంగా ఎఫ్‌సిఐకి ఉన్న 2200 గోడౌన్లలో 510 గోడౌన్లను మినహాయించి మిగతా వాటిని ప్రైవేట్ కంపెనీలకు అమ్మేయాలని కేంద్ర వినియోగదార్ల పంపిణీ మంత్రిత్వ శాఖ సిఫారసు చేసింది.

ఆహార ధాన్యాల నిలవ కోసం మరిన్ని గోడౌన్ల నిర్మాణానికి పూనుకోవలసి ఉండగా, ఉన్న వాటినే ప్రైవేట్ సంస్థలకు అప్పచెప్పడం వలన 2012 జూలై 1 నాటికి ఉన్న 8.05 కోట్ల ఆహార ధాన్యాల నిలువలో కేవలం 1.72 కోట్ల టన్నులు పక్కా ఎఫ్‌సిఐ గోడౌన్లలోనూ, తాత్కాలిక ప్లాస్టిక్ షీట్ల కవరింగ్‌తో 4.5 కోట్ల టన్నులు నిల్వ చేయగలిగారు. మిగిలిన 1.83 కోట్ల టన్నుల ధాన్యాలు సరైన స్టోరేజి సదుపాయాలు లేక చెడిపోతున్నాయి. ఆహార ధాన్యాలు నిల్వలు పేరుకు పోవడంతో వాటిని పేదలకు పంచి పెట్టాల్సింది పోయి ఉత్పత్తి ధర కన్నా తక్కువ ధరలకు విదేశాలకు జంతువుల ఆహారంగా ఎగుమతి చేస్తున్నారు. 'గోధుమ పంటకు దేశంలో ఉత్పత్తి ధర రు. 19,100 ఉంటే ఎగుమతి కోసం ప్రభుత్వం ధరను రు. 16,200గా నిర్ణయించింది. దీని వలన గత సంవత్సరం దాదాపు 1700 కోట్ల రూపాయల నష్టం వచ్చింద'ని ఎఫ్‌సిఐ ఛైర్మన్ అమర్‌సింగ్ అన్నారు.

దేశ వ్యవసాయ రంగం ప్రపంచీకరణ విధానాల కారణంగా సర్వనాశనమై పోయింది. ఒకప్పుడు రైతులు పండించే పంటలోంచి నాణ్యమైన ధాన్యాన్ని సేకరించి తరువాత పంటకు విత్తనాలుగా వాడుకొంటూ స్వయం పోషక విధానాన్ని కొనసాగించేవారు. కాని ఈనాడు విత్తనాల కోసం విదేశీ బహుళజాతి కంపెనీల మీద ఆధార పడేటట్లు చేశారు. నకిలీ విత్తనాలు, కల్తీ విత్తనాల వలన రైతు కుటుంబాలు నాశనమవుతున్నాయి. ఆత్మహత్యలు పెరిగిపోయాయి.

ఆర్థిక సంస్కరణలు అమలయిన తర్వాత ఆహార ధాన్యాలను పండించే భూమి విస్తీర్ణం బాగా తగ్గిపోయింది. మొత్తం సాగు భూమిలో ఆహార పంటలు పండించే భూమి 74.2 శాతం నుండి 71.4 శాతానికి పడిపోయింది. పేదలు అధికంగా వాడే జొన్న, సజ్జలు లాంటి తృణ ధాన్యాల కింద ఉండే విస్తీర్ణం 21.8 శాతం నుండి 18.6 శాతానికి పడిపోయింది.

2007లో ఆర్థిక మంత్రిత్వ శాఖ విడుదల చేసిన రిపోర్ట్ ప్రకారం దేశంలో 50 శాతం రైతులు రుణ భారంతో నలిగిపోతున్నారు. అప్పులు తీర్చలేని పరిస్థితుల్లో ఆత్మహత్యలు చేసుకొంటున్నారు.

1991-99 ఆల్టర్నేటివ్ సర్వే రిపోర్ట్ ప్రకారం, సంస్కరణలలో భాగంగా జరిగిన ప్రైవేటీకరణ విధానాల ఫలితంగా వ్యవసాయాభివృద్ధికి కేటాయించిన నిధులపైన ధనిక రైతులు, వడ్డీ వ్యాపారులు, స్థానిక నాయకులు, వర్తకులు, ద్రవ్య సంస్థల అపవిత్ర కలయికతో ఏర్పడిన సిండికేట్లు బాగా పట్టు సంపాదించాయని పేర్కొంది.

అంతర్జాతీయ ద్రవ్య సంస్థల, ప్రపంచ బ్యాంక్‌ల ఆదేశాలు శిరసా వహించడం వలన వ్యవసాయ రంగ అభివృద్ధి కుంటు పడిందని ఢిల్లీ జవహర్‌లాల్ యూనివర్సిటీ వ్యవసాయ శాస్త్రాచార్యులు జె.పి. సింగ్, అలోక్‌దాస్‌లు అన్నారు.

సంస్కరణలకు ముందు అంటే 1980లో బియ్యం ఉత్పాదకత రేటు 3.3 శాతం ఉంటే అది 1990-98ల మధ్య కాలంలో 1.7 శాతానికి పడిపోయింది. గోధుమ ఉత్పాదక రేటు 4.7 శాతం ఉంటే సంస్కరణల తరువాత 2.7 శాతానికి పడిపోయింది.

1995-2011ల వరకు దేశంలో 2,79,940 ఆత్మహత్యలు జరిగాయి. దీనిలో మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, కర్నాటక, ఛత్తీస్‌గడ్, మధ్యప్రదేశ్‌లలో దాదాపు 64 శాతం ఉన్నాయి. మహారాష్ట్ర 53,818 రైతుల ఆత్మహత్యలతో మొదటి స్థానంలో ఉంటే, ఆంధ్రప్రదేశ్ 33,326 మంది రైతుల ఆత్మహత్యలతో రెండవ స్థానంలో నిలిచింది.

'రుణ బాధలనేవి ఆంధ్ర రైతాంగాన్ని, సమాజాన్ని నేడు పట్టి పీడిస్తున్న రోగాలు. రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారంటే అర్థం, అప్పుల బాధల నుండి ఇక తిరిగి కోలుకోలేమని నిర్ధారణకు రావడమే' అని ఆంధ్రప్రదేశ్ పత్తి రైతులు ఆత్మహత్యలు చేసుకొన్న ప్రాంతాలను సందర్శించిన కేంద్ర పరిశీలనా బృందానికి నాయకత్వం వహించిన వ్యవసాయ శాఖ కార్యదర్శి భగత్‌సింగ్ అన్నారు.

హరిత విప్లవంలో భాగంగా మొదలైన విషపూరిత రసాయనిక ఎరువులు, పురుగుల మందుల వాడకం నేటికీ కొనసాగుతోంది. దీని వలన దాదాపు ఒక కోటీ, ఇరవై లక్షల హెక్టార్ల భూములు నిస్సారమైపోయాయని ఒక అంచనా.

**పేదలెవరు?**

ప్రపంచ బ్యాంక్ పేదరికాన్ని సమీక్షిస్తూ 'వేర్ ది పూర్ అండ్ వేర్ ది పూరెస్ట్' అనే పేరుతో ఒక నివేదిక విడుదల చేసింది. దాని ప్రకారం ప్రపంచంలో ప్రతి ముగ్గురు పేదవారిలో ఒకరు భారతదేశానికి చెందిన వారే. మూడు దశాబ్దాల్లో పేదరికం 22 శాతం నుండి 33 శాతానికి పెరిగింది. భారతదేశంలో ప్రస్తుతం 40 కోట్ల మంది పేదలున్నారు. ఈ నివేదికపై ప్రపంచ బ్యాంక్ చీఫ్ ఎకనామిస్ట్, భారత ప్రధాని మన్మోహన్ సింగ్ మాజీ ఆర్థిక సలహాదారు అయిన కౌశిక్ బాసు 'పేదరికాన్ని తొలగించడానికి ఎంతో కృషి చేశాం. ఇప్పటికీ ఇంత మంది పేదలున్నారంటే మా ప్రయత్నాలు మరింత పెరగాలి. పెట్టుబడులు నేరుగా పేదలకు చేరేలా ప్రపంచ బ్యాంక్, సభ్య దేశాలు సంయుక్తంగా కృషి చేయాలి' అన్నారు. ఆ కృషిలో భాగంగానే పేదరికాన్ని తొలగించే పేరుతో పేదలను తొలగించే కార్యక్రమాలు ముమ్మరంగా సాగుతున్నాయి.

ఐక్యరాజ్య సమితి అభివృద్ధి ప్రాజెక్ట్ (యుఎన్‌డిపి) చేపట్టిన మల్టీ డైమన్షనల్ పావర్టీ ఇండెక్స్ (ఎంపిఐ) పద్ధతి ద్వారా తేల్చిన విషయమేమంటే, 2011లో 109 ప్రపంచ దేశాలలో మన దేశం పేదిరకంలో 79వ స్థానంలో ఉంది. రష్యా 10వ స్థానంలో, చైనా 45 స్థానంలోనూ, బ్రెజిల్ 26వ స్థానంలోనూ ఉన్నాయి.

భారతదేశంలో అసంఘటిత రంగాన్ని పరిశీలించిన ప్రొ. అర్జున్‌సేన్ గుప్త ఇచ్చిన నివేదిక ప్రకారం దేశంలో 77 శాతం ప్రజలు కేవలం రు. 20 సంపాదనపై జీవిస్తున్నారు. నేషనల్ న్యూట్రిషన్ మానిటరింగ్ బ్యూరో (ఎన్ఎన్ఎంబి) ప్రకారం దేశంలో 76.8 శాతం ప్రజలకు పొందవలసి నంత పోషకాహారం లభించడం లేదని తెలిపింది. గ్రామాలలో రోజుకు ఒక మనిషి 2200 కాలరీలు, పట్టణాల్లో 2100 కాలరీలు శక్తినిచ్చే ఆహారం కనీసం తినాలని శాస్త్రవేత్తలు నిర్ణయించారు. 1993లో నిర్ణయించిన ప్రకారం ఆహారం తీసుకోలేని వారు పట్టణాలలో 57 శాతం ఉండగా, 2003 నాటికి 73 శాతానికి పెరిగారు. గ్రామాలలో 58.5 శాతం నుండి 75 శాతానికి పెరిగారు. ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా 1991లో దేశమంతటా రెండు కోట్ల, పది లక్షల టన్నుల ఆహార ధాన్యాలను పంపిణీ చేయగా 2001 నాటికి అవి ఒక కోటీ ముప్పై లక్షల టన్నులకు దిగజారిపోయాయి. పోషకాహార లోపం వల్ల మన దేశంలో ప్రతి సంవత్సరం ఐదు సంవత్సరాల లోపు పిల్లలు పదమూడు లక్షల మంది చనిపోతున్నారు. ప్రపంచంలో సరైన పోషకాహారం లేక చనిపోతున్న పిల్లలలో 40 శాతం మన దేశం వాళ్లే. 54 శాతం స్త్రీలు రక్తహీనతతో బాధపడుతున్నారు. ప్లానింగ్ కమిషన్ రిపోర్టు ప్రకారం కేంద్ర ప్రభుత్వం ఇంతవరకు అందిస్తున్న సబ్సిడీ ఆహార ధాన్యాలలో పేదరిక స్థాయి దిగువనున్న వారికి 58 శాతానికి అందడం లేదు. పేదలను గుర్తించడంలో తప్పుడు పద్ధతులు, సరైన లబ్ధిదారుల్ని గుర్తించక పోవడం దీనికి కారణమని పేర్కొన్నారు.

నూతన ఆర్థిక విధానాల కారణంగా పేదరికం పెరిగిపోతూ, పోషకాహార లోపంతో ప్రజలు ఒకవైపు బలయిపోతుంటే మన ప్రణాళికా సంఘం తాజా కొలమానం ప్రకారం పట్టణ ప్రాంతాలలో రోజుకు రు. 29, గ్రామాల్లో రోజుకు రు. 22 ఖర్చు చేయగలిగినవారు పేదలు కారని నిర్ధారించింది.

**జాతీయ గ్రామీణ ఉపాధి పథకం ఎవరికోసం?**

ఈ పథకాన్ని 2005లో ప్రారంభిస్తూ 'పని హక్కుని సాధించే దిశగా ఒక ముఖ్యమైన అడుగు ఇది, శ్రమజీవులు హుందాగా జీవించే ప్రాథమిక హక్కుని కల్పించే ప్రజల చట్టం'గా దీన్ని పాలకులు ప్రచారం చేశారు. ఈ చట్టాన్ని అమలుపరిచే ప్రతి జిల్లాలో గల పేద కుటుంబంలో పనిచేయగలిగే వ్యక్తికి ఆ సంవత్సరంలో వంద రోజుల పని కల్పిస్తారు. పని కల్పించకపోతే నిరుద్యోగ భృతి ఇవ్వాలి. దినసరి కూలీ రు. 60లకు తగ్గకుండా చెల్లించాలి. ఇది కేవలం గ్రామీణ ప్రాంతాలకే వర్తిస్తుంది.

ఆచరణలో ఈ పథకం పేదరికాన్ని ఏ మాత్రం తగ్గించలేదని రుజువయింది. మొదటి సంవత్సరం 200 జిల్లాల్లోనూ, రెండవ సంవత్సరం 330 జిల్లాల్లోనూ అమలు చేసిన ఈ పథకం, వంద రోజుల పని హామీకి కనీసంగా అమలు చేయలేకపోయింది. కల్పించిన పని దినాలు కూడా క్రమంగా తగ్గిపోయాయి. 'సొసైటీ ఫర్ పార్టిసిపేటివ్ రీసెర్చ్ ఇన్ ఆసియా' అనే సంస్థ పద్నాలుగు రాష్ట్రాలలో, 21 జిల్లాలలో, 530 గ్రామాలలో చేసిన అధ్యయనం ప్రకారం పథకం అమలు చేసిన ప్రాంతాలలో నమోదు చేసుకొన్న మొత్తం కుటుంబాలలో కేవలం 6 శాతం కుటుంబాలకు మాత్రమే పని చేయగల వ్యక్తులకు వంద రోజుల పనిని కల్పించగలిగారు. అంటే 94 శాతానికి హామీ అమలు జరగలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే 2006-07లో ఉపాధి కోసం నమోదు చేసుకొన్న రెండు కోట్ల పది లక్షల కుటుంబాలకు కేవలం 21 లక్షల కుటుంబాలకు మాత్రమే వంద రోజుల పని కల్పించారు. మొదటి సంవత్సరంలో సగటున 45 రోజుల పని కల్పించగా, రెండవ సంవత్సరం 38 రోజులకు పడిపోయింది. మన రాష్ట్రంలో 2006-07లో 13 జిల్లాల్లో అమలు చేసిన ఈ పథకానికి ఖర్చు చేసింది రు. 512.53 కోట్లు మాత్రమే. అంటే దాదాపు 50 శాతం ఖర్చు పెట్టకుండానే మిగిలించారు. వాడిన మొత్తంలో వాస్తవంగా గ్రామీణ పేదలకు కూలి రూపంలో ముట్టిన మొత్తం రు. 348.48 కోట్లు. సామాగ్రి, పాలన కోసం ఖర్చు పెట్టింది రు. 64.05 కోట్లు. మిగిలినదంతా రాజకీయ నాయకులు, పెత్తందార్లు, అధికారులు స్వాహా చేశారు.

**కాంట్రాక్ట్ వ్యవసాయం**

ప్రపంచ బ్యాంక్ ఆదేశాలకనుగుణంగా ఆంధ్రప్రదేశ్, చిత్తూరు జిల్లా, కుప్పంలో ప్రారంభించిన కాంట్రాక్ట్ వ్యవసాయం కుప్పకూలిన సంగతి అందరికీ తెలిసిందే. దేశ వ్యవసాయ రంగాన్ని పూర్తిగా నాశనం చేయడానికి మళ్లీ ఆ విధానాన్ని తెరమీదకు తెస్తున్నారు. డిసెంబర్ 2012లో పారిశ్రామికవేత్తల సంఘం (సిఐఐ) వ్యవసాయం మీద ఒక జాతీయ సెమినార్ జరిపింది. దీన్ని దేశాధ్యక్షుడు ప్రణబ్ ముఖర్జీ ప్రారంభించారంటే దీని ప్రాముఖ్యత తెలుస్తుంది. ఆయన దేశంలో రెండవ హరిత విప్లవాన్ని, పబ్లిక్ - ప్రైవేట్ పార్టనర్‌షిప్ (పిపిపి) విధానం ద్వారా సాధించాలని పిలుపిచ్చారు. దేశంలో వ్యవసాయ రంగంలో ఉత్పాదకత పెంచడానికి రైతులు, ప్రభుత్వం, కార్పొరేట్ సంస్థల సహకారంతో పని చేయాలని, తద్వారా పేదరికాన్ని తొలగించాలని, సెమినార్‌లో వ్యాపారరంగ ప్రతినిధులు, ప్రభుత్వ అధికార ప్రతినిధులు మాట్లాడారు. ఈ సెమినార్‌లో ప్రకటించిన లక్ష్యాలకు ప్రభుత్వం వెంటనే స్పందించింది. జనవరి 2013లో ప్రభుత్వం పిపిపి పద్ధతిలో వ్యవసాయ రంగంలో మార్పులు తేవడానికి 'స్మాల్ ఫార్మర్స్ అగ్రి బిజినెస్ కన్సోర్టియం'

(ఎస్ఎఫ్ఎసి)ను జాతీయ స్థాయిలో ఏర్పాటు చేసింది. వ్యవసాయ మంత్రిత్వ శాఖ, ఈ సంస్థ ద్వారా రాష్ట్రాలకు కార్పొరేట్ కంపెనీలకు అవసరమైన సాంకేతిక సహకారం అందిస్తుందని ప్రకటించారు. ఎస్ఎఫ్ఎసి ద్వారా దేశంలో అనేక ప్రాంతాలలో ఫార్మర్ ప్రొడ్యూసర్ కంపెనీ (ఎఫ్‌పిసి) లను ఏర్పాటు చేయడానికి ప్రయత్నాలు ప్రారంభించారు. 'రాష్ట్రీయ కృషి వికాస్ యోజన' (ఆర్‌కెవివై) ద్వారా ఆర్థిక సహాయం అందించడానికి ఏర్పాట్లు చేస్తున్నారు.

ఎస్ఎఫ్ఎసి కార్యక్రమంలోని అంశాలు 'దేశంలో ఉన్న భూమిలో 83 శాతం చిన్న చిన్న కమతాలుగా ఉన్నాయి. వెంటనే కలుగ చేసుకొని, రైతు సంస్థల ద్వారా వీటిని పెద్ద పెద్ద కమతాలుగా మార్చి భారీ ఉత్పత్తులను సాధించాలి. దీనిలో భాగస్వాములైన వారందరికీ, ప్రధానంగా రైతులకు న్యాయం చేయాలి. వ్యవసాయ రంగంలో ఉత్పాదకత పెంచడానికి పబ్లిక్, ప్రైవేట్ పార్టనర్‌షిప్ ఒక ప్రత్యామ్నాయం గా తెచ్చి దీన్ని కృషి వికాస్ యోజనల ద్వారా నిర్వహించాలని ఈ కార్యక్రమానికి ప్రభుత్వం ఆర్థిక సహాయమిస్తే ప్రైవేట్ రంగం తన యజమాన్య శక్తి యుక్తులను, సాంకేతిక పరిజ్ఞానాన్ని తోడు ఇస్తూ, సమర్థవంతమైన, సుస్థిరమైన ప్రతిఫలాలను సాధించగలం. అదనంగా ప్రైవేట్ పెట్టుబడులతో మరిన్ని లాభాలు సాధించగలం.'

దీని ప్రకారం కార్పొరేట్ శక్తుల చేతుల్లో కీలుబొమ్మలుగా 'ఫార్మర్ ప్రొడ్యూసర్ కంపెనీలు' పని చేస్తూ, వ్యవసాయ రంగంలో పిపిపి మోడల్‌ను అమలు పరుస్తారు. గతంలో కార్పొరేట్ సంస్థలు అమలు చేసిన, చేస్తున్న కాంట్రాక్ట్ వ్యవసాయ విధానాన్ని కొత్త పేరుతో విస్తృతంగా అమలు చేయబోతున్నారు. కాంట్రాక్ట్ వ్యవసాయంలో చిన్న కమతాల రైతులతో ఒప్పందాలు చేసుకొన్నప్పుడు చాలాసార్లు అసలు కాంట్రాక్టే ఉండదు. నోటి మాట మీదే ఒప్పందాలు చేసుకొని తమ కార్యక్రమాలను కొనసాగిస్తారు. అంతర్జాతీయ కార్పొరేట్ సంస్థలు కూడా ఈ విధానాన్నే కొనసాగిస్తున్నాయి. రైతులకు ఇంగ్లీష్ రాకపోవడంతో, మాయ మాటలు చెప్పి, సంతకాలు తీసుకొంటారు. కార్పొరేట్ సంస్థల కాంట్రాక్ట్ వ్యవసాయం దేశంలో చాలా ప్రాంతాలలో దివాళా తీసి, రైతుల జీవితాలను సర్వనాశనం చేశాయి. ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, పంజాబ్ లాంటి రాష్ట్రాలలో కార్పొరేట్ శక్తుల చేతిలో మోసపోయిన రైతులు తమ బాధలను రికార్డు చేసి ఉన్నారు. భాష రాకపోవడంతో మాయ మాటలు చెప్పి మమ్మల్ని మోసం చేశారని రైతులు వాపోతున్నారు.

సట్లెజ్ నదీ తీరాన పంజాబ్, లూథియానాకు దగ్గరలో ఉన్న పంజాబ్ అగ్రి కల్చరల్ యూనివర్సిటీకి చెందిన మూడు వందల ఎకరాల భూమిని భారతి ఎంటర్‌ప్రైజెస్, అమెరికాకు చెందిన డెవ్‌మోంట్ పసిఫిక్‌ల జాయింట్ కంపెనీకి 2004లో ఎకరానికి సంవత్సరానికి కేవలం రు. 300 రేటుతో 90 సంవత్సరాలకు లీజుకు ఇచ్చారు. అప్పుడు ఆ భూమి మార్కెట్ ధర ఎకరానికి రు. 35,000. ఈ విధంగా పంజాబ్‌లో కాంట్రాక్ట్ వ్యవసాయం పేరుతో కార్పొరేట్ సంస్థలు చాలా చవుకగా భూముల్ని స్వాధీనం చేసుకొని, వాళ్ల అవసరాల కోసం పంటలు పండిస్తున్నారు. గత పది సంవత్సరాలలో పంజాబ్‌లో కాంట్రాక్ట్ వ్యవసాయం పెరిగిపోయింది. ప్రభుత్వ సహకారంతో కార్పొరేట్ సంస్థలైన ఎఎం టాడ్, పెప్సి చంబల్ అగ్రిటెక్, మహేంద్ర అండ్ మహేంద్ర, యూని లీవర్, ఎస్కార్ట్స్, యునైటెడ్ బ్రెవరీస్, డిసిఎం శ్రీరామ్, టాటా కెమికల్స్, మోన్సాంటో, కార్గిల్‌లు పంజాబ్ వ్యవసాయ రంగాన్ని శాసిస్తున్నాయి.

2012లో దాదాపు 17 రాష్ట్ర ప్రభుత్వాలు, 25 కార్పొరేట్ సంస్థలతో కలిసి వ్యవసాయ రంగంలో పిపిపి కార్యక్రమాలు మొదలు పెట్టినట్లు తెలుస్తోంది. ఈ కార్పొరేట్ సంస్థల్లో రిలయన్స్, ఎస్సార్, భారతి ఎంటర్‌ప్రైజెస్, డెవ్‌మాంట్ పసిఫిక్, అదాని గ్రూప్, ఐటిసి, గోద్రెజ్, మారికో, టాటా కెమికల్స్, నెస్లే లాంటి సంస్థలున్నాయి. ఈ కార్యక్రమాలను అమలు చేయడానికి ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్నాటక, గుజరాత్ రాష్ట్రాలు చాలా ఉత్సాహాన్ని చూపిస్తున్నాయని కేంద్ర ప్రభుత్వ అధికారులు చెపుతున్నారు. ఈ కార్యక్రమంలో ప్రధానంగా బంగాళ దుంపలు, టమాట, ఇతర కూరగాయలకు అధిక ప్రాధాన్యతనిస్తున్నారు. ఎందుకంటే ఇవన్నీ సూపర్‌మాల్‌ల కోసం ఏర్పడిన పరిశ్రమలకు సరఫరా చెయ్యాలి. అలాగే ఇతర పంటలు పొగాకు, పత్తి, సన్‌ఫ్లవర్, డైరీ ఉత్పత్తుల మీద శ్రద్ధపెడుతున్నారు. మొత్తం మీద ఈ కార్యక్రమాల ద్వారా పండే పంటలలో అధిక శాతం కార్పొరేట్ సంస్థలు నిర్వహించే వ్యాపార సంస్థలకు, బడా మాల్‌ల కోసమే ఉత్పత్తి జరుగుతుంది.

నూతన ఆర్థిక విధానాల అమలు కారణంగా వ్యవసాయ రంగంలో తీవ్రమైన మార్పులు వచ్చాయి. జనాభా లెక్కల ప్రకారం మన దేశంలో 1991లో 11.07 కోట్ల మంది ఉండే రైతాంగం 2011 నాటికి 9.58 కోట్లకు తగ్గిపోయారు. అంటే 1.49 కోట్ల మంది, రోజుకి రెండు వేల మంది వ్యవసాయం నుండి తొలగించబడ్డారు. అదే సమయంలో రైతు కూలీలు 1991లో 7.45 కోట్ల మంది ఉంటే 2011 నాటికి 8.61 కోట్ల మంది ఉన్నారు. అంటే 1.16 కోట్ల మంది, రోజుకు 1600 మంది పెరిగారు. పంటలు పండే లక్షలాది ఎకరాల వ్యవసాయ భూములను సెజ్‌ల కోసం నాశనం చేయబడ్డాయి.

కార్పొరేట్ వ్యవసాయానికి పుట్టినిల్లు అయిన అమెరికా పరిస్థితి చూద్దాం: అమెరికా ప్రభుత్వ లెక్కల ప్రకారం 1935లో 70 లక్షల భూ కమతాలుంటే నేటికి 20 లక్షలకు దిగజారిపోయాయి. అంటే 50 లక్షల మంది రైతులు తమ భూమిని కోల్పోయారు. అమెరికాలో 90 శాతం అగ్రో కెమికల్ మార్కెట్ కేవలం పది బహుళజాతి కంపెనీల చేతుల్లో ఉంది. ఆహార ధాన్యాల మార్కెట్‌ను కేవలం రెండు కంపెనీలు కార్గిల్, కాంటినెంటల్‌లు శాసిస్తున్నాయి. మొత్తం అమెరికన్ విత్తనాల మార్కెట్ 50 శాతం కేవలం మూడు కంపెనీలు మోన్‌సాంటో, డుపాంట్, సింజెంటాలు శాసిస్తున్నాయి. జొన్న విత్తనాల మార్కెట్‌లో 60 శాతం, సోయాబిన్ విత్తనాల మార్కెట్‌లో 62 శాతం కేవలం ఒకే ఒక్క కంపెనీ మోన్‌సాంటో అధికారం చెలాయిస్తోంది.

పేదరికానికి, వ్యవసాయ రంగానికి, ఆహార భద్రతకు విడదీయరాని సంబంధం ఉంది. స్వావలంబనతో కూడిన సుస్థిర వ్యవసాయమే పేదరికాన్ని తొలగించగలదు. ఓట్లు దండుకోవడంతో పాటు, ఆహార భద్రత సాకుతో, వ్యవసాయ రంగాన్ని కార్పొరేట్ శక్తుల చేతిలో పెట్టడానికే ఈ జాతీయ ఆహార భద్రతా పథకాన్ని ప్రవేశపెట్టారని అర్థం చేసుకోవాలి. పేదరికాన్ని సృష్టించిన పాలకులు దాన్ని తొలగిస్తారని ఎవరికి భ్రమలుండే అవకాశం లేదు. కాని ఆ పేరుతో దేశ సంపదను సామ్రాజ్యవాద శక్తులకు ధారపోయడాన్ని వ్యతిరేకిస్తూ ప్రజలతో కలిసి పోరాడాలి.

*(రచయిత కార్మికోద్యమ నాయకులు)* వీ

# వ్యవసాయ సంక్షోభం - ప్రమాద ఘంటికలు

*సరళీకృత ఆర్థిక విధానాల ఫలితంగానే వ్యవసాయ రంగం సంక్షోభంలో కూరుకుపోయిందనీ, రైతులు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారనీ అంటున్నారు* **ఆశాలత**

జాతీయ నేర నమోదు సంస్థ (ఎన్‌సిఆర్‌బి) 2012 గణాంకాల ప్రకారం 1995–2012 మధ్యగల 18 సంవత్సరాలలో మన దేశంలో 2,84,694 మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. వీటిలో 68 శాతం దేశంలో వర్షాధార ప్రాంతాలలో పత్తి పంటను ఎక్కువగా సాగు చేస్తున్న నాలుగు రాష్ట్రాలు ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, కర్ణాటక, మధ్యప్రదేశ్‌లలో జరిగాయి. గత సంవత్సరంతో పోల్చినప్పుడు మహారాష్ట్ర లో 13 శాతం, ఆంధ్రప్రదేశ్‌లో 17 శాతం రైతు ఆత్మహత్యలు పెరిగాయి. మొత్తం రైతు ఆత్మహత్యలలో 46 శాతం ఈ రెండు రాష్ట్రాలలోనే జరిగాయి. 18 సంవత్సరాలలో మహారాష్ట్రలో 57,604 మంది, ఆంధ్రప్రదేశ్‌లో 35,898 మంది రైతులు ఆత్మహత్య చేసుకున్నారు. గత సంవత్సరం మన రాష్ట్రంలో జరిగినవి 2572, దేశం మొత్తంలో జరిగినవి 13754. ఆత్మహత్య చేసుకున్న రైతులలో చాలా మంది మహిళా రైతులు ఉన్నప్పటికీ వారి వివరాలు బయటికి రావడం లేదు.

ఈ రైతు ఆత్మహత్యలు వ్యవసాయ రంగంలో నెలకొని ఉన్న తీవ్ర సంక్షోభానికి ప్రమాద సూచికలు. ఆత్మహత్య చేసుకున్న కుటుంబాలలో మిగిలిన వారు, అప్పుల ఊబిలో కూరుకుపోయి దిక్కుతోచకుండా ఉన్న వారి పరిస్థితి మరింత దుర్భరంగా ఉంది. ఆత్మహత్యలతో పాటు, పెద్ద ఎత్తున జరుగుతున్న వలసలు, వ్యవసాయ కూలీలకు పని లేకపోవడం, పేదరికం, పోషకాహార లోపం, అనారోగ్యం వంటి అనేక రూపాలలో కూడా ఈ సంక్షోభం వ్యక్తమవుతోంది. మన రాష్ట్రంలో గత 18 సంవత్సరాలలో 35898 మంది రైతులు ఆత్మహత్య చేసుకుంటే రాష్ట్ర ప్రభుత్వం గుర్తించినవి కేవలం 5683 మాత్రమే. ఒక వైపు ఆత్మహత్యలు రోజు రోజుకూ పెరుగుతుంటే, ఆ అత్మహత్యలన్ని నిజమైన రైతు ఆత్మహత్యలు కావని, అవి తాగుడు, మానసిక సమస్యలు, కుటుంబ సమస్యల వల్ల జరుగుతున్నాయని రైతు ఆత్మహత్యలను తక్కువ చేసి చూపిస్తూ రాష్ట్ర ప్రభుత్వం వాటిని గుర్తించకుండా నిరాకరిస్తోంది. ఇట్లా రైతు అత్మహత్యలను తక్కువ చేసి చూపడం వల్ల వారి కుటుంబాలకు ఎన్నటికీ నష్ట పరిహారం, సహాయం అందే అవకాశం లేకపోగా అసలు సమస్యను, సంక్షోభాన్ని గుర్తించే అవకాశం కూడా లేకుండా పోతోంది.

వ్యవసాయంలో విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల వంటి ఉత్పాదకాల ఖర్చులు పెరిగి, వర్షాభావం వల్ల బోర్ల తవ్వకం కోసం పెట్టుబడులు పెరిగి, దిగుబడి తగ్గి, సరైన గిట్టుబాటు ధరలు లేక రైతులు అప్పులలో కూరుకుపోయి ఆత్మహత్య చేసుకుంటున్నారు. 2011 జనాభా లెక్కలను విశ్లేషిస్తూ ప్రముఖ పాత్రికేయుడు పి.సాయినాథ్, దేశంలో మరెక్కడి కంటే కూడా ఆంధ్రప్రదేశ్‌లో రైతులు ఆత్మహత్య చేసుకోవడానికి 3 రెట్లు ఎక్కువ అవకాశముందని పేర్కొన్నారు.

2011 జనాభా లెక్కల ప్రకారం 1991 నుండి ఇప్పటి వరకు మన దేశంలో లక్షా 50 వేల మంది రైతులు (ప్రధాన సాగుదార్లు) తగ్గిపోయారు, 2001కి, ఇప్పటికి 77 లక్షల రైతులు తగ్గిపోయారు. అంటే గత 20 సంవత్సరాలుగా దేశంలో సగటున రోజుకి 2035 మంది రైతులు, మన రాష్ట్రంలో రోజుకి 350 మంది రైతులు వ్యవసాయం నుండి వైదొలుగుతున్నారు అనేకంటే బయటికి నెట్టివేయబడు తున్నారనడం ఉచితంగా ఉంటుంది. వీరంతా కూలీలుగా మారడమో, వలసలు పోవడమో, చిన్న చిన్న కంపెనీల్లో సెక్యూరిటీ గార్డులుగా, అటెండర్లుగా పని చేయడమో జరుగుతోంది. 1990 నుండి దేశంలో అమలు జరుగుతున్న నయా ఉదారవాద సరళీకరణ, ప్రైవేటీకరణ విధానాలు వ్యవసాయ రంగంపై చూపిన ప్రతికూల ప్రభావం ఫలితంగానే ఇంత మంది రైతులు వ్యవసాయంలో ఉపాధి కోల్పోయారని వేరే చెప్పనక్కర లేదు. 1999 లో చంద్రబాబు నాయుడు ప్రభుత్వం ప్రపంచ బ్యాంకు ప్రోద్భలంతో స్వర్ణాంధ్రప్రదేశ్–విజన్ 2020 పేరుతో ఒక విధాన పత్రాన్ని రూపొందించింది. గ్రామీణ ప్రాంతాలలో వ్యవసాయంపై ఆధారపడిన 70 శాతం ప్రజలను 40 శాతానికి తగ్గించడం లక్ష్యంగా ఆ పత్రంలో స్పష్టంగా పేర్కొనడం జరిగింది కూడా.

మన రాష్ట్రంలో ఆత్మహత్య చేసుకున్న రైతులలో ఎక్కువ శాతం (దాదాపు 80 శాతం వరకు) పత్తి రైతులే ఉన్నారంటే రాష్ట్రంలో విపరీతంగా విస్తరిస్తున్న పత్తి సాగు ఎంత నష్టం కలిగిస్తోందో తెలుస్తోంది. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఆంధ్రప్రదేశ్‌లో గత 5 సంవత్సరాలలో పత్తి విస్తీర్ణం 28 లక్షల ఎకరాల నుండి 56.70 లక్షల ఎకరాలకు పెరిగింది. ఈ విస్తరణ అంతా కూడా ఎక్కువగా తెలంగాణ జిల్లాలలో వర్షాభావ ప్రాంతాలలో జరిగింది. మన రాష్ట్రంలో ఆదిలాబాదు జిల్లాలో సాంప్రదాయకంగా పత్తిని పండిస్తూ వస్తున్నారు. హరిత విప్లం తర్వాత గుంటూరు జిల్లాలో 1970లలో హైబ్రిడ్ పత్తి రకాలు ప్రవేశ పెట్టింది. గుంటూరు నుండి వలస వెళ్లి తెలంగాణలో స్థిరపడిన రైతుల ద్వారా 1980ల తర్వాత మొదట వరంగల్, ఖమ్మం జిల్లాల్లో, ఆ తర్వాత మహబూబ్‌నగర్ జిల్లాలో హైబ్రీడ్ పత్తి రకాలు ప్రవేశించాయి

మన రాష్ట్రంలో మొత్తం సాగు భూమి సుమారు 200 లక్షల ఎకరాలు, అందులో 2010 ఖరీఫ్ సీజన్లో 114.5 లక్షల ఎకరాలలో ఆహార ధాన్యాలు సాగు చేస్తే 44.4 లక్షల ఎకరాలలో పత్తి సాగయింది. 2012 ఖరీఫ్‌లో ఆహార ధాన్యాల సాగు విస్తీర్ణం 97 లక్షల ఎకరాలకు తగ్గింది, పత్తి విస్తీర్ణం 56.70 లక్షల ఎకరాలకు పెరిగింది. అంటే గత 5 సంవత్సరాలలో ఆహార ధాన్యాల సాగు విస్తీర్ణం 17.5 లక్షల ఎకరాలు తగ్గింది. ముఖ్యంగా చిరు ధాన్యాలు, పప్పు దినుసులు, నూనె గింజల

సాగు బాగా తగ్గిపోయింది. పంటల సరళిలో జరిగిన ఈ మార్పు ఆహార భద్రత, రైతుల ఆహార సార్వభౌమత్వం, ఆదాయ భద్రత, జీవ వైవిధ్యం కోణాల నుండి తీవ్ర ఆందోళన కలిగించే విషయం. ఇప్పుడు సాగు చేస్తున్న పత్తిలో 90 శాతం జన్యుమార్పిడి బిటి పత్తే కావడం పర్యావరణం, జీవ భద్రతకు కూడా పెనుముప్పు.

దేశంలో జన్యు మార్పిడి బిటి పత్తిని ప్రవేశ పెట్టి 10 సంవత్సరాలు దాటింది. మన రాష్ట్రంలో మొదట వరంగల్ జిల్లాలోను ఆ తర్వాత మరొక 10 జిల్లాలలోను అది బాగా వ్యాపించింది. బిటి పత్తిలో పురుగు మందుల ఖర్చు తగ్గి, దిగుబడులు పెరిగి లాభం వస్తుందని కంపెనీలు పెద్ద ఎత్తున సాగించిన ప్రచారంతో అధిక ఆదాయం వస్తోందనే ఆశతో రైతులు బిటి పత్తిని సాగు చేస్తున్నారు. రాష్ట్రంలో గత 10 సంవత్సరాలుగా పత్తి విస్తీర్ణం నిలకడగా పెరుగుతూనే వస్తోంది. కాని పత్తి దిగుబడులు మాత్రం తగ్గుతున్నాయి. పత్తి సాగు చేస్తున్న మెజారిటీ రైతులు నష్టపోయి అప్పుల పాలవుతున్నారు. పత్తి సాగు చేస్తున్న వారిలో 10-15 శాతం మంది పత్తి రైతులు తప్ప మిగిలిన వారందరూ సగటున ఎకరానికి 5 వేల రూపాయల కంటే ఎక్కువ నష్టపోతున్నారు. వీరిలో అధిక శాతం చిన్న సన్నకారు రైతులు, కౌలు రైతులే.

కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఈ సంక్షోభాన్ని పరిష్కరించడానికి అనేక ప్రత్యేక పథకాలు అమలులోకి తెచ్చాయి కాని అది అదుపులోకి వచ్చే బదులు మరింత తీవ్రతరమవుతోంది. వ్యవసాయ సంక్షోభం పెరిగినప్పుడల్లా పరిష్కారంగా ప్రభుత్వం కొత్త సాంకేతిక పరిజ్ఞానాలను ఒక మంత్రం లాగా ముందుకు తెస్తోంది (కొత్త రకం పురుగు మందులు, జన్యుమార్పిడి పంటలు). కాని ఈ పరిష్కారాలే కొత్త సమస్యలకు దారి తీస్తున్నాయి.

ఉదాహరణకు మన రాష్ట్రంలో పేదరిక నిర్మూలన అంటూ ప్రభుత్వం స్త్రీ స్వయం సహకార బృందాల సభ్యులకు అధిక పాల దిగుబడినిచ్చే సంకర జాతి ఆవులను, గేదెలను అప్పుగా ఇచ్చింది. ఈ నిరుపేద కుటుంబాలకు వాటిని పెంచే స్తోమత లేక, వర్షా భావ ప్రాంతాలలో ఆ సంకర జాతులు మనలేక పాల దిగుబడి పూర్తిగా తగ్గిపోయి ఆ కుటుంబాలు వాటిని అమ్ముకోవలసి వచ్చింది. ఇటీవల అనంతపురం జిల్లాలో ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబానికి ప్రభుత్వ రుణ పథకం కింద 40 వేల రూపాయల హర్యాన బర్రెను ఇచ్చారు. కరువు నెలకొని ఉన్న అనంతపురం జిల్లాలో దానికి అవసరమయిన నీరు మేత అందకపోవడంతో అది కొద్ది రోజులకే పాలు ఇవ్వడం మానేసింది. ఆ కుటుంబం బర్రెను 5 వేలకు అమ్మి 35 వేల రూపాయలు వేరొక చోట అప్పు చేసి దాని అప్పు తీర్చారు. ఆ కుటుంబంపై అప్పు భారం మరింత పెరిగింది. ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబానికి ప్రభుత్వం చేసిన సహాయం ఇది. విదర్భ ప్రాంతంలో జరిగిన ఇటువంటి అనేక సంఘటనలను పి.సాయినాథ్ వెలుగులోకి తెచ్చారు.

వ్యవసాయ సంక్షోభాన్ని లోతుగా అధ్యయనం చేసిన అనేక ప్రభుత్వ, స్వతంత్ర (జయతి ఘోష్ కమిషన్, స్వామినాథన్ కమిషన్ మొదలైన 50కు పైగా) కమిటీలు, కమిషన్లు దాని పరిష్కారం కోసం ఇచ్చిన సూచనలను ప్రభుత్వం ఏనాడూ పట్టించుకోలేదు, అమలు చేయలేదు.

1970లో హరిత విప్లవంలో భాగంగా ఆంధ్రప్రదేశ్‌లో వరి పంటలో సాంద్ర పద్ధతి ప్రవేశ పెట్టింది. అప్పటి నుండి అధిక దిగుబడి నిచ్చే విత్తనాలు, రసాయన ఎరువులు పురుగు మందుల వాడకం, వాణిజ్య పంటల సాగు పెరిగి పోయింది. ఇదంతా సాగునీటి వనరులు, సారవంతమైన భూములు ఉన్న కోస్తా ప్రాంతంతో పాటు ఉత్పాదక వనరులు తక్కువగా ఉన్న వర్షాభావ ప్రాంతాలలో కూడా ఒకే రకంగా అమలయింది. వర్షాభావ పరిస్థితులకు అనువుకాని అధికోత్పత్తి వంగడాలు, వ్యవసాయ పద్ధతులు అక్కడి వ్యవసాయానికి గొడ్డలిపెట్టుగా మారాయి. 1990లో నూతన ఆర్థిక సంస్కరణలు, సరళీకరణ విధానాలు అమలులోకి వచ్చిన తర్వాత వ్యవసాయంలో మరింత గణనీయమైన మార్పులు చోటు చేసుకున్నాయి. అధిక ఉత్పాదకాలు అవసరమయ్యే ఎగుమతికి ఉద్దేశించిన వాణిజ్య పంటలకు ప్రోత్సాహం పెరిగింది. మరొక వైపు వ్యవసాయంలో ఉత్పాదకాల ఖర్చు పెరిగింది. రైతులకు సబ్సిడీలు ఉపసంహరించబడ్డాయి. పంట రుణాలు సరిపడినంత దొరకడం లేదు. వ్యవసాయంలో ప్రభుత్వ పెట్టుబడులు తగ్గిపోయాయి. లాభాపేక్ష గల కంపెనీలు, ప్రైవేటు రంగ పెట్టుబడులు పెరుగుతూ వచ్చాయి. విత్తనాలపై ప్రైవేటు కంపెనీల గుత్తాధిపత్యం పెరిగింది. విత్తనాలు, ఎరువులు, పురుగు మందుల వంటి ఉత్పాదకాల కోసం, ధాన్య విక్రయం కోసం రైతులు మార్కెట్ శక్తులపై ఆధార పడడం పెరిగింది. ఇదంతా తీవ్ర సంక్షోభానికి దారి తీసి రైతులను దుర్భర స్థితిలోకి నెట్టివేసింది.

ఆత్మహత్య చేసుకున్న రైతు కుటుంబాలను వారి దుర్భర స్థితి నుండి బయటకి తేవడానికి, తీవ్రమైన దుర్భర స్థితిలో ఉన్న వారు ఆత్మహత్యలకు పాల్పడకుండా నివారించడానికి ఒక సమగ్రమైన సహాయ పునరావాస కార్యక్రమాన్ని తీసుకురావాలి. ఇది వారి అప్పులు తీర్చడంతో పాటు భూమిని తనఖా నుండి విడిపించుకోవడానికి, జీవనోపాధికి, పిల్లల చదువులకు, ఆరోగ్య ఖర్చులకు సరిపోయేటట్లు ఉండాలి.

రైతులు అధిక ఖర్చుతో కూడుకున్న వ్యవసాయ పద్ధతుల నుండి తక్కువ ఖర్చు గల సుస్థిర వ్యవసాయ పద్ధతులకు మారడానికి ప్రభుత్వం సహాయం అందించాలి. వ్యవసాయ సంక్షోభపు మూల కారణాలను పరిష్కరించడానికి ప్రభుత్వం అన్ని వ్యవసాయ కుటుంబాలకు ఆదాయ భద్రతను కల్పించాలి. సుస్థిర వ్యవసాయాన్ని ప్రోత్సహించాలి. వర్షాధారిత ప్రాంతాలలో అధిక ప్రభుత్వ పెట్టుబడులతో, సాగు నీటి వసతిని, చిరు ధాన్యాలు, పప్పు ధాన్యాలు నూనె గింజలు వంటి రకరకాల పంటలను, పశుసంపద ఆధారిత జీవనోపాధులను పెంపొందించాలి. వ్యవసాయంపై ఆధారపడిన వారందరికి భూమి, నీరు మొదలైన జీవనోపాధి వనరులపై హక్కులు కల్పించాలి.

*(రైతు స్వరాజ్య వేదిక చేసిన అధ్యయనాల ఆధారంగా)*

*(రచయిత సామాజిక విశ్లేషకురాలు)*

**రచయితలకు సూచన :** తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. - సం.

# దిగ్విజయ్ మాయాజాలంలో తెలంగాణ

*తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షతో ప్రజలు ఉవ్వెత్తున ఉద్యమం చేస్తున్న ప్రతి సందర్భంలోనూ కాంగ్రెస్ పార్టీ తన కుటిల నీతులతో ఉద్యమాన్ని చల్లార్చడానికి ప్రయత్నిస్తోందని అంటున్నారు* **ఎ . రాజేంద్ర బాబు**

శంకరాచార్యుల వారు అరమోడ్పు కన్నులతో వేదాంత సారం చెపుతున్నారు. భక్తులంతా పారవశ్యంలో మునిగి పోయి తన్మయత్వం చెందుతూ తలలూపుతున్నారు. 'ఈ ప్రపంచమంతా ఒక మాయ. పుట్టడం, గిట్టడం అంతా మాయ...'. వేదాంతం చెపుతున్న స్వాముల వారు, వింటున్న ప్రజలు మాయా ప్రపంచంలోకి జారుకుంటున్నారు. ఇంతలో మదించిన ఒక ఏనుగు ఘీంకరిస్తూ రాజు గారి గజశాల నుండి తప్పించుకొని కంగారులో అటు వైపు వచ్చింది. హాహాకారాలు చేస్తూ ప్రజలంతా చెల్లాచెదురయ్యారు. గోచి సరిచేసుకుంటూ, ఊడిన పిలకను సర్దుకుంటూ వేదాంతుల వారు కూడా పలాయనం చిత్తగించారు. ఆ హడావిడిలో కూడా వివేచన కోల్పోని ఒక శిష్య పరమాణువు, పరుగెత్తుతున్న గురువు గారిని ఆపి, 'స్వామీ, ఈ జగమంతా మాయ ఈ బతుకంతా మాయ అన్నారు. మరి గజరాజును చూసి మీరెందుకు పారిపోతున్నారు. తన బలమైన కాళ్లతో అది మనల్ని తొక్కి వేసినా, చావు కూడా మాయేకదా. మీరెందుకు భయపడి పరుగెడుతున్నారు స్వామీ' అని అమాయకంగా ప్రశ్నించాడు. నిర్ఘాంతపోయిన ఆచార్యుల వారు 'నాయనా గజం మాయ, నేను పలాయనం చిత్తగించడం కూడా మాయ' అని సెలవిచ్చి తుర్రుమన్నారట!

ఇదంతా పుక్కిటి పురాణమని కొట్టి పారెయ్యకండి. స్వాముల వారి స్థానంలో దిగ్విజయ సింగ్‌ను ఊహించుకోండి. కొత్తగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కాంగ్రెస్ వ్యవహారాల బాధ్యతను చేపట్టిన డిగ్గీ రాజా వారు కాంగ్రెస్ వ్యవహార శైలిని చాలా బాగా వంటబట్టిచ్చుకున్నవారు. ప్రజలను మాయ మాటలతో ముంచెత్తి తమ పబ్బం గడుపు కోవడంలో సిద్ధహస్తులు. రాష్ట్ర రాజకీయాలలో ఆయన రంగప్రవేశం చాలా ఆర్భాటంగా జరగాలి. మరి ఎలా? తెలంగాణ సమస్యను స్పృశించక పోతే ఉద్వేగం లేదు. ఉత్సాహం లేదు. సమస్యకు పరిష్కారం కనుక్కుంటానని భీకర వాగ్దానాలు చేశాడు. ఇక ఆలస్యం జరగదని నమ్మ బలికాడు. ప్రజలను మాయా ప్రపంచంలోకి రండి రండి అని ఆహ్వానించాడు. అబ్రకదబ్ర అని మంత్రాలు చదివాడు. కోర్ కమిటీ అన్నాడు. తెలంగాణ వచ్చేసినట్టే అన్నాడు. ఇంతలోనే మత్తెక్కిన గజరాజు లాగా పంచాయితీ ఎన్నికలు కదం తొక్కాయి. జనం కన్ఫ్యూషన్‌లో పడిపోయారు. తెలివి వచ్చిన తర్వాత చూసుకుంటే నామినేషన్ల గడువు అయిపోయింది. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులు అంతటా నామినేషన్లు వేశారు. రంగంలో ఉంటే చాలు. కులం అనవచ్చు. మతం అనవచ్చు. సంక్షేమ పథకాలు అనవచ్చు. మందు పోయవచ్చు. డబ్బు పంచవచ్చు. వాగ్దానాలు చేయవచ్చు. ఓట్లు రాబట్టవచ్చు. ఆ తర్వాత కథ కంచికి మనమింటికి.

కొన్నాళ్ల క్రితం గుజ్జర్ల సమస్యను ఒక కొలిక్కి తీసుకురావాలను కున్నప్పుడు, ఆనాటి ప్రభుత్వం రాస్తారోకో చేస్తున్న ఆందోళనకారుల దగ్గరికి వచ్చింది. జయపూర్‌కు చర్చలకు రమ్మంటే గుజ్జర్ల నాయకులు తిరస్కరించారు. తమ వద్దకే రాజస్థాన్ ముఖ్యమంత్రిని రమ్మన్నారు. ఒక కేంద్ర మంత్రి, రాజస్థాన్ ముఖ్యమంత్రి కలిసి ఉద్యమ నాయకత్వం సూచించిన స్థలానికి వెళ్లి, వారితో చర్చలు జరిపి ఆందోళన విరమింప చేశారు.

గూర్ఖాల్యాండ్ విషయంలోను ఇదే జరిగింది. తాత్కాలికంగా గూర్ఖాల్యాండ్ ఆందోళన కారులను శాంతింపచేసే ప్రక్రియలో భాగంగా పశ్చిమ బెంగాల్ రాష్ట్రం గూర్ఖాల్యాండ్ ప్రాంతంలోని సిలిగురి పట్టణ సమీపంలో పింతాలి అన్న గ్రామంలో అప్పటి కేంద్ర హోంమంత్రి చిదంబరం, రాష్ట్ర ముఖ్యమంత్రి మమతా బెనర్జీ సమక్షంలో గూర్ఖాల్యాండ్ ఉద్యమ నాయకులు, ప్రభుత్వ ఉన్నతాధికారులు అంగీకార పత్రం మీద సంతకం చేశారు.

1969 ఉద్యమ సందర్భంగా అప్పటి ప్రధానమంత్రి హుటాహుటిగా హైదరాబాద్ పరుగెత్తుకొచ్చి రాజ్‌భవన్‌లో కూర్చొని రాత్రికి రాత్రి ఉద్యమ నాయకులను పిలిపించుకొని చర్చించింది. రాష్ట్రం సమైక్యంగా ఉంటుందన్న నిర్ణయం తీసుకున్నప్పటికీ, సమస్య తీవ్రత గుర్తించి కొన్ని చర్యలు తీసుకుంది. ఇటీవల జరిగిన దిగ్విజయ మాయలో ఉద్యమ నాయకుల ప్రసక్తే లేదు. జెఎసి నాయకులు ఢిల్లీ వెళ్లి దిగ్విజయ సింగ్‌ను కలిసే ప్రయత్నం చేసినా, ఆయన వారితో తూతూమంత్రంగా ముక్తసరిగా మాట్లాడి పంపించేసాడు. మొన్న జరిగిన చర్చలంతా కాంగ్రెస్ పార్టీకి సంబంధించినవి. పార్టీకి చెందిన మూడు ప్రాంతాల ప్రతినిధులను పిలిచి మాట్లాడారు. సమస్యను నిజంగా పరిష్కరించాలనుకొంటే ఉద్యమ నాయకులతో మాట్లాడాలి. మరి ఇంతకు ముందు భారత ప్రభుత్వం చేసిన డిసెంబర్ 9 ప్రకటన ఏమయ్యింది? కేంద్ర హోంశాఖ పాన్పు మీద అప్పటి ముఖ్యమంత్రి రోశయ్య అఖిల పక్ష సమావేశం ఏర్పాటు చేశారు. ఆ సమావేశం ఆమోదించిన ఏకగ్రీవ తీర్మానాన్ని పార్టీ అధిష్టానానికి, కేంద్ర ప్రభుత్వానికి నివేదించాడు. సి డబ్ల్యు సి దాని పై చర్చించి ప్రభుత్వానికి సిఫారసు చేసిన తర్వాతే హోం మంత్రి ప్రకటన వెలువడింది. ఇప్పుడు మళ్లీ సిడబ్ల్యుసి అంటారేమిటి? ఇదంతా చిత్తశుద్ధి లేని వ్యవహారం.

'సీమాంధ్రలో వైఎస్ఆర్ పార్టీ ప్రభంజనం వీస్తుంది. అక్కడ కాంగ్రెస్‌కు ఒక్క సీటు గూడా రాదు. తెలంగాణ ఇస్తే ఈ ప్రాంతంలో చాలా సీట్లు గెలిచే అవకాశం ఉంటుంది. కాబట్టి కాంగ్రెస్ తప్పక

# మార్క్స్‌తో అమెరికన్ విలేఖరి సంభాషణ

***కార్ల్ మార్క్స్ తన జీవితకాలంలోనే సుప్రసిద్ధుడైనప్పటికీ ఆ కాలపు పత్రికలలో అచ్చయిన ముఖాముఖీ సంభాషణలు తక్కువ. పరిశోధకులు వెలికితీసిన ఇంటర్వ్యూలు అరడజను లోపే. వాటిలో ఒకటైన అరుదైన ముఖాముఖీ.***

సోషలిజాన్ని, ట్రేడ్ యూనియన్లను నిరంతరం విమర్శిస్తుండిన అత్యంత మితవాద దినపత్రిక షికాగో ట్రిబ్యూన్ 1879 జనవరి 5 సంచికలో ఒక విలేఖరి కార్ల్ మార్క్స్‌తో జరిపిన ఈ ముఖాముఖీ అచ్చయింది. ఆ విలేఖరి పేరు ఎచ్. అనే పొడి అక్షరంతో మాత్రమే ఉంది. ఆ విలేఖరి పూర్తి పేరేమిటో పరిశోధకులు కూడ కనిపెట్టలేక పోయారు. సోషలిజాన్ని వ్యతిరేకించే ఆ మితవాద పత్రికకు మార్క్స్ ఎందుకు ఇంటర్వ్యూ ఇచ్చాడో తెలియదు. మార్క్స్, ఎంగెల్స్ లు గాని, వారి సమకాలికులు గాని మరెక్కడా ఈ ఇంటర్వ్యూ ప్రస్తావన చేయలేదు. కాని ఇంటర్వ్యూ అచ్చయిన వారంలోపే అమెరికాలోని జర్మన్–ఇంగ్లిష్ కార్మికవర్గ దినపత్రికలు న్యూయార్క్ ఫోక్స్ జీటుంగ్, షికాగో వోర్బోట్ దాన్ని పునర్ముద్రించాయి. అయితే ఈ రెండు పునర్ముద్రణలు కూడ అసంపూర్ణ, తప్పుడు అనువాదాలు, తమ రాజకీయ ప్రయోజనాల కోసం మార్క్స్ మాటలను అటూ ఇటూ మార్చినవి. షికాగోలోని సోషలిస్ట్ వర్కర్స్ పార్టీ వారపత్రిక ది సోషలిస్ట్ ఈ ఇంటర్వ్యూలోని కొంత భాగాన్ని జనవరి 11న పునర్ముద్రించింది. షికాగో వోర్బోట్‌లో అచ్చయిన అనువాదాన్ని డానిష్ దినపత్రిక సోషల్ డెమొక్రాట్ ఏప్రిల్‌లో ప్రచురించింది. ఈ ఇంటర్వ్యూ ఉన్నదనే విషయమే ఆ తర్వాత డెబ్బై ఆరేళ్ల పాటు ఎవరికీ తెలియకుండా ఉండిపోయింది. అమెరికాలో అచ్చయిన మార్క్స్ ఎంగెల్స్ రచనల గురించి పరిశోధించిన కార్ల్ ఒబెర్‌మన్ ది సోషలిస్ట్ పత్రికలో వెలువడిన భాగాన్ని గుర్తించి, 1964లో అచ్చయిన తన పుస్తకంలో దాన్ని ఉటంకించారు. అలాగే అదే విషయం మీద పరిశోధించిన లూయిస్ లాజరస్ 1964 మేలో రాసిన మార్క్స్ ఎంగెల్స్‌ల అమెరికన్ పత్రాలు పుస్తకంలో రచనల జాబితాలో ఈ ఇంటర్వ్యూను చేర్చారు. లాజరస్ ఇచ్చిన సమాచారం ఆధారంగా పరిశోధించిన బెర్ట్ ఆండ్రియాస్ 1965లో తొలిసారిగా ఆ ఇంటర్వ్యూ పూర్తి పాఠాన్ని సంపాదించి ఒక జర్మన్ పత్రికలో ప్రచురించారు. ఆ ఇంటర్వ్యూకు విస్తృత ప్రచారం అవసరమని భావించిన సంపాదకుడు థామస్ డబ్ల్యు పోర్టర్ వివరణలతో, పాదసూచికలతో ఇంటర్వ్యూ పూర్తిపాఠాన్ని 1972లో పుస్తకరూపంలో ప్రచురించారు. ఆ పుస్తకాన్ని న్యూయార్క్ కు చెందిన అమెరికన్ ఇన్ స్టిట్యూట్ ఫర్ మార్క్సిస్ట్ స్టడీస్ ప్రచురించింది. పోర్టర్ రాసిన వివరణలతో సహా ఈ ఇంటర్వ్యూను మార్క్సిస్ట్ ఇంటర్నెట్ ఆర్కైవ్ (http://www.marxists.org/archive/marx/bio/media/marx/79_01_05.htm)లో చూడవచ్చు.

లండన్, డిసెంబర్ 18 (1878) – లండన్‌లోని వాయవ్య భాగంలోని హావర్ స్టాక్ హిల్ ప్రాంతంలో ఒక చిన్న భవనంలో ఆధునిక సోషలిజానికి మూలస్తంభమైన కార్ల్ మార్క్స్ నివసిస్తున్నారు. విప్లవ సిద్ధాంతాలను ప్రచారం చేస్తున్నారనే కారణం మీద ఆయనను 1844లో స్వదేశమైన జర్మనీ నుంచి బహిష్కరించారు. ఆయన తిరిగి 1848లో స్వదేశం వెళ్లగలిగారు గాని కొద్ది నెలలలోనే మళ్లీ బహిష్కరణకు గురయ్యారు. తర్వాత ఆయన పారిస్‌లో నివాసం ఏర్పరచుకున్నారు. తన రాజకీయ సిద్ధాంతాల వల్ల అక్కడినుంచి కూడ 1849లో బహిష్కరణకు గురయ్యారు. అప్పటినుంచీ ఆయన లండన్ నే స్థావరంగా

---

తెలంగాణ ఇస్తుంది ’ అని తెలంగాణ వాదుల్లో ఆశావహులు పదే పదే విశ్వాసం వ్యక్త పరుస్తూ ఉంటారు. తెలంగాణ రాష్ట్రాన్ని ఎన్నికల ద్వారా సాధిద్దామన్న తప్పుడు వ్యూహాన్ని ప్రచారం చేయడం వల్ల ప్రజల్లో ఈ అభిప్రాయం నాటుకుపోయింది. ఎన్నికల ద్వారా ప్రత్యేక రాష్ట్రం వచ్చేట్టయితే తెలంగాణ రాష్ట్రం 1969లోనే ఏర్పడి ఉండేది. ఒక ఓటు – రెండు రాష్ట్రాలు అన్న నినాదంతో 1999 ఎన్నికలలో కొంత లబ్ధి పొందిన బిజెపి, ప్రభుత్వం ఏర్పాటు చేసి కూడా మాట నిలుపుకోలేదు కదా! కారణాలు ఏం చెప్పినా రాష్ట్రం ఏర్పడలేదన్నది వాస్తవం. ఇప్పుడు వైఎస్‌అర్‌సిపి పోరాటం రాష్ట్రంలో అధికారం కోసమే కాని, కేంద్రంలోని యుపిఎతో దానికేం పేచీ లేదు. ఆ పార్టీ గౌరవాధ్యక్షురాలు కేంద్రంలో యుపిఎ నే సమర్థిస్తామని స్పష్టంగా ప్రకటించారు కూడా. దళిత క్రిస్టియన్ ఓటర్లు సీమాంధ్రలో వైఎస్‌ఆర్ పార్టీని బలపరుస్తున్న ప్రధాన సామాజిక వర్గం. కేంద్రంలో సోనియాను, కాంగ్రెస్‌ను బలపరిచే వర్గం కూడా అదే. ఆ వర్గం అభీష్టానికి భిన్నంగా వైఎస్‌ఆర్ పార్టీ చర్యలు తీసుకొంటే, ఆ పార్టీకి అక్కడ పుట్టగతులు ఉండవు. కాబట్టి సీమాంధ్రలో వైఎస్‌ఆర్ పార్టీ గెలిచినా కాంగ్రెస్‌కు నష్టం లేదు. అందుకోసం తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేస్తుంది అనుకోవడం వట్టి భ్రమ మాత్రమే!

తెలంగాణ ఉద్యమానికి బలమైన సిద్ధాంత నేపథ్యం ఉంది. ప్రజల భావోద్వేగం అండగా ఉంది. ఉద్యమ సంస్థలు నిర్మాణపరమైన సమస్యలు అధిగమించి రాబోయే సార్వత్రిక ఎన్నికల కంటే ముందే మూడు నాలుగు నెలలు విరామం లేకుండా మొత్తం సమాజాన్ని స్తంభింపచేసే ఉద్యమ రూపాలు చేపడితేనే తెలంగాణ ప్రజల కలలు సాకారం అయ్యే అవకాశం ఉంటుంది.

*(రచయిత తెలంగాణ కో–ఆర్డినేషన్ కమిటి సభ్యుడు)* వీ

చేసుకుని ఉన్నారు. ఆయన విశ్వాసాలే ఆయనకు మొదటినుంచీ ఇబ్బందులు తెచ్చిపెడుతున్నాయి. ఆయన ఇంటి వాలకం చూస్తే తన సిద్ధాంతాల వల్ల ఆయనకు సౌకర్యవంతమైన జీవితమేమీ దక్కలేదని అర్థమవుతుంది. ఇన్ని సంవత్సరాలుగా ఆయన తన భావాలకు స్థిరంగా అంటిపెట్టుకుని వాటిని నిజాయితీతో ప్రచారం చేస్తూ వస్తున్నారు. నిస్సందేహంగా తన భావాలలో ఆయనకు గాఢమైన విశ్వాసం ఉన్నదని రుజువవుతుంది. ఆ భావాల ప్రచారాన్ని మనం ఎంతగా ఈసడించుకున్నప్పటికీ ఈ గౌరవనీయ ప్రవాసి నిరాడంబరత్వం చూస్తే ఆయనను కొంతవరకు గౌరవించక తప్పదు.

ఆయనతో ముఖాముఖీ కోసం మా విలేఖరి ఆయనను రెండు మూడుసార్లు కలిశారు. ప్రతిసారీ కూడ డాక్టర్ గారు తన గ్రంథాలయంలో ఒకచేతిలో పుస్తకం, మరొకచేతిలో సిగరెట్ తో కనిపించారు. ప్రస్తుతం ఆయన వయసు డెబ్భై దాటి ఉండవచ్చు. ఆయనది దృఢమైన శరీరం. బలంగా, నిటారుగా ఉంటారు. తలను పరికించి చూస్తే ఆయన మేధావి అని అభిప్రాయం కలుగుతుంది. ఆయనవి సంస్కారవంతుడైన యూదు హావభావాలు. ఆయన తల వెంట్రుకలూ, గడ్డమూ కూడ ఒత్తుగా పొడుగ్గా, ఇనుములా ముదురు రంగులో ఉన్నాయి. నల్లని కళ్లు ఒత్తయిన కనుబొమల గుబుర్ల నీడలో తళతళ మెరిసిపోతున్నాయి. కొత్తవాళ్ల పట్ల ఆయన చాల జాగ్రత్తగా ఉంటారు. విదేశస్తులెవరయినా లోపలికి సులభంగానే వెళ్లవచ్చు. కాని ప్రాచీన మానవిలా కనిపించే ఒక జర్మన్ స్త్రీ (హెలెన్ డెముత్) అతిథుల రాకపోకలను పర్యవేక్షిస్తుంటారు. అతిథులు జర్మనీ నుంచి వచ్చినవారయితే తగిన పరిచయ పత్రాలు లేకుంటే లోపలికి ప్రవేశం లేదు. కాని మీరు ఒకసారి గ్రంథాలయంలోకి అడుగు పెట్టాక, ఆయన తన ఒంటి కంటి అద్దంతో, ఓరకంట మీ మేధో వైశాల్యాన్నీ లోతునూ అంచనా వేశాక తన సంకోచాలన్నీ వదిలేస్తారు. ప్రపంచవ్యాప్తంగా మనుషుల గురించీ, వస్తువుల గురించీ తనకున్న పరిజ్ఞానాన్నంతటినీ, మీకు ఆసక్తికరమైన వాటన్నిటినీ విప్పిచెబుతారు. ఆయన సంభాషణ ఒకేఒక్క మూసలో సాగదు. ఆ గ్రంథాలయం బీరువాలలో ఉన్న పుస్తకాలు ఎంత వైవిధ్యభరితమైనవో ఆయన సంభాషణా అంతే. ఏ వ్యక్తినైనా అతను చదివే పుస్తకాలను బట్టి సాధారణంగా అంచనా వేయవచ్చు. నేను అలా పైపైన చూస్తేనే నాకక్కడ షేక్స్ పియర్, డికెన్స్, థాకరే మోలియర్, రాసిన్, మోంటేన్, బేకన్, గెథె, వోల్టేర్, పేయిన్ కనబడ్డారు. ఇంగ్లిష్, అమెరికన్, ఫ్రెంచి ప్రభుత్వ నివేదికలు, రష్యన్, జర్మన్, స్పానిష్, ఇటాలియన్ వగైరా భాషలలో రాజకీయ, తాత్విక గ్రంథాలు కనబడ్డాయి. ఆయనను ఎలా అంచనా వేయాలో మీరే నిర్ణయించుకోవచ్చు.

గత ఇరవై సంవత్సరాలలో అత్యధిక ప్రాధాన్యత గల అమెరికా సమస్యలతో ఆయన సాన్నిహిత్యం నన్ను అబ్బురపరచింది. ఆయా విషయాల మీద ఆయన అవగాహన, మన జాతీయ, రాష్ట్రీయ శాసనాలను విమర్శిస్తున్నప్పుడు ఆయన చూపిన ఆశ్చర్యకరమైన కచ్చితత్వం నన్నెంతగా ఆకట్టుకున్నాయంటే ఆయనకు ఈ సమాచారమంతా ఏవో అంతర్గత వనరులనుంచి అంది ఉంటుందని నాకనిపించింది. కాని, నిజం చెప్పాలంటే ఆయన అవగాహనలు అమెరికాకు మాత్రమే పరిమితమైనవి కావు, యూరప్ మొత్తానికీ ఆయన అవగాహనలు విస్తరించాయి. తన ప్రధాన వ్యాపకమైన సోషలిజంపై మాట్లాడేటప్పుడు కూడ ఆయన గురించి సాధారణంగా ప్రచారంలో ఉన్న నాటకీయ ఉద్వేగభరిత సన్నివేశాలు ఏమీ జరగలేదు. 'మానవజాతి విముక్తి' కోసం తన ఆదర్శవాద ప్రణాళికల గురించి ఆయన ఎంత గంభీరంగా, నిజాయితీతో వివరించారంటే ఆ సిద్ధాంతాలు ఈ శతాబ్దంలో కాకపోయినా వచ్చే శతాబ్దంలోనైనా సాకారమవుతాయనే దృఢవిశ్వాసం ఆయనలో కనిపించింది.

బహుశా డా. కార్ల్ మార్క్స్ గురించి అమెరికాలో ఎక్కువగా తెలిసినది ఆయన కాపిటల్ అనే గ్రంథ రచయిత అని. ఒక అంతర్జాతీయ సంఘపు (ఇంటర్నేషనల్) నిర్మాత అని. లేదా దాని మూలస్తంభాలలో ఒకరని. ఆ సంఘపు ప్రస్తుత స్థితి గురించి ఆయన అభిప్రాయాలు ఈ కింద ఇంటర్వ్యూలో మీరు చూస్తారు. కాని, ఈ లోపు నేను మీకు ఆ సంఘపు సాధారణ సూత్రాలలోంచి కొన్ని భాగాలు చెప్పదలచాను. ఈ సూత్రాలను దాని సర్వసభ్య సమావేశపు అనుమతితో 1871లో అచ్చువేశారు. అవి చదివితే మీ అంతట మీరే దాని లక్ష్యాల గురించీ, ఆశయాల గురించీ నిష్పక్షపాతమైన అంచనాకు రాగలరు. దాని పీఠికలో శ్రామికవర్గాలు తమ విముక్తిని తామే గెలుచుకోవలసి ఉందని రాశారు. శ్రామిక వర్గాల విముక్తి కొరకు పోరాటమంటే వారి వర్గ అధికారాల కోసం, గుత్తాధిపత్యాల కోసం పోరాటం కాదు. అందరికీ సమాన హక్కుల కోసం, బాధ్యతల కోసం, మొత్తంగా సమస్త వర్గపాలన రద్దు కోసం జరిగే పోరాటం అని రాశారు. శ్రమ చేసే వ్యక్తిని శ్రమసాధనాల మీద అంటే జీవనాధారాల మీద గుత్తాధిపత్యం గల వ్యక్తి ఆర్థికంగా లోబరచుకోవడమే సకల రూపాల బానిసత్వానికీ, సమస్త సామాజిక దౌర్భాగ్యానికీ, మానసిక పతనానికీ, రాజకీయ పరాధీనతకూ మూలకారణం అని రాశారు. 'శ్రామికవర్గాల సార్వత్రిక విముక్తి' ధ్యేయంగా ఇప్పటివరకు జరిగిన ప్రయత్నాలన్నీ విఫలం కావడానికి కారణం 'ప్రతిదేశంలోనూ శ్రామిక వర్గంలోని అనేక విభజనల మధ్య సంఘీభావం లేకపోవడమే'నని రాశారు. 'ఇప్పటివరకూ సంబంధం లేకుండా ఉన్న ఉద్యమాలన్నీ తక్షణమే ఏకం కావాలని' ఈ పీఠికలో పిలుపునిచ్చారు. అంతేకాదు, ఇంటర్నేషనల్ అసోసియేషన్ 'బాధ్యతలు లేకుండా హక్కులు ఉండవనీ, హక్కులు లేకుండా బాధ్యతలు ఉండవనీ' గుర్తిస్తుందని కూడ చెప్పారు. ఈ సంఘంలో సభ్యులు కావాలంటే కార్మికులు కావలసిందే. 'విభిన్న దేశాలలోని కార్మికవర్గ సంస్థల మధ్య కేంద్ర సమాచార, సహకార మాధ్యమంగా' ఈ సంఘాన్ని లండన్‌లో స్థాపించారు. విభిన్న దేశాలలోని ఆ వివిధ సంస్థలకు ఒకే లక్ష్యం ఉంది. అది: 'కార్మికవర్గాల పరిరక్షణ, పురోగతి, సంపూర్ణ విముక్తి'. 'ఇంటర్నేషనల్ అసోసియేషన్ లోని ఏ సభ్యుడైనా ఒక దేశం నుంచి మరొక దేశానికి తన నివాసాన్ని మార్చుకున్నప్పుడు, సోదర కార్మికుల సౌభ్రాతృత్వ సహాయాన్ని పొందుతాడు' అని కూడ ఆ పత్రం రాసింది.

సంవత్సరానికి ఒకసారి ఈ సంఘ సర్వసభ్య సమావేశం జరుగుతుంది. దానితోపాటు సంఘానికి చెందిన విభిన్న జాతీయ, స్థానిక బృందాల మధ్య అంతర్జాతీయ వ్యవస్థ ఉంటుంది, ఒక దేశంలో జరిగే తమ వర్గ ఉద్యమాల గురించి మరొక దేశపు కార్మికులకు నిరంతరం తెలియజేసే సాధారణ మండలి ఉంటుంది. ఇంటర్నేషనల్‌లో చేరడానికి కొత్త శాఖల నుంచి అభ్యర్థనలను ఈ మండలి పరిశీలించి తగిన చర్యలు తీసుకుంటుంది. విభిన్న శాఖల మధ్య వచ్చే విభేదాలను పరిష్కరిస్తుంది. అమెరికన్ పదజాలంలో చెప్పాలంటే 'యంత్రాన్ని నడిపిస్తుంది'. ప్రతి సభ్యుడూ ఏడాదికి ఒక ఇంగ్లిష్ పెన్నీ సభ్యత్వ రుసుము చెల్లించాలి.

సాధారణ మండలి ఖర్చులన్నీ ఆ నిధులనుంచే జరుగుతాయి. ఆ తర్వాత వేరువేరు దేశాలలో జాతీయ మండలులు, లేదా కమిటీలు, స్థానిక శాఖలు ఉంటాయి. జాతీయ మండలులు కనీసం ప్రతినెలా ఒక నివేదికను సాధారణ మండలికి పంపాలి. కనీసం మూడునెలలకోసారి తమ శాఖల పాలనా, ఆర్థిక వ్యవహారాలపై నివేదికను పంపాలి. ఇంటర్నేషనల్ మీద విమర్శలు ప్రచురితమైనప్పుడు, దగ్గరిలోని శాఖ గాని, కమిటీ గాని ఆ విమర్శ ప్రతిని వెంటనే సాధారణ మండలికి పంపాలి. కార్మికవర్గాలలో మహిళల శాఖలను ఏర్పాటు చేయడం మీద ప్రత్యేక శ్రద్ధ పెట్టాలని కూడ సిఫారసు చేశారు.

సాధారణ మండలి సభ్యులు: ఆర్ ఆపిల్ గార్త్, ఎం టి బూన్, ఫ్రెడరిక్ బ్రాడ్నిక్, జి ఎచ్ బట్టరీ, ఇ డెలాహాయ్, యూజిన్ డుపాంట్, విలియమ్ హేల్స్, జి హార్స్, జూల్స్ జొహాన్నా, హారీ లా, ఫ్రెడరిక్ లెస్నర్, లోఛ్నర్, చార్లెస్ లాంగెట్, సి మార్టిన్, జెవీ మారిస్, హెన్రీ మేయో, జార్జ్ మిల్నర్, చార్లెస్ ముర్రే, ప్ఫాండర్, జాన్ పాచ్, రుహ్ల్ సాడ్లర్, కొవెల్ స్టెప్నీ, ఆల్ఫ్రెడ్ టేలర్, డబ్ల్యు టౌన్ షెండ్, ఇ వైల్లాన్ట్, జాన్ వెస్టన్. ఇక వివిధ దేశాలతో సమాచార సంబంధాలు నెరిపే కార్యదర్శులు: ఆస్ట్రియా, హంగరీలకు లియో ఫ్రాంకెల్, బెల్జియంకు ఎ. హెర్మన్, డెన్మార్క్‌కు టి. మాటర్ షెడ్, ఫ్రాన్స్‌కు ఎ సెర్రాయిలర్, జర్మనీ, రష్యాలకు కార్ల్ మార్క్స్, హాలండ్‌కు చార్లెస్ రోచట్, ఐర్లాండ్‌కు జె పి మెక్డానెల్, ఇటలీ, స్పెయిన్‌లకు ఫ్రెడరిక్ ఎంగెల్స్, పోలాండ్ కు వాలెరీ వ్రొబ్లెవ్స్కీ, స్విట్జర్లాండ్ కు హెర్మాన్ యుంగ్, యునైటెడ్ స్టేట్స్‌కు జె జి ఎక్కారియస్, అమెరికాలోని ఫ్రెంచి శాఖలకు ఎల్ మౌస్సు.

జె సి బాంక్రాఫ్ట్ డేవిస్ తన 1877 అధికారిక నివేదికలో ఇచ్చినది సోషలిజం గురించి చాల స్పష్టమైన, అత్యంత క్లుప్తమైన వివరణ అని నాకనిపించిందని నేను డా. మార్క్స్‌తో అన్నాను. అది 1875 మేలో జర్మనీలోని గోథాలో సోషలిస్టు పునర్నిర్మాణ నివేదిక నుంచి తీసుకున్నదని ఆయన అన్నారు. నిజానికి ఆ అనువాదం సరిగ్గా లేదని అంటూ ఆయన నాకోసం ఆ అంశాలను సరిగా అనువాదం చేశారు. ఆయన చెపుతుండగా నేను రాసుకున్న అంశాలు ఇవి:

| | |
|---|---|
| మొదటిది | : స్థానిక, జాతీయ ఎన్నికలతో సహా అన్ని ఎన్నికలలోను ఇరవై ఏళ్లకు పైబడిన పురుషులందరికీ సార్వత్రిక, ప్రత్యక్ష, రహస్య వోటు హక్కు ఉంటుంది. |
| రెండవది | : శాసనాధికారం ప్రత్యక్షంగా ప్రజలదే. యుద్ధ, శాంతి నిర్ణయాలను ప్రత్యక్ష ప్రజా వోటు ద్వారా నిర్ణయించాలి. |
| మూడవది | : ప్రతి ఒక్కరికీ సైన్యంలో చేరవలసిన బాధ్యత ఉంటుంది. ప్రత్యేకంగా ఎప్పుడూ ఉనికిలో ఉండే సైన్యం ఉండదు. |
| నాలుగవది | : పత్రికా చట్టాల గురించి, బహిరంగ సభల గురించి ప్రత్యేక చట్టాలన్నిటినీ రద్దు చేయడం జరుగుతుంది. |
| ఐదవది | : చట్టపరమైన పరిష్కారాలు ఉచితంగా దొరుకుతాయి. చట్టపరమైన విచారణలను ప్రజలే నిర్వహిస్తారు. |
| ఆరవది | : ప్రభుత్వమే, సాధారణంగా, నిర్బంధంగా, ఉచితంగా విద్యా శిక్షణ కల్పిస్తుంది. శాస్త్ర, మత స్వేచ్ఛ ఉంటుంది. |
| ఏడవది | : పరోక్ష పన్నులన్నిటినీ రద్దు చేస్తారు. స్థానిక జాతీయ ప్రభుత్వాలకు అవసరమయ్యే నిధులను ప్రత్యక్ష పద్ధతిలో, ఎక్కువ ఆదాయానికి ఎక్కువ పన్ను అనే పద్ధతిలో సేకరిస్తారు. |
| ఎనిమిదవది | : కార్మికవర్గాలలో ఒకరితో ఒకరు కలవడానికి స్వేచ్ఛ ఉంటుంది. |
| తొమ్మిదవది | : పురుషుల పనిదినం వ్యవధిని చట్టబద్ధంగా నిర్వచిస్తారు. స్త్రీల పనిదినం పరిమితంగా ఉంటుంది. పిల్లల శ్రమ నిషిద్ధం. |
| పదవది | : కార్మికుల జీవితాలను, ఆరోగ్యాలను పరిరక్షించే, కార్మికుల నివాస స్థలాలను, పనిస్థలాలను నియంత్రించే పారిశుద్ధ్య చట్టాలను కార్మికులే ఎంపిక చేసిన వ్యక్తులు అమలు చేస్తారు. |
| పదకొండవది | : జైళ్లలోని ఖైదీల శ్రమను గౌరవించే తగిన నిబంధనలు విధిస్తారు. |

బాంక్రాఫ్ట్ డేవిస్ నివేదికలో అదనంగా పన్నెండో అంశం కూడ ఉండింది. అది చాల ముఖ్యమైనది కూడ. 'పారిశ్రామిక సంస్థలకు ప్రజాస్వామిక నిర్దేశకత్వంలో రాజ్యమే సహాయం చేస్తుంది, పరపతి సౌకర్యం కలిగిస్తుంది.' ఈ అంశాన్ని ఎందుకు వదిలేశారని నేను డాక్టర్‌ను అడిగాను. ఆయన ఇచ్చిన జవాబు:

'గోథాలో 1875లో పునర్నిర్మాణం జరిగినప్పుడు, సోషల్ డెమొక్రాట్స్ మధ్య విభజన ఉండేది. ఒక బృందం లాసాల్ అనుయాయులుగా ఉండేవారు. మరొక బృందం మొత్తంగా అంతర్జాతీయ సంస్థ కార్యక్రమాన్ని ఆమోదిస్తుండేది. దాన్ని ఐసెనాక్ పక్షం అనేవాళ్లు. ఈ పన్నెండో అంశం అక్కడ వేదిక మీద చర్చకు రాలేదు. లాసాల్ అనుచరులకు రాయితీగా దాన్ని సాధారణ ఉపోద్ఘాతంలో చేర్చడం జరిగింది. ఆ తర్వాత దాని గురించి ఎవరూ మాట్లాడలేదు. ఆ అంశానికి ప్రత్యేక ప్రాధాన్యత ఏమీ లేదని, దాన్ని ఒక రాజీగా కార్యక్రమంలో చేర్చడం జరిగిందని వాస్తవం చెప్పకుండా, డేవిస్ దాన్ని కార్యక్రమంలోని కీలక సూత్రాలలో ఒకటిగా రాసేశాడు.'

'కాని, శ్రమసాధనాలను సమాజపు ఉమ్మడిగా ఆస్తిగా మార్చడమే తమ ఉద్యమపు అంతిమ ఫలితం అని సోషలిస్టులు సాధారణంగా చెపుతుంటారు గదా' అన్నాను నేను.

'ఔను, అదే మా ఉద్యమ అంతిమ ఫలితం. కాని అది చాల కాలం పట్టే, చాల విద్య అవసరమైన, ఒక ఉన్నతస్థాయి సామాజిక నిర్మాణపు అంశం.'

'ఈ కార్యక్రమం జర్మనీకి, మరి ఒకటి రెండుదేశాలకు మాత్రమే వర్తిస్తుంది గదా' అని నేను వ్యాఖ్యానించాను.

'ఆహా. మీరు ఈ కార్యక్రమం నుంచి మాత్రమే నిర్ధారణలకు వస్తే అంతే. పార్టీ సాగించే ఇతర కార్యక్రమాల గురించి మీకేమీ తెలియదన్నమాట., నిజానికి ఈ అంశాలలో చాలా భాగం జర్మనీకి బైట ప్రాముఖ్యత లేనివే. కాని స్పెయిన్, రష్యా, ఇంగ్లండ్, అమెరికాలలో వారి ప్రత్యేక సమస్యల మీద కార్యక్రమాలున్నాయి. వాటన్నిటి మధ్య ఉమ్మడి అంశం సాధించవలసిన అంతిమ లక్ష్యమే.'

'అంటే కార్మికుల ఆధిపత్యమా?'

'కాదు, కార్మికుల విముక్తి.'

'అమెరికాలో సాగుతున్న ఉద్యమం తీవ్రమైనదేనని యూరపియన్ సోషలిస్టులు భావిస్తారా?'

'ఔను. అది ఆ దేశపు అభివృద్ధికి సహజ ఫలితం. అక్కడి ఉద్యమాన్ని విదేశీయులు దిగుమతి చేశారని కొందరు అంటారు. యాభై ఏళ్లకింద

ఇంగ్లండ్‌లో కార్మికోద్యమాలు అంగీకారయోగ్యం కాని రోజుల్లో ఇటువంటి ఆరోపణనే విన్నాం. అప్పటికింకా సోషలిజం అనే మాటే లేదు. అమెరికాలో 1857 తర్వాతనే కార్మికోద్యమం కొట్టవచ్చినట్టుగా కనబడుతోంది. ట్రేడ్ యూనియన్లు విరివిగా తలెత్తాయి. వేరువేరు పరిశ్రమల కార్మికులు ఏకమైన విశాల కార్మిక సంఘాల సమాఖ్యలు వచ్చాయి. ఆ తర్వాత జాతీయ స్థాయి కార్మిక సంఘాలు వచ్చాయి. కాలక్రమంలో జరిగిన ఈ ప్రగతిని గనుక చూసినట్టయితే అమెరికాలో సోషలిజం ఎటువంటి విదేశస్తుల సహాయమూ లేకుండానే వికసించిందని అర్థమవుతుంది. అది కేవలం పెట్టుబడి కేంద్రీకరణవల్ల, కార్మికులకూ యజమానులకూ మధ్య మారిన సంబంధాల వల్ల జరిగింది.'

'మరి, ఇప్పటివరకూ సోషలిజం ఏం సాధించింది' అని మా విలేఖరి అడిగారు.

'రెండు విషయాలు' అని ఆయన మొదలు పెట్టారు. 'పెట్టుబడికీ శ్రమకూ మధ్య సాధారణ సార్వత్రిక పోరాటం – ఒక్క మాటలో చెప్పాలంటే ఆ పోరాటపు విశ్వవ్యాప్తత – ఉన్నదని సోషలిస్టులు చూపెట్టారు. తత్ఫలితంగా విభిన్న దేశాల కార్మికుల మధ్య అవగాహన కుదర్చడానికి ప్రయత్నించారు. కార్మికులను పనిలో పెట్టుకోవడంలో పెట్టుబడిదారులు విశ్వవ్యాప్తమయ్యారు గనుక, అమెరికాలో మాత్రమే కాక ఇంగ్లండ్‌లో, ఫ్రాన్స్‌లో, జర్మనీలో విదేశీ కార్మికులను ఆయా దేశాల కార్మికులకు వ్యతిరేకంగా రెచ్చగొట్టారు గనుక ఈ అవగాహన చాల అవసరమయింది. మూడు దేశాల కార్మికుల మధ్య అంతర్జాతీయ సంబంధాలు ఒక్కుమ్మడిగా తలెత్తాయి. తద్వారా సోషలిజం అనేది స్థానిక సమస్య కాదనీ, అది అంతర్జాతీయ సమస్య అనీ, దాన్ని కార్మికుల అంతర్జాతీయ ఆచరణ మాత్రమే పరిష్కరించగలదనీ తేటతెల్లమయింది. కార్మిక వర్గాలు ఎక్కడికక్కడ తమ ఉద్యమ అంతిమ లక్ష్యాలేమిటో తెలియకుండానే సద్యోజనితంగా లేచినిలుస్తాయి. సోషలిస్టులు ఆ ఉద్యమాన్ని తయారు చేయరు. కేవలం కార్మికులకు వారి ఉద్యమ స్వభావం ఏమిటో, దాని లక్ష్యాలు ఏమై ఉండాలో వివరిస్తారు.'

'దాని అర్థం ప్రస్తుత సామాజిక వ్యవస్థను కూలదోయడం అనేనా?' అని నేను అడ్డు తగిలాను.

'ఒకవంక భూమీ, పెట్టుబడీ తమ చేతుల్లో ఉన్న యజమానులు, మరొకవంక తమ చేతులలో ఉన్న శ్రమశక్తిని సరుకుగా అమ్ముకోవడం మినహా మరేమీ లేని కార్మికులు అనే ప్రస్తుత వ్యవస్థ కేవలం ఒకానొక చారిత్రక దశ అనీ, ఇది గడిచిపోయి దాని స్థానంలో మరొక ఉన్నత సామాజిక స్థితి వస్తుందనీ మేం విశ్వసిస్తాం' అని ఆయన కొనసాగించారు.

'ప్రతిచోటా సమాజం విభజించబడి ఉన్నదని మేం చూస్తాం. ఆధునిక దేశాల పారిశ్రామిక వనరుల అభివృద్ధితోపాటుగానే రెండువర్గాల శత్రుత్వం సాగిపోతున్నది. సోషలిస్టు దృక్పథం నుంచి చూసినప్పుడు దాని అర్థం ప్రస్తుత చారిత్రక దశను విప్లవీకరించడానికి అవసరమైన సాధనాలు ఉన్నాయనే. ఎన్నో దేశాలలో ట్రేడ్ యూనియన్ల భూమిక మీదనే రాజకీయ సంస్థలు నిర్మాణమయ్యాయి. అమెరికాలో ఒక స్వతంత్ర కార్మికవర్గ పార్టీ అవసరం స్పష్టంగా వ్యక్తమవుతున్నది. అమెరికన్ ప్రజలు ఇంకెంత మాత్రమూ రాజకీయవాదులను నమ్మే అవకాశం లేదు. ముఠాలూ, గుంపులూ శాసనసభలను ఆక్రమించాయి. రాజకీయాలు వ్యాపారంగా మారిపోయాయి. ఐతే ఈ విషయంలో అమెరికా ఒంటరి కాదు. అక్కడి ప్రజలు యూరపియన్ల కన్న ఎక్కువ నిర్ణయాత్మకమైనవారు. అక్కడ వ్యవహారం తొందరగా తెమిలిపోతుంది. సముద్రానికి ఇవతలి వైపు కన్న అవతలి వైపు ప్రవచనాలూ కపటత్వమూ తక్కువ.'

జర్మనీలో సోషలిస్టు పార్టీ త్వరితగతిన పురోగమించడానికి కారణమేమిటని నేనాయనను అడిగాను. ఆయన ఇలా జవాబిచ్చారు:

'ప్రస్తుత సోషలిస్టు పార్టీ ఆలస్యంగా వచ్చింది. వారిది ఫ్రాన్స్, ఇంగ్లండ్‌లో ముందుకొచ్చినలాంటి ఊహాస్వర్గ ప్రణాళిక కాదు. జర్మన్ మేధ ఇతరుల కన్న ఎక్కువగా సిద్ధాంతీకరించడానికి అలవాటు పడినది. గత అనుభవాల నుంచి జర్మన్లు ఏదో ఒక ఆచరణాత్మకమైన దాన్ని అభివృద్ధి చేయదలచారు. ఇతర దేశాలతో పోలిస్తే జర్మనీలో ఈ ఆధునిక పెట్టుబడిదారీ వ్యవస్థ చాల కొత్తదని మీరు గుర్తుంచుకోవాలి. ఫ్రాన్స్ లోను, ఇంగ్లండ్ లోను పాతబడిపోయిన ప్రశ్నలను ఇక్కడ మళ్లీ లేవనెత్తడం జరిగింది. ఆ రాజ్యాలు ఏ రాజకీయ ప్రభావాలకు తలవంచాయో అవే రాజకీయ ప్రభావాలు జర్మనీలో శ్రామిక వర్గాలు సోషలిస్టు సిద్ధాంతాలతో ఉత్తేజితం కాగానే పునరుజ్జీవం పొందాయి. అందువల్ల దాదాపు ఆధునిక పారిశ్రామిక అభివృద్ధి మొదలైనప్పటినుంచీ కూడ వారు ఒక స్వతంత్ర రాజకీయ పార్టీని ఏర్పరచుకున్నారు.

జర్మన్ పార్లమెంటులో వారికి వారి సొంత ప్రతినిధులు ఉండేవారు. అప్పటికి ప్రభుత్వ విధానాలను వ్యతిరేకించే మరొక పార్టీ ఏదీ లేకుండింది గనుక ఆ బాధ్యత వారిపైననే పడింది. ఆ పార్టీ చరిత్రనంతా వివరించడానికి చాల సమయం పడుతుంది గాని ఒక్క మాట మాత్రం చెప్పగలను: అమెరికా, ఇంగ్లండ్ లలోని మధ్యతరగతుల వారి కంటె భిన్నంగా, జర్మనీలోని మధ్యతరగతుల వారు అతిపెద్ద పిరికిపందలు కానట్టయితే, ప్రభుత్వ వ్యతిరేక రాజకీయ కృషి అంతా వాళ్లే చేసి ఉండవలసింది.'

ఇంటర్నేషనల్‌లో లాసాల్ అనుచరుల సంఖ్యాబలం ఎంత అని నేనాయనను అడిగాను.

'లాసాల్‌కు సొంత రాజకీయ పార్టీ ఏదీ లేదు. మా శ్రేణులలోనే ఆయన అభిప్రాయాలను ఆమోదించేవారు కొందరున్నారు. కాకపోతే వారి సంఖ్య చాల తక్కువ. లాసాల్ మా సాధారణ సూత్రాలకు అంగీకరించాడు. 1848 విప్లవాలు ఓడిపోయిన తర్వాత పారిశ్రామిక సంస్థలకూ కార్మికులకూ మధ్య సహకారాన్ని ప్రతిపాదించడం ద్వారా విజయవంతంగా పురోగమించగలమని ఆయన అనుకున్నాడు. పారిశ్రామిక సంస్థలకు పునరుత్తేజం కలిగించే ప్రయత్నం అది. ఉద్యమపు నిజమైన అంతిమ లక్ష్యాలకు ఇది ఒక సాధనం అని ఆయన అనుకున్నాడు. ఈ అభిప్రాయాలతో ఆయన రాసిన ఉత్తరాలు నాదగ్గర ఉన్నాయి.'

'అది ఆయన ప్రతిపాదించిన చిట్కా వైద్యం అనుకుంటున్నారా మీరు?'

'కచ్చితంగా. ఆయన బిస్మార్క్‌ను కూడ కలిసి తన ఆలోచనలు చెప్పాడు. ఆ సమయంలో లాసాల్ ఆలోచనాక్రమాన్ని బిస్మార్క్ అన్ని విధాలా ప్రోత్సహించాడు.'

'బిస్మార్క్ ఉద్దేశం ఏమిటి?'

'1848లో సమస్యలను రెచ్చగొట్టిన మధ్యతరగతులకు వ్యతిరేకంగా కార్మికవర్గాలను వాడుకోవడానికి ఇది ఒక అవకాశమని ఆయన అనుకున్నాడు.'

'డాక్టర్, సోషలిజానికి మేధస్సూ వ్యక్తీకరణా మీరేనని అనుకుంటు న్నారు. మీరు ఇక్కడ ఈ ఇంట్లో కూచుని ఇవాళ ప్రపంచమంతా జరిగే పనులన్నిటినీ, సంఘాలనూ, విప్లవాలనూ నడుపుతున్నారని అనుకుంటు న్నారు. మీరేమంటారు?'

నా ప్రశ్న విని ఆ పెద్దమనిషి చిరునవ్వు నవ్వాడు. 'నాకు తెలుసు' అన్నాడు.

'అది ఒక పిచ్చి ఆలోచన. అయితే దానికి ఒక హాస్యస్ఫోరక కోణం కూడ ఉంది. హోడెల్ హత్యాప్రయత్నం జరగడానికి రెండు నెలల ముందు నార్త్ జర్మన్ గెజెట్ అని తాను నడిపే పత్రికలో బిస్మార్క్ ఒక ఫిర్యాదు చేశాడు. జెసూయిట్ ఉద్యమ నాయకుడు ఫాదర్ బెక్‌తో నేను మిలాఖత్తయ్యానట. మేమిద్దరమూ కలిసి సోషలిస్టు ఉద్యమాన్ని ఆ స్థితిలో ఉంచడం వల్లనే తానేమీ చేయలేకపోతున్నాడట.'

'కాని లండన్ నుంచి మీ ఇంటర్నేషనల్ ఆ ఉద్యమానికి మార్గ దర్శకత్వం వహించేమాట నిజమే కదా?'

'ఇంటర్నేషనల్ అవసరానికి కాలం చెల్లింది. అది ఇంకెంత మాత్రమూ ఉనికిలో లేదు. ఒకప్పుడు అది ఉండిన మాటా, ఉద్యమానికి మార్గదర్శకత్వం వహించిన మాటా నిజమే. కాని ఇటీవలి కాలంలో సోషలిజం అభివృద్ధి ఎంత విస్తారంగా జరిగిందంటే ఇక ఇంటర్నేషనల్ అనవసరమై పోయింది. వేరువేరు దేశాలలో వార్తాపత్రికలు మొదలయ్యాయి. వాటి మధ్య పరస్పరం ఇచ్చిపుచ్చుకోవడం కొనసాగింది. వేరువేరు దేశాల పార్టీల మధ్య సంబంధం అంతమాత్రమే. అసలు మొట్టమొదట, ఇంటర్నేషనల్‌ను రూపొందించింది కార్మికులను సంఘటితం చేసి, విభిన్న జాతుల కార్మికుల మధ్య సంఘ నిర్మాణ అవసరాన్ని వారికి చూపించడానికి మాత్రమే. విభిన్న దేశాలలో ఉండే ఒక్కొక్క పార్టీకి ఉండే ప్రయోజనాల మధ్య సారూప్యత ఉండదు. కనుక లండన్‌లో కూచుని ప్రపంచాన్నంతా నడిపించే ఇంటర్నేషనల్ నాయకులు అనే భూతం ఊహాకల్పన మాత్రమే. మొట్టమొదట ఇంటర్నేషనల్ ను స్థాపించినప్పుడు మేం విదేశాలలోని సంఘాలకు సూచనలు ఇచ్చిన మాట నిజమే. కాని న్యూయార్క్‌లోని కొన్ని వర్గాలను మేం మినహాయించవలసి వచ్చింది. అలా మినహాయించిన వర్గాలలో మేడమ్ వుడ్‌హల్ ప్రఖ్యాతమైన వారే. అదంతా 1871 సంగతి. ఉద్యమంలో భాగం కాదలచుకున్న ప్రఖ్యాత అమెరికన్ రాజకీయ నాయకులెందరో ఉన్నారు. నేను వారి పేర్లు చెప్పబోవడం లేదు. వారందరూ సుప్రసిద్ధ అమెరికన్ సోషలిస్టులు.'

'డాక్టర్ మార్క్స్, మీరూ మీ అనుచరులూ మతానికి వ్యతిరేకంగా ఉద్రేకపూరితమైన ఉపన్యాసాలు చేస్తారని ప్రఖ్యాతి పొందారు. సరే, మీరు ఎట్లాగూ మొత్తం వ్యవస్థనే సమూలంగా ధ్వంసం చేయాలంటా రనుకోండి.'

జవాబిచ్చే ముందు ఆయన ఒక క్షణం ఆగారు. 'మతానికి వ్యతిరేకంగా హింసాత్మక చర్యలు అర్థరహితమైనవని మాకు తెలుసు. ఒక అభిప్రాయమేమంటే, సోషలిజం పెరిగినకొద్దీ మతం రూపుమాసి పోతుంది. మతం అదృశ్యం కావడమనే చర్య సామాజిక అభివృద్ధి ద్వారా జరగాలి. అందులో విద్యాశిక్షణ ఒక పాత్ర వహించాలి.'

'బోస్టన్‌కు చెందిన రెవరెండ్ జోసెఫ్ కుక్ – బహుశా మీకు ఆయన తెలుసనుకుంటాను...'

'ఆయన గురించి విన్నాం. సోషలిజం అనే విషయం గురించి తప్పులతడక ప్రచారం చేసే మనిషని.'

'ఆయన ఇటీవల ఈ విషయంపై ఒక ఉపన్యాసమిచ్చారు. "యునైటెడ్ స్టేట్స్‌లో, గ్రేట్ బ్రిటన్‌లో, బహుశా ఫ్రాన్స్‌లో కూడ రక్తపాత విప్లవం జరగకుండానే కార్మిక సంస్కరణలు జరగవచ్చుననీ, కాని జర్మనీలో, రష్యాలో, ఇటలీలో, ఆస్ట్రియాలో రక్తం చిందక తప్పదనీ కార్ల్ మార్క్స్ అన్నారు" అని ఆయన అన్నారు...'

జవాబు మొదలు పెడుతున్నప్పుడు డాక్టర్ ముఖం మీద చిరునవ్వు కదిలింది. 'రష్యా, జర్మనీ, ఆస్ట్రియాలలో రక్తపాత విప్లవం జరుగుతుందని సోషలిస్టులు జోస్యం చెప్పనక్కరలేదు. ఇటలీలో ప్రస్తుతం అమలవుతున్న విధానాలే కొనసాగితే బహుశా ఇటలీలో కూడ అంతే. ఈ దేశాలన్నిటి లోనూ ఫ్రెంచి విప్లవ ఘటనలు పునరావృతం కావచ్చు. ఏ రాజకీయ విద్యార్థికైనా అది స్పష్టమే. కాని ఆ విప్లవాలన్నీ అక్కడి అత్యధిక ప్రజలు సాగిస్తారు. ఏ విప్లవాన్నీ కూడ ఒక పార్టీ సాధించదు, ఒక జాతి సాధిస్తుంది.'

'ఆ మతాధిపతి పెద్దమనిషి తాను చెప్పే మాటలకు మీ ఉత్తరంలోని భాగాలు సాక్ష్యాలుగా చూపుతున్నారు. 1871లో పారిస్‌లోని కమ్యూనిస్టులకు మీరు రాసిన ఉత్తరంలో ఆ మాటలున్నాయట: "ఇప్పటికి మనం ఎక్కువలో ఎక్కువ ముప్పై లక్షల మందిమి మాత్రమే. ఇరవై సంవత్సరాలలో మనం ఐదు కోట్ల మందిమో, పది కోట్ల మందిమో అవుతాం. అప్పుడు ప్రపంచం మనది కావడం మొదలవుతుంది. అప్పుడు దుర్మార్గమైన పెట్టుబడి మీద తిరగబడుతున్న నగరాలు పారిస్, లయాన్, మార్సెల్స్ మాత్రమే కావు, బెర్లిన్, మ్యూనిచ్, డ్రెస్డెన్, లండన్, లివర్ పూల్, మాంచెస్టర్, బ్రస్సెల్స్, సేంట్ పీటర్స్ బర్గ్ న్యూయార్క్ – ఒక్కమాటలో యావత్ ప్రపంచమూ తిరగబడుతూ ఉంటుంది. చరిత్రలో కనీవినీ ఎరగని ఇటువంటి కొత్త విప్లవం జరిగేటప్పుడు, గతమంతా భయానకమైన పీడకల లాగ చెరిగిపోతుంది. ఎందుకంటే వంద చోట్ల ఒక్కసారే రగుల్కొన్న జనజ్వాల ఆ గతపు జ్ఞాపకాన్ని కూడ తుడిచి పారేస్తుంది!" అని మీరు రాశారట. డాక్టర్, ఈ మాటలు మీరు రాసిన ఉత్తరం లోనివేనా?'

'వాటిలో ఒక్క మాట కూడ నేను రాయలేదు. నేను అటువంటి భావోద్వేగపు చెత్త ఎప్పుడూ రాయను. నేను ఏది రాసేటప్పుడైనా చాల జాగ్రత్తగా ఉంటాను. ఆ సమయంలో లె ఫిగారో పత్రికలో నా పేరుతో ఈ మాటలు అచ్చయ్యాయి. అప్పుడు నా రాతలుగా చెపుతూ ఇటువంటి ఉత్తరాలు వందలాదిగా ప్రచారంలోకి వచ్చాయి. అవన్నీ కల్పిత ఉత్తరాలని నేను లండన్ టైమ్స్‌లో రాశాను. కాని అలా నా గురించి అన్నవీ, రాసినవీ అన్నీ ఖండించాలని కూచుంటే నాకు ఓ ఇరవై మంది గుమస్తాలు కావాలి.'

'కాని, పారిస్ కమ్యూనిస్టులకు సానుభూతి ప్రకటిస్తూ మీరు రాశారు కదా?'

'ఔను. కచ్చితంగా నేను రాశాను. వాళ్ల గురించి ప్రధాన పత్రికా వ్యాసాలలో వస్తున్న అభిప్రాయాలను దృష్టిలో పెట్టుకుని నేను రాశాను. కాని ఆ సంపాదకీయాల పచ్చి అబద్ధాలను ఖండించడానికి ఇంగ్లిష్ పత్రికలలో పారిస్ నుంచి వస్తుండిన వార్తలే పూర్తిగా సరిపోయేవి. పారిస్ కమ్యూన్ కేవలం అరవై మందిని మాత్రమే చంపింది. కాని

మార్షల్ మెక్‌మోహన్, ఆయన నాయకత్వంలోని హంతక సైన్యం అరవై వేల మందిని ఊచకోత కోసింది. కమ్యూన్ గురైనంత దుష్ప్రచారానికి మరే ఉద్యమమూ గురి కాలేదు.'

'సరే, అయితే, సోషలిజం సిద్ధాంతాలను ఆచరణలోకి తేవడానికి దాని సమర్థకులు హత్యలనూ రక్తపాతాన్నీ ప్రచారం చేస్తారా?'

'ఏ మహత్తర ఉద్యమమూ రక్తపాతం లేకుండా ప్రారంభం కాలేదు.' కార్ల్ జవాబివ్వడం మొదలుపెట్టారు.

'అమెరికా రక్తపాతంతోనే స్వాతంత్ర్యం సాధించింది. ఫ్రాన్స్‌ను నెపోలియన్ రక్తపాతంతోనే స్వాధీనం చేసుకున్నాడు. మళ్లీ నెపోలియన్‌ను పదవీచ్యుతుణ్ని చేసినవాళ్లూ అదేపని చేశారు. ఇటలీ, ఇంగ్లండ్, జర్మనీ, ఇతర దేశాల్లో ప్రతి ఒక్కటీ అందుకు ఉదాహరణలుగా నిలుస్తాయి. ఇక హత్యల విషయనికి వస్తే...' అని ఆయన కొనసాగించారు. 'అదేమీ కొత్త విషయం కాదని నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. నెపోలియన్‌ను చంపడానికి ఆర్సిని ప్రయత్నించాడు. ఇతరులు ఎవ్వరికన్నా ఎక్కువ హత్యలు రాజులు చేశారు. జెసూయిట్లు హత్యలు చేశారు. క్రామ్‌వెల్ కాలంలో ప్యూరిటాన్లు హత్యలు చేశారు. ఈ హత్యలూ హత్యా ప్రయత్నాలూ అన్నీ సోషలిజం పుట్టకమునుపే జరిగిపోయాయి. ఇప్పుడు మాత్రం రాజకుటుంబం మీదనో, ప్రభుత్వాధికారి మీదనో హత్యా ప్రయత్నం జరిగితే వెంటనే దాన్ని సోషలిజానికి ఆపాదిస్తున్నారు. ప్రస్తుతం ఉన్న స్థితిలో జర్మన్ చక్రవర్తి మరణిస్తే సోషలిస్టులమే ఎక్కువ విచారిస్తాం. ఆయన ఉన్న స్థానంలో ఉపయోగకరంగా ఉన్నాడనే అనాలి. అలాగే బిస్మార్క్ ప్రతిదాన్నీ తెగేదాకా లాగి ఆశయానికి ఇతరులందరికన్న ఎక్కువ సహాయం చేశాడు.'

బిస్మార్క్ మీద తన అభిప్రాయాలేమిటని నేను డా. మార్క్స్‌ను అడిగాను.

'పతనమయ్యేవరకూ నెపోలియన్ అంతటి ప్రతిభావంతుడు లేడని అందరూ అనేవారు. పతనం కాగానే ఆయనను తెలివిమాలినవాడన్నారు. బిస్మార్క్‌కు కూడ అదే వర్తిస్తుంది. ఏకీకరణ పేరుతో ఆయన నిరంకుశత్వాన్ని స్థాపించడం మొదలుపెట్టాడు. ఆయన మార్గం అందరికీ స్పష్టంగానే అర్థమయింది. ఆయన చేసిన చివరి పని సైనిక కుట్రను అనుకరించే ప్రయత్నం మాత్రమే. కాని అది తప్పకుండా విఫలమవుతుంది. ఫ్రాన్స్‌లో లాగనే జర్మనీలో కూడ సోషలిస్టులు 1870 యుద్ధం కేవలం వంశాధికారం కోసం మాత్రమే అని ప్రతిఘటించారు. వారు ప్రణాళికలు ప్రకటించి జర్మన్ ప్రజానీకానికి ముందస్తు హెచ్చరికలు చేశారు. రక్షణ కోసం యుద్ధం పేరిట జరుగుతున్న యుద్ధాన్ని దండయాత్ర యుద్ధంగా మారడానికి అనుమతిస్తే ఇక చివరికి సైనిక నిరంకుశ రాజ్యం ఏర్పడడానికి అనుమతించినట్టేనని, తమకు తామే శిక్ష విధించుకున్నట్టేనని, శ్రామిక ప్రజానీకం మీద నిర్దాక్షిణ్యమైన దమనకాండ సాగబోతుందని వాళ్లు హెచ్చరించారు. ఫ్రాన్స్ తో గౌరవనీయమైన శాంతిని కోరుతూ జర్మనీలో సభలూ సమావేశాలూ పెట్టి ప్రణాళికలు ప్రచురించిన సోషల్ డెమొక్రటిక్ పార్టీ మీద ప్రష్యన్ ప్రభుత్వం వెంటనే విచారణ జరిపింది. ఎంతో మంది నాయకులను జైలు పాలు చేసింది. అయినా ఆ పార్టీ ప్రతినిధులు ఫ్రెంచి భూభాగాలను బలవంతంగా విలీనం చేసుకోవడాన్ని నిరసిస్తూ జర్మన్ రీచ్ స్టాగ్‌లో గట్టిగా నిరసన ప్రకటించారు. బిస్మార్క్ బలప్రయోగంతో తన విధానాలను కొనసాగించాడు. బిస్మార్క్ ఎంత ప్రతిభావంతుడో అని జనం మాట్లాడుకున్నారు. యుద్ధం జరిగింది. ఇక కొత్త దండయాత్రలకు అవకాశం లేనప్పుడు ఆయన దగ్గర కొత్త ఆలోచనలు ఏమన్నా ఉన్నాయా అని వెతుకులాట మొదలైంది. అక్కడ ఆయన భయంకరంగా విఫలమయ్యాడు. ప్రజలకు ఆయనలో విశ్వాసం సన్నగిల్లడం మొదలైంది. ఆయన ప్రాభవం తగ్గిపోవడం మొదలయింది. ఆయనకూ, రాజ్యాంగ యంత్రానికీ కూడ డబ్బు కావాలి. ఒక బూటకపు రాజ్యాంగం కింద ఆయన ప్రజల మీద పన్నులు విధించాడు. ఆ పన్నులన్నీ సైన్యం కోసం. ఏకీకరణ పథకాల కోసం. ఇక ప్రజల మీద పన్నులు విధించలేని పరిస్థితి వచ్చేసరికి, రాజ్యాంగాన్ని పక్కన పడేసి అదే పని చేయబోతున్నాడు. తన ఇష్టారాజ్యంగా పన్నులు సేకరించడానికి ఆయన ఇప్పుడు సోషలిజం భూతాన్ని ఎత్తిచూపుతున్నాడు. విప్లవం తలెత్తడానికి ఆయన చేయగలిగిందంతా చేశాడు.'

'మీకు బెర్లిన్‌తో నిత్య సంబంధాలున్నాయా?'

'ఔను. నా మిత్రులు నాకు ఎప్పుడూ వర్తమానాలు పంపుతుంటారు. అక్కడ పరిస్థితి ప్రశాంతంగా ఉంది. బిస్మార్క్ నిరుత్సాహ పడుతున్నాడు. ఆయన నలభై ఎనిమిది మంది ప్రముఖులను దేశం నుంచి బహిష్కరించాడు. వారిలో హాసిల్ మన్, ఫ్రిత్షె వంటి ప్రజా ప్రతినిధులు, రాకో, బౌమన్, ఆడ్లర్ వంటి ఫ్రీ ప్రెస్ పత్రికా ప్రతినిధులు ఉన్నారు. బెర్లిన్ కార్మికులు ప్రశాంతంగా ఉండేలా చూసింది వాళ్లే. ఆ సంగతి బిస్మార్క్‌కు బాగా తెలుసు. ఆ నగరంలో 75,000 మంది కార్మికులు ఆకలిగొని ఉన్నారని కూడ ఆయనకు తెలుసు. ఒకసారి ఈ నాయకులు చెరసాలకు పోతే, ఇక జనం మందలు మందలుగా లేస్తారని, హింసాకాండ సాగుతుందని, దాన్ని సాకుగా చూపి ఊచకోత కోయవచ్చునని బిస్మార్క్ అనుకుంటున్నాడు. అప్పుడిక మొత్తం జర్మన్ సామ్రాజ్యం పైననే దమనకాండ అమలు చేయవచ్చు. నెత్తుట తడిసిన ఉక్కు పాలన అనే బిస్మార్క్ క్షుద్ర సిద్ధాంతాన్ని అప్పుడిక సంపూర్ణంగా అమలు చేయవచ్చు. పన్నులు ఏ స్థాయికైనా పెంచవచ్చు. కాని ఇప్పటిదాకా అక్కడ ఏ తిరుగుబాటూ జరగలేదు. పరిస్థితి తాను ఆశించినట్టు మారలేదని బిస్మార్క్ గందరగోళంలో ఉన్నాడు. రాజకీయ వేత్తలందరి అభిశంసననూ ఎదుర్కొంటున్నాడు.'

– ఎచ్

**వివరణలు**

ఈ ఇంటర్వ్యూలో మార్క్స్ మాటలన్నీ సమకాలీన ఘటనల మీద వ్యాఖ్యానాలు, ఈ ఇంటర్వ్యూ జరిగిన 1878 డిసెంబర్‌కు ముందు నాలుగైదు నెలలలో జరిగిన ఘటనల ప్రస్తావనలు గనుక ఇది అచ్చయిన 1879లో, అమెరికాలో, యూరప్‌లో సులభంగా అర్థమై ఉంటాయి. నూటనలభై సంవత్సరాల కిందటి ఆ రాజకీయ ఘటనలు, పరిణామాలు ఇవాళ చరిత్రలో భాగమై పోయాయి. ఎక్కువభాగం తెలుగు పాఠకులకు సుదూరమైనవి. కనుక కొన్ని మాటలకైనా వివరణ అవసరం.

- **మార్క్స్ వయసు:** తాను ఇంటర్వ్యూ చేసేనాటికి మార్క్స్ వయసు 'డెబ్భై దాటి ఉండవచ్చు' అని విలేఖరి రాశాడు గాని నిజానికి అప్పటికి మార్క్స్ వయసు అరవై ఒకటే.
- **ఇంటర్నేషనల్:** మొదటి ఇంటర్నేషనల్‌గా ప్రఖ్యాతమైన

ఇంటర్నేషనల్ వర్కింగ్ మెన్స్ అసోసియేషన్ 1864లో ఏర్పడి 1876 దాకా పనిచేసింది. పోలండ్‌లో 1863లో జరిగిన కార్మిక తిరుగుబాటు తర్వాత వివిధ దేశాల కార్మికుల మధ్య అంతర్జాతీయ సంఘీభావం ఉండాలని ఆశించిన ఫ్రెంచి, బ్రిటిష్ కార్మికవర్గ నాయకుల ఆలోచన నుంచి ఇంటర్నేషనల్ ఏర్పడింది. కార్మిక వర్గం మీద, వర్గపోరాటం మీద ఆధారపడిన వివిధ దేశాల వామపక్ష సోషలిస్టు, కమ్యూనిస్టు, అనార్కిస్టు రాజకీయ బృందాలనూ, కార్మిక సంఘాలనూ ఏకం చేయడం ఇంటర్నేషనల్ లక్ష్యం. లండన్‌లో జరిగిన స్థాపక సమావేశంలో కార్ల్ మార్క్స్ 46 ఏళ్ల వయసున్న జర్నలిస్టుగా, ఏ సంస్థకూ చెందని స్వతంత్ర వ్యక్తిగా పాల్గొన్నాడు. ఓవెన్ అనుచరులైన ఇంగ్లిష్ కార్మికులు, ప్రౌధాన్, బ్లాంక్వి అనుచరులైన ఫ్రెంచి కార్మికులు, ఐరిష్, పోలిష్ జాతీయ వాదులు, ఇటాలియన్ రిపబ్లికన్లు, జర్మన్ సోషలిస్టులు మొదలైన అన్ని రకాల విప్లవవాదులు పాల్గొన్న ఇంటర్నేషనల్ తన కార్యక్రమ ప్రణాళికను రాసేపని కార్ల్ మార్క్స్‌కు అప్పగించింది. ఇంత విభిన్నమైన భావజాలాలు గలవాళ్లు ఉన్నందువల్లనే ఇంటర్నేషనల్ మొదటి నుంచీ అభిప్రాయభేదాలతోనే సాగింది. 1872 హేగ్ కాంగ్రెస్‌లో మార్క్సిస్టులకూ అనార్కిస్టులకూ మధ్య విభేదాలు చీలికకు కూడ దారితీశాయి. బకూనిన్ తన అనుచరులతో సహా 1868లో ఇంటర్నేషనల్‌లో చేరి 1872లో చీలిపోయి మరొక ఇంటర్నేషనల్ స్థాపించాడు. 1876లో ఫిలడెల్ఫియా సమావేశంలో ఇంటర్నేషనల్ రద్దయింది.

- **జె సి బాంక్రాఫ్ట్ డేవిస్ అధికారిక నివేదిక:** అమెరికా ప్రభుత్వ రాయబారిగా బెర్లిన్‌లో 1874 నుంచి 1877 వరకు పనిచేసిన జాన్ షాండ్లర్ బాంక్రాఫ్ట్ డేవిస్ విదేశాంగ శాఖ మంత్రికి 1877లో ఇచ్చిన అధికారిక నివేదికలో జర్మన్ సోషలిజం గురించి రాసిన భాగం.
- **సోషలిజం వివరణ:** జర్మనీకి చెందిన సోషలిస్ట్ వర్కర్స్ పార్టీ కార్యక్రమంపై బాంక్రాఫ్ట్ డేవిస్ పంపిన నివేదిక గురించి ఈ విలేఖరి మాట్లాడుతున్నాడు. నిజానికి 1875లో ఆ పార్టీ గోథాలో జరిపిన సమావేశంలో ఈ కార్యక్రమం తయారయింది. ఆ కార్యక్రమం మీద విమర్శగా మార్క్స్ రాసిన కరపత్రం సోషలిజం లక్ష్యాల గురించి మరింత స్పష్టతను ఇస్తుంది.
- **ఫెర్డినాండ్ లాసాల్ (1825-1864):** జర్మన్ సోషలిస్ట్ వర్కర్స్ పార్టీలో కొంతకాలం భాగస్వామి. వృత్తిరీత్యా న్యాయవాది, జర్మనీలో తొలి సోషలిస్టు భావ ప్రచారకుడు. సాయుధపోరాటానికి కూడ పిలుపు నిచ్చాడు. 1848 విప్లవాల నాటికి విప్లవకారుడిగా, కమ్యూనిస్ట్ లీగ్ సభ్యుడిగా కూడ ఉండి, ఆ విప్లవ వైఫల్యం తర్వాత క్రమంగా పాలకవర్గాలకు, ముఖ్యంగా బిస్మార్క్ కు దగ్గరయ్యాడు. మార్క్స్ రాసిన గోథా కార్యక్రమ విమర్శ ప్రధానంగా లాసాల్ భావాల మీద విమర్శే.
- **మేడమ్ వుడ్ హాల్ (1838-1927):** అమెరికాకు చెందిన బూర్జువా స్త్రీవాది, వ్యాపారవేత్త, ఉన్నతవర్గ మహిళ. ఒక బ్రోకరేజి సంస్థను, వారపత్రికను నడుపుతూ తనను తాను సోషలిస్టుగా చెప్పుకుని 1871లో న్యూయార్క్‌లోని ఇంటర్నేషనల్ సెక్షన్ 12 శాఖను తన అధీనంలోకి తీసుకోవడానికి ప్రయత్నించింది. 1872 హేగ్ కాంగ్రెస్‌లో ఇంటర్నేషనల్ జనరల్ కౌన్సిల్ మొత్తంగా ఆ శాఖనే బహిష్కరించింది.
- **రెవరెండ్ జోసెఫ్ కుక్:** పందొమ్మిదో శతాబ్ది రెండో అర్ధభాగంలో ఉండిన అమెరికన్ మతబోధకుడు, ఉపన్యాసకుడు. అమెరికాలోనూ, ఇతరదేశాలలోనూ పర్యటిస్తూనే బోస్టన్ నగరంలో 1874 నుంచి ఇరవై ఏళ్ల పాటు ప్రతి సోమవారం ఉపన్యాస కార్యక్రమాలు నిర్వహించాడు. కార్మిక సమస్యలపైన, సోషలిజం పైన కూడ ఆయన నిపుణుడని పేరుండేది.
- **పారిస్ కమ్యూన్:** చరిత్రలో ఏర్పడిన తొలి సోషలిస్ట్ రాజ్యం. 1871 మార్చ్ 18న ఏర్పడి డెబ్బై రోజుల పాటు బీజప్రాయమైన, ఆదర్శవంతమైన ప్రజారాజ్యాన్ని అమలు చేసి శత్రు రాజ్యాల మూకుమ్మడి దాడిలో మే 28న పతనమయింది. కార్మికవర్గ నాయకత్వాన జరిగిన ఈ తిరుగుబాటుకు, విప్లవానంతర ప్రభుత్వానికి మార్క్స్, ఎంగెల్స్‌లు తమ సంపూర్ణమైన మద్దతు తెలిపారు. కమ్యూనార్డులు చేసి ఉండవలసిన పనుల గురించి విమర్శలు కూడ చేశారు.
- **బిస్మార్క్:** జర్మన్ రాజ్యాలన్నిటినీ ఏకం చేసి జర్మన్ సామ్రాజ్యం స్థాపించిన మితవాద రాజకీయ నాయకుడు. ఐక్య జర్మనీకి 1871లో ఛాన్సలర్ అయి 1890లో చక్రవర్తి తొలగించేవరకూ ఆ పదవిలో ఉన్నాడు. ఉక్కు మనిషిగా పేరు తెచ్చుకుని సోషలిస్టుల మీద అత్యంత తీవ్రమైన నిర్బంధాన్ని ప్రయోగించాడు.
- **జర్మన్ చక్రవర్తి మృతి:** జర్మన్ చక్రవర్తి విలియం మీద 1878 మే, జూన్‌లలో బెర్లిన్‌లో రెండుసార్లు హత్యాప్రయత్నాలు జరిగాయి. మొదటిసారి ఎమిల్ మాక్స్ హోడెల్ అనే నిర్మాణ కార్మికుడు, రెండో సారి డా. కార్ల్ ఎడువార్డ్ నోబిలింగ్ అనే వ్యవసాయ శాస్త్రవేత్త ఈ హత్యాప్రయత్నాలు చేశారు. వారిద్దరూ అరాచకవాదంలో విశ్వాసం ఉండినవారు. వీరిలో హోడెల్ మొదట సోషల్ డెమొక్రటిక్ పార్టీ సభ్యుడే అయినా, ఆయనలోని అరాచకవాద భావాల వల్ల 1870ల తొలిరోజుల్లోనే పార్టీ నుంచి బహిష్కరణకు గురయ్యాడు. ఇక నోబిలింగ్ కూ సోషల్ డెమొక్రటిక్ పార్టీకీ ఎప్పుడూ ఎటువంటి సంబంధమూ లేదు. అయినా బిస్మార్క్ ఈ హత్యా ప్రయత్నాల్ని సాకుగా చూపెట్టి అక్టోబర్‌లో సోషలిస్టు వ్యతిరేక చట్టం ప్రవేశపెట్టి సోషల్ డెమొక్రటిక్ పార్టీనీ, ప్రజాసంఘాలనూ నిషేధించాడు. సోషలిస్టు సాహిత్యాన్ని జప్తు చేయించాడు. సోషల్ డెమొక్రటిక్ పార్టీ నాయకులను దేశం నుంచి బహిష్కరించాడు. ఆ నిషేధం తర్వాత రెండు నెలలకే ఈ ఇంటర్వ్యూ జరిగింది.
- **దేశబహిష్కారం:** నలభై ఎనిమిది మంది ప్రముఖులను బిస్మార్క్ దేశం నుంచి బహిష్కరించాడని మార్క్స్ అన్నట్టు ఇక్కడ ఉంది గాని జర్మన్ సోషల్ డెమొక్రటిక్ వర్కర్స్ పార్టీ స్థాపకుడు ఆగస్ట్ బెబెల్ తన ఆత్మకథలో 'మా పార్టీకి చెందిన సుప్రసిద్ధ సభ్యులలో 67 మందిని నలభై ఎనిమిది గంటలలోపే బహిష్కరించారు' అని రాశాడు. మార్క్స్ గాని, ఈ విలేఖరి గాని ఈ రెండు అంకెల మధ్య గందరగోళపడ్డట్టున్నారు.

*(అనువాదం, వివరణలు: ఎన్ వేణుగోపాల్)* వీ

# వ్యవస్థీకృతమవుతున్న అవినీతి

*సమాజం మొత్తాన్ని కుదిపేస్తున్న అవినీతికి సొంత ఆస్తి, దాన్ని ప్రోత్సహిస్తూ పాలన కొనసాగిస్తున్న పాలనా వ్యవస్థలే మూల కారణాలంటున్నారు* **యాటెల్లి రామచంద్రం**

దేశవ్యాప్తంగా ప్రతి రోజు ఏదో మూలన అవినీతి కుంభకోణాలు బయటపడుత్తున్నాయి. ఈ వ్యవస్థలోని అన్ని రంగాలు అవినీతిలో మునిగితేలుతున్నాయంటే దీనికి కారణం వ్యవస్థ లోపమే. ఈ వ్యవస్థే అవినీతిని కేంద్రంగా చేసుకొని దాని పునాదిపై నడుస్తోంది. దానికి ప్రతి రోజు వెలుగు చూస్తున్న కుంభకోణాలే చక్కటి ఉదాహరణలు. అవినీతి ప్రభావం ఇంచు మించు అందరిపై ఉంటుంది. పాలకులు అవినీతికి పాల్పడి ఇబ్బడి ముబ్బడిగా అభివృద్ధి పేరుతో ప్రాజెక్టులకు అనుమతులు ఇస్తున్నారు. కార్పొరేట్ సంస్థల, బహుళజాతి సంస్థల ఉద్దేశం లాభం కాబట్టి అవి సృష్టించే పర్యావరణ విధ్వంసం నుండి ఎవరూ తప్పించుకోలేరు.

సమాజాన్ని ఇంతగా కుదిపేస్తున్న అవినీతి మూలాలను పరిశీలిస్తే మనిషి వేట దశను దాటి పశుపోషణ, కుటుంబం, సొంత ఆస్తి పుట్టుక, దానిపై హక్కు ఎప్పుడైతే ప్రారంభమయిందో అవినీతికి బీజాలు అక్కడే మొదలయ్యాయి.

ఈ దేశంలోని భూస్వామ్య సమాజపు స్వభావమే అవినీతితో కూడుకున్నది. దానికి తోడు ఇక్కడ కొనసాగిన వలస పాలన. ఈ క్రమంలోనే విదేశీ విధానాలను అమలుపర్చాలనే ఒప్పందంలో భాగంగా జరిగిన అధికార మార్పిడి. ఇక్కడి పాలకులను తమకు అనుకూలంగా పనిచేసే కమిషన్ ఏజెంట్‌లుగా మార్చుకున్నారు. పాలనా విధానాల రూపకల్పనలో, అమలుపరుస్తున్న తీరులో చాలా స్పష్టంగా తెలుస్తూనే ఉంది. ప్రభుత్వం అమలు చేస్తున్న పథకాల్లో, ప్రభుత్వ రంగ సంస్థలను మూసివేసి వనరులన్నింటిని ప్రైవేట్ రంగ సంస్థలకు కట్టబెడుతున్న తీరులో చూడవచ్చు. అట్లాగే విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతించడంలో చూడవచ్చు. ఈ క్రమం అంతటిలో అవినీతి పూసల్లో దారంలా కొనసాగుతూనే ఉంది.

సమాజంలో అవినీతి విస్తరిస్తున్న తీరును గమనిస్తే సమిష్టి ప్రజల ప్రయోజనాలకు ఉపయోగపడాల్సిన సహజ వనరులను కొద్ది మంది హస్తగతం చేసుకున్నారు. ఆ ఆస్తిని, అధికారాన్ని కాపాడుకోవడం కోసం పాలకులు అవినీతిని ప్రోత్సహిస్తున్నారు. ఇది ఎంతవరకు వెళ్లిందంటే ప్రభుత్వ పాలన విస్తరించినంత మేర దీని విస్తరణ కొనసాగుతోంది. బర్త్ సర్టిఫికెట్ మొదలుకొని డెత్ సరిఫికెట్ ఇవ్వడానికి సైతం లంచం ఇవ్వకుండా ఇవ్వలేని స్థితికి పాలకులు అధికార యంత్రాంగాన్ని నెట్టివేశారు.

పాలకులు పార్టీలకు అతీతంగా తమ క్యాడర్‌ను పోషించడానికి స్థానికంగా ఉండే కాంట్రాక్టులు, భూతగాదాలు, పోలీస్ స్టేషన్ పైరవీలు, ప్రభుత్వం అందజేసే రుణాలు, ప్రభుత్వ పథకాలు వీటన్నింటిలో అవినీతికి అవకాశం కల్పిస్తున్నారు. అవినీతి ప్రభుత్వరంగం, ప్రైవేట్‌రంగం అనే తేడా లేకుండా కొనసాగుతోంది. తమ అధికారాన్ని స్థిరపరుచుకోవడానికి తమ అనుయాయులను పాలనలోకి, అధికార యంత్రాంగంలోకి చేర్చుకోవడం కొనసాగుతోంది. నిరక్షరాస్యులైన మెజారిటీ ప్రజలు వీరి సహకారంతోనే ప్రభుత్వం అమలుచేసే పథకాలను పొందాలి. ఏదో రూపంలో వీరికి ముట్టచెపితేనే గాని ప్రభుత్వం అమలు చేసే పథకాలు సామాన్యుల దరికి చేరవు. గ్రామాల్లో ప్రభుత్వ వ్యవహారాలన్ని ఒకరిద్దరితోనే నడుస్తుంటాయి. వీళ్లు వెళితేనే ప్రభుత్వ కార్యాలయాల్లో పనులవుతాయి. సామాన్యులు వెళితే తిరగడానికి చెప్పులరుగుతాయి. అవినీతి ఈ సమాజంలో చాలా సాధారణమైన విషయంగా ప్రజలచేతే ఒప్పించే స్థితికి దిగజార్చారు మన పాలకులు.

దేశంలోని చాలా మందికి రక్షణ రంగమంటే చాలా గౌరవం. ఎందుకంటే సైన్యం, పోలీసులు దేశంలోని పాలకులకు, 'ప్రజలకు' భద్రత కల్పిస్తున్నారు. అటువంటి రక్షణ రంగంలో అవినీతి ఏ విధంగా కొనసాగుతుందో పరిశీలిద్దాం. పాలకులు పేదరిక నిర్మూలనకోసం బడ్జెట్‌లో కేటాయిస్తున్న నిధులకన్నా దేశ రక్షణ రంగంకోసం అధిక నిధులు కేటాయిస్తున్నారు. అటువంటి రక్షణరంగంలో కీలక పాత్ర పోషిస్తున్న అధికారులు, ఆ శాఖను నిర్వహిస్తున్న మంత్రులు, కాంట్రాక్టర్లు ఏవిధంగా అవినీతికి పాల్పడుతున్నారో చూద్దాం. దేశ రక్షణ కోసం ఏర్పాటు చేసుకున్న రక్షణ రంగం చాలా రహస్యం. కాని అవినీతి మాత్రం బహిరంగంగా కొనసాగుతోంది. ఎక్కడైతే ప్రశ్నించడానికి వీలు లేదో, ఏదైతే రహస్యం అంటామో అక్కడ అవినీతి లెక్కలేకుండా పెరిగిపోతోంది.

అధికార మార్పిడి జరిగిన తొలినాళ్లలోనే పాలన మారినా విధానాల్లో మార్పులేదని రుజువు చేస్తూ భారత పాలకులు అవినీతిని నిరాటంకంగా కొనసాగిస్తున్నారు. 1947/48 సంవత్సరాల్లో అప్పటి కేంద్ర మంత్రి కృష్ణమీనన్ జీపులు, రైఫిల్స్, బాంబర్లు, రక్షణ వాహనాల కొనుగోళ్లకు ఒక బోగస్ బ్రిటిష్ కంపెనీకి అడ్వాన్సుగా డబ్బులు చెల్లించారు. అవి దిగుమతి అయిన తరువాత అవన్నీ నిరుపయోగమైనవని తేలింది.

1987-89 బోఫోర్స్ శతఘ్నుల కొనుగోలులో రాజకీయ నాయకులకు, సైనికాధికారులకు ముడుపులు అందాయన్న ఆరోపణలకు సంబంధించిన కేసు గత 25 సంవత్సరాలుగా కొనసాగింది. చివరికి కత్రోచిపై దాఖలు చేసిన అభియోగాలను ఉపసంహరించుకునేందుకు మార్చ్ 3న ఢిల్లీలోని తీస్‌హజారీ కోర్టు మెజిస్ట్రేట్ వినోద్ యాదవ్ సిబిఐకి అనుమతి ఇచ్చారు. 25 ఏళ్లుగా నడుస్తున్న ఈ కేసుకు రు. 250 కోట్ల ఖర్చు అయ్యింది. బి.జె.పి పాలనలో జరిగిన శవపేటికల అవినీతి కావచ్చు, సైన్యంలో పనిచేస్తూ చనిపోయిన కుటుంబాలకు ఇవ్వడానికి ఏర్పాటు చేసిన ఆదర్శ హౌసింగ్ సొసైటీలో రాజకీయ నాయకులు, అధికార్లు అక్రమంగా పొందిన ప్లాట్లు కావచ్చు. ఇవన్నీ ప్రజల్ని మోసానికి గురిచేస్తూ సాగుతున్నవే.

ఈ మధ్య రక్షణ రంగంలో వివిఐపిల కోసం 12 హెలికాప్టర్లు

కొనాలనే ఒప్పందం కుదుర్చుకుంది. ఈ వ్యవహారంలో భారత వైమానిక దళం మాజీ చీఫ్ ఎస్‌పి త్యాగి లంచం తీసుకున్నట్టు బయటపడింది. ఇటలీకి చెందిన ఫిన్‌మెకానికా కంపెనీ భారత్‌లోని పలువురు అధికారులకు ముడుపులు ముట్టజెప్పి అక్రమమార్గంలో రు. 3,600 కోట్ల ఒప్పందం కుదుర్చుకున్నట్టు నిర్ధారణ అయింది. దేశ రక్షణ పేరుతో ఇలా వేల కోట్లు వృథా ఖర్చు చేస్తూ ప్రపంచంలోనే మనదేశం ఆయుధాల కొనుగోలులో ముందుంది. రక్షణ రంగంలోనే ఇంత అవినీతి కొనసాగుతుంటే ఇక వేరే రంగాల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరం లేదేమో.

తమ సృజనాత్మకతతో సమాజంలో భాగమయి ఉత్పత్తిలో పాల్గొనాల్సిన లక్షలాది యువతరాన్ని పాలకులు తమ స్వార్థంకోసం భద్రత పేరుతో సైన్యంగా మార్చి పనిముట్లుగా వాడుకుంటున్నారు.

కాంగ్రెస్ ప్రభుత్వం సరళీకరణ, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణ విధానాలకు 1991లో ద్వారాలు తెరిచింది. ఈ విధానాల అమలు వల్ల విదేశీ సంస్థలు భారత మార్కెట్‌లోకి రావడానికి ఉన్న అడ్డంకులు తొలిగిపోయాయి. దీంతో పూర్వీకులు అందించిన అపారమైన సహజ వనరులను విదేశీ సంస్థలు కొల్లగొట్టుకుపోవడానికి మార్గం సులభమయింది. విదేశీ సంస్థలు ఇక్కడికి వస్తున్నా, ఇక్కడి వనరులు విదేశాలకు తరలించబడుతున్నా వాటికి 'అభివృద్ధి' అనే ముద్దుపేరు పెట్టారు మన పాలకులు. వెలకట్టలేని సహజ వనరులు తరలించుకు పోవడానికి సహకరిస్తున్నారు. దీనికి ప్రతిఫలంగా బహుళజాతి కంపెనీలు ఇచ్చే కమిషన్‌లు అటు నుంచి అటే స్విస్ బ్యాంకుల్లోకి తరలిపోయి అక్రమ సంపాదనలో ప్రపంచ దేశాలలోనే భారతదేశం మొదటి స్థానంలో ఉంది.

2012-2013 ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వార్షిక బడ్జెట్ రు. 1,45,854 కోట్లు కాగా, 2010లో జరిగిన 2జీ స్పెక్ట్రమ్ అవినీతి కుంభకోణం రు. 1,76,000 కోట్లు. దేశ ప్రధాన మంత్రి నిర్వాహణలోని బొగ్గు గనుల కేటాయింపుల్లో జరిగిన మరో కుంభకోణం రు. 1,86,000 కోట్లు అని తేలింది. ఈ కుంభకోణంలో మొదట రు. 10 లక్షల కోట్ల నష్టం వాటిల్లిందని అంచనా కట్టిన కాగ్, ఆ తర్వాత నష్టం అంచనాను రు. 1.86 లక్షల కోట్లకు సవరించింది.

వాల్‌మార్ట్ సంస్థ భారత చిల్లర వర్తకరంగంలోకి అడుగుపెట్టడానికి అమెరికా చట్టసభ సభ్యులతో పైరవీలు చేశామని, ఇందుకు రు. 125 కోట్లు ఖర్చు చేసినట్లు అమెరికా సెనేట్‌కు వాల్‌మార్ట్ సంస్థ నివేదిక ఇచ్చింది. మన దేశంలోని దేన్నయినా కొనడానికి, అమ్మడానికి పాలకులు సిద్ధంగా ఉన్నారు. వీటిలో దేనికి ప్రజల ఆమోదం లేదు. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను చిల్లర వర్తకరంగంలోకి, టెలికం రంగంలోకి, బ్యాంకింగ్ రంగంలోకి, రక్షణ రంగంలోకి రావడానికి యుపిఎ ప్రభుత్వం అనుమతించింది. ఈ పెట్టుబడులు విశాలమైన భారత మార్కెట్‌ను తన గుప్పిట్లో పెట్టుకుని గుత్తాధిపత్యంతో ధరలను పెంచి లాభాలను తరలించుకుపోతుంది తప్ప ఇక్కడి ప్రజలకు జరిగేదేమి లేదు. దీని ప్రభావం వల్ల వ్యవసాయరంగం కార్పొరేట్ సంస్థల చేతుల్లోకి వెళ్లే ప్రమాదం ఉంది. ఈ విధానం అమలయితే చిల్లర వర్తక రంగం మీద ఆధారపడి ఉన్న లక్షలాది మంది చిల్లర వర్తకుల, కూలీల జీవితాలు రోడ్డున పడే ప్రమాదం ఉంది.

పాలకులు అవినీతిలో ఏమేరకు కూరుకుపోయారో చెప్పడానికి ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా (పిసిఐ) చైర్మన్ జస్టిస్ మార్కండేయ కట్జూ మాట్లాడిన మాటలే నిదర్శనం. దేశం దొంగల రాజ్యంగా మారుతోందనీ, ఎక్కడ చూసినా దోపిడే కొనసాగుతోందనీ, రాజకీయ నాయకుల్లో అవినీతి పెచ్చరిల్లడంతో నేతలు ప్రజల విశ్వాసాన్ని కోల్పోయారని ఆయన అన్నారు.

వరుస కుంభకోణాలు జరుగుతున్న క్రమంలో 2జీ స్పెక్ట్రమ్ అవినీతి కేసులో సుప్రీంకోర్టు తీర్పు వెలువడింది. ఈ తీర్పులో సహజ వనరుల మీద రాజ్యం ఆధిపత్యంతోపాటు, వాటి సంరక్షకునిగా, ధర్మకర్తగా వ్యవహరించాలని చెప్పింది. రాజ్యానికి వనరుల మీద ప్రజల తరఫున చట్టపరంగా హక్కు కలిగి ఉండవచ్చు కానీ, వాటి వలన ప్రజలకు మేలు జరిగేలా చూడకుండా ప్రైవేట్ వ్యక్తులకు, సంస్థలకు కట్టబెట్టే హక్కు దానికి లేదు అని తెలిపింది.

దేశంలోని ప్రధానమైన దర్యాప్తు సంస్థ అయిన సి.బి.ఐ పూర్తిగా ప్రభుత్వం చెప్పుచేతుల్లోనే ఉంటుందని ఆ సంస్థ మాజీ డైరెక్టర్ యు.ఎస్ మిశ్రా ఆరోపించారు. తాను సి.బి.ఐ డైరెక్టర్‌గా ఉన్న కాలంలో ప్రభుత్వం నుంచి తీవ్ర ఒత్తిడిని ఎదుర్కొన్నట్లు ఆయన స్వయంగా ఓ ఇంటర్వ్యూలో తెలిపారు. ఈ మధ్య బొగ్గు కుంభకోణంలో జరిగిన అవినీతి గురించి సి.బి.ఐ దర్యాప్తు నివేదికను న్యాయశాఖ మంత్రి ముందే చూడడం, దాన్ని తారుమారు చేయడం దీనికి అద్దంపడుతోంది. ఈ విషయాన్ని స్వయంగా సి.బి.ఐ డైరెక్టరే వెల్లడించారు.

ప్రజాస్వామ్య బద్ధ పాలన అందిస్తున్నామంటున్న పాలకులు వ్యవహరిస్తున్న తీరును చూస్తే వీళ్లచేతేనా మనం పాలించబడుతుంది అనే అసహ్యం కలుగక మానదు. ప్రజల సమస్యలను పార్లమెంట్‌లో చర్చించి పరిష్కరించాల్సిన పార్లమెంట్ సభ్యులు ప్రజల తరఫున పార్లమెంట్‌లో ప్రశ్నలడగడానికి డబ్బు తీసుకుంటున్న నీచ స్థితికి పాలకులు దిగజారారు.

పార్లమెంట్ సభ్యుల చరిత్ర వోహ్రా కమిటీ వివరంగా తెలిపింది. ఆ వివరాల ప్రకారం రెండవసారి ఎన్నికయిన పార్లమెంట్ సభ్యుల ఆస్తులు రెండు వందల శాతం పెరిగాయి. దీన్ని బట్టి పాలకులు ఎంత అవినీతికి పాల్పడి, ఆ ఆస్తిని కాపాడుకోవడానికి తమ వారసులను ఎలా అధికారంలోకి తెస్తున్నారో అర్థమవుతోంది. ప్రస్తుత పార్లమెంట్‌లో 38 మంది యువకులున్నారు. వీరిలో 33 మంది తల్లిదండ్రులు గతంలో పార్లమెంట్ సభ్యులుగా, మంత్రులుగా ఉన్నారు. కాంగ్రెస్ పార్టీకి చెందిన 208 మంది ఎం.పిలలో 23 మంది మహిళలున్నారు. వీరిలో 18 మంది గత పార్లమెంట్ సభ్యుల భార్యలు లేదా కూతుళ్లు. ఈ విధంగా మన పాలకులు ప్రజాస్వామ్యం ముసుగులో వారసత్వ రాజకీయాలను కొనసాగిస్తూ అవినీతికి పాల్పడుతున్నారు.

రాజ్యాంగ బద్దంగా, రాజ్యాంగ విలువలకు కట్టుబడి తీర్పులిస్తున్నామన్న న్యాయవ్యవస్థ వ్యవహరిస్తున్న తీరును గమనిస్తే కోర్టు తీర్పులు డబ్బుకు అమ్మబడును అనేది అర్థమవుతోంది. కోర్టు తీర్పులను కొనగలిగే శక్తి ఎవరికి ఉంటుందో ప్రత్యేకంగా చెప్పనవసరంలేదు. ఈ విషయాన్ని ఓబుళాపురం మైనింగ్ కంపెనీ (ఒఎంసి) కేసులో నిందితులకు బెయిల్ మంజూరు చేయడానికి రు.100 కోట్ల లంచం తీసుకున్నట్లు ఆరోపణలు ఎదుర్కొంటూ న్యాయమూర్తి పట్టాభిరామారావు జైల్లో ఉన్నారు. కొందరు ఆదాయానికి మించిన ఆస్తులు కలిగి ఉన్నారనే ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. ఇక అధికార యంత్రాంగం తామేమి తక్కువా అన్నట్లు అందివచ్చిన అధికారాన్ని అవకాశంగా మలుచుకొని పెద్దఎత్తున పాలకుల అవినీతికి సహకరించి, దానికి ప్రతిఫలంగా ఏదో ఒక ప్రయోజనాన్ని పొందారు. పాలకులు మారిన సందర్భాల్లో ఇటువంటి అధికారులు

ఇరుక్కుపోయి కోర్టుల చుట్టు తిరుగుతుంటారు.

రాష్ట్రం అవినీతికి నిలయమే అయినా ఆర్థిక సంస్కరణలు మొదలయిన తరువాత అవినీతి వేగం పుంజుకుంది. రాష్ట్రంలో జరుగుతున్న అవినీతిని పరిశీలిస్తే సరళీకరణ ముసుగులో సెజ్‌లను ఆహ్వానించారు. వీటికి లక్షల కోట్ల విలువచేసే వేల ఎకరాల భూమిని పాలకులు తమ అనుయాయులకు నామమాత్రపు ధరలకే కట్టబెట్టారు. దీనికి ప్రతిఫలంగా పాలకులు, వారి అనుయాయులు నిర్వహించే పెట్టుబడుల పేరుతో వేల కోట్ల రూపాయలు పెట్టారు. వీళ్లు అనుకుంటున్న అభివృద్ధిలో ప్రజలు లేరు, వారి ప్రమేయం లేకుండానే ఇదంతా జరిగిపోతోంది. పాలకులు తెస్తున్న ఈ 'అభివృద్ధి' వల్ల అడవులు నశించిపోయి అడవి జంతువులు గ్రామాల్లోకి వచ్చి మనుషుల్ని చంపుతున్నాయి. అడవిలో జీవించే ఆదివాసిలు నిర్వాసితులవుతున్నారు. కొండలు, ఇసుక తరలిపోతున్నాయి. సముద్రపు నీరు కలుషితమవుతోంది. భూమి సారాన్ని కోల్పోయి నిస్సారంగా మారి ఉత్పత్తికి పనికిరాకుండా పోతోంది. బొగ్గు గనులు బొందల గడ్డలుగా మారుతున్నాయి. ప్రకృతి బీభత్సాలు సంభవించి వేల మంది మృత్యువాత పడుతున్నారు. గాలి కలుషితమై వేడి పెరిగి ఓజోన్ పొర దెబ్బతిందని ఇది పర్యావరణానికి ప్రమాదమని శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. తాగే నీరు కలుషితమై సకల జీవరాశులు అంగవైకల్యం బారిన పడుతున్నాయి. అందులోని చేపలు చనిపోయి మత్స్యకారులు ఉపాధికోల్పోతున్నారు. సమాజంలోని ఇన్ని రకాల వనరులు నష్టపోయేది ఎవరికోసమంటే సమాజంలోని వేళ్ల మీద లెక్కపెట్టగలిగే వాళ్ల కోసం. వాళ్లే ప్రపంచ ధనవంతులతో పోటీ పడుతుంటారు. వీరు పాలనా విధానాలను నిర్దేశిస్తుంటారు.

రాష్ట్రంలో మంత్రి ధర్మాన ప్రసాదరావు పై వాన్‌పిక్ భూకేటాయింపుల్లో వచ్చిన అవినీతి ఆరోపణల గురించి సిబిఐ ప్రశ్నిస్తానంటే రాష్ట్ర మంత్రి మండలి రంగంలోకి దిగి ప్రశ్నించవద్దని ఏకంగా తీర్మానం చేసి గవర్నర్‌కు పంపింది. దాల్మియా సిమెంట్ కంపెనీకి లబ్ధి చేకూరే విధంగా జిఒలు విడుదల చేశారనే ఆరోపణలు రావడంతో హోంమంత్రి సబితా ఇంద్రారెడ్డి రాజీనామా చేశారు. వై.ఎస్. రాజశేఖర రెడ్డి అధికారాన్ని అడ్డం పెట్టుకొని తన అనుయాయుల పేర బినామి కంపెనీలను వివిధ దేశాల్లో సృష్టించారు. ఇక్కడి వనరులను చాప చుట్టినట్టు చుట్టి విదేశాలకు ఎగుమతి చేశారు. వాటిని నిర్వహిస్తున్న జగన్‌మోహన్ రెడ్డి ఇప్పటి పాలకులకు సహకరించకపోవడంతో అక్రమ ఆస్తులు కలిగి ఉన్నాడని నిర్బంధించారు.

దేశంలో అవినీతి మితిమీరి పోవడంతో కొద్ది మంది సామాజిక కార్యకర్తలు 1960లో అవినీతికి అడ్డుకట్టవేసేందుకు లోక్‌పాల్ బిల్లు తేవాలని ఉద్యమించారు. ఈ బిల్లు 1968లో పార్లమెంట్ ముందుకు వచ్చింది కాని అది ఈనాటికీ చట్ట రూపందాల్చలేదు. ఇది అవినీతి నిర్మూలనకు ఒక మంత్రదండంగా కొద్ది మంది సామాజిక కార్యకర్తలు భావిస్తున్నారు.

ఈ మధ్య కాలంలో వరుస కుంభకోణాలు బయటపడ్డాయి. ఇందులో రాజకీయ నాయకుల, కార్పొరేట్ సంస్థల పాత్ర ఉందనేది తేలింది. వీటి పట్ల ప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరు పట్ల మధ్యతరగతి ప్రజల్లో వ్యతిరేకత పెరిగింది. ఢిల్లీ కేంద్రంగా అన్నా హజారే చేపట్టిన అవినీతి వ్యతిరేక ఉద్యమంలో మధ్యతరగతి ప్రజలు అవినీతి పట్ల తమకున్న నిరసనను వ్యక్తం చేశారు. అవినీతికి వ్యతిరేకంగా అన్నాహజారే చేపట్టిన ఉద్యమం పరిశీలిస్తే మార్పు మెజారిటీ ప్రజల ప్రమేయంతో జరగాల్సింది కాదు, కొద్ది మంది మానవాతీత వ్యక్తులు మాత్రమే దేన్నయినా మార్చగలరు అనే సందేశాన్ని సమాజానికి ఇచ్చింది. ప్రజల సమిష్టి కృషి వల్ల మారుతుందనే విశ్వాసాన్ని కల్పించదలుచుకోలేదు. అందుకే ఆ ఉద్యమాన్ని మధ్యలోనే ఆపేశారు.

ప్రభుత్వాలు అమలు చేస్తున్న సంస్కరణల వల్ల, అవినీతి విధానాల వల్ల జరుగుతున్న ఆర్థిక సంక్షోభాలు, విధ్వంసాలు, విస్థాపనలకు వ్యతిరేకంగా ప్రజలు వివిధ రూపాల్లో సమాజంలో మౌలిక మార్పుకోసం పోరాడుతున్నారు. వీరి ప్రభావాన్ని తగ్గించడానికి పాలకులు ఒక పథకం ప్రకారం అసమ్మతిని సృష్టిస్తున్నారు. అందులో భాగంగా వచ్చిందే అన్నా హజారే అవినీతి వ్యతిరేక ఉద్యమం. అన్నాహజారే చేస్తున్న అవినీతి వ్యతిరేక ఉద్యమాన్ని ప్రభుత్వం, మీడియా ద్వారా ప్రోత్సహిస్తోంది.

అన్నా హజారే చేపట్టిన అవినీతి వ్యతిరేక ఉద్యమమైనా, ఈ మధ్య సిబిఐ ఎంక్వయిరీలయినా, కాగ్ నివేదికలైనా, కోర్టుల తీర్పులను పరిశీలించినా ఒక విషయం స్పష్టమవుతోంది. అదేంటంటే, దేశవ్యాప్తంగా అవినీతిలో కూరుకుపోయిన పాలకుల పట్ల ప్రజల్లో రోజు రోజుకు విశ్వాసం సన్నగిల్లుతోంది. సన్నగిల్లుతున్న విశ్వాసాన్ని పాదుకొల్పడానికే న్యాయవ్యవస్థ ఒకటీ, అరా ప్రజలకు ఆమోదమైన తీర్పులతో ముందుకు వస్తోంది. పాలకులు పాల్పడుతున్న అవినీతి తుఫాను ముందు ఈ తీర్పుల మొక్కలు ఏమేరకు ప్రభావాన్ని చూపుతాయి? ఒక పక్క న్యాయస్థానాల్లో తీర్పులు అమ్ముడుపోతున్న పరిస్థితిని మనం చూస్తూనే ఉన్నాం.

భారత పాలకులు అక్రమ సంపాదనతో ప్రపంచంలోని ధనవంతులతో పోటీపడుతున్నారు. ఇది ఇలా ఉంటే మన దేశంలో ఒక వైపు నిత్యం ఆకలి చావులు, రైతుల ఆత్మహత్యలు, చేనేత కార్మికుల ఆత్మహత్యలు, వివిధ రంగాల్లోని పీడిత ప్రజల ఆత్మహత్యలు కొనసాగుతున్నాయి. స్విస్ బ్యాంకుల్లో అవినీతి డబ్బు మూలుగుతూ ఉంది. ఈ దేశంలోని ప్రజలకు కొనుగోలు శక్తిలేక ఆహార లేమిని ఎదుర్కొంటూ జీవన ప్రమాణాలు పడిపోతున్నాయి. ఇది మన 'ప్రజాస్వామ్య' దేశంలోని ప్రజల స్థితి. 1940లోనే రజనీ పామీ దత్ ఇండియా టుడేలో 'భారతదేశం పేద ప్రజల దేశం, కాని పేద దేశం కాదు' అని రాసిన మాట 70 సంవత్సరాలు గడిచినా అది అక్షరాల నిజం.

అవినీతి పాల్పడిన వ్యక్తుల, సంస్థల వివరాలు ఒకటీ, అరా బయటికి వచ్చినప్పుడు ఆయా ఘటనలకు మాత్రమే పరిమితమయ్యేలా ప్రభుత్వం విధానం కొనసాగుతోంది. అవినీతికి మూలకారణమైన వ్యవస్థ మూలాల్లోకి కనీసం తొంగి చూడడం లేదు. ఘటనలకు స్పందిస్తూ తాత్కాలిక, తక్షణ ఫలితాలకే పరిమితమైన మధ్యతరగతి ప్రజలు దీర్ఘకాలిక వ్యవస్థాగత మార్పుల పట్ల శ్రద్ధ చూపడం లేదు. ప్రభుత్వాలు అభివృద్ధి పేరుతో తెస్తున్న అవినీతితో మిళితమైన విధానాల వల్ల రోజు రోజుకు నిర్వాసితుల సంఖ్య పెరిగిపోతూనే ఉంది.

ఈ అరవై అయిదేళ్ల పరిణామ క్రమాన్ని మనం అర్థం చేసుకుంటే కారల్ మార్క్స్ సమాజాన్ని అర్థం చేసుకోవడానికి చెప్పిన విషయాలు గుర్తుకు వస్తాయి – అనేక మంది తత్వవేత్తలు ప్రపంచాన్ని అనేక రకాలుగా వ్యాఖ్యానించారు కాని, అసలు విషయం దాన్ని మార్చడం' అన్నట్లుగా అవినీతిని నిర్మూలించడానికి చేసిన ఉద్యమాలు కావచ్చు, దాన్ని తగ్గించడానికి వచ్చిన చట్టాలు కావచ్చు ఇవేవీ కూడా సరయిన ఫలితాలను ఇవ్వలేదనేది తేలిపోయింది. ఎందుకంటే ఆ సమస్యకు మూలాలు ఈ వ్యవస్థలోనే ఉన్నాయి.

(రచయిత వీక్షణం కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్) వీ

# ఎన్నికల ఎత్తుగడే బంగారు తల్లి పథకం

***రానున్న సాధారణ ఎన్నికల్లో తిరిగి అధికారంలోకి రావాలనే అత్యాశతో ముఖ్యమంత్రి చేస్తున్న ఆర్భాటమే తప్ప ప్రభుత్వ పథకాల అమలులో చిత్తశుద్ధి లేదంటున్నారు చిమ్మె జాన్ బర్నబాస్***

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి చెపుతున్న 'బంగారు తల్లి' పథకం ప్రచారం చేసుకోవడానికి బాగానే కనిపిస్తున్నప్పటికీ, ఆచరణలో మెదటి విడత మే 1 నుంచి జూన్ 23 లోపుగా జన్మించిన ఆడ పిల్లలకే ఈ పథకం ఉద్దేశం అని చెప్పడంతోనే వీరి చిత్తశుద్ధి-లక్ష్య సాధనలో వీరికున్న అనుమానాలూ బహిర్గతమవుతున్నాయి.

ఇప్పటి పరిస్థితుల్లో పురిటిలోనే ఆడ పిల్లలను చంపడం ఎక్కువైంది. ఇది మరీ దారుణం. ఆడపిల్ల పుడితే మహాలక్ష్మి పుట్టిందనే రోజుల నుంచి, ఆడపిల్లనా! అంటూ చులకనగా, ఏవగింపుగా చూసే రోజుల కొచ్చాం. వాస్తవానికి స్త్రీలలో చైతన్యం పెరిగింది. ఉద్యోగాలు చేస్తూ, ఆత్మగౌరవంతో జీవించాలనే ధోరణి కూడ ప్రభవించింది. అంతే కాకుండా ఇప్పుడు ముస్లిం మహిళలు కూడ బాగా విద్యనభ్యసిస్తు తున్నారు. వారు కూడ ఉద్యోగాలు చేస్తున్నారు. ఉర్దూ మీడియంలో పాఠశాలలూ, కళాశాలలూ అందుబాటులోకి వచ్చాయి. ఇంతగా పురోగాభివృద్ధి చెందుతూ కూడ మహిళలు నిత్యమూ ప్రదేశం ఏదైనా ప్రతి చోటా ఏదో ఒక రూపంలో వేధింపులకు గురవుతున్నారు. వీటిపై దృష్టి సారించకుండా రాష్ట్ర ప్రభుత్వం 'బంగారు తల్లి' పథకం మహిళల సమస్యలన్నింటికీ పరిష్కారంగా 'జిందాల్ తిలిస్మాత్' ఆయుర్వేదిక్ వైద్యం ద్రావణం లాగా ప్రచారం చేసుకోవడం, రాజకీయ దివాళాకోరుతనం తప్ప మరొకటి కాదు. రాష్ట్ర ప్రభుత్వం మహిళల పోరాటాలను, మహిళల మౌలిక సమస్యలను పరిష్కరించకుండా, బాధ్యతారహితంగా వ్యవహరిస్తోందనడానికి ఇది నిదర్శనం. ఆడ శిశువుల జననాల రేటు బాగా తగ్గిపోయింది. స్త్రీ, పురుషుల నిష్పత్తిలో గడిచిన 12 ఏళ్లలో ఎంతో తేడా కనిపిస్తోంది. ఈ విపరీత పరిణామానికి అడ్డుకట్ట వేసే పనిలో భాగంగానే రాష్ట్ర ప్రభుత్వం 'బంగారు తల్లి' పథకాన్ని ప్రవేశ పెట్టడమే కాకుండా, దీనికి చట్టబద్ధత కూడ కల్పించి, తానేదో ఘనకార్యం చేసినట్లు ముఖ్యమంత్రి స్వంత డబ్బా వాయించుకుంటున్నారు.

ఆకాశంలో సగం అంటూ నిత్యం ఘోషించే ప్రస్తుత సమాజంలో హక్కులు, అవకాశాల విషయంలో స్త్రీ, పురుషుల మధ్య ఎంత వ్యత్యాసం ఉందో గమనిస్తూనే ఉన్నాం. సంఖ్యాపరంగా కూడ ఈ తేడా పెరిగిపోయి అత్యంత ప్రమాదకరమైన స్థితిలో ఇప్పుడున్నాం. ఆడపిల్లలను గుండెల మీద కుంపటిగా భావించే వారు ఇప్పటికీ ఎంతోమంది ఉన్నారు. లింగ నిర్ధారణ పరీక్షల పేరు మీద ఆడపిల్లలు పుట్టే సూచనలు ఉంటే గర్భంలోనే చంపే కుసంస్కృతి పెరిగిపోతోంది. రాష్ట్రంలో 2005-11 మధ్య కాలంలో 78,747 భ్రూణ హత్యలు జరిగాయి. 1991లో ప్రతి వెయ్యి మంది మగ శిశువులకు 970 మంది ఆడ శిశువులు ఉండగా, 2001 నాటికి 961కి, 2011 నాటికి 943కి పడిపోయింది.

ప్రస్తుతం అమలులో ఉన్న 'బాలికా సంరక్షణ పథకం', అందరికీ ప్రయోజనం చేకూరకపోవడం చేత, 'బంగారు తల్లి' పథకాన్ని రూపొందించినట్లు ప్రభుత్వం చెప్పుకుంటోంది. అయితే ఈ పథకంలో కూడా అనేక లోపాలున్నాయని సీనియర్ మంత్రులు బహిరంగంగానే ప్రకటిస్తున్నారు.

ఈ పథకం 2013, మే 1 నుంచి ప్రభుత్వ, ప్రైవేట్ ఆసుపత్రులలో జన్మించిన ఆడ శిశువులకు వర్తిస్తుంది. ఈ పథకం కింద ఆర్థికపరమైన ప్రోత్సాహకాలను అందించడంతో పాటు, ఆడ పిల్లలు కుటుంబాలకు భారం కాదనే భావనను వ్యాపింపచేయడం ప్రభుత్వ ముఖ్య ఉద్దేశం. ఈ పథకం ప్రకారం ఆడ శిశువు జన్మించగానే రు. 2500లు, టీకాల కోసం రు.1000 అందిస్తారు. మూడవ సంవత్సరంలో స్థానిక అంగన్‌వాడీ కేంద్రంలో చేరగానే సంవత్సరానికి రు. 1500 చొప్పున ఐదవ సంవత్సరం వరకు ఇస్తారు. ఒకటోవ తరగతి పాఠశాలలో చేరినప్పటి నుంచి 21వ సంవత్సరంలో డిగ్రీ పూర్తియ్యే వరకూ, వారికి రు. 5500లు ఇస్తారు. ఆ తర్వాత లక్ష రూపాయలు అందించడం ఈ పథకంలోని ముఖ్యాంశాలు. ఇంటర్మీడియట్ విద్యతోనే చదువు ఆపేసిన ఆడ పిల్లలకు 21 సంవత్సరాలు వచ్చిన తర్వాత 50 వేల రూపాయలను అందచేస్తారు. ఈ పథకంలో లోపాలుంటే వాటిని ఎత్తిచూపి సరి చేయవలసిన అవసరం మంత్రివర్గ సహచరులందరికి ఉంది. కానీ ఆ విధంగా చేయకుండా చర్చను బహిష్కరించడం కొంత రాజకీయంగా ఉన్నట్లు అనిపిస్తోంది. తల్లీ, పిల్లలను సంరక్షించాల్సిన బాధ్యత, నిర్దిష్ట గడువులోగా టీకాలు, కొన్ని ద్రావణాలు వాడవలసిన అవసరం ఉంటుంది. కాని అవన్నీ ఇప్పటికే వాడుతున్నట్లు అర్థమవుతోంది. ప్రభుత్వ ఆసుపత్రిలలో అన్నీ కొరతగానే ఉంటున్నాయి.

'బంగారు తల్లి' పథకానికి ప్రతి ఏటా, ఈ కేటాయింపులు పెరుగుతూ ఉంటాయనీ, ప్రభుత్వం పేర్కొంది. రాష్ట్రంలోనే కాక, దేశవ్యాప్తంగా సంక్షేమ పథకాలకు కేటాయించిన నిధులు సక్రమంగా ఖర్చు కాకపోవడం వల్ల కొత్త పథకాలు అనేసరికి అవి అమలు జరుగుతాయా అనే అనుమానం కలుగుతోంది. మాజీ ముఖ్యమంత్రి రాజశేఖరరెడ్డి ప్రతి మహిళనూ లక్షాధికారిణిగా చేస్తానంటూ చెప్పేవారు. కానీ రాష్ట్రంలో ఎంత మంది మహిళలు లక్షాధికారులు కాగలిగారో ప్రత్యక్షంగా మనకు స్పష్టమవుతోంది.

ఎన్నికలు సమీపిస్తుండడంతో కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ జనాకర్షణ కోసం సంక్షేమ పథకాలు ప్రకటించడం కొత్త కాదు. పైగా హడావిడిగా ప్రారంభించే పథకాలన్నీ ఆరంభ శూరత్వంగానే మిగిలి

# విలువలు లోపిస్తున్న జర్నలిజం

***పెట్టుబడిదారుల, రాజకీయ నాయకుల, యాజమాన్యాల కబంధ హస్తాలలో చిక్కుకున్న పాత్రికేయ వృత్తిని కాపాడి సమాజ వికాసానికి తోడ్పడాలనీ, పాత్రికేయులు తమ పరిణతిని పెంపొందించుకోవాలనీ అంటున్నారు ఎం. ఆదిశేషయ్య***

ఇప్పటికి అభివృద్ధి చెందిన శాస్త్ర, సాంకేతిక విజ్ఞానంతో మారుమూల ప్రాంతాలకు సైతం మీడియా క్షణాల్లో సమాచారాన్ని చేరవేస్తోంది. ఇందులో రేడియో, టివి, పత్రికలు విస్తృతమైన కృషి చేస్తున్నాయి. ముఖ్యంగా ఆయా మీడియా సంస్థల్లో పని చేస్తున్న సిబ్బంది ఈ విషయంలో చాలా కష్ట నష్టాలను ఓర్చి శ్రమిస్తున్నారు. మీడియా ఒక రకంగా సమస్యల్లో ఉన్న వారికి భరోసానిస్తూ, సమాజంలోని వక్ర రీతుల్ని ప్రపంచం ముందుంచుతోంది. ఇంత గొప్ప బాధ్యతను నెత్తికెత్తుకున్న మీడియా పట్ల ప్రపంచానికి విశ్వాసం, గౌరవం ఉండడంలో ఆశ్చర్యమేమీ లేదు. గౌరవించాలి కూడా. అయితే ఇంత గొప్ప స్థానంలో ఉన్న మీడియా సంస్థలూ, పాత్రికేయులూ కనీస విలువల్ని పాటించడం నైతిక ధర్మం కదా. అంత ఉన్నత గౌరవ స్థానంలో నిలుచున్న మీడియా ప్రభుత్వమో, పెట్టుబడిదారులో, రాజకీయనేతలో ఇచ్చే ప్రకటనల రాపిడిలో ఇరుక్కుపోతే ఎవరి ప్రయోజనాల లక్ష్యంగా పని చేస్తుందో గమనించాలి. అప్పుడు మీడియాకు అట్టడుగు ప్రజల సమస్యలు కనిపిస్తాయా? ప్రభుత్వమో, రాజకీయనేతలో, పెట్టుబడిదారుల దృక్కోణం నుంచి వార్తలు వెలువడతాయా? అనేది ఆలోచించాలి. ఈ నేపథ్యంలో నిజాయితీని మీడియా జారవిడుస్తోందా? అన్న అనుమానంలో నుంచి చాలా మంది మీడియా ఇప్పుడు విలువల్ని పాటించడం లేదని అతి సాధారణంగా వ్యాఖ్యానిస్తున్నారు. ఈ వ్యాఖ్య ప్రస్తుతం నడుస్తోన్న అన్ని మీడియా సంస్థలకూ అన్వయం కాకపోవచ్చు. విలువల గాడి తప్పకుండా పని చేస్తున్న సంస్థలూ, పాత్రికేయులూ ఇప్పటికీ లేకపోలేదు. అయితే పాత్రికేయ రంగంలోని అరమరికల్ని చర్చించుకోవడంలో కాసింతైనా సమాజ ప్రయోజనం దాగుందేమోనని నేను పరిశీలించిన అంశాల్ని నా అవగాహన పరిమితికి లోబడి విశ్లేషిస్తున్నాను.

ప్రస్తుతం నడుస్తున్న చాలా మీడియా సంస్థలు పాత్రికేయునికి ఏ మాత్రం స్వేచ్ఛ లేకుండా నియంత్రణలో ఉంచుతున్న పరిస్థితిని మనం గమనించవచ్చు. పత్రికల్లో వార్త రావాలన్నా, రాకూడదన్నా యాడ్ ఆబ్లిగేషనే (ప్రకటన తప్పనిసరిగా ఇవ్వడం) నిర్ణయిస్తుందంటే ఎవరికైనా ఆశ్చర్యం వేస్తుంది. దీంతో పాటు పనిచేస్తున్న పాత్రికేయులకు మీడియా సంస్థలు చాలీచాలని వేతనాలిస్తున్నాయి.

ఈ పరిస్థితులే పాత్రికేయులను పరోక్షంగా హీన, దీన పరిస్థితుల్లోకి నెట్టుతున్నట్లు అర్థం చేసుకోవడానికి ఆస్కారం ఉంది. అదే క్రమంలో పాత్రికేయుడు కూడా తాను ప్రపంచానికి విలువలను బోధిస్తూ, సమాజంలో బాధ్యత కలిగిన స్థానంలో ఉంటూ విలువలకు తానే మంగళం పాడడం ఎంత వరకు సరైనదో ఆలోచించాలి. తాను పని చేస్తున్న సంస్థతోనే న్యాయపరంగా రావాల్సిన వేతనాలపై పోరాడవచ్చు.

ఏది ఏమైనా ఎందరో అభాగ్యుల గురించి ప్రపంచం ముందు ఉంచే పాత్రికేయుల జీవనం ఎంత కష్టతరంగా ఉంటుందో ప్రపంచానికి అర్థం కానిదేమీ కాదు. ఎన్ని ఇబ్బందులైనా ఎదుర్కొని తనకు ఇష్టమైన పాత్రికేయ వృత్తిని వదలకుండా బతుకు జీవుడా అంటూ పాత్రికేయులు జీవనం సాగిస్తున్నారు.

ఎక్కువ మంది పాత్రికేయులు గందరగోళమైన పని భారంతో పూటకు

---

పోయాయి. మహిళలకు సంబంధించిన అనేక సమస్యలను పక్కకు పెట్టి కేవలం 'బంగారు తల్లి' పథకం ద్వారానే మహిళాభ్యున్నతి సాధించవచ్చని ప్రభుత్వం భావిస్తోంది. ప్రచారం చేసుకొంటోంది. కాని ఇప్పటికీ పనిచేసే చోట గానీ, లేదా రాజకీయ ప్రాధాన్యతలో గానీ, ఆర్థిక అంశాలలో గానీ మహిళల స్థానం మోసపూరితంగానే ఉంది. గ్రామాలలో కరుడుగట్టిన భూస్వామ్య పునాదులు పెకిలించకుండా మహిళలకు స్వాతంత్ర్యం లభించినట్లు కాదు. ఇప్పటికీ గ్రామాలలో కొనసాగుతున్న కుల వ్యవస్థ వల్ల దళిత మహిళలు అనేక విధాలుగా దోపిడీకీ, మోసాలకూ గురవుతున్నారు. పురుషాధిక్య సమాజంలో మహిళలపై వేధింపులు సర్వ సాధారణమై పోయాయి. అందుకు మహిళలు చైతన్యవంతులైన పోరాటాలను ఉధృతం చేయడం తప్ప మరో మార్గం లేదు.

స్త్రీలను ఓటు బ్యాంక్‌గా ఉపయోగించుకోవడానికి అలాంటి పథకాలేగాక చట్ట సభల్లో రిజర్వేషన్లు కల్పిస్తామన్న హామీలను, రాజకీయ పార్టీలన్నీ దశాబ్దాలుగా చెప్తూ, మహిళలను మభ్య పెడుతూనే ఉన్నాయి. సమాజంలో మహిళలకు భద్రత కరువైంది. ముక్కు పచ్చలారని పసి పిల్లల నుంచి పండు ముసలి వరకు అందరిపైనా అత్యాచారాలు ప్రతి రోజూ ఏదో మూలన జరుగుతూనే ఉన్నాయి. లైంగిక హింసకు పాల్పడే వారిపై 'నిర్భయ' చట్టాన్ని ప్రయోగించడంలో ప్రభుత్వాలు సాహసించడం లేదు. 90 శాతం పోలీసులకు ఈ చట్టం గురించి అవగాహన లేదు. దీనిని కఠినంగా అమలు పరచాలి! సమాన హక్కులు సమాన అవకాశాలు, సమ న్యాయం రాజ్యాంగం ప్రసాదించిన పౌర హక్కులలో భాగమే. వాటి అమలు కోసం నేడు మహిళా లోకమంతా నడుం బిగించి పోరాడాలి! లేకుంటే భవిష్యత్తు మరింత అంధకారమవుతుంది.

*(రచయిత న్యాయవాది, ప్రజాస్వామ్య హక్కుల పరిరక్షణ సంస్థ రాష్ట్ర కమిటీ సభ్యులు)*

వీ

తిండిలేక అనారోగ్యం బారిన పడుతున్నారు. వీరితోపాటు విధి నిర్వహణలో ప్రమాద బారిన పడినవారు ప్రైవేట్, కార్పొరేట్ ఆసుపత్రుల్లో సిఫారసు వైద్య సౌకర్యాన్ని అందుకుంటున్నారు. ప్రస్తుతం మీడియా సంస్థల పేర నిర్వహించే కార్యక్రమాలు, పాత్రికేయ సంఘాలు, ప్రెస్ క్లబ్‌లు నిర్వహించే కార్యక్రమాల వ్యయాన్ని భరించేందుకు కొందరు ముందుకొస్తున్నారు. మరికొందరు విరాళాలు ప్రకటిస్తున్నారు. అయితే ఈ దాతలు ఏ ప్రయోజనాన్ని ఆశించి ఇస్తున్నారు? ప్రజల ముందు ప్రేమ చూపించని కొందరు, పాత్రికేయులపై ఎందుకంత ప్రేమ చూపిస్తున్నారో ఆలోచించాలి. ఇలాంటి వారికి సంబంధించిన తప్పిదాలు ఎలా వార్తలుగా వస్తాయో? వీరిపై వ్యతిరేక వార్తలు ఎంత మాత్రం వచ్చే పరిస్థితి ఉండదని గమనించాలి. ఇలా పిడికెడు మంది ప్రయోజనాలకు లోబడి మీడియా విశాల ప్రజల ప్రయోజనాలను దెబ్బతీస్తోంది. ఒక వ్యక్తినీ, ఒక సంస్థనూ ప్రజలకు చెడ్డగా కనిపించే వారిని, మంచి వారిగా చూపించే పని ప్రయత్నం ప్రస్తుతం మీడియా చేస్తోంది. సమాజంలో అవినీతి, అక్రమాలతో వెలిగే వారిని ప్రకటనల పేరుతో గొప్ప వ్యక్తులుగా కీర్తించే మీడియా వింత స్వభావాన్ని బుద్ధిజీవులు గమనిస్తూనే ఉన్నారు. సమాజం పట్ల బాధ్యతతో మెలగాల్సిన మీడియా ప్రకటన కర్తలు, పత్రికల్లో వ్యాసాలు రాసే వారి అభిప్రాయాలతో తమకు ఎంత మాత్రమూ సంబంధం లేదంటున్న మీడియా సంస్థల బాధ్యతారాహిత్యాన్ని మనం గమనించవచ్చు.

ప్రస్తుతం తెలుగు పత్రికారంగంలో అక్షరాక్షరం అభ్యుదయమని చెప్పుకుంటున్న అర్హుదైన గొప్ప పత్రికలు, ప్రసిద్ధ విమర్శకులుగా అందరూ అనుకుంటున్న వారి నిర్వహణలో నడిచే పత్రికల్లో సైతం అంశాలు మూఢ విశ్వాసాలను పెంపొందించేవిగానూ, అశాస్త్రీయ భావాల్ని నూరిపోసేవిగానూ ఉండడం ఆశ్చర్యం కలిగించే అంశం. ఇదిలా ఉంటే దేశంలో ఇటీవల పెయిడ్ ఆర్టికల్స్ (డబ్బు తీసుకొని వార్త రాయడం) పాత్రికేయ విలువలను మంట కలుపుతున్నాయని 'ఎడిటర్స్ గిల్డ్' ఆందోళన వ్యక్తం చేసిన విషయం గుర్తుకొస్తోంది. నేడు తెలుగు పత్రికా రంగంలోనూ ఈ చీడ వెర్రితలలు వేస్తోంది. ఏది వార్తో, ఏది పెయిడ్ ఆర్టికలో అర్థంకాని పరిస్థితి ఉంది. దీంతో పాటు ఏదో ఒక వంకతో అశ్లీలాన్ని ఒలకబోస్తున్న మీడియా యువత చేస్తున్న వికృత చేష్టలకు ఏమాత్రం కారణం కాదని చెప్పగలమా? ఏదైనా ఒక తప్పు చేసినవారి చుట్టూ వార్తలు అల్లినంతగా, దానికి సంబంధించిన మూల విషయాన్ని అంతగా వివరించడం లేదు. తప్పిదాలను మాత్రమే కొండంతలుగా చూపించడం, సంచలనానికి దారి తీసేలా ప్రచురించడం జర్నలిజానికి చాలాకాలం క్రితమే సోకిన జబ్బు. ఈ విషయంలో మీడియాకు పునాది అంశాల పట్ల దృష్టి లేదని, ఈ పార్శ్వం నుంచి మీడియా మరింత పరిణతి చెందడం సమాజానికి ప్రయోజనమేమో అనిపిస్తుంది.

ఇప్పుడు దాదాపు మీడియా ఉన్నత వర్గాల చేతుల్లోనే ఉందనీ, ఇదంతా రూపం మార్చుకున్న భూస్వామ్య వర్గాల దోపిడీకి కొనసాగింపే ననీ అర్థం చేసుకోకపోతే మీడియా నడక, గమ్యం గురించి ఎవరికీ అర్థం కాదు. ఆదర్శవంతమైన సమాజ నిర్మాణానికి ప్రజలు చేసే ప్రయత్నాలకు మీడియా ఎంత వరకు బాసటగా నిలుస్తోంది అనే దాన్ని బట్టి మీడియా సంస్థల మార్గాన్ని మనం అంచనా వేయగలుగుతాం.

ఇప్పుడు వస్తున్న వార్తల్లో అచ్చు తప్పులు, భాషాదోషాలు, విషయ స్పష్టత లేకపోవడం గమనించవచ్చు. అసలు సమస్యేమిటి, ఎలా ఉంది? ఎలా ఉండాలి? అనే విషయం గమనిస్తే వార్త నిర్మాణంపై పాత్రికేయుల్లో అవగాహన లేనట్టు మనకు అర్థమవుతుంది. ఇదిలా ఉంటే మీడియా చాలా ఆడంబరం కలిగిన సంస్థలకు, వ్యక్తులకు ఇచ్చిన ప్రాధాన్యత వాస్తవమైన దిగువ స్థాయి ప్రజల సమస్యలకు చోటు నివ్వడం లేదు. సంపన్నుల కట్టుబొట్టు, తిండి తీర్థాలనే ప్రామాణికంగా మీడియా అనుసరిస్తోంది. దానికే ఎక్కువ ప్రచారాన్ని కల్పిస్తోంది. ఈ రకంగా పేదలను సాంఘిక వివక్షతకు గురి చేస్తోంది. అటు పెట్టుబడిదారులూ, రాజకీయ నేతలూ మీడియాను వశపరచుకుంటే తమకు తిరుగులేదనే భ్రమల్లో తేలాడుతున్నారు. ఇదంతా ప్రపంచానికి తెలియదన్నట్లు మీడియా వారిని ఆకాశానికి ఎత్తుతోంది. ఇది ఎంతో కాలం ముందుకు సాగదన్న విషయం అర్థమయ్యేదే. సత్యం కొంత కాలం మరుగున పడవచ్చేమో కానీ, సత్యాన్ని ఎవరూ నాశనం చేయలేరన్న చారిత్రక సత్యాన్ని మీడియా మర్చిపోతే మనుగడ లేదనే విషయాన్ని గుర్తించు కోవాలి. ఎవరికీ అభ్యంతరం లేకపోతే నేడు మీడియా ఓ దళారీ పాత్రను పోషిస్తోంది. ఇది వాస్తవం కాకపోతే ఇంత కాలం సజీవంగా దోపిడీ వర్గ నాటకం ఇంత నిరాఘాటకంగా కొనసాగేదే కాదు.

నిత్యం ప్రభుత్వం చట్టాలను సరిగ్గా అమలు చేయడం లేదనే మీడియా, తమ సంస్థల్లో పని చేసే వారికి కనీస వేతనాలు ఇవ్వకుండా చట్టాలకే తూట్లు పొడుస్తున్న విషయాన్ని ఎవరు ప్రశ్నించాలి. ఇదంతా ప్రభుత్వాలకు తెలియనిది కాదు. మొత్తం సమాజానికే విలువల ఒరవడి దిద్దాల్సిన మీడియానే కష్టపడే తమ ఉద్యోగుల కడుపు కొట్టడాన్ని మనం గమనించవచ్చు. విధి నిర్వహణలో ఎందరో పాత్రికేయులు అనేక సమస్యలు ఎదుర్కొంటున్నారు. వారిపై దాడులు జరుగుతున్నాయి. ఏకంగా జర్నలిస్టులను హత్యలు చేయడం దాకా వచ్చింది. దీన్ని ప్రజలూ, మేధావులూ తీవ్రంగా ఖండించాలి. ఇది ఒక రకంగా పత్రికా స్వేచ్ఛకు, మరో రకంగా ప్రజా స్వేచ్ఛకు ప్రమాదకరం కాగలదన్న విషయాన్ని మరువకూడదు. ఇప్పటికే కొన్ని సమస్యాత్మక ప్రాంతాల్లో రాజకీయ నేతల, అధికారుల పెద్దరికానికి పాత్రికేయులు భయపడే పరిస్థితులను మనం చూస్తున్నాం. ఇలాంటి సమస్యలనీ పరిష్కరించాల్సిన ప్రభుత్వమే కొన్ని పత్రికలపై, సంస్థలపై నిబంధనలు పెట్టి నియంత్రణలో ఉంచిన పరిస్థితి మనకు తెలిసిందే.

ఏదైనా ఓ సమస్యను వ్యాఖ్యానించడం వరకే కాదు, అసలు విషయం దాన్ని మార్చడం అన్న భౌతికవాద దృష్టిని మీడియా నిరంతరం జ్ఞాపకం ఉంచుకోవాలి. మార్పుకు ప్రత్యక్షంగా దోహదపడే శక్తి మీడియా వద్ద లేకపోవచ్చు. కానీ మార్పుకు అవసరమైన అవగాహనను, లక్ష్యాన్ని మీడియా సూచించగలదు.

ఇప్పటికీ లేని నిశిత పరిశీలన దృష్టిని అలవర్చుకొని మానవాళి ఆకాంక్షలు నెరవేర్చే కర్తవ్యాన్ని చేపట్టాలి. దీంతోనే మీడియా విలువల్ని మెరుగు దిద్దుకున్నట్లని, మీడియా తప్పక విలువలును మెరుగు దిద్దుకుంటుందని ఆశిద్దాం.

*(రచయిత పరిశోధక విద్యార్థి, తెలుగు అధ్యయన శాఖ,
శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం)* వీ

# ఒక ఆదివాసి రాజకీయ ఖైదీ కథ

***రాజకీయ కార్యకర్తల మనోస్థైర్యాన్ని దెబ్బతీయడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పన్నుతున్న కుటిల ఎత్తుగడలలో భాగంగానే వారిపై పదుల సంఖ్యలో కేసులు పెడుతూ, తీవ్ర నిర్బంధాలకు గురిచేస్తున్నారని అంటున్నారు పి. మంగరాజు***

ప్రస్తుతం దేశంలో మావోయిస్టులు అంటే ఆదివాసులుగానూ, ఆదివాసులంటే మావోయిస్టులుగానూ పరిగణిస్తున్న స్థితి. విశాఖ మన్యం ప్రజలు నాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా అల్లూరి నాయకత్వంలో పోరాడిన చరిత్ర. ఆనాటి నుండి నేటి వరకు ఆదివాసుల చరిత్రంతా కూడా పోరాటాల చరిత్రే.

ఆదివాసి ప్రజలు ప్రభుత్వాల దోపిడీ, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా, ఫారెస్టు అధికారుల దోపిడీకి వ్యతిరేకంగా ఉద్యమిస్తున్నారు. అడవిపైన సర్వ హక్కులు ఆదివాసులవేనంటూ దోపిడి రహిత సమాజం కోసం సర్వం త్యాగం చేస్తూ మావోయిస్టు పార్టీ నాయకత్వంలో ఉద్యమిస్తున్నారు.

ఆ ఉద్యమ క్రమంలోనే తాంబేలు రుప్పి (కమల) ఆదివాసి కువ్వి తెగకు చెందిన మహిళ. తెగ పితృస్వామ్య అణిచివేత నుండి ఆదివాసి మహిళ విముక్తి చెందాలంటే, సమాజ విముక్తిలో భాగంగానే మహిళా విముక్తి ముడిపడి ఉందనే వాస్తవాన్ని అర్థం చేసుకుంటూ, ఆ విముక్తి మార్గంలో తాను తన వంతు కృషిని నిర్వహించడానికిగాను విప్లవంలో భాగమైంది రుప్పి.

తాను పుట్టి పెరిగిన ఆ అటవీ ప్రాంతంలో ప్రతి ఏడాది వందలాది మంది ఆదివాసి ప్రజలు మలేరియా, డయేరియా వంటి వ్యాధుల బారిన పడి మృత్యువాత పడిన, పడుతున్నది అందరికీ తెలిసినదే. అలా మన్యంలో పనిచేస్తున్న కార్యకర్తలు కూడ ఈ కామెర్లు మలేరియా, సెరిబ్రల్ మలేరియాకు గురై అమరులైనవారు ఉన్నారు. ఆంధ్రరాష్ట్రమంతా గజ్జె కట్టి, గళం విప్పిన జననాట్యమండలి కుమారి కూడా ఇదే మన్యంలో సెరిబ్రల్ మలేరియాకు గురై వైద్యం పొందుతున్న క్రమంలో అమరురాలైంది. అట్లా రుప్పి దళ జీవితంలో ఉంటుండగా తీవ్రమైన మలేరియా కామెర్ల వ్యాధికి గురైంది. దళం తనకు అందుబాటులో ఉన్నంత వైద్య సేవలను అందించింది. అయినా వ్యాధి తగ్గక మరింత విషమ స్థితికి చేరుకునే సూచనలను గమనించిన నాయకత్వం రుప్పిని మెరుగైన వైద్య సేవలకుగాను కుటుంబాన్ని సంప్రదించి, వైద్య సేవలు అందించాల్సినదిగా కోరి, వైద్యం కోసం గ్రామంలో ఉంచారు.

ఈ క్రమంలో శత్రువుకు ఉప్పందింది. ఆమె ఉన్న గ్రామాన్ని వందలాది మంది పోలీసులు చుట్టుముట్టి పెద్ద పెద్ద అరుపులతో హ్యాండ్సప్ అంటూ కాషన్స్ ఇస్తూ తీవ్రమైన యుద్ధ వాతావరణాన్ని తలపిస్తూ సీన్ క్రియేట్ చేశారు. అచేతనా స్థితి అంచుల్లో ఉన్న రుప్పిది ఏమాత్రం అంతుపట్టని స్థితి.

శత్రు అరుపులు, కాషన్స్ ఫలితంగా ఊరు ఊరంతా మేల్కొంది. చుట్టు పక్కల వారు భయాందోళనలకు గురైయ్యారు. నడవలేని స్థితిలో ఉన్న రుప్పి గురించి, పోలీసులు పై అధికారులకు తెలపడంతో వాహనాలను పంపించి, రుప్పిని పోలీస్ హెడ్ క్వార్టర్‌కు తరలించారు. రుప్పి అరెస్టు వార్త అప్పటికే ప్రచారం అవ్వడంతో రెండు రోజులకు మించి కస్టడీలో ఉంచలేక కోర్టుకు హాజరు పర్చారు. ఈ రెండు రోజులు తీవ్రమైన మానసిక హింసకు గురి చేశారు. మళ్లీ వెంటనే ఏడు రోజులు పోలీసు కస్టడీకి కోరడంతో, కోర్టు అనుమతించింది.

ఏడు రోజుల కస్టడీలో సరెండర్ కావాలంటూ, పార్టీ రహస్యాలను రాబట్టు కోవడానికి, తన జీవిత సహచరుని ఆచూకీ, డంపులు వివరాల కోసం తీవ్రమైన మానసిక హింసకు గురిచేశారు. తదుపరి ఆమెను విశాఖ కేంద్ర కారాగారానికి తరలించారు. అప్పటికి ఆమె కనీసం నడవలేని స్థితిలోనే ఉంది. కర్ర దన్నుతో నడవాల్సి వచ్చింది. మొదట ఆమెపై పది కేసులు చూపించారు. పోలీస్ కస్టడీ అనంతరం పదుల సంఖ్యలో పిటి వారెంట్లు పంపారు. కనీసం రెండు, మూడు సంవత్సరాల వరకు పిటి వారెంట్లు వస్తూనే ఉన్నాయి. విశాఖ, తూర్పుగోదావరి జిల్లాల్లో నలభై ఏడు కేసులు బనాయించారు. చదువులేని ఒక ఆదివాసి కువ్వి తెగకు చెందిన మహిళను నలభై ఏడు హత్య, హత్యా ప్రయత్నాల కేసుల్లో పాల్గొన్నట్లు అభియోగాలు మోపారు. ఈ కేసులు రిమాండ్ నిమిత్తం ఆమె చింతపల్లి, నర్సీపట్నం, అనకాపల్లి, చోడవరం, అరకు, పాడేరు, రంపచోడవరం ఇలా ప్రతిరోజు కోర్టులకు తిరగవలిసిందే. ఖైదీలు కోర్టుకు వెళ్లడం కూడ ఒక నరకం. అందునా రాజకీయ ఖైదీలకు మరింత నరకమే. ఏదో బయట గాలి కొద్ది గంటలు పీల్చవచ్చులే అనుకుంటాం కానీ పోలీసుల డేగకళ్ల పహారాలో మన కళ్లను కూడ నియంత్రించే ఖాకీమూకల కుసంస్కారాల మధ్యలో నరకం కాక మరేముంటుంది. సహజ అవసరాలను కూడ కంట్రోల్ చేసుకోవల్సిన స్థితికి నెట్టివేస్తారు. అంతో ఇంతో పురుషులకు ఈ విషయంలో ఒక్కొక్కసారి ఫర్వాలేదు. ఎందుకంటే ఎస్కార్ట్ అంతా పురుషులే కదా. మహిళలకు అలా ఉండదు కదా. ఇద్దరు మహిళలు వస్తారు. వారినిచ్చి పంపరు. కోర్టులకు వెళ్లాలంటే మూడు నుంచి నాలుగు గంటలు ప్రయాణం ఒక వైపు, అందుకే మహిళా నక్సలైట్లు ప్రయాణంలో కాలకృత్యాలు తీర్చుకోవడం అంటే యుద్ధం చేయాల్సిందే.

ప్రతిరోజూ ఇలా కోర్టులకు తిరిగి తిరిగి రెస్ట్ లేకపోవడం, అనారోగ్యం, సరైన వైద్య సదుపాయాలు అందక పోవడం, జైలులో సరైన ఆహారం లేకపోవడంతో రుప్పి ఆరోగ్యం మరింత క్షీణించింది. తన ఆరోగ్య పరిస్థితిని మెరుగు పర్చవలసిందిగా జైలు అధికారులకు అనేకసార్లు చెప్పినా మనుబోతు మీద వాన కురిసిన చందమే కానీ పట్టించుకున్న అధికారి ఒక్కరూ లేరు. జైలు ఆసుపత్రి వర్గాలు బయట ఆసుపత్రికి (కెజిఎచ్) రిఫర్ చేస్తే, కెజిఎచ్‌కు వెళ్లాలంటే బయట నుండి

ఎస్కార్ట్ రావాలి. ఈ ఎస్కార్ట్ ఆర్ఐ ఆఫీసు నుండి రావాలి. ఈ ఎస్కార్ట్ కోసం సూపరిండెంట్ సంతకంతో ఎల్ఆర్ వెళ్లాలి. అంత సులువుగా సూపరిండెంట్ సంతకం పెట్టి పంపరు. అందులోనూ నక్సలైట్ ఖైదీలకు అంత ఈజీగా ఎస్కార్ట్‌లు రప్పిస్తారా? మీకు స్పెషల్ ఎస్కార్ట్‌లు కావాలి. అక్కడ మెన్ ఉండొద్దని వీళ్లే ముందు మనకు చెప్తారు. మరి లక్షల పోలీసు రిక్రూట్స్ ఏమైతున్నాయో. ఆ మాట మాట్లాడే జైలు అధికారులకు ఆలోచన ఉండదేమో. అసలు ఆ విషయం మేం ఆలోచిస్తామనీ, వాడి వక్ర దుర్మార్గ బుద్ధిని, అల్ప చింతనను మేం బేరీజు వేస్తామని కూడ వాళ్లకు ఆలోచన లేని పెత్తనపు, అహంకారపు మాటలు మాట్లాడతారు. ఒకసారి ఎస్కార్ట్ క్యాన్సిల్ అయితే మళ్లీ జైలు డాక్టర్‌ను కలిసి, మన సమస్యకు సంబంధించిన ఒపి ఎప్పుడూ, ఏ రోజు ఉంటుందో చూసుకొని, మళ్లీ మెడికల్ జనరల్‌లో ఎంటర్ చేసుకొని, జైలరు, సూపరిండెంట్స్ సంతకాలకు వెళ్లి ఆమోదం పొంది, పోలీసు హెడ్ ఆఫీసు నుండి ఎస్కార్ట్ రావాలి ఇంత ప్రాసెస్.

ఒకసారి ఎస్కార్ట్ క్యాన్సిల్ అయితే దానికి కారణం, తదుపరి చర్యలకు సంబంధించి విషయాలు, వివరాలు అంటే వారానికి ఒక రోజు వచ్చే సూపరిండెంట్ రౌండ్‌లో అడగాలి. అది వర్కింగ్‌డే, వర్కింగ్‌డే అంటే ప్రతిరోజు కోర్టులకు వెళ్లే నక్సలైట్ ఖైదీలకు కష్టమే. ఒక్కొక్కసారి హాస్పిటల్ ఎస్కార్ట్ వస్తుంది. ఈ రోజు అంటే, అదే కోర్టు ఉంటే నేను హాస్పిటల్‌కు వెళ్తాను. కోర్టుకు వెళ్లను. కోర్టుకు తెలియపర్చండి అంటే జైలు అధికార్లు ఒప్పుకోరు. మెజిస్ట్రేట్‌లు మమ్మల్ని తిడతారు అంటారు. జబర్దస్తీగా కోర్టుకు పంపుతారు. సిక్ రాసి పంపండి కోర్టుకు అంటే జైలు అథారిటీస్ మీద మెడికల్ వాళ్లు, మెడికల్ వాళ్ల మీద జైలు అథారిటీస్ చెప్పుకుంటూ, మధ్యలో మనకు నెత్తిన చెయ్యి వేస్తారు. అటు, ఇటు తిరిగే కంటే వాళ్లను వీళ్లను అడిగే కంటే చస్తే చస్తాం అని కోర్టుకు పోయిన దినాలు ఎన్నో. కోర్టులు లేని రోజుల్లో అందించిన ఉడతాభక్తి వైద్యమే. అలా కాలాన్ని నడిపించడంగా మారింది. ఇలా ఎన్నో ఇబ్బందులు పడి ఆరేళ్లుగా జైలులో మగ్గిపోతూ, నేడు మధుమేహం, తీవ్రమైన చర్మవ్యాధితో బాధపడుతోంది. వీటికి తోడు అనేక సైడ్ ఎఫెక్టులు వస్తున్నవి. వాటికి నేటికీ వైద్యం అందక తీవ్రమైన మానసిక, శారీరక సమస్యలు ఎదుర్కోవలసి వస్తోంది. ఈ అనారోగ్య సమస్యలతో నిద్రలేని రాత్రులు ఎన్నో, తిండి తినని రోజులు ఎన్నో, ఆ బాధలు అనుభవిస్తున్న వారికే కదా తెలిసేది. ఖైదీల బాధలు జైలు అధికార్లకు ఏం తెలుస్తాయి?

అనారోగ్య సమస్యల గురించి కోర్టులో అనేకసార్లు చెప్పినా న్యాయమూర్తులు సరైన రీతిలో స్పందించక పోవడం బాధాకారం. రుప్పి న్యాయవాది కోర్టుకు మెడికల్ ప్రిస్క్రిప్షన్స్ అందచేసి, అలాగే మెరుగైన వైద్య సదుపాయం కల్పించాల్సిందిగా విన్నవించారు. అయినా పట్టించుకోలేదు. వ్యక్తిగతంగా జైలు అధికారులు అసలే స్పందించరు కదా. వెరసి రుప్పి అనారోగ్యం మరింత తీవ్రమవుతున్నది.

రుప్పికి బెయిల్స్‌కు సంబంధించి తనపై నలభై ఏడు కేసులు మోపబడ్డాయి. వాటిలో కొన్ని అక్విట్ అయి ఆరు సంవత్సరాలకు గాను ఇంకా 15 కేసులు ఉన్నాయి. ఈ 15 కేసులకు ష్యూరిటీలు అంటే రుప్పి కుటుంబానికి ఇంత ఎక్కువ మొత్తంలో ష్యూరిటీదారులను తెచ్చుకునే ఆర్థిక స్థోమత లేదు. దాంతో ఇన్ని కేసులకు ష్యూరిటీలు కష్టమై పోతున్నాయి.

రుప్పి కుటుంబం ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే. అందులోనూ రుప్పిని విశాఖపట్నం వచ్చి జైలు దగ్గర ములాఖత్ పెట్టి కలవడం అంటే ఎంతో వ్యయ ప్రయాసలతో కూడుకున్నది. చింతపల్లి, నర్సీపట్నం కోర్టులకు రుప్పిని వాయిదాకు తీసుకుపోయినపుడు రుప్పి కుటుంబ సభ్యులు వస్తే ఇంటలిజెన్స్ సిఐ, నాయకత్వంలోని ఎస్కార్ట్ బృందం, కుటుంబ సభ్యులతో మాట్లాడవద్దని అభ్యంతరం తెలపడమే కాక నానాదుర్భాషలాడారు. ఈ సందర్భంగా నర్సీపట్నం కోర్టు ఆవరణలో ఇంటలిజెన్స్ సిఐతో ఘర్షణలో ఆయన గల్లా పట్టుకొని కొట్టేంత పనయింది. దీంతో మిగతా ఎస్కార్ట్‌వారు వెనక్కి తగ్గారు. దీంతో రుప్పి పోలీసులతో ఘర్షణ పడింది. రుప్పిని మెజిస్ట్రేట్ ముందు హాజరు పరిచినపుడు ఎంతో బాధ, వేదనకు గురై మెజిస్ట్రేట్‌కు చెప్పడంతో, మెజిస్ట్రేట్ జైలుకు వచ్చి కలువమను అన్నది. రుప్పి కుటుంబ పరిస్థితి వివరించడంతో మెజిస్ట్రేట్ పర్మిషన్ ఇచ్చింది. అంటే కుటుంబ సభ్యులు కోర్టుకు దగ్గర కలిస్తే, మాట్లాడుకోవడానికి కూడా యుద్ధం చేయాల్సిందే నన్నమాట. ఇది ఒక్క రుప్పి సమస్య కాదు. నేడు నక్సలైట్ అనే పేరుతో ఎవరు బందీలు అయినా ప్రతి ఒక్కరి పరిస్థితి ఇదే.

ప్రజలు ఎవరికి నచ్చిన రాజకీయాలను, వారు విశ్వసించే హక్కు ఉందని రాజ్యాంగంలో ఉన్నప్పటికీ, పాలక వర్గాలూ, పోలీసులూ మాత్రం, మీరు విప్లవ రాజకీయాలను విడిచిపెట్టి, బహిరంగంగా సరెండర్ స్టేట్‌మెంట్ ఇస్తేనే, ఎక్కువ కేసులు పెట్టమనో, లేదా కేసులు సత్వరం పరిష్కరించే విధంగా చేస్తామనో బహిరంగంగా మాట్లాడుతున్నారు. ఈ రోజుకూ రుప్పి అనారోగ్యంతో కోర్టులకు హాజరవుతుంటే, ఇంటలిజెన్స్ వర్గాలు నీవు ఒక్క మాట సరెండర్ అని ప్రకటిస్తే, నిన్ను మేమే బయటకు తీద్దుం కదా, నీపైన ఇన్ని కేసులు పెట్టం కదా అని మాట్లాడుతుంటారు. అంటే రాజకీయంగా అంత దిగజారిపోయాం, పతనమయ్యాం అని శత్రువు ముందు మోకరిల్లితే కేసుల నుండి ఉపశమనం కలిగిస్తారట. అందుకు అంగీకరించ నందుకే నీవు ఫలితం అనుభవిస్తున్నావు అనే అర్థంలో వారి మాటలు ఉంటాయి. ఎన్ని సమస్యలైనా, ఎన్ని సంవత్సరాలైనా జైలు జీవితం గడుపుతాను కానీ సరెండర్ అనే మాట నా నుండి రాదు అంటూ ఆత్మాభిమానంతో తెగేసి చెప్పి, అనారోగ్యంతో ఉన్నా, రాజకీయాల పట్ల దృఢంగా ఉంది రుప్పి.

ఒక ఆదివాసి మహిళపై నలభై ఏడు కేసులు పెట్టి నిర్బంధ రూపాల నమూనాను చూపుతున్నారు. విశాఖలో కమల, చెడ్డా భూషణంలపై ఎనభై ఐదు కేసులు, చత్తీస్‌గడ్‌లో నిర్మలపై 160 పైగా కేసులు పెట్టారు. రాజకీయ కార్యకర్తల మనోస్థైర్యాన్ని దెబ్బతీయడానికి చేసే ప్రయత్నం రాజ్యహింసలో భాగంగా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల కుటిల ఎత్తుగడలలో భాగమే. పదుల, వందల సంఖ్యలో కేసులు పెట్టడం, రాష్ట్రం కాని రాష్ట్రంలో భాష, యాస తెలియని వారిని వయో వృద్ధులను, అనారోగ్య పీడితులను అక్రమంగా, అన్యాయంగా, దుర్మార్గపు చర్యలతో జైళ్లలో బంధించడాన్ని ప్రజలందరూ ఖండించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. రాజకీయ ఖైదీల విడుదలకు మరింత కార్యాచరణతో ముందుకు సాగవలసిన అవసరం ఉంది.

*(రచయిత ఆదివాసి కార్యకర్త)*

వీ

# సెజ్‌లు సాధించిందేమిటి?

*సెజ్‌ల వల్ల ప్రయోజనాలు ఉన్నా అవి పట్టణాలకే పరిమితం కావడం వల్ల, అందులోనూ ఐటి రంగాలకు చెందిన సంస్థలు మాత్రమే ఉత్పత్తిని ప్రారంభించడం వల్ల అనుకున్న మేరకు ఉపాధిని కల్పించలేకపోయాయని అంటున్నారు* **డా. ఇమ్మానేని సత్యసుందరం**

మనది ప్రధానంగా వ్యవసాయిక దేశం. జాతీయ ఆదాయంలో వ్యవసాయం వాటా 12 శాతానికి తగ్గినా, శ్రామిక శక్తిలో 55 శాతం వ్యవసాయంపైనే ఆధారపడి ఉన్నారు. పైగా మన దేశ జనాభా 120 కోట్లు దాటింది. వ్యవసాయ రంగం పటిష్టంగా లేకపోతే దారిద్ర్య నిర్మూలన కష్టం. మన వ్యవసాయ రంగం అనేక సమస్యలు ఎదుర్కొంటుంది. ఉత్పాదకత తక్కువ, ఎగుమతుల విషయంలో ఆశించిన పురోగతి లేదు. ఆధునిక ఉత్పత్తి పద్ధతులు అందరి రైతులకు అందుబాటులో లేవు. విస్తరణ (ఎక్స్‌టెన్షన్) వ్యవస్థ కూడ బలహీనంగా ఉంది. అనుకూల పరిస్థితులలో ఉత్పత్తి పెరిగినా, ప్రయోజనాలు రైతులకు అందడం లేదు. మధ్యవర్తులే రాజ్యమేలుతున్నారు. వ్యవసాయ ఉత్పత్తిలో వైవిధ్యతకు ప్రాముఖ్యం ఉండాలి. అధిక విలువ వస్తువుల ఉత్పత్తి పెరగాలి. అధిక దిగుబడినిచ్చే విత్తనాలు అందుబాటులో ఉండాలి. కేవలం వ్యవసాయం వలనే గ్రామీణ దారిద్ర్య నిర్మూలన జరగదు. గ్రామీణ పారిశ్రామికీకరణ ముఖ్యం. ఈ రంగంలో ప్రగతి ఆశించినంతగా లేదు. మన దేశంలో చిన్న, సన్నకారు రైతుల సంఖ్య పెరుగుతూ ఉంది. వీరికి వ్యవసాయం ఏ మాత్రం లాభసాటిగా లేదు. సెజ్‌ల ద్వారా ఈ సమస్యలను పరిష్కరించడానికి అవకాశం ఉంది. అయితే ప్రభుత్వ విధానం లోపభూయిష్టంగా ఉంది.

సెజ్‌లకు సంబంధించిన చట్టం 2006 ఫిబ్రవరి 16న నుండి అమల్లోకి వచ్చింది. సెజ్‌ల ద్వారా మౌలిక సదుపాయాల నిర్మాణం జరుగుతుందని, ఉత్పత్తులు, సర్వీసులు, ఎగుమతులకు ప్రోత్సాహం లభిస్తుందని, పరిశ్రమలలో విదేశీ పెట్టుబడులు, ఉద్యోగావకాశాలు పెరుగుతాయని, ప్రభుత్వం ఆశించింది. సెజ్‌లకు సంబంధించిన అన్ని రకాల అనుమతులను మంజూరు చేయడానికి ఒక సింగిల్ విండో సౌకర్యాన్ని ఏర్పాటు చేశారు.

ప్రభుత్వ ప్రోత్సాహం వల్ల రిలయన్స్, విప్రో, నోకియాలాంటి కంపెనీలు సెజ్‌లలో పెట్టుబడి పెట్టడానికి ముందుకు వచ్చాయి. 2006 ఫిబ్రవరి – 2009 అక్టోబర్‌ల మధ్యకాలంలో లక్ష కోట్ల రూపాయాలకు పైగా సెజ్‌లలో పెట్టుబడి పెట్టాయి. పారిశ్రామికవేత్తలు ప్రభుత్వం నుండి పొందే సౌకర్యాలు (ముఖ్యంగా మౌలిక సౌకర్యాలు) లేవనడం వల్ల సెజ్‌లను స్థాపించాయి. సెజ్ చట్టం ప్రకారం సెజ్ యూనిట్లకు మొదటి ఐదు సంవత్సరాలు లాభాలపై వంద శాతం పన్ను రాయితీ ఇచ్చింది. ఆ తర్వాత ఐదు సంవత్సరాలలో రాయితీ 50 శాతం ఉంటుంది. ఆ తరువాత ఐదు సంవత్సరాలలో లాభాలను తిరిగి పెట్టుబడి పెడితే అదనంగా 50 శాతం రాయితీ ఉంటుంది. సెజ్ అభివృద్ధిదారులకు కూడ పది సంవత్సరాల వరకు వంద శాతం ఆదాయం పన్ను రాయితీ ఉంటుంది. ఎక్సైజ్ కస్టమ్స్ విషయాలలో కూడ రాయితీలు ఉన్నాయి.

అయితే, సెజ్‌లలో పెట్టుబడి పెట్టడానికి ఎక్కువ మంది ఉత్సాహం చూపించడం లేదు. ఉదాహరణకు 2007-08లో 146 సెజ్‌లకు అనుమతిస్తే, 2009-10లో ఈ సంఖ్య 25కు తగ్గింది. అక్టోబర్ 2011కి దేశం 583 సెజ్‌లకు అనుమతి ఉంది. అయితే 143 సెజ్‌లే పని చేస్తున్నాయి. సెజ్‌ల ఎగుమతులు మాత్రం క్రమంగా పెరుగుతున్నాయి. వీటి విలువ 2003-04లో రు. 13854 కోట్లు ఉంటే 2011-12 నాటికి రు. 364000కి పెరిగింది.

ప్రభుత్వ సెజ్ విధానం వివాదస్పదంగా మారింది. ఎక్కువ సెజ్‌లు చిన్న సైజులోనే ఉన్నాయి. వీటిలో ఎక్కువ సెజ్‌లు ఐటి రంగానికి సంబంధించినవి. దారిద్ర్య నిర్మూలనపైగానీ, ఉపాధి కల్పనపై గానీ వీటి ప్రభావం తక్కువ. చాలా సెజ్‌లు పెద్ద పట్టణాలకు దగ్గరలో స్థాపించారు. ఉద్యోగాలు కూడ బాగా నైపుణ్యత గల వారికే లభిస్తున్నాయి. సెజ్ విధానం ఉపాధి సౌకర్యాలను పెంచలేకపోయింది. మౌలిక సౌకర్యాలు కల్పించలేక పోయింది. మొత్తం ఎగుమతులలో సెజ్‌ల ఎగుమతులు నాల్గోవ వంతు మాత్రమే.

సెజ్‌లు కొన్ని రాష్ట్రాలకే పరిమితమై ఉన్నాయి. సుమారు 80 శాతం సెజ్‌లు కర్ణాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గుజరాత్, కేరళలో ఉన్నాయి. సెజ్‌లకు ఇచ్చే రాయితీలకు సెజ్‌ల వల్ల ప్రయోజనాలకు పొంతన లేదు. సెజ్‌ల రాయితీల విలువ 2004-05, 2009-10 మధ్య కాలంలో రు. 175487 కోట్లు, అందుకే ప్రభుత్వం ఈ రాయితీల భారాన్ని తగ్గించడానికి ప్రయత్నిస్తోంది. సెజ్‌లు మాత్రం దేశంలో అమ్మే వస్తువుల విషయంలోనూ రాయితీలు ఉండాలని వాదిస్తున్నాయి.

భూసేకరణ ఒక ప్రధాన సమస్య. భూమి కోల్పోయిన రైతులకు తగిన నష్ట పరిహారం లభించడం లేదు. ప్రస్తుతం ప్రభుత్వం భూమిని దీర్ఘకాలిక లీజ్‌పై తీసుకోవాలని చూస్తుంది. కొత్తగా ప్రవేశపెట్టిన బిల్లు నష్ట పరిహారాన్ని పెంచింది. పట్టణాలలో ఇది మార్కెట్ రేటుకు రెట్టింపు గ్రామీణ ప్రాంతాలలో మార్కెట్ రేటు కంటే నాలుగు రెట్లు ఎక్కువ 2013 ఏప్రిల్ 18న ప్రభుత్వం సెజ్‌లలో పెట్టుబడి పెంచడానికి ఒక నిర్ణయం ప్రకటించింది. బహుళ వస్తువులు తయారు చేసే సెజ్‌ల విషయంలో కనీస భూమి విస్తీర్ణం 1000 హెక్టార్ల నుండి 500 హెక్టార్లకు తగ్గించింది. ఒకే రంగానికి సంబంధించిన సెజ్‌ల విషయంలో ఈ పరిమితి 100 హెక్టార్ల నుండి 50 హెక్టార్లకు తగ్గించింది.

ప్రభుత్వం సెజ్ విధానం సామాజిక మౌలిక సదుపాయాలు (హోటళ్లు, ఆసుపత్రులు, పాఠశాలలు మొదలైనవి) ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతాలలో కల్పించేందుకు తోడ్పడాలి. సెజ్ విధానం అది అయితే అసలు ఆశయాలను ప్రక్కనపెట్టి సెజ్‌లను రియల్ ఎస్టేట్ వ్యాపారంగా మార్చడం సరికాదు. నిరుద్యోగిత అధికంగా ఉన్న మన దేశంలో సెజ్‌లు ఉపాధి కల్పనకు ముఖ్యంగా నేర్పరితనంగా లేని శ్రామికులకు ప్రాధాన్యత ఇవ్వాలి.

*(రచయిత రిటైర్డ్ ఎకనామిక్స్ లెక్చరర్)* వీ

# ఎఫ్‌డిఐకి తలుపులు బార్లా ...

***భారత ప్రభుత్వం ఎఫ్‌డిఐల పేరుతోని మళ్లీ ఒకసారి కొన్ని రంగాలను పూర్తిగా విదేశీ సంస్థలకు కట్టబెట్టే చటబద్ధ విధానాలను రూపొందించిందంటున్నారు ఎ. సంతోష్***

రూపాయి మారకం విలువ ఎన్నడూ ఎరగనంత స్థాయికి దిగజారింది. నేడు ఆసియా కరెన్సీలన్నింటిలో అత్యంత అధ్వాన్నంగా మన రూపాయి ఉంది. ద్రవ్యోల్బణం పెరిగిపోయింది. నిత్యావసర వస్తువుల ధరలకు రెక్కలొచ్చాయి. పెట్రోలియం ఉత్పత్తుల ధరలకు అదుపులేదు. పారిశ్రామికోత్పత్తి పడిపోయింది. ఉపాధి అవకాశాలు సన్నగిల్లాయి. దేశీయ స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) అంచనాలు తలకిందులయ్యాయి. ఫారెక్స్ నిల్వలు కరిగిపోతున్నాయి. ఎగుమతి - దిగుమతి వ్యాపార కరెంట్ ఎకౌంట్ లోటు ఆందోళనకరంగా మారింది. కరెంటు అకౌంటు లోటు సాధారణంగా 2.5 శాతం మించకూడదు. కానీ ఐదు శాతానికి చేరుకున్నది. 1990లో చంద్రశేఖర్ ప్రభుత్వం బంగారాన్ని కుదువ పెట్టినప్పుడు కూడా మూడు శాతం దాటలేదు.

వేగంగా దిగజారిపోతున్న ఈ ఆర్థిక వ్యవస్థను మెరుగుపరిచే ఆఖరి ఉపాయంగా విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను (ఎఫ్‌డిఐ) అనేక దేశీయ రంగాలలోకి రాకెట్ వేగంతో అనుమతించడానికి మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం తలుపులు బార్లా తెరిచింది. ఏ సమస్యకైనా విదేశీ పెట్టుబడులే పరిష్కారమనేది ప్రధాని మన్మోహన్ సింగ్ నమ్ముతున్న విధానం. ఇందుకు అనుగుణంగా యుపిఎ ప్రభుత్వం రక్షణ రంగంతో పాటు టెలికం, బీమా తదితర రంగాలలో విదేశీ పెట్టుబడుల ప్రవేశానికి పరిమితులను సడలించింది. అయితే ఈ విదేశీ పెట్టుబడులు సంక్షోభం నుంచి గట్టెకిస్తాయా అనేదే అనుమానం. సంపన్నుల బొక్కసాలు నింపే వృద్ధిరేటు కోసం కోట్లాది ప్రజల జీవితాల్లో చీకట్లు నింపే నిర్ణయాలు తీసుకోవడం మన్మోహన్ సింగ్‌కు అలవాటుగా మారడం శోచనీయం.

1991లో ఆర్థిక మంత్రిగా మన్మోహన్ విదేశీ ప్రత్యక్ష, పరోక్ష పెట్టుబడులను ఆహ్వానించడమే అన్ని సమస్యలకు పరిష్కారమని ఆనాడు అన్నారు. ఇవాళ ప్రధానిగా అదే అంటున్నారు. మళ్లీ 1990 నాటి సంక్షోభ స్థితి ఎందుకు వచ్చిందనే ప్రశ్నకు సమాధానం మాత్రం ఆయన నుండి రావడం లేదు. దేశ ఆర్థిక వ్యవస్థ దిగజారుడుకు విచక్షణారహిత మొదటితరం ఆర్థిక సంస్కరణలు మౌలిక కారణాలన్న వాస్తవాన్ని గుర్తించ నిరాకరిస్తున్న మన్మోహన్‌సింగ్ ప్రభుత్వం సామ్రాజ్యవాద కార్పొరేట్ల ద్రవ్య పెట్టుబడికి దేశాన్ని దోచిపెట్టి లాభాలు చేకూర్చుడానికేనన్నది సుస్పష్టం. సామ్రాజ్యవాద అనుకూల విధానాలతో స్వావలంబన విధానాలను పక్కన పెట్టడం వలన వచ్చిన సంక్షోభం ఇది. రోగమొకటైతే మందొకటి అన్న చందంగా ఎఫ్‌డిఐకి తలుపులు బార్లా తెరవడంతో మరింత సంక్షోభాన్ని ఎదుర్కోక తప్పదు.

నిజానికి విదేశీ పెట్టుబడుల కోసం ఇంతగా సాష్టాంగపడే బదులు ఎగుమతులు పెంచుకోవడానికో, దిగుమతులను తగ్గించుకోవడానికో ఎందుకు ఆసక్తి చూపడం లేదు? అభివృద్ధి వ్యూహాన్ని ఎందుకు మార్చుకోవడం లేదు. ప్రజా సంక్షేమంతో సంబంధం లేని అభివృద్ధి విధానాల వల్ల విచ్చలవిడి దిగుమతులు చేసుకోవాల్సి వస్తోంది. పైగా ఆ దిగుమతులకు ప్రత్యామ్నాయ పద్ధతులు ఉన్నా పట్టించుకోవడం లేదు. ఆహార రంగంలో స్వావలంబన ఏ దేశ సార్వభౌమత్వానికైనా పునాది. కానీ వ్యవసాయ రంగాన్ని సంక్షోభానికి గురి చేయడం వల్ల ఆహారోత్పత్తులు కూడా దిగుమతి చేసుకోవలసి వస్తోంది. ఎరువుల వినియోగాన్ని ప్రోత్సహించినప్పుడు, దేశీయంగా ఎరువుల ఉత్పత్తికి ఎందుకు ప్రాధాన్యత ఇవ్వడంలేదు? ఇవాళ మూడోవంతు ఎరువులు దిగుమతి చేసుకోవలసి వస్తున్నది. ఆర్థిక మంత్రి పి. చిదంబరం, వాణిజ్య మంత్రి ఆనందశర్మ, ప్రణాళికా సంఘ ఉపాధ్యక్షుడు మాంటేక్ సింగ్ ఆహ్లూవాలియా ఇటీవలి అమెరికా పర్యటనలో అనేక కార్పొరేట్ కంపెనీలతో చర్చలు జరిపి తిరిగి వచ్చిన తరువాత నిబంధనల సడలింపు ప్రకటన చేయడం గమనించాల్సిన అంశం.

వనరులను, లాభాలను విదేశీ సంస్థలకు దోచిపెట్టాలన్న ధ్యేయం తప్ప, ఇందులో విదేశీ పెట్టుబడి దేనికో ఎవరికీ అర్థంకాని సమస్య. ఆర్థిక వ్యవస్థను సరిదిద్దుకోవడానికి అవసరమైన సాంకేతిక పరిజ్ఞానం, మానవ వనరులు మనకు పుష్కలంగా వున్నాయి. ప్రధాని భారతీయుడే తప్ప ఆలోచనా ప్రక్రియ యావత్తు అమెరికా అడుగుజాడల్లో, జీ హుజూర్ తత్వంతో కూడుకున్నదని రోజురోజుకు సుస్పష్టమవుతోంది. అమెరికా అధ్యక్షుడు సహా కార్యదర్శుల వరకు ఇటీవల పలు అంతర్జాతీయ వేదికలపై ఆర్థిక సంస్కరణల అమలులో భారత్ వేగం తగ్గిపోవడం ఆందోళనకరంగా ఉందని వ్యాఖ్యానించారు. అంతేకాదు. ఈ విషయాన్ని అమెరికా అధ్యక్షుడు ఒబామా స్వయంగా మన ప్రధానమంత్రి చెవిన కూడా వేశాడు. అంతే, ఇక రెండవ తరం సంస్కరణలు వేగాన్ని పుంజుకుంటున్నాయి.

విదేశీ పెట్టుబడులకు అత్యుత్తమ గమ్యంగా భారతదేశాన్ని నిలిపేందుకు యుపిఎ ప్రభుత్వం అన్ని విధాలా కృషి చేస్తోంది. ప్రపంచ పెట్టుబడుల ధోరణులను విశ్లేషిస్తూ అంక్టాడ్ ఇటీవలనే ప్రపంచ పెట్టుబడుల నివేదిక (డబ్ల్యుఐఆర్ - 2012) ను ప్రచురించింది. ఆ నివేదికలో భారతదేశం పెట్టుబడులకు మూడవ అత్యంత ఆకర్షక దేశంగా నిలుస్తోందని పేర్కొంది. ఎర్నెస్ట్ అండ్ యంగ్ సర్వే ప్రకారంగా కూడా ఎఫ్‌డిఐలకు భారతదేశం ప్రపంచంలో నాలుగో గమ్యస్థానంగా ఉంటోంది. ప్రభుత్వం 63 రంగాల్లోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల స్వేచ్ఛా ప్రవాహాన్ని అనుమతిస్తోంది. వీటిలో అగ్రస్థానంలో ఉన్న పది రంగాలలో బ్యాంకింగ్, ఇన్సూరెన్స్, నిర్మాణం, టెలికాం, కంప్యూటర్ సాఫ్ట్‌వేర్, ఔషధాలు, ఫార్మసీ, రసాయనాలు, ఆటోమొబైల్స్, విద్యుత్, మెటలర్జీ లున్నాయి. కేవలం ఈ రంగాలే ఎఫ్‌డిఐ ప్రవాహాల్లో 70 శాతం ఆకర్షిస్తున్నాయి. టెలికాం ఆకర్షక శక్తి మూడవ స్థానంలో అంటే సేవారంగం, నిర్మాణ రంగం తరువాత స్థానంలో ఉంది.

డాలర్ల పెట్టుబడుల కొరకు అంగలారుస్తున్న యుపిఎ ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థను మెరుగుపరిచే చర్యల పేరుతో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు తలుపులు బార్లా తెరిచింది. వివిధ రంగాల్లో విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల పరిమితులను పెంచడంతో పాటు పలు రంగాల్లో ఇన్వెస్టర్లకు అనుమతుల బెడద లేకుండా, అనాయసంగా పెట్టుబడులు పెట్టేందుకు వీలుగా ఆటోమేటిక్ తోవను చూపింది. ఇప్పటికే ఎఫ్‌డిఐకి ఆమోదం ఉన్న విభాగాల్లో పరిమితులను పెంచడంతో పాటు కొత్తగా మరికొన్ని విభాగాలకు కూడా ఎఫ్‌డిఐకి అనుమతి ఇచ్చింది. మొత్తం 12 రంగాల్లో ఎఫ్‌డిఐ పరిమితిని సరళీకరిస్తూ జూలై 16న కేంద్ర ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ప్రధానంగా టెలికాం రంగంలో నూటికి నూరుశాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అనుమతించింది. అధునాతన రక్షణ తయారీ రంగంలో పరిమితులను 49 శాతానికి పెంచింది. రక్షణ రంగంలోకి విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం అంటే రక్షణ రంగం విదేశీ అదుపులోకి వెళ్లడం తప్ప వేరుకాదు.

అలాగే టెలికాం రంగంలోకి 100 శాతం ఎఫ్‌డిఐకి అనుమతించడం ద్వారా భవిష్యత్తులో యావత్ పబ్లిక్ రంగ టెలికాం వ్యవస్థ రద్దు కాక తప్పదు. ఇప్పటికే దేశంలో కీలకంగా ఉన్న మీడియా రంగాన్ని కార్పొరేట్ వ్యవస్థ శాసిస్తోంది. భవిష్యత్తులో మీడియాలో స్వదేశీ, విదేశీ గుత్త సంస్థల గొంతు తప్ప ప్రజల గొంతు వినపడక పోవచ్చు. అంతేగాకుండా దేశ భద్రత విషయంలో కూడా రాజీ పడినట్లు అవుతుంది. ప్రసార మాధ్యమంలో (ప్రింట్, ఎలక్ట్రానిక్) విదేశీయుల పెత్తనం పెరిగి విదేశీ వ్యవహారాలు, రాజకీయాలు విదేశీ ప్రభావానికి లోనయ్యే ప్రమాద ముంటుంది. ఏ దేశానికి ప్రజల విధానాలు నచ్చకున్నా విదేశీ పెత్తనంలోని మీడియా ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకంగా ప్రచారం చేసే అవకాశం ఉంటుంది. రాజకీయ అస్థిరత్వానికి అంతర్గతంగా అలజడులకు ప్రోత్సాహం కలిగించే అవకాశం కూడా ఉంటుంది. పౌర విమానయాన రంగంలో 49 శాతానికి అనుమతించింది. బీమా రంగంలో 26 శాతం నుండి 49 శాతానికి పెంచింది. అయితే ఇది పార్లమెంట్ ఆమోదం పొందవలసి ఉంది. సింగిల్ బ్రాండ్ రిటైల్ రంగంలో 49 శాతం అనుమతిస్తూ మంత్రివర్గం నిర్ణయం తీసుకుంది. ప్రభుత్వ రంగ చమురు రిఫైనరీలు, పవర్ ఎక్స్చేంజీలు, స్టాక్ ఎక్స్చేంజీలు వంటి వాటిలో కూడా నేరుగా 49 శాతం ఎఫ్‌డిఐలకు అనుమతిస్తూ నిర్ణయం తీసుకున్నారు. ప్రభుత్వం తాజా నిర్ణయం ప్రకారం 9 రంగాల్లో 49 శాతం వరకూ ఎఫ్‌డిఐకి ముందస్తు అనుమతులు కూడా అక్కర ఉండదు. పెట్రోలియం, సహజ వాయు రంగంలో, సరకుల మారకంలో, విద్యుత్ రంగంలో, స్టాక్ ఎక్స్చేంజి, పరపతి రంగ సంస్థలు ఈ కోవలో ఉన్నాయి. ఎలాంటి ఆటంకాలు లేకుండా నేరుగా ఎఫ్‌డిఐలకు అనుమతించడం మన ఆర్థిక వ్యవస్థను విదేశీ పెట్టుబడులకు తాకట్టుపెట్టడం తప్ప మరొకటి కాదు.

రక్షణ రంగంలో 26 శాతం పెట్టుబడులకు ఆటోమేటిక్ రూట్ వర్తిస్తుంది. 49 శాతం వరకు ఎఫ్‌డిఐకి భద్రతా వ్యవహారాల కేబినెట్ కమిటీ (సిసిఎస్) ఆమోదం తీసుకోవాల్సి ఉంటుంది. అసెట్ రీకన్‌స్ట్రక్షన్ కంపెనీల్లో ఎఫ్‌డిఐ పరిమితి 74 శాతం నుంచి 100 శాతానికి పెంచారు. ఇందులో 49 శాతం వరకు ఆటోమేటిక్ మార్గంలో రావొచ్చు. ఈ పరిమితి దాటితే ఎఫ్ఐపిబి అనుమతి తీసుకోవాలి. సింగిల్ బ్రాండ్ రిటైల్‌లో 49 శాతం వరకు ఆటోమేటిక్ రూట్, ఆపై ఎఫ్‌డిఐకి ఎఫ్ఐపిబి ఆమోదం ఉండాలి. క్రెడిట్ ఇన్ఫర్మేషన్ కంపెనీల్లో ఎఫ్‌డిఐ పరిమితి 49 శాతం నుంచి 74 శాతానికి పెంపు. బీమా రంగంలో 49 శాతం ఎఫ్‌డిఐని ఆటోమేటిక్ రూట్‌లోకి మార్చారు. పెట్రోలియం రిఫైనరీల్లో ఎఫ్ఐపిబి మార్గంలో ఉన్న 49 శాతం ఎఫ్‌డిఐ పరిమితి ఆటోమేటిక్ రూట్‌కు మార్చారు. పవర్ ఎక్స్చేంజ్‌ల్లో ప్రస్తుత 49 శాతం ఎఫ్‌డిఐని కూడా ఎఫ్ఐపిబి నుంచి తప్పించి ఆటోమేటిక్ రూట్‌లోకి తెచ్చారు. దాదాపు అన్ని కీలక రంగాలను ఎఫ్‌డిఐకి బార్లా తెరిచింది. మీడియాలోనూ ఎఫ్‌డిఐని అనుమతించాలన్న డిమాండ్ చాలాకాలంగా ఉంది. గ్యాస్ రిఫైనరీలు, కమోడిటీ ఎక్స్చేంజ్‌లు, విద్యుత్ ట్రేడింగ్, స్టాక్ ఎక్స్చేంజ్‌ల్లో ఎఫ్ఐపిబి మార్గంలో ఎఫ్‌డిఐకి అనుమతి ఉంటుంది. తేయాకు రంగంలో విదేశీ ఇన్వెస్టర్లు విధిగా తమ వాటాలను భారతీయ భాగస్వామికే విక్రయించాలనే నిబంధనకు స్వస్తి పలికారు.

ఆర్థికాభివృద్ధి క్షీణించడం, ద్రవ్యోల్బణం పెరిగిపోవడంతో పారిశ్రామిక వర్గాల నుంచి వస్తున్న ఒత్తిడి, సార్వత్రిక ఎన్నికల నేపథ్యంలో యుపిఎ ప్రభుత్వం కొన్ని విధానపరమైన కీలక నిర్ణయాలు తీసుకుంది. రాబోయే పార్లమెంట్ సమావేశాల్లో మలి విడత సంస్కరణలకు చెందిన కీలకమైన బిల్లుల విషయంలో ప్రధాన పార్టీలు పరస్పరం సర్దుబాటు చేసుకోనున్నట్లు ఇప్పటికే సంకేతాలు వస్తున్నాయి. పార్లమెంట్ వర్షాకాల సమావేశాలు ఆగస్టు 5 నుంచి ప్రారంభం కానున్నాయి. సార్వత్రిక ఎన్నికల్లో ప్రధాన అస్త్రంగా ఉపయోగపడడానికి వీలుగా ఆహార భద్రత, భూ సేకరణ బిల్లులను ఈ సమావేశాల్లో మొదటి రోజే చర్చకు ప్రవేశపెట్టాలని ప్రభుత్వం భావిస్తోంది. అయితే ఆ బిల్లులతో పాటు ఎఫ్‌డిఐ బిల్లును కూడా పార్లమెంటులో ఆమోదింపచేసుకునేందుకు ప్రభుత్వం రంగం సిద్ధం చేస్తోంది. చిల్లర వర్తకులు చితికిపోతారని, ఉపాధి అవకాశాలు ఆవిరవుతాయని, రైతులు పొలాలను కోల్పోయి బికారులుగా మారే ప్రమాదముందన్న సూచనలను కేంద్రం పట్టించుకోవడం లేదు. ఆర్డినెన్స్ రూపంలో ఆహార భద్రతా బిల్లు, రాకెట్ వేగంతో ఎఫ్‌డిఐలకు మరో 12 రంగాల్లోకి ఆహ్వానం ప్రజాస్వామ్య వ్యవస్థలో పార్లమెంటును పరిహసించినట్లయింది. మరోవైపు విదేశీ సంస్థల దోపిడీకి ఎర్రతివాచీలను పరిచినట్లయింది. దేశభద్రతని, సామాన్యుల పరిస్థితిని గాలికి వదిలారు.

1990 దశకంలో బంగారాన్ని తాకట్టు పెట్టి డబ్బు అప్పు తెచ్చుకుంటే తప్ప విదేశీ చెల్లింపులు చేయలేని స్థితి ఏర్పడిందని ఇప్పుడు కూడా అలాంటి స్థితి ఏర్పడిందని, నెల రోజుల్లోనే రూపాయి పదకొండుశాతం పతనమైందని ఎచ్‌డిఎఫ్‌సి ఛైర్మన్ దీపక్ పరేఖ్ వ్యాఖ్యానించారు. అనేక దేశాల్లో సామాజిక అశాంతి చెలరేగుతోందని, మన ఇంటిని మనం ఒక పద్ధతిలో సరి పెట్టుకొనేందుకు అవి మనకు ప్రమాద హెచ్చరికలని పరేఖ్ చెప్పారు. అయినా దేశంలోకి విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులను అనుమతించడం ఆందోళన కలిగించే అంశం. దీంతో దేశ సమగ్రతకు, ఆర్థిక ప్రజాస్వామ్యానికి, రాజకీయ సార్వభౌమత్వానికి ప్రమాదం సంభవించక తప్పదు. స్వదేశీ పారిశ్రామికవేత్తలు సింగపూర్, ఒమన్, బంగ్లాదేశ్, ఆగ్నేయాసియా దేశాల్లో పెట్టుబడులు పెడుతుంటే మన్మోహన్ సింగ్ విదేశీ పెట్టుబడులను ఆహ్వానించడం విచిత్రంగా ఉంది. భారత ప్రజల తరపున కాకుండా మన పాలకులు అమెరికా ప్రైవేట్ ఆర్థిక సంస్థలకే పెద్దపీట వేసేందుకు మొగ్గు చూపుతున్నారనడంలో సందేహం లేదు.

ఇంటర్నేషనల్ జర్నల్ ఆఫ్ సైంటిఫిక్ అండ్ రిసర్చ్ పబ్లికేషన్స్ 2012 డిసెంబరు సంచికలో ప్రకటించిన సమాచారం ప్రకారం భారత్‌లో పెట్టుబడుల తీరు తెన్నులు ఇలా ఉన్నాయి. 2000 నుంచి 2012 జనవరి వరకు దేశంలోకి రు.16,009 కోట్ల డాలర్లు వచ్చాయి. సర్వీసు

# ఉచిత విద్యుత్తు మీద నెపం

***వ్యవసాయానికి ఉచిత విద్యుత్ అనేది కేవలం ప్రచార ఆర్భాటమేననీ, విద్యుత్ సంక్షోభానికి పాలకుల, అధికారుల అసమర్థత, స్వార్థమే అసలు కారణమనీ అంటున్నారు* ఎం. తిమ్మారెడ్డి**

రాష్ట్రంలో విద్యుత్ రంగం తీవ్ర ఒడిదుడుకులను ఎదుర్కొంటోంది. ఒక వైపు కరెంటు కోతలు వినియోగదారులను వెతలకు గురిచేస్తోండగా మరొక వైపు రాష్ట్రంలోని విద్యుత్ పంపిణీ సంస్థలు (డిస్కమ్‌లు) దాదాపు 21 వేల కోట్ల రూపాయల లోటులో కూరుకుపోయి ఉన్నాయి. ఈ పరిస్థితికి ఒక ముఖ్య కారణంగా వ్యవసాయానికి విద్యుత్‌ను ఉచితంగా అందించడాన్ని, ఉచితమన్న ధోరణితో విద్యుత్‌ను సక్రమంగా వినియోగించడంలో శ్రద్ధ చూపకపోవడాన్ని చూపుతున్నారు. రాష్ట్రంలో పంపిణీ చేస్తున్న కరెంటులో 21 శాతం వ్యవసాయ రంగంలో వినియోగిస్తున్నట్లు డిస్కమ్‌ల లెక్కలు చూపుతున్నాయి.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థలో బావుల కింద వ్యవసాయానిది కీలకమైన స్థానం. రాష్ట్రంలో నీటి పారుదల సౌకర్యం గల వ్యవసాయ భూమిలో సగాని కంటే ఎక్కువ బావుల కింద సాగుతోంది. 30 లక్షల హెక్టార్ల కంటే ఎక్కువ భూమి బావుల కింద సాగవుతోంది. 2009-10 సంవత్సరంలో నీటి పారుదల సౌకర్యం గల భూమిలో 58 శాతం బావుల కింద సాగయింది. డిస్కమ్‌ల లెక్కల ప్రకారం కరెంటు కనెక్షన్లు గల బావుల సంఖ్య 30 లక్షలు దాటింది. కాలువల వసతి లేని మెట్ట వ్యవసాయం అధికంగా గల రాయలసీమ, తెలంగాణ ప్రాంతాలలో ఈ బావులు ఎక్కువగా విస్తరించి ఉన్నాయి. కోట్లాది మంది గ్రామీణులకు ప్రత్యక్షంగా జీవనోపాధి కల్పించడంతో పాటు దేశ ఆహార భద్రతకూ, వివిధ పరిశ్రమలకు ముడి సరుకులను అందజేయడంలోనూ బావుల కింద వ్యవసాయం తోడ్పడుతోంది.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకగా ఉన్న బావుల కింద వ్యవసాయం విద్యుత్ వ్యవస్థను బలహీనం చేస్తోందన్న ఆరోపణకు గురికావలసి వస్తోంది. అయితే కొన్ని అపోహల కారణంగానే ఈ ఆరోపణను ఎదుర్కొనవలసి వస్తోంది. వ్యవసాయ రంగంలో విద్యుత్ వినియోగాన్ని ఎక్కువ చేసి చూపడం ఇందులో ముఖ్యమైంది. వ్యవసాయ కనెక్షన్లకు మీటర్లు లేకపోవడం వలన ఈ రంగంలోని విద్యుత్ వినియోగాన్ని ఉజ్జాయింపుగా లెక్కేస్తున్నారు. రాష్ట్రంలో పంపిణీ చేసిన మొత్తం విద్యుత్ నుండి మీటర్లున్న వినియోగదారుల (గృహ, పరిశ్రమలు, వ్యాపారసంస్థలు మొదలైనవి) వినియోగాన్ని  తీసివేయగా మిగిలిన దానిని వ్యవసాయ రంగం, ప్రసార పంపిణీ (టి అండ్ డి) నష్టాల మధ్య పంచుతున్నారు. విద్యుత్ రంగంలో సామర్థ్యం పెరుగుతోందని చూపేందుకు టి అండ్ డి నష్టాలను తక్కువ చేసి చూపగా వ్యవసాయ వినియోగాన్ని ఎక్కువ చేసి చూపుతున్నారు. అనగా వ్యవసాయ వినియోగంలో కొంత వరకు టి అండ్ డి నష్టాలను కలుపుతున్నారు. 2012-13 ఆర్థిక సంవత్సరంలో డిస్కమ్‌లు రూపొందించిన అంచనాలను అనుసరించి వ్యవసాయ రంగం లో 22,112 మిలియన్ యూనిట్ల కరెంటు వినియోగం ఉంటుంది. ఇది రాష్ట్రంలో పంపిణీ చేసే మొత్తం విద్యుత్‌లో 21.3 శాతం.

---

రంగంలోకి 19.99 శాతం, టెలికమ్యూనికేషన్స్ 7.84 శాతం , సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్ 6.94 శాతం, రియల్ ఎస్టేట్ 6.86 శాతం, నిర్మాణ రంగం 6.79 శాతం వచ్చాయి. వచ్చిన పెట్టుబడులలో ముంబైకి రు.2690 కోట్ల డాలర్లు, ఢిల్లీకి రు. 1268 కోట్ల డాలర్లు వచ్చాయి. 2000 నుంచి 2008 మధ్య వచ్చిన పెట్టుబడుల్లో సగం ముంబై, ఢిల్లీకే పరిమితమయ్యాయి. మొత్తం పెట్టుబడుల్లో ముంబై, ఢిల్లీ, అహమ్మదాబాద్, బెంగుళూర్, చెన్నయ్ నగరాలకు 69 శాతం వచ్చాయి. మారిషస్, సింగపూర్, అమెరికా, బ్రిటన్ నుంచి ఎక్కువగా పెట్టుబడులు వస్తున్నాయి. ప్రభుత్వం మద్దతు ఇచ్చిన రంగాలకే పెట్టుబడులు వస్తున్నాయి.

ఆర్థికాభివృద్ధి జరగాలంటే పెట్టుబడులను ఉత్పత్తి రంగానికి మరల్చేందుకు గట్టి చర్యలు తీసుకోవాలి. అదే సమయంలో దిగుమతులు తగ్గించుకోవడానికి స్వావలంబన విధానాలు అనుసరించాలి. పన్నుల వ్యవస్థను బలోపేతం చేయడం ద్వారా ప్రభుత్వ ఆదాయాన్నీ మెరుగు పరచుకోవాలి. వృథా వ్యయాన్ని తగ్గించుకోవాలి. దీర్ఘకాలిక పరిష్కారాలపై దృష్టి సారించకుండా విదేశీ నిధులవంటి తాత్కాలిక చిట్కా వైద్యాలవైపు ప్రభుత్వం మొగ్గడమే ఆశ్చర్యం కలిగిస్తోంది. ఉత్పత్తి పెరగకుండా, ఉపాధి అవకాశాలు పెంచకుండా ఊరికే విదేశీ పెట్టుబడులు రాగానే దేశం బాగుపడి పోతుందనడం మోసపూరితం. ప్రజల కొనుగోలు శక్తి పెంచకుండా దేశంలో ఉత్పత్తి మార్కెటింగ్ పుంజుకోలేదు. బహుళ బ్రాండ్ల చిల్లర వ్యాపారంలో ఎఫ్‌డిఐల రాకకు షరతులు సరళీకరించడం ఉన్న దేశీయ ఉత్పత్తిని కూడా దెబ్బ తీస్తుంది. పైగా ఎఫ్‌డిఐలు పెట్టిన వారు అంతకంటే అనేక రెట్లు నిధులు, వనరులు తరలించుకుపోతారు. ఇప్పుడు మన దేశ పరిస్థితి అయోమయంగా ఉంది. ఇప్పటికే మన్మోహన్ సంస్కరణలు చేదు ఫలితాలను ఇచ్చాయి. ఆర్థిక వ్యవస్థ మెరుగుపడడానికి విదేశీ పెట్టుబడులు కాక ప్రత్యామ్నాయం ఆలోచించాలి. ఇవాళ పార్టీలు ఏవైనా మన్మోహన్ ఆర్థిక విధానాల పట్ల పైకి వ్యతిరేకత లోలోపల సమ్మతి ఉందని గత అనుభవాలు, వాటి ఆచరణ రుజువు చేస్తోంది. ప్రత్యామ్నాయ రాజకీయ ఆర్థిక విధానాలు అమలు కావాలంటే ప్రజలు, ప్రజాస్వామిక వాదులు ప్రత్యామ్నాయ రాజకీయాలు వెతుక్కోక తప్పదు.

*(రచయిత రిటైర్డ్ ఉపాధ్యాయులు)* వీ

2004లో వ్యవసాయానికి ఉచిత విద్యుత్‌ను అమలులోకి తెచ్చిన సమయంలో వ్యవసాయానికి కరెంటును అందచేసే సమయాన్ని తగ్గించారు. ఇంతకు ముందు వ్యవసాయానికి తొమ్మిది గంటల కరెంటును సరఫరా చేయగా ఉచిత విద్యుత్ అమలులోకి వచ్చిన తరువాత దానిని ఏడు గంటలకు తగ్గించారు. కాని ఈ ఏడు గంటల కరెంటును సక్రమంగా అమలు చేయడం లేదు. కరెంటును అందించే సమయాన్ని ఇరవై శాతం తగ్గించినా వినియోగం పెరిగినట్లు లెక్కలు చూపుతున్నారు.

రాష్ట్రంలో కరెంటు కనెక్షన్లు గల బావుల సంఖ్యను కూడ ఎక్కువ చేసి చూపుతున్నారు. ప్రస్తుతం ముప్పై లక్షల కంటే ఎక్కువ బావులకు కరెంటు కనెక్షన్లు ఉన్నట్లు డిస్కమ్‌ల లెక్కలు చూపుతున్నాయి. వాస్తవానికి ఇన్ని కనెక్షన్లు ఉపయోగంలో లేవు. ఎలక్ట్రిసిటీ బోర్డు ఏర్పడినప్పటి నుండి ఇప్పటి వరకు ఇచ్చిన కనెక్షన్లను అన్నింటినీ ఇందులో చూపుతున్నారు. ఇందులో చాలా బావులు ఉపయోగంలో లేవు. భూగర్భ జలాలు అడుగంటడం వలన చాలా బావులు నిరుపయోగంగా ఉండి పోతున్నాయి. ఉదాహరణకు మైనర్ ఇరిగేషన్ సెన్సెస్‌లో లభించే సమాచారాన్ని తీసుకుందాం. 2009-10 లో మైనర్ ఇరిగేషన్ సెన్సెస్ ప్రకారం రాష్ట్రంలో 22,00,361 బావులున్నాయి. ఇందులో 19,66,374 బావులు ఉపయోగంలో ఉన్నాయి. మిగిలిన 2,33,987 బావులు ఉపయోగంలో లేవు. ఉపయోగంలో ఉన్న బావులలో కూడా కొన్ని ఆయిల్ ఇంజన్ల ద్వారా నీటిని తోడుతున్నాయి. ఇదే సంవత్సరంలో డిస్కమ్‌ల లెక్కల ప్రకారం 22,96,996 వ్యవసాయ కనెక్షన్లున్నాయి. దీనిని బట్టి బావుల సంఖ్యను 10 శాతం ఎక్కువ చేసి చూపుతున్నట్లు తేటతెల్లమవుతోంది.

దీనితో పాటు బావుల కింద 50 శాతం కంటే తక్కువ భూమిలో మాత్రమే రెండవ పంట సాగు అవుతోంది. డిస్కమ్‌లు తమ అంచనాలలో బావుల కింద రెండు పంటలు సాగు చేస్తున్నట్లు, సంవత్సరంలో 150 రోజులు కరెంటు వాడుతున్నట్లు గణనలోకి తీసుకుంటున్నారు. వ్యవసాయానికి వాస్తవంగా కరెంటును అందిస్తున్న సమయాన్ని లెక్కలోకి తీసుకున్నట్టయితే వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగం గణనీయంగా తగ్గుతుంది.

**విద్యుత్ పంపిణీలో ఆదాయ వ్యయాలు - 2009-10**

| వివరాలు | రు. కోట్లలో |
|---|---|
| వ్యవసాయానికి విద్యుత్‌ను అందించేందుకు అయ్యే ఖర్చు | 3,933,91 |
| వ్యవసాయానికి ప్రభుత్వ సబ్సిడీ | 2,138.44 |
| వ్యవసాయానికి క్రాస్ సబ్సిడీ | 1,649.06 |
| వ్యవసాయ వినియోగదారుల నుండి వచ్చిన ఆదాయం | 146.41 |

వ్యవసాయానికి ఉచిత విద్యుత్ ఇస్తున్న సందర్భంలో గుర్తుంచుకోవాల్సిన విషయం వ్యవసాయదారులకు ఉచిత విద్యుత్ అందుతున్నా డిస్కమ్‌లు విద్యుత్‌ను ఉచితంగా అందించడం లేదు. వ్యవసాయానికి విద్యుత్‌ను అందించేందుకు అయ్యే ఖర్చును ఈ సంస్థలు ప్రభుత్వం నుండి సబ్సిడీ రూపంలో, పరిశ్రమలు, వ్యాపార సంస్థల వంటి వినియోగదారుల నుండి క్రాస్ సబ్సిడీ రూపంలో వచ్చే ఆదాయంతో భరిస్తారు. వ్యవసాయానికి ఉచిత విద్యుత్ అందించడం వలన ఈ సంస్థలకు ఎటువంటి నష్టం ఉండదు. ఉదాహరణకు 2009-10 సంవత్సరపు లెక్కలు చూద్దాం. ఈ సంవత్సరంలో వ్యవసాయానికి విద్యుత్‌ను అందించేందుకు, రు. 3933.91 కోట్లు ఖర్చు కాగా అందులో రు. 2,138.44 కోట్లు రాష్ట్ర ప్రభుత్వం నుండి సబ్సిడీ రూపంలో అందగా రు. 1,649.06 కోట్లు క్రాస్ సబ్సిడీ రూపంలో అందాయి. మిగిలిన రు. 146.41 కోట్లు వ్యవసాయ వినియోగదారుల నుండి సమీకరించారు. తమకు విద్యుత్‌ను ఉచితంగా ఇస్తున్నారు కాబట్టి ఎటువంటి నాణ్యత కరెంటును ఇచ్చినా అడగలేమన్న భావన రైతులలో ఉండగా, తాము వ్యవసాయానికి కరెంటును ఉచితంగా ఇస్తున్నాం కాబట్టి గ్రామాలకు, మరీ ముఖ్యంగా వ్యవసాయానికి సంబంధించిన విద్యుత్ వ్యవస్థ చిన్నాభిన్నమైనా పట్టించుకోవలసిన అవసరం లేదని డిస్కమ్‌లు భావిస్తున్నాయి.

అధికారిక లెక్కల ప్రకారం రాష్ట్రంలో 8,000 లైన్‌మెన్ పోస్టులు ఖాళీగా ఉన్నాయి. ఈ ఖాళీలన్నీ చాలావరకు గ్రామీణ ప్రాంతాలకు చెందినవే. కరెంటు సమస్యలు తలెత్తినపుడు సరైన సాంకేతిక సహకారాలు అందుబాటులో లేకపోవడం వలన రైతులు పలు ఇక్కట్లు ఎదుర్కుంటున్నారు. రైతులు స్వయంగా ట్రాన్స్‌ఫార్మర్లను సరిచేయడానికి ప్రయత్నించి షాకు తగిలి చనిపోతున్నారు. రాష్ట్రంలో ప్రతి సంవత్సరం 800 నుండి 1000 మంది రైతులు కరెంటు షాకుల వలన చనిపోతున్నారు. ఈ పోస్టులను భర్తీ చేయడం వలన సంవత్సరానికి రు. 100 కోట్లు అదనపు ఖర్చు కావచ్చు. దాదాపు 50 వేల కోట్ల రూపాయల వార్షిక ఆదాయంలో ఇది ఏపాటిది! ఈ పోస్టులను భర్తీ చేయడం ద్వారా రైతుల మరణాలనే కాదు, ప్రసార-పంపిణీ (టిఅండ్ డి) నష్టాలనూ తగ్గించవచ్చు. అదనపు ఆదాయం పొందవచ్చు.

వ్యవసాయానికి ఉచిత విద్యుత్ అందించడం వలన రాష్ట్ర బడ్జెట్‌పై తీవ్ర ఒత్తిడి ఉంటుందన్న భావన కూడా ఉంది. ఇది సరైనది కాదు. నీటి పారుదల గల భూమిలో 50 శాతం బావుల కింద సాగవుతున్నది. దీనితో పోల్చితే కాలువల కింద సాగవుతున్నది తక్కువ. కాని బడ్జెట్ కేటాయింపులో చిత్రం తలకిందులుగా ఉంటుంది. బడ్జెట్‌లో నీటి పారుదల శాఖకు చేసే కేటాయింపుతో పోల్చితే విద్యుత్ శాఖకు చేసే కేటాయింపు చాలా తక్కువ. అదే సమయంలో విద్యుత్ శాఖకు చేసే కేటాయింపు మొత్తం వ్యవసాయ విద్యుత్ సబ్సిడీకి కేటాయించారు. ఇందులో దాదాపు సగం మాత్రమే ఉచిత విద్యుత్‌కు సబ్సిడీగా కేటాయిస్తారు. మిగిలినవి పేద గృహ వినియోగదారులకు, కుటీర పరిశ్రమలు, ఇతర వినియోగదారులకు సబ్సిడీలుగా అందిస్తారు. కొంత జెన్‌కో ఖర్చులకు కేటాయిస్తారు. అంటే వ్యవసాయానికి ఉచిత విద్యుత్‌కై అందించే సబ్సిడీ నీటిపారుదల శాఖకు కేటాయించే నిధులలో సగం కూడా ఉండవు. ఉదాహరణకు 2011-12 ఆర్థిక సంవత్సరంలో విద్యుత్ శాఖకు రాష్ట్ర బడ్జెట్‌లో రు. 4,980 కోట్లు కేటాయించగా అందులో వ్యవసాయ సబ్సిడీ రు. 2,356 కోట్లు మాత్రమే. అదే సమయంలో నీటి పారుదల శాఖకు రు. 15,000 కోట్ల వరకు కేటాయించారు.

బడ్జెట్ కేటాయింపులు (రు. కోట్లలో)

| సంవత్సరం | విద్యుత్ శాఖ | నీటి పారుదల శాఖ |
|---|---|---|
| 2000 | 1,799 | 2,402 |
| 2001 | 2,894 | 3,029 |
| 2002 | 2,845 | 3,294 |
| 2012 | 4,980 | 15,000 |

వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగంలో అసమర్థత చోటు చేసుకున్నది వాస్తవం. వ్యవసాయరంగంలో ఉపయోగిస్తున్న విద్యుత్ పంపు సెట్లు 20 శాతం కంటే తక్కువ సామర్థ్యంతో పనిచేస్తున్నాయి. అంటే, 100 యూనిట్ల విద్యుత్ వినియోగిస్తే అందులో ఉపయోగించు కున్నది 20 యూనిట్లు మాత్రమే. మిగిలిన 80 యూనిట్లు వృథాగా పోతున్నాయి. దీనికి ముఖ్య కారణం స్టాండర్డు లేని, స్థానికంగా అసెంబుల్ చేసిన మోటర్లు వాడడం. ఐఎస్ఐ స్టాండర్డు మోటర్లు ఉపయోగించడం ద్వారా పంపుసెట్ల సామర్థ్యాన్ని 30 నుండి 40 శాతం పెంచేందుకు అవకాశం ఉంది. ఈ పంపుసెట్ల సామర్థ్యాన్ని పెంచడం ద్వారా వ్యవసాయ రంగంలో విద్యుత్ వినియోగాన్ని తగ్గించవచ్చు. దానితో పాటు రాష్ట్ర ప్రభుత్వంపై సబ్సిడీ భారాన్ని తగ్గించ వచ్చు.

వ్యవసాయరంగంలో విద్యుత్ వినియోగ సామర్థ్యాన్ని పెంచే కార్యక్రమంలో భాగంగా రాష్ట్ర ప్రభుత్వం 2005 జనవరి 25న ఉచిత విద్యుత్ పథకంలో కొన్ని మార్పులు చేర్పులు చేసింది. రైతులు ఉచిత విద్యుత్‌కు అర్హులు కావాలంటే నాలుగు డిమాండు సైడ్ మేనేజ్‌మెంట్ (డి ఎస్ ఎం) చర్యలను చేపట్టాలి. డిఎస్ఎం అంటే వాడకం సమయంలో చేపట్ట వలసిన పనుల కెపాసిటర్లు పెట్టడం. రాపిడిలేని ఫుట్ వాల్వ్‌లు వాడడం, హెచ్‌డిపిఇ పైపులు వాడడం, ఐఎస్ఐ స్టాండర్డు మోటర్లు వాడడం ఈ డిఎస్ఎం చర్యలలో భాగం. రాష్ట్ర ప్రభుత్వ కార్యాచరణ ప్రణాళికను అనుసరించి మార్చ్ 2006 నాటికి కెపాసిటర్లను, రాపిడి లేని ఫుట్ వాల్వ్‌లను వాడకంలోకి తేవాలి. మార్చ్ 2008 నాటికి అందరూ ఐఎస్ఐ స్టాండర్డు మోటర్లు, హెచ్‌డిపిఇ పైపులు వాడేటట్లు చూడాలి.

రాష్ట్రంలోని నాలుగు డిస్కమ్‌లు రాష్ట్ర విద్యుత్ నియంత్రణ మండలి (ఎపిఇఆర్‌సి)కి సమర్పించిన సమాచారం ప్రకారం 99 శాతం వ్యవసాయ విద్యుత్ కనెక్షన్లలో డిఎస్ఎం చర్యలను చేపట్టాలి అయితే ఇది పూర్తిగా అవాస్తవం. 10 శాతం కనెక్షన్లలో కూడా కెపాసిటర్లను కూడ పెట్టలేదు. నాలుగు డిఎస్ఎం చర్యలలో తక్కువ ఖర్చుతో కూడుకున్నది ఇది. మిగిలిన చర్యల గురించి ప్రస్తావించ వలసిన అవసరం లేదు. దీనికి కారణం రైతులలో అవగాహన లేకపోవడం వీటిని అమలు పరచడానికి క్షేత్ర స్థాయిలో తగినంత సిబ్బంది లేకపోవడం, ఉన్న వారికి తగిన సాంకేతిక పరిజ్ఞానం లేకపోవడం. కొన్ని సందర్భాలలో కెపాసిటర్లు సరిగా అమర్చక పోవడం వల్ల కరెంటు మోటర్లు కాలిపోతాయి. దీనితో కేపాసిటర్ల వలననే మోటర్లు కాలిపోతాయని రైతులు వాటికి దూరమైన సందర్భాలున్నాయి.

డిఎస్ఎం చర్యలలో అతిముఖ్యమైనది ఐఎస్ఐ స్టాండర్డు మోటార్లు వాడడం. విద్యుత్ వినియోగంలో ఆదా చేయడం ఎక్కువగా దీని మీదనే ఆధారపడి ఉంది. ప్రస్తుతం ఉపయోగిస్తున్నది స్టాండర్డులేని, స్థానికంగా అసెంబల్ చేసిన కరెంటు మోటర్లు. ఇవి స్టాండర్డు మోటర్ల వలె సమర్థ వంతంగా పనిచేయవు. దీనివలన విద్యుత్ వృథా అవుతున్నది. స్టాండర్డు మోటర్లు ఉపయోగించక పోవడానికి, స్థానికంగా తయారు చేసిన మోటర్లు వాడడానికి కారణం ఉంది. స్టాండర్డు మోటర్లు వాడడానికి కరెంటు వోల్టేజి బాగా ఉండాలి. కాని గ్రామీణ ప్రాంతాలలో కరెంటు వోల్టేజి చాలా తక్కువగా ఉంటుంది. ఈ తక్కువ వోల్టేజిలో ఐఎస్ఐ స్టాండర్డు మోటర్లు పనిచేయవు. దీనివలన రైతులు తక్కువ వోల్టేజిలో కూడా పనిచేసే స్థానికంగా అసెంబల్ చేసిన మోటర్లనే వాడుతున్నారు. వీటి ధర కూడా తక్కువ. రైతులు నాణ్యతగల, ఐఎస్ఐ స్టాండర్డు మోటర్ల వాడకం వైపు మొగ్గు చూపాలంటే ముందుగా గ్రామీణ ప్రాంతాలలో కరెంటు వోల్టేజి తగినంతగా ఉండేటట్లు చర్య తీసుకోవాలి.

ఇందులో ముఖ్యమైనది వ్యవసాయ కనెక్షన్లకు అవసరమైనన్ని ట్రాన్స్‌ఫార్మర్లను ఏర్పాటు చేయడం. ప్రస్తుతం ఒక్కొక్క ట్రాన్స్‌ఫార్మర్ మీద 20 నుండి 50 శాతం ఓవర్ లోడ్ ఉన్నది. దీనివలన కరెంటు వోల్టేజి తక్కువగా ఉంటున్నది. దీన్ని అధిగమించడానికి అదనంగా ట్రాన్స్‌ఫార్మర్లను ఏర్పాటు చేయాలి. దీనికి పరిష్కారంగా రాష్ట్ర ప్రభుత్వం హై వోల్టేజి డిస్ట్రిబ్యూషన్ సిస్టమ్ (ఎచ్‌విడిఎస్) ట్రాన్స్‌ఫార్మర్లను ప్రవేశపెట్టింది. సాంకేతికంగా ఇది సరైనదిగా కనిపించినా రాష్ట్రంలోని పరిస్థితులకు ఇది సరిపోదు. హెచ్‌విడిఎస్ ట్రాన్స్‌ఫార్మర్లు ప్రస్తుతం ఉపయోగంలో ఉన్న ట్రాన్స్‌ఫార్మర్ల కంటే నాలుగైదు రెట్లు ఖరీదైనవి. దీని వలన వచ్చే లాభం దీని ఖర్చుతో పోల్చితే సరితూగదు. ఈ పథకం కింద ఇప్పటికే రు, 2,862 కోట్ల ఖర్చు పెట్టారు. అయినా 10 శాతం ట్రాన్స్‌ఫార్మర్లను కూడా ఇంతవరకు మార్చలేదు. ఇదే ఖర్చు సాధారణ ట్రాన్స్‌ఫార్మర్ల మీద పెట్టి ఉంటే ఈ పాటికి గ్రామీణ ప్రాంతాలలో చాలా వరకు లో వోల్టేజి సమస్య పరిష్కరింపబడి ఉండేది. హెచ్‌విడిఎస్ పథకాన్ని కొందరు పారిశ్రామికవేత్తల కొరకు రూపొందించారు కాని రైతుల కొరకు కాదు.

వ్యవసాయానికి ఉచిత విద్యుత్ పథకాన్ని మొదటగా రూపొందించిన సమయంలో కాని, ఉచితం పేరుతో విద్యుత్ వినియోగం విచ్చల విడిగా పెరిగిపోకుండా ఉండడానికి డిఎస్ఎం చర్యలను రూపొందించి ప్రవేశ పెట్టిన సమయంలో కాని, రాజకీయ పార్టీలు కాని, రాష్ట్ర ప్రభుత్వం కాని రైతులతోనూ, రైతు ప్రతినిధులతోనూ చర్చించలేదనే చెప్పాలి. దీనిని రైతులకిస్తున్న వరంగానో, దక్షిణగానో చూశారు కాని, ఒక అభివృద్ధి అంశంగా పరిగణించలేదు. వ్యవసాయ రంగంలో విద్యుత్‌ను సమర్థ వంతంగా ఉపయోగించడాన్ని ప్రోత్సహించేందుకు రైతులతో కూలంకషంగా చర్చించవలసిన అవసరం ఉంది. రైతులు మెట్ట వ్యవసాయం నుంచి అనిశ్చిత స్థితిని ఎదుర్కొనేందుకు బోరుబావుల వైపు మొగ్గుచూపారు. బోరు బావుల సంఖ్య పెరిగి భూగర్భ జలాలు అడుగంటడంతో ఆ అనిశ్చిత స్థితి మెట్ట రైతులను వెంటాడుతూనే ఉంది. బోరు బావుల కొరకై లక్షల కొద్ది అప్పుచేసి, పెట్టుబడి పెట్టి, అనుకున్న రీతిలో నీళ్లురాక అప్పులు తీర్చే దారిలేక ఆత్మహత్యలు చేసుకున్న రైతుల సంఖ్య భారీగానే ఉంది. వ్యవసాయ రంగంలో భూగర్భ జలాలు విద్యుత్ వినియోగాన్ని రైతుల భాగస్వామ్యంతో నియంత్రించ వలసిన అవసరం ఉంది. మెట్ట వ్యవసాయం లాభసాటిగా ఉండేటట్లు విధానాలను రూపొందించ వలసిన అవసరం కూడా ఉంది.

*(రచయిత కన్వీనర్, పీపుల్స్ మానిటరింగ్ గ్రూప్ ఆన్ ఎలక్ట్రిసిటి రెగ్యులేషన్)* వీ

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 18

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

*(గత సంచిక తరువాయి...)*

**హైదరాబాద్ ప్రాంత ఇనాంల గుర్తింపు చట్టం 1952**

పూర్వపు నిజాం పరిపాలనలోని జిల్లాలలో అప్పటి ప్రభుత్వం ఇచ్చిన ఇనాంలు, జాగీర్దారులు, పాయికాదారులు ఇచ్చిన ఇనాం భూములలో పూర్తి ఉచితంగా ఎలాంటి శిస్తు లేకుండా ఉన్న వాటికి, ఆ భూములపై హక్కు ఉందని నిర్ణయించడానికి గాను భూమి శిస్తులో 1/8 వంతును (జోడి లేదా క్విటా రెంట్ అంటారు) వీరి నుండి వసూలు చేయడం ద్వారా సాగు చేసుకొనే వారికి గుర్తింపు వస్తుందని భావించి ప్రభుత్వం ఈ చట్టాన్ని చేసింది. కాని ఈ చట్టం ద్వారా ఇనాందారుకు 7/8 వంతు భూమి శిస్తు రద్దయింది కాని, ఈ భూములలో ఇనాందారు ద్వారా సాగు చేసుకుంటున్న సామాన్య రైతులకు ఎలాంటి ఉపయోగం కలుగలేదు. దాని సమగ్రమైన చట్టం చెయ్యాల్సిన అవసరం వచ్చింది.

**హైదరాబాద్ ప్రాంత ఇనాంల రద్దు చట్టం 1955**

గ్రామసేవా ఇనాంలు, మతపరమైన, సేవా సంబంధమైన ఇనాంలు తప్ప మిగిలిన అన్ని ఇనాంలను ఈ చట్టం ద్వారా రద్దు చేసి, ఇనాం భూములన్నింటికీ పూర్తి భూమి శిస్తు విధించారు. హైదరాబాద్ కౌలుదారీ చట్టం 1950 ద్వారా సంక్రమించిన హక్కు ద్వారా ఒక ఇనాందారు తన స్వంత సేద్యం కోసం ఉంచుకోదగిన భూమిని, దానితో పాటు తనకున్న ఇతర భూములతో కలిపి నాలుగున్నర రెట్ల భూమిని ఒక కుటుంబ కమతంగా నిర్ణయించారు. ఈ భూమి పోను మిగిలిన భూమిని కౌలుదారు లేదా ప్రభుత్వం స్వాధీనం చేసుకుంటుంది. ప్రభుత్వం స్వాధీనం చేసుకున్న ఇనాం భూమికి నష్టపరిహారం చెల్లించాల్సి ఉంటుంది. స్వాధీనం చేసుకున్న భూమి సాగులో ఉన్నదైతే, కౌలుదారుకైతే (అతనికి నాలుగున్నర రెట్ల కుటుంబ కమతం కన్నా ఎక్కువ భూమి ఉన్న పక్షంలో) మెట్ట భూములకు పది రెట్ల భూమి శిస్తు, మాగాణికి పదిహేను రెట్ల భూమి శిస్తును ప్రభుత్వం పరిహారంగా చెల్లించాల్సి ఉంటుంది. రక్షిత కౌలుదారుకైతే మెట్టకైనా, మాగాణికైనా పదిహేను రెట్లు భూమి శిస్తు చెల్లించాలి. కబజ్-ఇ-కదిమ్ (కబిజ్ - స్వాధీనంలో, కదిమ్ అంటే పన్ను కట్టం) ఇనాందారుకైతే (ఇనాందారుకు భూమి గ్రాంట్‌గా ఇచ్చినప్పటి కన్నా ముందు నుంచి అదే భూమిలో సాగు చేస్తున్న వారు లేదా పన్నెండు సంవత్సరాల నుండి ఆ భూమిలోనే సాగు చేస్తూ ఇనాందారుకు శిస్తు కడుతున్నవారిని కబజ్-ఇ-కదిమ్ ఇనాందారు అంటారు) ప్రభుత్వం మెట్ట భూములకు ఇరవై రెట్లు భూమి శిస్తును, మాగాణికి పదిరెట్లు భూమి శిస్తును నష్టపరిహారంగా చెల్లించాల్సి ఉంటుంది.

బంజరు భూములకు సంబంధించి ప్రభుత్వం నష్టపరిహారాన్ని కౌలుదారులకైతే మెట్ట భూములకు నాలుగు రెట్లు, మాగాణికి రెండు రెట్లు భూమి శిస్తును, రక్షిత కౌలుదారుకు మెట్టకు ఆరు రెట్ల భూమి శిస్తు, మాగాణికి మూడు రెట్లు భూమి శిస్తును చెల్లించాలి. కబిజ్-ఇ-కదిమ్ ఇనాందారుకు మెట్టకు ఇరవై రెట్ల భూమి శిస్తు, మాగాణికి పది రెట్లు భూమి శిస్తును పరిహారంగా ఇవ్వాలి.

**'హక్కు పత్రం'** - ప్రభుత్వం ఇనాం భూములుగా వర్గీకరించిన భూములకు హక్కు పత్రం పొందాలంటే ఒక భూమికి విధించిన శిస్తులో 7/8 వంతు భూమి శిస్తుకు 25 రెట్లు ప్రభుత్వానికి చెల్లించి ఇనాందారు హక్కు పత్రం పొందవచ్చు. ఈ నిర్ధారించిన ప్రీమియం (అధిక విలువ)ను పది సంవత్సరాలలో పది కంతులలో ప్రతి సంవత్సరం ఆ భూమిపై విధించే భూమి శిస్తుతో కలిపి చెల్లించాలి. అదే రక్షిత కౌలుదారు అయితే భూమి శిస్తుకు నలభై రెట్లు ప్రభుత్వానికి చెల్లించి మెట్ట భూమికి హక్కు పత్రం పొందవచ్చు. మాగాణి భూమికైతే పదమూడున్నర రెట్లు భూమి శిస్తు చెల్లించి పొందాలి. ఈ మొత్తాన్ని పది సంవత్సరాలలో భూమి శిస్తుతో కలిపి చెల్లించాలి. మామూలు కౌలుదారు మెట్ట భూములకు అరవై రెట్లు భూమి శిస్తు, మాగాణి భూములకు ఇరవై రెట్లు పది సంవత్సరాలలో చెల్లించి హక్కు పత్రం పొందవచ్చు.

**లావొని రూల్స్ (నిబంధనలు) 1950**

'లావొని' అంటే ఖాళీగా ఉన్న భూమిలో వ్యవసాయం జరగడం. శతాబ్దాల నుంచి రాజ్యాధికారం ఉన్న వాళ్లు వారి అవసరాల కోసం లేదా వారికిష్టమైన వారికి, వారిని మెప్పించిన వారికి భూమిపై హక్కు కల్పించి, అందులో వచ్చే ఆదాయాన్ని వసూలు చేసుకొనే అధికారం లేదా ఆదాయాన్ని అనుభవించే అధికారాన్ని కల్పించారు. కాని నిజాం రాచరిక వ్యవస్థ అంతమై భారత ప్రజాస్వామ్య ప్రభుత్వంలో విలీనమైన తరువాత ప్రజావసరాలు తీర్చడానికి గాను చేసిన జాగీర్దారు రద్దు చట్టం, హైదరాబాద్ కౌలుదారుల రద్దు చట్టాలను అమలు పరిచే యంత్రాంగం ద్వారా ప్రభుత్వం బంజరు భూముల పంపిణీ సక్రమంగా జరగడానికి కొన్ని నిబంధనలను ఏర్పరిచింది. వీటినే లావొని రూల్స్ అంటారు.

హైదరాబాద్ లాండ్ రెవెన్యూ యాక్ట్ 1317 ఫసలీలోని సెక్షన్ 54 ద్వారా బంజరు లేక ఖాళీగా ఉన్న ప్రభుత్వ భూములను మంజూరు చేసే అధికారాన్ని అప్పటి వరకు ఉన్న రాచరిక ప్రతినిధుల స్థానంలో తహసిల్దార్‌కు, అసిస్టెంట్ / డిప్యూటీ కలెక్టర్‌కు, కలెక్టర్‌కు, రెవెన్యూ బోర్డ్‌కు అప్పగించారు. మంజూరు చేసే ప్రక్రియ, ఉత్తర్వులు ఇవ్వడంలో

పాటించాల్సిన నియమాలే లావొని రూల్స్. తరం కట్టిన బంజరు భూములు, తరం కట్టనివి, రిజర్వ్ భూములలో (అటవీ భూములు తదితరాలు) వ్యవసాయం చేసుకోవడానికి లేదా నివసించడానికి గాను భూమిలేని / ఇల్లు లేని వ్యక్తులు తహసిల్దారుకు తమ పేరిట భూమి లేదా నివాస స్థలం మంజూరు చేయమని దరఖాస్తు పెట్టుకోవాలి.

ఈ దరఖాస్తును ముందుగా గ్రామాధికారి (పటేల్, పట్వారీ) విచారించిన తరువాత గిరిదావర్ (రెవెన్యూ ఇన్‌స్పెక్టర్) గ్రామ ప్రజల సమక్షంలో విచారణ చేసి అభ్యంతరాలు రానట్లయితే దరఖాస్తు పెట్టుకున్న భూమి రూపాన్ని చిత్రించి (స్కెచ్) దానిపై దరఖాస్తుదారు తాను దరఖాస్తు పెట్టుకున్న భూమి అదేనని నిర్ధారించుకున్న తరువాత (ఆ స్కెచ్‌పై) అతని సంతకాన్ని తీసుకొని, గ్రామ ప్రజలతో పంచనామాను తయారు చేస్తాడు. గిర్దావరు నివేదిక ఆధారంగా తహసిల్దారు ముందుగా దరఖాస్తు చేసుకున్న భూమి హైదరాబాద్ రెవెన్యూ చట్టం 1317 ఫసలీలోని 25 సెక్షను ద్వారా గ్రామం మొత్తం భూమిలో పది శాతం పశువుల గడ్డి మేతకు వదలగా పోను మిగిలిన భూమిలో ఉందా లేదా పరిశీలించాలి. తరువాత లావొని పట్టాను దరఖాస్తుదారుని ఆర్థిక స్తోమతను బట్టి ఉచితంగానా లేదా ధర చెల్లించిన తరువాత మంజూరు చేయాలో నిర్ణయించడానికి కలెక్టర్‌కు పంపుతారు. ఒకవేళ అప్పటికే ఆ భూమి ప్రజా అవసరార్థం ఉపయోగించబడుతున్నా లేదా ప్రజా అవసరాల కోసం కావలసి ఉన్నా దరఖాస్తును తిరస్కరించవచ్చు.

కలెక్టర్ అనుమతించిన ఉత్తర్వుల మేరకు రు. 100 విలువ కల భూమికి తహసిల్దారుకే లావొని పట్టా మంజూరు చేసే అధికారం ఉంది. రు. 100 నుంచి రు. 500 విలువకల భూమిని మంజూరు చేసే అధికారం అసిస్టెంట్ / డిప్యూటీ కలెక్టర్‌కు ఉంటుంది. అదే రు. 500 నుంచి రు. 2000 లోపు ఖరీదు ఉండే భూముల మంజూరు అధికారం కలెక్టర్‌కు ఉంటుంది. ఒకవేళ భూములను ధరకే అమ్మాలని నిర్ణయించు కున్నప్పుడు వేలం వేయాల్సిన అవసరం లేదనే నిర్ధారణకు కలెక్టర్ వస్తే నిర్ణయించిన ధరకు దరఖాస్తుదారుకు పట్టా మంజూరు చేయొచ్చు. ఒకరు కన్నా ఎక్కువ దరఖాస్తుదారులున్నప్పుడు, లేదా భూమి ఎక్కువ ఉన్నప్పుడు వేలం వేసి భూములను మంజూరు చేయాలని నిర్ణయించు కుంటే వేలం తేదీని నిర్ణయించి అందుకు పదిహేను రోజుల ముందే గ్రామంలోనూ, తహసిల్దారు కార్యాలయంలోనూ నోటీసులు అంటించి, విస్తృతమైన ప్రచారం కూడా చేయాలి. రు. 100 విలువ గల భూమికి గిర్దావరు వేలం నిర్వహిస్తాడు. వేలం ధరను తహసిల్దారు నిర్ధారించాలి. అదీ రు. 100 నుంచి రు. 500 విలువ కలిగిన భూములకు తహసిల్దారు వేలం పాట నిర్వహిస్తే అసిస్టెంట్ / డిప్యూటీ కలెక్టర్ ధరను నిర్ధారిస్తాడు. రు. 500 నుంచి రు. 2000 వరకు విలువ కలిగిన భూముల వేలంను కలెక్టరే స్వయంగా నిర్వహించాల్సి ఉంటుంది. ఈ వేలం పాటలో భూమి పొందిన దరఖాస్తుదారునికి రెవెన్యూ బోర్డు అనుమతి ఇవ్వాల్సి ఉంటుంది. వేలంలో భూమిని దక్కించుకున్న వ్యక్తి వేలం రోజు ధరలో 25 శాతం విలువను అదే రోజు జమ చేయాలి. మిగిలిన 75 శాతం భూమి విలువను పదిహేను రోజులలో జమ చేయాల్సి ఉంటుంది.

దరఖాస్తుతో పాటు విచారణ చేసిన రికార్డును, వేలం నిర్వహించిన రికార్డును, చలానుతో కలిపి కలెక్టర్ అనుమతి కోసం ప్రతి దరఖాస్తునూ పంపాలి. కలెక్టర్ అనుమతి ఇస్తేనే లావొని పట్టా చెల్లుబాటు అవుతుంది. కలెక్టర్ వేలం నిర్వహించిన భూములకు సంబంధించి యావత్తు రికార్డును రెవెన్యూ బోర్డుకు పంపాల్సి ఉంటుంది. ఒకవేళ అమ్మకాన్ని రద్దు చేయాలనుకుంటే కలెక్టర్ కాని, రెవెన్యూ బోర్డు కాని కారణాలు తెలిపి వేలాన్ని రద్దు చేయవచ్చు. రద్దు చేసిన పక్షంలో రద్దు ఉత్తర్వులతో పాటు జమ చేసిన డబ్బు కూడా వాపసు చేస్తారు. ఈ ప్రక్రియలో చేసే ప్రతి పనికీ అన్ని వివరాలు నమోదు చేస్తూ రిజిష్టరులు తయారు చేస్తారు. కలెక్టర్ లేదా రెవెన్యూ బోర్డు అనుమతి లభించిన తరువాత ఫారం 'జి'లో దరఖాస్తుదారుకు మంజూరు ఉత్తర్వును ఇస్తారు. లావొని పట్టా ద్వారా మంజూరయిన భూములను మూడు సంవత్సరాల లోపు సాగు చేయాలి లేదా మంజూరు ఉత్తర్వును రద్దు చేస్తారు. ఉత్తర్వుతో పాటు గ్రామాధికారికి గ్రామ లెక్కల్లో మార్పులు చేయమని ఉత్తర్వులు జారీ చేస్తారు. ఈ భూమిపై నిర్ధారించిన శిస్తు, భూమి ధర జమ అయిన తరువాత సర్వే సెటిల్‌మెంట్ శాఖకు ఆకార్ బంద్ రిజిష్టరులో సబ్ డివిజన్ మార్పులు చేయడానికి వివరాలు పంపుతారు. ఒకవేళ లావొని పట్టాలో నమోదు చేసిన విస్తీర్ణానికి, సర్వే చేసిన తరువాత విస్తీర్ణం ఎక్కువ ఉంటే, దానికి సంబంధించి భూమి విలువను, అంత మొత్తానికి శిస్తును వసూలు చేసిన తరువాత ఆకార్ బంద్ రిజిష్టర్‌లో మార్పులు నమోదు చేస్తారు.

**స్పెషల్ లావొని రూల్స్ (ప్రత్యేక లావొని నిబంధనలు)**

హైదరాబాద్ ల్యాండ్ రెవెన్యూ చట్టం 1317 ఫసలీ సెక్షన్ 58 ఎ లోని నిబంధనల ఆధారంగా వేలంలో పాల్గొని డబ్బు చెల్లించలేని భూమి లేని పేదలు కానీ, వెనుకబడిన తరగతుల వారు కానీ భూమి కోసం లేదా ఇంటి స్థలం కోసం పెట్టుకున్న దరఖాస్తులను సాధారణంగా ప్రతి సంవత్సరం ఏప్రిల్, సెప్టెంబర్ నెలల్లో ఆ ప్రాంతాలను తహసిల్దారు సందర్శిస్తున్నప్పుడు పరిశీలించి, ఆ గ్రామంలోని వారిలో ఎక్కువ అవసరం ఉన్న వాళ్లను గుర్తించి వారికి భూమి మంజూరు చేయడానికి ఉత్తర్వులు ఇస్తారు. తహసిల్దారు ఉత్తర్వులకు తప్పనిసరిగా కలెక్టర్ అనుమతి ఉండాలి. లేకపోతే ఈ ఉత్తర్వు అమల్లోకిరావు. భూమి లేని వాళ్లకు భూమి మంజూరు చేస్తే వారు మూడు సంవత్సరాలలో ఆ భూమిని ఉపయోగించుకోవాలి. ఈ ప్రత్యేక లావొని నిబంధనల కింద ఇప్పటికే ఆ భూములలో వ్యవసాయం చేస్తున్న వారిని, రక్షిత కౌలుదారులకు ముందుగా అవకాశం ఇస్తారు. వీరికి మంజూరు చేయగా మిగిలిన భూమిని మాత్రమే లేని వారికి పంపిణీ చేస్తారు. ప్రత్యేక లావొని నియమాల ద్వారా మంజూరయిన భూముల వివరాలను 'ఐ' రిజిష్టర్‌లో నమోదు చేస్తారు.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం భూమిపై సాగు చేస్తున్న వారికోసం, భూమి లేని పేదల కోసం అందరికీ భూమిపై హక్కు తద్వారా జీవితానికి భద్రత, జీవించే హక్కుకు భంగం కలగకుండా ఉండడానికి ఇన్ని చట్టాలు చేసినా వాటిని చట్టంలో ఉన్న చిన్న చిన్న లొసుగుల ఆధారంగా భూస్వాములు ఈ భూసంస్కరణల చట్టాల అమలులో అడుగడుగునా అడ్డం వచ్చారు. గ్రామ రెవెన్యూ అధికారి స్థాయి నుంచి వీరికి చాలాసార్లు తమ వంతు సహకారం కూడా అందించారు. ముఖ్యంగా ఈ చట్టం అమలులో కింద పేర్కొన్న సమస్యలు వచ్చాయి.

**ఆంధ్రప్రదేశ్‌లో భూ సంస్కరణల చట్టాల అమలులో సమస్యలు**

1. మద్రాస్ ప్రెసిడెన్సీ కింద ఉన్న రాష్ట్ర భూభాగంలో ఎస్టేటు భూములలోని వ్యవసాయదారుల సమస్యలపై అధ్యయనానికి, సమస్య పరిష్కార సూచనలపై నివేదిక కోరి టంగుటూరి ప్రకాశం కమిటీని 1936లో వేశారని, ఆ నివేదికను బిల్లు రూపంలో 1939లో సెనేట్‌లో చట్టం చేయడం కోసం చర్చకు పెట్టినా అది ఆమోదం పొందకుండా తిరిగి 1949లో ఎస్టేట్ రద్దు చట్టం చేశారు. ఇందుకు పట్టిన 14 సంవత్సరాల కాలంలో జమీందార్లు, రాజాలు, వారి అనుచరులు భూ కమతాలపై హక్కులను తమకనుగుణంగా మార్చు కున్నారు. మార్చుకోవడం కుదరనప్పుడు బినామీల పేరు మీద హక్కులు సృష్టించుకొని భూములను సాగుదారులకు కాకుండా ఇతరులకు అమ్ముకున్నారు.

2. స్వంత సేద్యం కోసం భూములను తమ ఆధీనంలో ఉంచుకోవచ్చనే కారణంతో రక్షిత కౌలుదారులను కూడా భూముల నుంచి వెళ్లగొట్టి, వేరే వ్యవసాయదారులకు లేదా వ్యవసాయ కూలీలకు వాటిని సాగు చేసుకోవడానికి ఇచ్చారు.

3. 1930ల నుంచీ కౌలుదారుల భూపోరాటాలు, వ్యవసాయ కూలీల ఆందోళనల వలన, 1936లో ఎస్టేట్ భూములలో రైతుల సమస్యల పరిష్కారానికి కమిటీ వేయడంతో భూస్వాములు లిఖిత కౌలుకు భూములు సాగుకు ఇవ్వడం మానేసారు. దానికి తోడు కౌలుదారుల పేర్లు ప్రత్యేకంగా నమోదు చేసే రిజిష్టర్ లేకపోవడం, కేవలం అడంగల్‌లోనే అనుభవదారు పేరు మాత్రమే రాసే అవకాశం ఉండడంతో గ్రామ రెవెన్యూ అధికారుల అండతోను, లేదా భూస్వాములు వారికున్న బలంతో గ్రామ రెవెన్యూ అధికారులను తమకనుకూలంగా మలచుకొని చాలాచోట్ల కౌలుదారుల పేర్లను అడంగల్‌లో నమోదు కానివ్వలేదు. కేవలం భూమి శిస్తు రసీదు మాత్రమే వీరికి భూమిలో తాము వ్యవసాయం చేస్తున్నామని దానికి ఆధారంగా ఉండేది. భూమి శిస్తుకు రసీదులు ఇవ్వకుండా భూస్వాముల మనుషులు, వారి యంత్రాంగం కౌలుదార్ల దగ్గర శిస్తు, కౌలు తామే వసూలు చేసుకొని తమకనుకూలంగా ఉండే వారి పేర్ల మీద, బినామీల పేరుతో, తమ దగ్గర పనిచేసే వారి పేరుతో రసీదులు ఇప్పించుకున్నారు.

4. కౌలుదారులు వ్యాజ్యాలలో తామే పొలం సాగుచేసుకుంటున్నామని రుజువు చేసుకోలేకపోవడంతో చాలాసార్లు కేసులలో ఓడిపోయారు. ఓడిపోయిన తరువాత జరిగే పరిణామాలకు భయపడి మెజారిటీ కౌలుదార్లు అసలు కోర్టులకు వెళ్లడం మానేశారు. దీనితో భూస్వామి కౌలును తన ఇష్టం వచ్చినంత పెంచడం, లేదా చెప్పినంత ఇచ్చేవారికి భూములను కౌలుకివ్వడం చేశారు.

5. జమీందారీ రద్దు చట్టం, జాగీర్దారు రద్దు చట్టం ద్వారా జమీందారులు, జాగీర్దార్లు మూడు కుటుంబ కమతాలు తమ స్వంతానికి ఉంచుకోవచ్చు అనడం, ఇవి కాకుండా జమీలు, జాగీరులలో లేకుండా వేరే చోట ఉన్న వారి స్వంత ఆస్తిని వారే ఉంచుకోవచ్చు అనే నిబంధనతో వారు పెద్ద విస్తీర్ణాలలో వందల ఎకరాలు ఉంచుకున్నారు. ముఖ్యంగా భూకమతాలపై గరిష్ట పరిమితి లేకపోవడంతో 27 ఎకరాల తరి భూమి, 324 ఎకరాల మెట్ట భూమి తమ స్వంత సేద్యం కోసం ఉంచుకోవచ్చనే నిబంధనతో 1961 గాను మిగులు భూమిగా కేవలం 7400 ఎకరాలు మాత్రమే భూస్వాములు చూయించారు.

6. ఎస్టేట్ రద్దు చట్టంలోని సెక్షన్ '11ఎ' కింద డిక్లరేషన్‌లను తమ బినామీల ద్వారా, లేదా తాము ఎవరికైతే భూమిని అమ్ముకున్నారో వారినే ఆ భూమికి కబ్జాదారులుగా సెటిల్‌మెంట్ ఆఫీసర్ ముందు దరఖాస్తులు దాఖలు చేయించి భూములను కాజేశారు. తమ కనుకూలంగా ఉత్తర్వులు రాగానే వాటిని అమ్ముకున్నారు.

7. ఇనాందారుల రద్దు చట్టంలో కుటుంబ కమతానికి వచ్చే భూమిపై నాలుగున్నర రెట్ల భూమిని ఇనాందారు తమ స్వంత సేద్యానికి ఉంచుకోవచ్చు అనే నిబంధనతో రక్షిత కౌలుదారులను కూడా వెళ్లగొట్టి భూములను తమ ఆధీనంలో తెచ్చుకున్నారు.

8. కౌలుదారీ చట్టం ద్వారా ఆరు సంవత్సరాలు ఒకే భూమిలో సాగు చేస్తుంటే ఆ భూమికి హక్కుదారుడు అవుతాడు కాబట్టి కౌలుదారులను పదే పదే మార్చారు. యజమానులు తాము స్వంత సేద్యం కోసం భూములను తీసుకోవచ్చు అనే నిబంధనను ఉపయోగించుకొని హక్కు దారులను కూడా వెళ్లగొట్టారు. ముఖ్యంగా ఆరు సంవత్సరాల తరువాత ఒకవేళ తన యాజమాన్య హక్కులో ఉన్న భూమిని కౌలుదారుకే ముందుగా అమ్మచూపాలి కాబట్టి యజమాని తన అవసరం కోసం అమ్ముకోవాల్సిన పరిస్థితిలో ఇది వరకు భూస్వామి నుంచి భూమి కౌలుకు తీసుకోవడానికి సాగుదారుడు నజరు ఇచ్చినట్లు ఇప్పుడు తాము ఎంతో కొంత కౌలుదారుకు ముట్ట చెప్పాల్సి వస్తుందని కౌలుదారులను ఖాళీ చేయించారు. సంస్థలు, చాలా పెద్ద కమతాలున్నవారు తప్ప, సాధారణ స్థాయిలో భూములున్నవారంతా కౌలుదారులను వెళ్లగొట్టి జాగ్రత్తపడ్డారు.

9. కౌలు మొత్తాన్ని ప్రభుత్వం పొలం లేదా పంట రుణాన్ని బట్టి 28 1/3 శాతం నుంచి 50 శాతం వరకు వసూలు చేసుకోవాలని ప్రభుత్వం నిర్ణయించడం, పైగా వసూలు చేసుకున్న కౌలుకు రసీదు ఇవ్వాల్సి రావడంతో ఇందులో ఏదైనా అవకతవకలుంటే ప్రత్యేక అధికారి దగ్గర విన్నవించుకునే అవకాశం కౌలుదారులకు ఉండడంతో యజమానులు కౌలు కొనసాగింపుకు భయపడి ఒక్క వ్యక్తికే కౌలుకివ్వడం మానారు.

(ఇంకా ఉంది)

(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)
saralareddy007@gmail.com

వీ

ఇటీవల పోస్టల్ శాఖ అన్ని మనీ ఆర్డర్‌లను టెలిగ్రాఫిక్ మనీ ఆర్డర్‌లుగా పంపుతున్నది. మీరు ఎం.ఒ. చేసినప్పుడు కింద కూపన్‌లో రాసిన ఉత్తరం ఈ టెలిగ్రాఫిక్ ఎం.ఒ.లో మాకు చేరదు. కనుక ఎం.ఒ.లు చేసేవారందరూ విడిగా ఒక పోస్ట్‌కార్డు మీద మీరు ఎం.ఒ. ఎందుకు పంపుతున్నారో రాయండి.

– సం.

# కులం పుట్టుక - నిర్మూలన

- చంద్ర వెంకటేశ్వర్రావు

ఇటీవల రంగనాయకమ్మ బి. సైదులు వ్యాసాన్ని 'చాలామార్లు చదివితే గాని అర్థం కాలేదు' అన్నారు. ఒకవేళ రంగనాయకమ్మ బి. సైదులు వ్యాసం (సిద్ధాంత చర్చ) 'కులం పుట్టుక – నిర్మూలన' (వీక్షణం, జూన్ 2013) చదివితే పరిస్థితిలో మార్పు ఉండకపోవచ్చు.

ఈ సిద్ధాంత చర్చలో (వ్యాసంలో) కులం పుట్టుకకు ఈ కింది వాటిని కారణాలుగా చూపించారు.

1. పని విభజన, 2. అంతర్ వివాహ పద్ధతి, 3. బల ప్రయోగం.

పై మూడింటికీ సాహిత్య నిరూపణ, శాసన నిరూపణ చేసి ఉన్నట్లయితే పాఠకులకు ఉపయుక్తంగా ఉండేది. ఒక సామాజిక అంశం వెనుక లోతైన అధ్యయనం ఉండి, ఆ మొత్తం నుండి చిలికి, చిలికి వెన్నలా విషయాన్ని బయటకు తీసుకువచ్చినప్పుడు వ్యాసం సరైన మూర్తిమత్వంలో ఉంటుంది. మొత్తం సమాజాన్ని వదిలి కులాన్ని ప్రధానం చేయడం వల్ల సహజంగా విశ్లేషణతో కూడిన సాహిత్య అధ్యయనం తక్కువగా ఉన్నా, ప్రజలకూ, పాఠకులకూ ఇదే ప్రధాన సమస్యగా కనిపించే, భ్రమింపచేసే అవకాశం ఉంది. సహజంగా ఇలాంటి వివిధ రకాల ఉద్యమాలు ప్రధాన స్రవంతి ప్రజా ఉద్యమాలని బలహీన పరుస్తాయని మనకు తెలుసు. ఇక్కడ విషయం నేల విడిచిన సాధనంగా ఉంటుంది.

భావవాద పద్ధతి కులాన్ని అర్థం చేసుకోవడానికి ఉపయోగపడదు. భావ వాదమంటేనే 'మాయ'. భావవాద పద్ధతిలో కులం పుట్టుక తెలుసుకోవడం అంటే 'మాయ' వెనుక ఉన్న మర్మం తెలుసుకున్నట్లే. అంటే అప్పుడు భౌతికవాద పద్ధతిలో ప్రజలు కులాన్ని అర్థం చేసుకున్నట్లు ఉంటుంది. అలా అర్థం చేసుకుంటే కులం పెరుగుదలకు అవకాశాలు ఇంత బలంగా ఉండేవి కావు. అందువల్ల పాలకవర్గాలు ఎప్పుడూ తమ వర్గ భావజాలాన్ని ఇలా ఉపరితల అంశాల ద్వారా ప్రజలపై మోపుతూ వర్గపాలన సాగిస్తుంటాయి. ఇకపోతే కమ్యూనిస్టులు 'కులం పుట్టుక' ఎలా జరిగిందో చెప్పాలి లాంటి వాక్యాలు ఈ శీర్షికకు సరిపోయినట్లు అనిపించడం లేదు. అంతేకాక భారతదేశపు ప్రత్యేక లక్షణమైన కులానికి, హెగెల్ భావవాదానికి ముడిపెట్టడం, ఒక విషయం పట్ల భావవాదులు, కమ్యూనిస్టులు ఒకే పద్ధతిని పాటిస్తారనడం కూడా కొంచెం ఆలోచించాల్సిన విషయం.

ఇక్కడ కమ్యూనిస్టులు భావవాదాన్ని చిలికి, చిలికి అందులో నుండి భౌతికవాదాన్ని వెలికితీశారు. ఆ భౌతికవాదాన్ని తార్కిక పద్ధతిలో అర్థం చేసుకోవడం మొదలుపెట్టారు. ఫలితంగా సమాజాన్ని 'గతితార్కిక' పద్ధతిలో భౌతికవాదం పునాదిగా అర్థం చేసుకోవడం మొదలయింది. అప్పుడు మాత్రమే సామాజిక సమస్యల మూలం, కారణాలు శాస్త్రీయ పద్ధతిలో వెలుగు చూశాయి. మరో మాట హెగెల్, కాంట్, ఫాయర్‌బాక్ లాంటి వారి తాత్విక చింతన ఎలా తలకిందులుగా ఉందో, ఎంత అశాస్త్రీయతను మూటకట్టుకుందో మార్క్స్, ఎంగెల్స్ నిరూపించారు. తలకిందులుగా ఉన్నటువంటి వారి తాత్విక చింతనను నిటారుగా నిలబెట్టి, శాస్త్రీయతను నిరూపించిన ఘనత కమ్యూనిస్టు నాయకులది. హెగెల్ సూటిగా భౌతికతత్వాన్ని ముందుకు తెచ్చినవాడు కాదు. అంతేకాక హెగెల్ భావవాదాన్ని తలకిందులుగా నిలబెట్టబడిన భౌతికవాదంగా కమ్యూనిస్టులు నిరూపించారు. కాబట్టి హెగెల్‌ది కమ్యూనిస్టులది ఒకే మార్గం కాదు. ఇక్కడ కొంత అద్ది శుద్ధి కూడా లోపించింది. భావవాది తార్కికతను ముందుకు తీసుకు వస్తే చివరి ప్రమాణం పదార్థం మిగులుతుంది. భావవాది పదార్థాన్ని భ్రమ అంటాడు. కాబట్టి భావవాది, భౌతికవాదానికి చెందిన గతితార్కికతను ముందుకు తీసుకురావడం ఎలాగో ఆలోచించాల్సి ఉంది.

కమ్యూనిస్టులు సమాజాన్ని ఎప్పుడూ పునాది, ఉపరితలంగా అధ్యయనం చేస్తారు. అదే శాస్త్రీయ పద్ధతి కూడా. సమాజం వర్గాలుగా విడిపోవడానికి కారణమైన శ్రమ విభజన ఎలా జరిగిందో చూస్తారు. ఇలా ఏర్పడిన వర్గ సమాజానికి ఉపరితల అంశాలను పాలకవర్గాలు ఎలా అనుకూలంగా మార్చుకుంటాయో చూస్తారు. వివిధ ఉపరితల అంశాలకు వర్గ సమాజంలో ఎప్పుడు పునాదులు పడ్డాయో చూస్తారు. ఆ పునాదులకు ఏయే భౌగోళిక అంశాలు ఉపయోగపడ్డాయో చూస్తారు. అప్పుడు మాత్రమే 'కులం' లాంటి ఉపరితల అంశాల పుట్టుకను గతితార్కిక, భౌతికవాద పద్ధతిలో శాస్త్రీయంగా నిరూపిస్తారు. తప్పితే కేవలం కులం కోసమే ఇంత పెద్ద అధ్యయనం కమ్యూనిస్టు సాహిత్యంలో కనిపించదు. ఆధునిక కాలంలో సామ్రాజ్యవాదం ఆక్రమణలో భాగంగా వివిధ దేశాల్లో పెట్టుబడిదారీ విధానాన్ని మరింతగా విస్తరిస్తూ దేశాల్ని, ప్రజల్ని మోసగిస్తూ, విచ్ఛిన్నం చేస్తూ సాగిస్తున్న మారణహోమానికి, గత చరిత్రంతా వర్గ పోరాటాల చరిత్రేనని నిరూపించిన మార్క్స్ సిద్ధాంతానికి ముడిపెట్టడం అంత సమంజసం కాదేమోననిపిస్తుంది. చరిత్రంతా వర్గ పోరాటాల చరిత్రే అన్నాడు మార్క్స్.

ఆఫ్రికా, బ్రిటన్, అమెరికాల వలసలకూ, బానిసత్వానికీ భారత్‌లో కుల వ్యవస్థకు సంబంధం లేదు. భారతదేశంలో బానిస విధానం లేదు. పాలకవర్గాలు ప్రజల్ని అణచి ఉంచడానికి సృష్టించిన ఉపరితల అంశం కులం. ముస్లిం పరిపాలనలో, ఆంగ్లేయుల పరిపాలనలో కులం పాలకవర్గాలకు ఊడిగం చేస్తూ ఉపయోగపడింది. వారి పరిపాలనకు ఆటంకం కలగకుండా కులాన్ని ఉపయోగించుకున్నారు. కులానికీ, వర్గానికీ చాలా తేడా ఉంది. చరిత్రలో వర్గమంత బలమైంది కులం కాదు. వర్గం పరిష్కారమైతే కులం దానితో పాటుగా అంతరించిపోతుంది.

విషయ ఉదాహరణను అర్థం చేసుకోవడం కష్టంగా ఉంది. విషయం చాలా గాఢమైంది, లోతైంది. ఎంతో నిబద్ధత కలిగిన అధ్యయనం చేస్తే తప్ప అంత తేలికగా శాస్త్రీయ నిరూపణ చేయలేం. కుల నిర్మూలన అనే విషయం భారతీయ సామాజిక పరిణామ క్రమాన్ని, పరివర్తన క్రమాన్ని, ఉద్యమ క్రమాల్ని శాస్త్రీయ వివేచన చేస్తే తప్ప విషయ నిరూపణ చేయలేం. దీనికి పై ఉదాహరణ ఎంత శాతాన్ని ప్రతిబింబిస్తుందో చూడాలి.

పరాయీకరణ సూత్రబద్ధంగా వాడాల్సిన పదం. క్రిస్టియన్ పాఠశాల ఉదాహరణ అర్థం కాకుండా ఉంది. మధ్యలో కమ్యూనిస్టుల్ని జోడించి పేరాను పూర్తి చేశారు. అలవాటు అనేది సాధారణమైంది. సాంప్రదాయం బూర్జువా సమాజం తన అవలక్షణాలను ముందుకు తీసుకొనిపోవడానికి వాహికగా ఉపయోగపడేది. కుల, మత మూలాలు ఏ సామాజిక దశలో అయితే ప్రారంభమయ్యాయో ప్రస్తుత సమాజం ఆ దశ కొనసాగింపే.

చారిత్రకంగా పాలకవర్గాలకు 'కుల' అవసరం ఏ రకంగా ఉందో అనుగుణంగా కుల ఆవిష్కరణలు చేశారు. వృత్తి, వివాహం తదితరాలు క్రమానుగతంగా వృద్ధి చెందాయి కాని ఇటువంటి గంభీరమైన సిద్ధాంత చర్చకు లోతైన అధ్యయనం అవసరం. కులాల పుట్టుకకు కొంచమైనా శాస్త్రీయత చూపించాలి. నిర్మూలనకు, అర్ధవలస, అర్ధ భూస్వామ్య సమాజ దశలో ఉన్న భారతదేశంలో ఏ ఎత్తుగడ దృష్ట్యా సాధ్యమవుతుందో రేఖామాత్రంగానైనా తెలిపితే బాగుండేది.

రాయితీలు, సంక్షేమ పథకాలు, ఉచితాల పట్ల అవగాహన సరైనదే. కాని కంచె ఐలయ్య, బి.ఎస్. రాములులను ప్రవేశపెట్టడం అర్థం కాలేదు. సామాజిక ఉద్యమ చరిత్రలో వారి పేజీలను వారు పూర్తి చేస్తూనే ఉన్నారు. పూర్తిగా మార్క్సిస్టు చట్రంలో ఇమడలేకపోయినప్పటికీ వారికున్న సామాజిక బాధ్యత, అవగాహన ప్రకారం వారు నడుస్తున్నారు. కాకపోతే వారికి తగిన తూకపురాళ్లు వేసి గౌరవప్రద సంబోధన చేస్తే బాగుండేది.

భౌతికవాద కోణంలో కులం పుట్టుక – నిర్మూలన తెలపాల్సిందీ వ్యాసం. ఎంతసేపూ బ్రాహ్మణిజం, భావవాదం చుట్టే తిరగకుండా వర్గ సమాజంలో కుల నిర్మూలనకు ఏ సిద్ధాంత ప్రాతిపదికన ఉద్యమ నిర్మాణం చేయాలో తెలిపితే బాగుండేది. వర్గ నిర్మూలనతోనే మిగతా సమస్యలు పరిష్కారం అవుతాయని మార్క్సిజం చెబుతుంది.

వ్యక్తి కుటుంబంలో భాగం. కుటుంబం సమాజంలో భాగం. వ్యక్తిని, కుటుంబాన్ని సమాజం నుండి వేరుగా చూడలేం. నేరం వ్యక్తి మీద మోపడం వల్ల సమాజం మంచిదవుతుంది. నేరం మూలాలు సమాజంలో ఎప్పటి నుంచో ఉంటాయి. అలాగే వ్యక్తి మూలాలు తన పుట్టుక దగ్గర నుండే ఉంటాయి. సమాజంలో నేర మూలాలు ఉండడం వర్గ నీతి. అందుకు రాజ్యం ఆజ్యం పోస్తుంది. ఇలా అధికారంతో, అణచివేతతో రాజ్యం వ్యక్తుల చేత నేరాలు చేయిస్తూ, శిక్షిస్తూ, ప్రతి వ్యక్తి మరో వ్యక్తిని నేరస్తుడిగా చూసే స్థాయికి దిగజార్చి, ప్రభుత్వాలచే పరిపాలన సాగిస్తుంటాయి. దీనిలో బ్రాహ్మణిజం భాగస్వామే. బ్రాహ్మణిజాన్ని రాజ్యం నుండి వేరుగా చూడలేం.

కమ్యూనిస్టులకు కులం పుట్టుక – నిర్మూలన పట్ల సరైన అవగాహన ఉంది. అయితే సమాజంలో వారు పరిష్కరించబోయే అనేక అంశాలలో కులం ఒకటి. కుల నిర్మూలన కంటే ముందు చాలా సమస్యల్ని వారు పరిష్కరించాలి. దానిలో భాగంగానే కుల నిర్మూలనకూ వారి కార్యాచరణ ఉంటుంది. గద్దర్, గోరటి వెంకన్న, భీమసేన, జయరాజు లాంటి సామాజిక ఉద్యమ కళారూపకర్తల్ని గురించిన అంచనా సరిపోనిది. ఒక పాటతోనో, ఆటతోనో ఈ నిర్మూలన చేయవచ్చు అనే చిన్న ఆశ కోగాదు వారిది. సకల రుగ్మతల ఈ సమాజ నిర్మూలనే వారి ఆశయం. కష్టాలకు, కన్నీళ్లకు కళారూపాల్ని కట్టి ముందుకు పోవడం ఉద్యమంలో ఒక భాగం. ఏడు సంద్రాలపైన ఎదురీతే అసలు పోరాటం.

వీ

# మూడు ప్రపంచాల సిద్ధాంతం - ప్రజాస్వామిక చర్చ

**- లంకా పాపిరెడ్డి**

నేను జూన్ నెల వీక్షణం సంచికలో మూడు ప్రపంచాల సిద్ధాంతం గురించి రాసిన లేఖపైన నరేంద్ర మోహన్, సత్యనారాయణ రెడ్డి తమ అభిప్రాయాలు జూలై సంచికలో రాశారు. మావో, కెన్నత్ కౌండాతో మాట్లాడడానికి ముందే మూడు ప్రపంచాల సిద్ధాంతానికి సంబంధించిన 'ఛాయలు', 'ప్రస్తావనలు', 'దాఖలాలు' చైనా కమ్యూనిస్టు పార్టీ చరిత్రలో ఉన్నాయనీ, 1977లో ఒక పుస్తకం కూడా అచ్చు వేశారని నరేంద్ర మోహన్ రాశారు. నేను అడిగింది ఏమిటంటే ఈ ఛాయలు, ప్రస్తావనలు, దాఖలాలు ఒక స్పష్టమైన పార్టీ తీర్మానాలుగా ఎందుకు లేవు. లేకపోతే కమ్యూనిస్టు పార్టీల ఒక అంతర్జాతీయ సమావేశం తీర్మానంగానో ఎందుకు లేవని మూడు ప్రపంచాల విభజన, మూడు ప్రపంచాల సిద్ధాంతం ఒకటి కాదు. గత ఇరవై సంవత్సరాలలో పార్టీలు మూడు ప్రపంచాల సిద్ధాంతం గురించి ప్రస్తావించినట్లు కానీ, విశ్లేషించి తిరస్కరించినట్లు కానీ తెలవదు అని కూడా నరేంద్రమోహన్ రాశారు. 1984లో సత్యమూర్తి మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని విమర్శిస్తూ పీపుల్స్‌వార్ పార్టీ అంతర్గత పోరాటంలో భాగంగా పెద్ద డాక్యుమెంట్ రాశారు. దానికి జవాబుగా పీపుల్స్‌వార్ పార్టీ మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని సమర్థిస్తూ ఒక పెద్ద డాక్యుమెంట్ రాసింది. అప్పుడు సత్యమూర్తి డాక్యుమెంట్‌ను పార్టీ తిరస్కరించింది. తిరిగి 1995లో పీపుల్స్‌వార్ పార్టీ తన ఆల్ ఇండియా స్పెషల్ కాన్ఫరెన్స్‌లో మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని విశ్లేషించి తిరస్కరిస్తూ చేసిన తీర్మానాన్ని ఆమోదించింది. ఆ పాత డాక్యుమెంట్లు ఎవరైనా మిత్రుల దగ్గర లభిస్తే తప్పకుండా నరేంద్రమోహన్‌కి పంపించడానికి ప్రయత్నిస్తా.

ఇక సత్యనారాయణరెడ్డి రాసిన అభిప్రాయాలు అసలు విషయాన్ని పక్కదారి పట్టించేలా ఉన్నాయి. మేము ఏమైనా రాస్తాము, దాన్ని విమర్శిస్తే ప్రజాస్వామ్యం కాదు. అది నిరంకుశం అవుతుంది అంటున్నారు వారు. నేను అడిగిన ప్రశ్నలకు జవాబు ఇవ్వకుండా ఇలా దబాయించడం అసలు నిరంకుశత్వం. వక్రీకరించడం అసలు అప్రజాస్వామికం. జవాబులు ఇవ్వకుండా తప్పించుకోవడానికి ఎదుటి వారి నోరు మూయించే మోటు పద్ధతి ఇది.

మూడు ప్రపంచాల సిద్ధాంతం కాలం చేసింది. అది ఒక కళేబరం

అందులోకి చొరబడాల్సిన అవసరం లేదు. అది చచ్చిన శవమే అని వర్తమాన చరిత్ర ఆధారంగానే నిరూపించవచ్చు అని నేను రాశాను. దాని అర్థం ఏమిటి? ఆ సిద్ధాంతాన్ని మళ్లీ వివరించాల్సిన అవసరం లేదు. ఇప్పటి చరిత్ర ఆధారంగానే అది పనికి రానిదని నిరూపించవచ్చు అని. కాని, సత్యనారాయణరెడ్డి కళేబరానికి ప్రాణం పోయడానికి ప్రయత్నిస్తున్నాడు అని నేను రాసినట్లుగా వక్రీకరించారు. ముప్పై సంవత్సరాల క్రితమే చర్చ జరిగింది. కావున ఇక మీరు ఆ సిద్ధాంతాన్ని తిరస్కరించండి అని నేను చెప్పలేదు. మీ లెక్క ప్రకారమే 1974లో ఈ సిద్ధాంతం ఆవిర్భవించింది. అంటే 40 సంవత్సరాలు. అప్పటి నుండి కూడా కమ్యూనిస్టులకు ఆచరణకు పనికి రాలేదు. కాని ఇప్పుడు దాన్ని మీరు రామబాణం లాంటి మందని, ప్రపంచ విప్లవ పురోగమనానికి గొప్ప ఉపయోగమని మళ్లీ కొత్తగా చెప్పుతూ ఉంటే, కాదు అది పాత సిద్ధాంతమే పనిచేయలేదు, చేయదు అని నేను చెప్పాను.

మీరు చెప్పాల్సి వస్తే ఈ నలభై సంవత్సరాలలో మూడు ప్రపంచాల సిద్ధాంతం ఆధారంగా అగ్రరాజ్యాలకు వ్యతిరేకంగా ఎన్నిసార్లు ఐక్య సంఘటన కట్టారు లేదా ప్రయత్నించారు. ఏమీ సాధించారు? అనుభవాలు ఏమిటి? పాఠాలు ఏమిటి? చెప్పాలి. ఒక పాత సిద్ధాంతం గురించి మీరు గొప్పగా చెప్పుతున్నప్పుడు, దాని ఆచరణ, పాఠాలు వివరించి ఇతరులను ఒప్పించాలి. చెప్పాల్సింది చెప్పకుండా ఎదుటి వారిని దబాయించడం, మళ్లీ వారే ప్రజాస్వామ్యం గురించి మాట్లాడడం విచిత్రం. అది తప్పుడు సిద్ధాంతం అని ధృఢ విశ్వాసం ఉన్నవారు అది ఏ విధంగా తప్పో, దానికి వారు చెప్పుతున్నదేమిటో వివరించాల్సి ఉంటుంది అని సత్యనారాయణ రాశారు.

చావెజ్‌కు ఎవరూ మద్దతుగా రాలేదనీ, లిబియా, సిరియా, ఇరాక్, ఉత్తర కొరియా, చైనా గురించి నేను రాసింది మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని బలపరచడానికి కాదు, తప్పు అని వివరించడానికే. నేను ఏమీ వివరించకపోతే రెండు ప్రపంచ దేశాల గురించి నా అభిప్రాయాలకు ఎలా జవాబు ఇచ్చారు. నా వివరణతో ఏకీభవించక పోవచ్చు. కాని నేను ఏమీ వివరించ లేదని కేవలం శవం అని మాత్రమే తిట్టినట్లుగా రాసి సత్యనారాయణ 'ఆ పైన ప్రజాస్వామిక పద్ధతుల్లో చర్చించాల్సి ఉంటుంది' అంటున్నారు. సత్యనారాయణ ప్రజాస్వామ్యం ప్రకారం రాసిన దానిని ఎవరు ప్రశ్నించవద్దు. మూడు ప్రపంచాల సిద్ధాంతం పార్టీ తీర్మానంగా ఎందుకు లేదు అంటే జవాబు ఇవ్వకుండా ప్రజాస్వామ్యం గురించి వివరించారు. ప్రజాస్వామ్యం ఇలా కూడా పనికి వస్తుందని ఇప్పటి వరకు నాకు తెలవదు.

భారత పాలక వర్గాల గురించి తనకు లేని అభిప్రాయాలను నేను అంటగట్టానని, ఏ ఆధారాలతో ఈ విధమైన అభిప్రాయాన్ని అంటగడు తున్నానని కూడా సత్యనారాయణ ప్రశ్నించారు. సత్యనారాయణ చెప్పిన మూడు ప్రపంచాల సిద్ధాంతమే నా నిర్ధారణకు ఆధారం. భారత పాలక వర్గాలకు వ్యతిరేకంగా పోరాడాలి అని చెప్పకుండా సామ్రాజ్యవాద అనుకూల విధానాలకు వ్యతిరేకంగా పోరాడాలి అని చెప్పడం అందుకు ఆధారం. మూడు ప్రపంచాల సిద్ధాంతం ప్రకారం మూడవ ప్రపంచ దేశాలు సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో ప్రధాన శక్తి. కావున భారత దేశం కూడా ఆ ఐక్య సంఘటనలో ఉంటుందా? ఉండదా? భారత పాలక వర్గాలు 'కల్తీ లేని' దళారులని, వారిది నెగటివ్ పాత్ర అని మాత్రం చెప్పి ఐక్య సంఘటనలో ఉండే విషయం, లేని విషయం ఏది చెప్పకుండా తప్పించుకోవడం అందుకు ఆధారం. ఇప్పుడు సత్యనారాయణ ఇచ్చిన జవాబులో కూడా భారత్ సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటనలో ఉంటుందా? ఉండదా? అనే విషయాన్ని చెప్పలేదు.

మే నెల వీక్షణంలో రెండవ ప్రపంచ దేశాల గురించి చెప్పుతూ కెనడా, యూరప్, జపాన్ దేశాలు ఇందులోకి వస్తాయని చెప్పారు. ఇప్పుడు రెండవ ప్రపంచ దేశాలు 30, 40 వరకు ఉంటాయి. అందులో కొన్ని మాత్రమే సామ్రాజ్యవాద దేశాలు, మిగిలినవి కావు. రెండవ ప్రపంచ దేశాలలో చాలా దేశాలు అమెరికాను వ్యతిరేకిస్తున్నాయి అన్నారు. అంటే అగ్ర రాజ్యాల వ్యతిరేక ఐక్య సంఘటనలో సామ్రాజ్యవాద దేశాలు రావా? అప్పుడు ఇది మూడు ప్రపంచాల సిద్ధాంతం కాదు నాలుగు ప్రపంచాల సిద్ధాంతం అవుతుంది. అసలు రెండవ ప్రపంచ దేశాలు 30, 40 వరకు ఉంటాయి అని అంత తేడాను (10 దేశాలు) చెప్పుతున్నారు అంటేనే వాటికి చెందిన నిర్వచనం పైనే స్పష్టత లేదని తెలుస్తోంది. ఇంకా ఫ్రాన్స్, జర్మనీ గురించి కూడా రాయాలని ఉన్నా స్థలా భావం వల్ల రాయలేక పోతున్నా.

ఆయా కాలాలలో ఆ కాలానికి అనుగుణంగా మార్క్సిస్ట్ మహోపాధ్యాయులు ప్రపంచాన్ని రకరకాలుగా విభజించారు. రకరకాలుగా యుగ స్వభావాన్ని నిర్ధారించారు. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో అంతర్యుద్ధానికి పిలుపు ఇస్తే రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ఫాసిస్ట్ వ్యతిరేక ఫ్రంట్‌కు (సామ్రాజ్య వ్యతిరేక ఫ్రంట్ కాదు) పిలుపు ఇచ్చారు. మూడు ప్రపంచాల విభజన వేరు. మూడు ప్రపంచాల సిద్ధాంతం వేరు. గతంలోనే ప్రపంచాన్ని రకరకాలుగా విభజించారు. కావున మూడు ప్రపంచాల సిద్ధాంతం సరైనదే అని వాదించడం అర్థం లేనిది. ఐక్య సంఘటనకు చెందిన సాధారణ సూత్రాలు చెప్పి మూడు ప్రపంచాల సిద్ధాంతాన్ని సమర్థించుకోవడం అమాయకత్వం అవుతుంది. ఐక్య సంఘటనకు చెందిన అతి సాధారణ సూత్రాలు చెప్పిన సత్యనారాయణ ఐక్య సంఘటనకు చెందిన నాయకత్వం గురించి మాత్రం చెప్పలేదు. ఐక్య సంఘటనకు సంబంధించి నాయకత్వం ఎవరిది అనే విషయం అత్యంత ప్రధాన విషయం. అందుకే సత్యనారాయణ నేను చైనా గురించి అడిగిన ప్రశ్నకు జవాబు ఇవ్వలేదు. భారతదేశం గురించి చైనా గురించి నేను అడిగిన ప్రశ్నలకు జవాబు ఇవ్వకుండా ఐక్య సంఘటనకు చెందిన అతి సాధారణ సూత్రాలు ఏకరువు పెట్టి, నాలుగు ప్రపంచాల సిద్ధాంతం చెప్పి ప్రజాస్వామ్యం వద్ద ముగించారు.

సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడే ప్రధాన శక్తి మూడవ ప్రపంచ దేశాలు కాదు. మూడవ ప్రపంచ దేశాలలోని ప్రజాస్వామిక ఉద్యమాలు, పెట్టుబడిదారీ దేశాలలోని సోషలిస్ట్ ఉద్యమాలు, ఉంటే సోషలిస్ట్ దేశాలు మాత్రమే ప్రధాన శక్తి అవుతాయి. మిగతావన్నీ ఆయా స్థాయిల్లో కలిసి వచ్చే శక్తులు మాత్రమే. ప్రపంచ వ్యాప్తంగా సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన, సోషలిస్ట్ దేశాల కూటమి లేదా బలమైన ఒక సోషలిస్ట్ దేశం ఉన్నప్పుడే సాధ్యం అవుతుంది. వీ

*(...4వ పేజీ తరువాయి)*

లోక సంచారి. నేరాల్లో చిన్నా పెద్దా చూడక్కర్లేదన్నారు. దుష్టులు, ఒక ఆడ పిల్లని చచ్చిపోయే స్థితికి తెస్తే, పేదల్ని ఏమీ అనరాదన్నారు. ఇలాంటి వాదాలు తప్పని రంగనాయకమ్మ చెప్తే ఆయన మళ్లీ వాటినే సమర్థించుకున్నారు. నేరాల్లో చిన్నా పెద్దా చూడరాదని చెప్పడం లోకజ్ఞానం అవుతుందా? అందుకే ఆవిడ, లోక సంచారికి లోకజ్ఞానం లేదన్నారు. అది, నిందించడం కాదు. విషయాన్ని సరిగా చెప్పారు. తప్పు వాదాల్ని భాషతో రక్షించుకోలేరు ఎవరూ.

ఇక ఎస్.జనార్దన్ గారి లేఖ గురించి:

వ్యాసం పూర్తి కాకుండానే రాయడం తప్పే అంటూనే రాశారు కదా! కానీ, ఫరవాలేదు. ఇంతకీ ఏం రాశారు? అసలు విషయం ఏమిటో రాయలేదు. మార్క్స్ లాంటి వాడి మీద విమర్శా అని. అది విమర్శ కాదు, చిన్న సవరణ అంతే.

'శ్రమ శక్తి' ఉపయోగపు విలువ గురించి, మార్క్స్ రాసిన పెట్టుబడి గ్రంథం మీద, ఈనాటి వరకూ, ఇలాంటి సవరణ గురించి ఎవరూ చర్చించలేదు. ఆమెకు వచ్చిన సందేహాలూ, వాటికి సమాధానాలూ ఆమె చర్చించి మన ముందు ఉంచారు. ఆమె ఆలోచించారు. మనల్ని ఆలోచించమన్నారు. అది తప్పా? మీరు ఆ విషయమై ఏమైనా చర్చిస్తారా? శ్రమశక్తిని అమ్మే శ్రామికుడికీ, కొనే యజమానికీ ఉండే సంబంధం, అమ్మే, కొనే వాడి సంబంధంగానే మార్క్స్ పొరపాటున చెప్పాడనే విషయం ఈనాడు ప్రపంచం ముందుకు ఆమె తెచ్చారు. అందులో ఏమైనా తప్పు ఉంటే, అది చెప్పండి. దాన్ని గురించి చర్చించండి.

అసలు కాపిటల్ ఒరిజినల్‌లోనే ఎన్నో సర్దుళ్లూ, దిద్దుబాట్లూ, పొరపాట్లూ రాసి తరువాత మార్క్స్ సవరించుకున్నాడని, కాపిటల్ మొదటి ముద్రణకీ తరువాత ముద్రణలకీ ఎన్నో మార్పులున్నాయని పరిశీలకులు అంటారు. అసలు మార్క్స్ చివరి రోజుల్లో అనారోగ్యం, తీవ్రమైన పని ఒత్తిడి, తను కనిపెట్టిన 'శ్రమ దోపిడీ' రహస్యాన్ని ప్రపంచానికి తెలియజేయకుండా చనిపోతానేమోనన్న భయం. ఇన్ని కారణాల వలన ఎక్కడో ఒక దగ్గర చిన్న పొరపాటు జరిగితే జరిగి ఉండవచ్చు. అది మార్క్స్ తప్పు కాదు, 'ఇది పొరపాటు' అని చెప్పిన రంగనాయకమ్మ తప్పూ కాదు. అలాంటి పొరపాట్లని తరువాత తరం వారు సవరించుకోవాలి. ఒక పెట్టుబడిదారుడు, 'నేను శ్రమ శక్తిని కొన్నాను. దాని వల్ల దొరికే ఉపయోగపు విలువ నాదే. నాది శ్రమ దోపిడీ కాదు' అని వాదిస్తే, ఏం చెప్పగలడు ఏ మార్క్సిస్టు అయినా? నిజానికి ఏ బూర్జువా ఆర్థికవేత్తకీ తట్టలేదు గానీ, తడితే ఏనాడో అదొక విమర్శ లాగ బయలుదేరేవారే.

అయినా ఈ రోజు కాకపోయినా, రేపయినా ఎవరో ఒకరికి ఈ ఆలోచన రాకపోతుందా? ఆనాడైనా జవాబు చెప్పాల్సిన బాధ్యత మార్క్సిజాన్ని ప్రేమించే వ్యక్తుల మీద ఉంటుంది కదా? అది ఈనాడు రంగనాయకమ్మగారు చేసి మార్క్సిస్టుల పని సులువు చేశారు. దానికి మార్క్సిస్టులందరూ ఎంతో సంతోషించాలి.

'ఏమిటి మార్క్సూ? ఏమిటి మరీనూ' అని అదో హాస్యం లాగా రాస్తే అదేదో మహా తప్పులాగా అనడం ఏమిటి? 'కానీ, ఆమె నోట్లో ఎవరు నోరు పెడతారు అని అందరూ చెప్పుకునే మాట గుర్తొచ్చి ఆగిపోయాను' మరి ఇవేం మాటలు? ఏం చర్చించాలో తెలియకపోతే ఇలాంటి మాటలే వస్తాయి. చేతనయితే 'శ్రమశక్తి' ని గురించి, ఆమె వ్యాసం గురించి చర్చించండి. లేకపోతే వదిలేయండి. అంతే తప్ప ఈ లేఖలు, చర్చలు కావు.

**– వి. వెంకట్రావు**
విజయనగరం

**జూ**లై సంచికలో లోకసంచారి ఉత్తరం చదివాను. అందులో ఆయన మే సంచికలో రంగనాయకమ్మ తనపై వ్యక్తిగత దూషణలు, దెప్పిపొడుపు మాటలతో స్పందించినట్లు రాశారు. అందులో ఏ మాత్రం వాస్తవం లేదు. ఫిబ్రవరి సంచికలోని లోకసంచారి వ్యాసం నేనూ చదివాను. ఆ వ్యాసంలో ఆయన రాసిన కొన్ని వాక్యాలకి వ్యభిచారాన్ని చట్టబద్ధం చేస్తే అత్యాచారాలు తగ్గుతాయనే అర్థమే వస్తుంది. లోకజ్ఞానం ఉన్న ఎవరికైనా మరొక అర్థం రాదు. ఆ వ్యాసంలోని తప్పుల్ని ఎత్తి చూపుతూ, అవి లేకపోతే ఆ వ్యాసం ఇంకా అద్భుతంగా ఉండేదని, చాలా మెచ్చుకోలుగా, పాజిటివ్‌గా రంగనాయకమ్మ స్పందించారు. అంత చక్కగా ఆవిడ చేసిన సూచనల్ని ఏమాత్రం పరిగణనలోకి తీసుకోకుండా ఏప్రిల్ సంచికలో చాలా వెటకారంగానూ, అహంభావ పూరితంగానూ స్పందించారు. 'ఈ వ్యవస్థలో వేశ్యావృత్తిలో ఉన్న స్త్రీల అత్యంత అమానవీయ, దీన పరిస్థితి దృష్ట్యా, ఆ వృత్తిని లీగలైజ్ చేయాలనే సెక్స్ వర్కర్ల హక్కుల సంఘాల డిమాండ్ సమర్థనీయమైనది' అని రంగనాయకమ్మ జవాబుగా రాశారు (ఏప్రిల్ సంచిక). ఈ ఒక్క వాక్యం చాలు. ఆయన తనేం తప్పు చేసాడో తెలుసుకునే ప్రయత్నమే చేయలేదని తెలుసుకోవడానికి. తప్పుడు అభిప్రాయాన్ని మళ్లీ, మళ్లీ సమర్థించుకునే దబాయింపు ధోరణి ప్రదర్శించారు.

అత్యంత క్రూరమైన, ఘోరమైన లైంగిక అత్యాచారాల్నీ, ఆడపిల్లల ఇష్టానికి వ్యతిరేకంగా పెద్దలు చేసే పెళ్లిళ్లనీ – ఈ రెండిటినీ ఒకే గాటన కట్టి, మరో తప్పుడు అభిప్రాయం వ్యక్తం చేశారు. గుర్రాన్నీ, గాడిదనీ ఒకే గాటన కట్టడం లాంటి వితండవాదం చేశారు.

అలాగే జూలై సంచికలోనే ఎస్. జనార్దన్, మెదక్ నుంచి వచ్చిన ఉత్తరం చదివాను. ఆయన ఉత్తరం చదివితే కలిగే మొట్టమొదటి, ఏకైక అభిప్రాయం ఏమిటంటే – రంగనాయకమ్మ మీద చాలా కాలంగా ఆయనకి తీవ్రమైన వ్యతిరేకత ఉన్నట్టుగానూ, మద్దతుగా ఎవర్నీ కూడగట్టుకోలేక, అవకాశం రాక ఇంత కాలంగా నిస్సహాయంగా ఉన్నట్టుగానూ, లోకసంచారి 'తనని తాను సమర్థించుకుంటూ రాసిన నాలుగు ముక్కలు', దానికి రంగనాయకమ్మ స్పందన అనే సందర్భం ద్వారా తను ఎంతోకాలంగా ఎదురు చూస్తోన్న అవకాశం దొరికినట్లుగా అనిపిస్తోంది.

మార్క్స్ పొరపాటు చేశాడని, దాన్ని తాను (రంగనాయకమ్మ) సరిదిద్దుతున్నాననీ ఆవిడ ఎప్పుడూ అనలేదు. జీతాల శ్రామికులకూ, పెట్టుబడిదారునికీ ఉండే సంబంధం, మొదట 'అమ్మే – కొనే' సంబంధంగా మొదలై చివరికి 'పెట్టుబడిదారుడు శ్రామికుల శ్రమని దోచే సంబంధంగా ముగుస్తుంది' అని మార్క్స్ కాపిటల్లో చూపించాడని చెప్తూ, ప్రారంభంలో అయినా సరే 'అమ్మే – కొనే' సంబంధంగా ఉంటుందని చెప్పడం పట్ల ఆవిడకో సందేహం వచ్చింది. ఆ సందేహాన్ని కూడా తను మార్క్స్ మీద విమర్శగా ప్రారంభించలేదని చెప్తూ, తన వ్యాసంలో ఆ విషయాన్ని సైద్ధాంతికంగా చర్చించింది. ఆమె చేసిన చర్చ చాలా అర్థవంతంగానూ, ఆలోచింప చేసేదిగానూ ఉంది.

జనార్దన్ తన ఉత్తరంలో 'మార్క్స్ రాసింది వేరూ, దానికి ఆమె (రంగనాయకమ్మ) తీసిన అర్థాలు వేరూ' అని రాశారు. మార్క్స్ రాసింది వేరనే విషయం ఆయనకి తెలిస్తే 'అసలు అర్థం' వివరించి ఉండవచ్చును కదా! తద్వారా రంగనాయకమ్మ పొరపాటు అభిప్రాయాన్నీ సరిదిద్దిన వారవుతారు, మా బోటి పాఠకులకి కూడా ఉపయోగం చేసిన వారవుతారు కదా! అంతేకానీ, 'ఆమె లెక్కలేనంత మంది రచయితల మీద, ప్రజా ఉద్యమ నాయకుల మీద చెయ్యి చేసుకుందనీ, అందర్నీ కుమ్ముతుంది' అనీ రాయడం – అవాకులూ, చెవాకులూ పేలటంగానూ, సంస్కారహీనంగానూ ఉంది. జనార్దన్ రాసిన 'చెయ్యి చేసుకోవడం, కుమ్మడం' అనే మాటల్ని విమర్శించడంగా అనుకుంటే – ఆమె (రంగనాయకమ్మ) – ఆ 'లెక్కలేనంత మంది రచయితల', 'ప్రజా ఉద్యమ నాయకుల' తప్పుడు వాదాల్ని సైద్ధాంతికంగా అత్యంత ప్రతిభావంతంగా ఖండించిందనే చెప్పి తీరాలి.

జనార్దన్ లోకసంచారి పట్ల కూడ చాలా సానుభూతి కురిపించారు. లోకసంచారి వ్యాసానికి స్పందనగా రంగనాయకమ్మ రాసిన వ్యాసం టైటిల్‌ని కూడ విమర్శించారు. 'కుండెడు అమృతంలో.. రెండు విషపు చుక్కలు పడవచ్చునా?' అనే టైటిల్ – తలకాయ ఉన్న ఎవరికైనా – ఎంతో సజెస్టివ్‌గా అనిపిస్తుంది. వాస్తవానికి ఆమె లోకసంచారి వ్యాసాన్ని మెచ్చుకుంటూనే, కొన్ని తప్పుల్ని ఎత్తి చూపారు. ఆ తప్పులే లేకపోతే ఆ వ్యాసం ఇంకా 'అద్భుతం'గా ఉండేదని ఆమె చెప్పారు. జనార్దన్ తన ఉత్తరం ద్వారా రంగనాయకమ్మ పట్ల తన వ్యతిరేకతని మాత్రమే వ్యక్తం చేశారు.

జనార్దన్‌కి ఒక మాట! కొన్ని దశాబ్దాలుగా 'వామపక్షాలు'గా పిలవబడే పార్టీలకు సంబంధించిన ప్రచురణ సంస్థలూ, ఆ పార్టీల తాలూకు రచయితలూ ఏ ఒక్కరూ కూడా 'మార్క్సిస్టు సాహిత్యాన్ని' సరళమైన, సులభ గ్రాహ్యమైన భాషలో ప్రజలకి అందించాలనే ప్రయత్నమే చేయలేదు. బహుశా వారు నమ్మి, చెలామణి చేస్తోన్న 'మార్క్సిస్ట్ భావజాలానికి' ఆ ప్రయత్నం అంత అవసరంగా అనిపించలేదేమో!

మార్క్సిస్ట్ సాహిత్యాన్ని – తన తిరుగులేని తర్కం ద్వారా, స్పష్టమైన సిద్ధాంత చర్చల ద్వారా – సులభంగా, సరళంగా తెలుగు పాఠకులకి అందించిన రచయిత రంగనాయకమ్మ మాత్రమే. నేనూ, నా బోటి అనేక మంది 'మార్క్సిజం' గురించి కొద్దిగానైనా తెలుసుకోగలిగామంటే దానికి రంగనాయకమ్మ రచనలే కారణం.

**– పి. వర్మ**
బాపట్ల

వీ

## సిబిఐకి స్వయం ప్రతిపత్తి

సిబిఐకి స్వయం ప్రతిపత్తి కల్పించాలని, సిబిఐ చేపడుతున్న కేసుల దర్యాప్తు సాగుతున్న తీరును రిటైర్డ్ న్యాయమూర్తితో కూడిన బృందం పర్యవేక్షించాలన్న సిఫారసును కేంద్ర ప్రభుత్వం ఆమోదించింది. సిబిఐ డైరెక్టర్ నియామకాన్ని ప్రధాని, లోక్‌సభలో విపక్ష నేత, భారత ప్రధాన న్యాయమూర్తితో కూడిన కొలీజియం ఎంపిక చేయాలని మంత్రుల బృందం పేర్కొంది.

## ప్రధాన న్యాయమూర్తిగా సదాశివం

సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పళనిసామి సదాశివం జూలై 19న ప్రమాణ స్వీకారం చేశారు. సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పని చేసిన వారిలో సదాశివం 40వ వారు. ఆయన ఎనిమిది నెలలు ఈ పదవిలో ఉంటారు. ఆయన తమిళనాడు నుంచి సుప్రీంకోర్టు ప్రధాన న్యాయమూర్తి బాధ్యతలు స్వీకరించిన తొలి వ్యక్తి. 1949 ఏప్రిల్ 27న తమిళనాడులో పుట్టారు. 1996లో మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తిగా పనిచేశారు. 2007 నుండి సుప్రీంకోర్టు న్యాయమూర్తిగా పనిచేస్తున్నారు.

## ఇష్రత్ ఎన్‌కౌంటర్ బూటకం

గుజరాత్‌లోని అహ్మదాబాద్ శివారు ప్రాంతంలో ఇష్రత్ జహాన్ (19)తో పాటు ముగ్గురు యువకులను 2004 జూన్ 15న పోలీసులు కాల్చిచంపారు. ఈ సంఘటనపై సిబిఐ చార్జిషీట్ దాఖలు చేసింది. ఈ ఘటన గుజరాత్ పోలీసులు, సబ్సీడరీ ఇంటెలిజెన్స్ బ్యూరో (ఎస్‌బిఐ) సిబ్బంది కలిసి చేసిన ఆపరేషన్ అని సిబిఐ తెలిపింది. ఇది బూటకపు ఎన్‌కౌంటరని తమ దర్యాప్తులో తేలిందని అదనపు చీఫ్ జ్యుడీషియల్ మెజిస్ట్రేట్ కోర్టుకు సమర్పించిన చార్జిషీట్‌లో పేర్కొంది.

## లారీల కొద్దీ నల్లడబ్బు

ముంబైలోని సెంట్రల్ రైల్వే స్టేషన్‌లో జూలై 2న జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ), ఆదాయ పన్ను శాఖ కలిసి నిర్వహించిన దాడిలో వందల కోట్ల విలువైన నగదు, బంగారం, వజ్రాభరణాలు పట్టుబడ్డాయి. నాలుగు టెంపో ట్రక్కుల్లో ఉన్న 150 సంచుల్లో నగదు, ఆభరణాలను అధికారులు స్వాధీనం చేసుకున్నారు. ముంబై నుంచి 'గుజరాత్ మెయిల్'లో అహ్మదాబాద్ తరలించేందుకు అంగడాలు (ప్రైవేట్ కొరియర్స్) రైల్వే స్టేషన్‌కు తీసుకురాగా దాడిచేసి పట్టుకున్నట్లు ఆదాయ పన్ను శాఖ డైరెక్టర్ జనరల్ స్వతంత్ర కుమార్ విలేకరులకు తెలిపారు.

## ఆహార భద్రతకు ఆర్డినెన్స్

ఆహార భద్రత ఆర్డినెన్స్‌ని జూలై 3న కేంద్ర కేబినెట్ ఏకగ్రీవంగా ఆమోదించింది. ఈ ఆర్డినెన్స్‌ను రాష్ట్రపతి ఆమోదం కోసం ప్రభుత్వం పంపింది. ఆర్డినెన్స్ రూపంలో ఈ పథకాన్ని అమలులోకి తీసుకురావడానికి యుపిఎ ప్రభుత్వం ప్రయత్నిస్తోంది. ఈ ఆర్డినెన్స్ ఆరు నెలల్లో ఉభయ సభల ఆమోదం పొందాల్సి ఉంటుంది. ఈ పథకం అమలులోకి వస్తే నెలకు ఒకరికి 5 కిలోల బియ్యం, గోధుమలు, తృణ ధాన్యాలను ప్రభుత్వం సబ్సీడీపై అంద జేస్తుంది. ఈ పథకానికి కేంద్ర ప్రభుత్వం ఏటా రు. 1.25 లక్షల కోట్లు కేటాయించనుంది.

## బుద్ధగయలో పేలుళ్లు

బీహార్‌లోని ప్రసిద్ధ బౌద్ధ క్షేత్రం బుద్ధగయలో జూలై 7న వరుసగా పది బాంబు పేలుళ్లు జరిగాయి. ఈ పేలుళ్లలో మయన్మార్, టిబెట్‌లకు చెందిన ఇద్దరు బౌద్ధ సన్యాసులకు గాయాలయ్యాయి. పేలుళ్లలో తక్కువ తీవ్రత కలిగిన టైమర్లతో సిలిండర్ బాంబుల్ని అమర్చారని పోలీసు అధికారులు తెలిపారు. ఈ బాంబు పేలుళ్ల కేసును కేంద్రం, జాతీయ దర్యాప్తు సంస్థ (ఎన్ఐఎ)కు అప్పగించింది.

## జార్ఖండ్‌లో జెఎంఎం ప్రభుత్వం

జార్ఖండ్‌లో ఆరు నెలల రాష్ట్రపతి పాలన ముగిసి, జార్ఖండ్ ముక్తి మోర్చా (జెఎంఎం) నేతృత్వంలో ప్రభుత్వం ఏర్పడింది. జెఎంఎం అధ్యక్షుడు హేమంత్ (37)ను రాష్ట్ర 9వ ముఖ్యమంత్రిగా ఎన్నుకున్నారు. జూలై 13న రాజ్‌భవన్‌లో గవర్నర్ సయ్యద్ అహ్మద్ హేమంత్ సోరెన్‌తో ప్రమాణ స్వీకారం చేయించారు. కాంగ్రెస్, ఆర్‌జెడి మద్దతుతో జార్ఖండ్ ముక్తి మోర్చా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. 82 మంది ఉన్న శాసనసభలో జెఎంఎంకు 43 మంది సభ్యుల మద్దతు ఉంది.

## టెలిగ్రాంలకు సెలవు

గత 162 సంవత్సరాలుగా భారతీయులకు సేవలందిస్తున్న టెలిగ్రాం సేవలను జూలై 15న నిలిపివేశారు. ఈస్ట్ ఇండియా కంపెనీ భారత దేశంలో మొట్టమొదట 1851లో కోల్‌కత్తా-డైమండ్ హార్బర్ మధ్య టెలిగ్రాఫ్ లైన్ వేసింది. నష్టదాయకంగా మారిన టెలిగ్రామ్ సేవలను బిఎస్ఎన్ఎల్ నిలిపివేసింది. దేశవ్యాప్తంగా 75 చోట్ల ఉన్న టెలిగ్రామ్ ఆఫీసుల్లోని యంత్రాలు మూతపడ్డాయి. ప్రస్తుతం టెలిగ్రాం విభాగంలో ఉన్న 998 మంది ఉద్యోగులను బిఎస్ఎన్ఎల్ ఇతర సేవలకు ఉపయోగించుకోనుంది.

## బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో జీవిత ఖైదు

2006 నవంబర్ 11న జరిగిన లఖన్ భయ్యా బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో 21 మందికి జూలై 12న జీవిత ఖైదు పడింది. వీరిలో 13 మంది పోలీసులు ఉన్నారు. ఎన్‌కౌంటర్‌పై లఖన్‌భయ్యా సోదరుడు హైకోర్టులో పిటిషన్ దాఖలు చేయడంతో ఈ ఘటనపై హైకోర్టు సిట్‌చే విచారణ జరిపించింది. ఈ విచారణలో ఒక బిల్డర్ కోసం జరిపిన బూటకపు ఎన్‌కౌంటర్‌గా తేలింది.

## రాజకీయ నేరస్తులపై సుప్రీం కొరడా

కోర్టు శిక్షలు ఎదుర్కొంటున్న ప్రజా ప్రతినిధులు పదవిలో కొనసాగరాదని సుప్రీంకోర్టు జూలై 10న వెల్లడించింది. దోషులుగా తేలిన వెంటనే పదవులకు అనర్హులవుతారంది. కింది న్యాయస్థానాల తీర్పులపై పైకోర్టుల్లో అప్పీళ్లు పెండింగ్‌లో ఉన్నాయన్న కారణంతో దోషులైన ఎం.ఎల్.ఎ, ఎం.పిలకు రక్షణ కల్పిస్తున్న ప్రజాప్రాతినిధ్య చట్టం (ఆర్‌పిఎ) సెక్షన్ 8 (4) నిబంధనను సుప్రీంకోర్టు కొట్టివేసింది. లిల్లీథామస్, స్వచ్ఛంద సంస్థ లోక్ ప్రహరి దాఖలు చేసిన పిటిషన్ ఆధారంగా జస్టిస్ ఎ.కె. పట్నాయక్, జస్టిస్ ఎస్.జె. ముఖోధ్యాయతో కూడిన ధర్మాసనం ఈ తీర్పునిచ్చింది.

## మధ్యప్రదేశ్ పాఠశాలల్లో మత ప్రచారం

మధ్యప్రదేశ్‌లోని ప్రైమరీ, అప్పర్ ప్రైమరీ పాఠశాలల్లో ఆర్ఎస్ఎస్ ముద్రించే 'దేవపుత్ర' పత్రికను ప్రతి నెల రెండు కాపీలను ప్రభుత్వమే అందజేస్తోంది. సర్వశిక్షా అభియాన్ (ఎస్ఎస్ఎ) కింద 1 నుండి 2 తరగతుల విద్యార్థులకు పుస్తక పఠనం అలవాటు చేసేందుకు కేంద్రం ప్రత్యేక నిధులను ఇస్తుంది. కేంద్రం కేటాయించిన రు.19 కోట్ల నిధుల్లోంచి రు. 13 కోట్లను 15 సంవత్సరాల పాటు ఆర్ఎస్ఎస్ పుస్తకాలు సరఫరా చేసే ఒప్పందంలో భాగంగా బిజెపి ప్రభుత్వం చెల్లించింది. ఎన్‌సిఇఆర్‌టి సూచించిన పుస్తకాలను మాత్రమే ఎస్ఎస్ఎ పథకం కింద కొనుగోలు చేయాలన్నది నిబంధన. నిబంధనలకు విరుద్ధంగా వ్యవహరించడంపై రాష్ట్ర కాంగ్రెస్ పార్టీ సిబిఐకి ఫిర్యాదు చేయడంతో ఈ విషయం వెలుగులోకి వచ్చింది.

వీ

## బ్రెజిల్‌లో నిరసనలు

ప్రభుత్వ ప్రజా వ్యతిరేక విధానాలను నిరసిస్తూ బ్రెజిల్ ప్రజలు ఆందోళన బాట చేపట్టారు. ప్రజా సంక్షేమం పట్టించుకోకుండా వృథా వ్యయం నిలిపివేయాలని డిమాండ్ చేశారు. నాణ్యమైన విద్య, ఆరోగ్య పరిరక్షణ సౌకర్యాలు కల్పించాలనీ, ప్రభుత్వ రవాణా ఛార్జీలను తగ్గించాలనీ డిమాండ్ చేశారు. మినాస్ జెరియాస్ రాజధాని బెలోహారి జోంటే నగరంతో పాటు వివిధ నగరాలలో నిరసన ప్రదర్శనలు జరిపారు.

## అమెరికా - స్నోడెన్ వేట

అమెరికన్ విజిల్ బ్లోయర్ మీద వేట మొదలవడంతో హాంకాంగ్‌కు వెళ్లిన స్నోడెన్ అక్కడి నుండి రష్యాకు వెళ్లాడు. 'ఇక ముందు అమెరికాకు హాని కలిగించే కొత్త లీకులకు పాల్పడకూడద'న్న రష్యా షరతులను అంగీకరిస్తూ తాత్కాలిక ఆశ్రయానికి దరఖాస్తు చేసుకున్నాడు.

## చైనాలో ఆందోళనలు

చైనా సుదూర పశ్చిమ ప్రాంతం జిన్ జియాంగ్‌లో జాతుల మధ్య పోరాటం కొనసాగుతోంది. తాజాగా జూన్ 26న జరిగిన ఘర్షణల్లో పది మంది పోలీసులతో సహా ఇరవై ఏడు మంది మరణించారు. ఈ ఘర్షణలు స్థానిక ఉయ్‌గుర్, టర్కిక్ ముస్లిం జాతులు పెరుగుతున్న చైనీ వలసల నడుమ జరుగుతున్నాయి. మరోపక్క చైనా మాజీ రైల్వే శాఖ మంత్రి లీ జిజుయన్‌కు బీజింగ్ న్యాయస్థానం జూలై 7న మరణశిక్ష విధించింది. ప్రపంచంలోనే అతిపెద్దదయిన రైల్వే ప్రాజెక్టుకు సంబంధించిన వ్యవహారంలో పది మిలియన్ డాలర్ల అవినీతికి పాల్పడ్డారన్న ఆరోపణతో ఆయనకు శిక్ష విధించారు.

## పాకిస్తాన్ - దాడులు

బ్రిటన్ ప్రధాని పాకిస్తాన్ రాజధానిలో తీవ్రవాదానికి వ్యతిరేక పోరులో మద్దతిస్తామని ప్రకటిస్తున్న సమయంలో జూన్ 30న పెషావర్‌లో పారా మిలిటరీ కాన్వాయ్‌పై జరిగిన దాడిలో 21 మంది మరణించారు. ఇందులో సాధారణ పౌరులే అధికమని పోలీసు అధికారి తెలిపారు. కాగా మాజీ నియంత ముషర్రఫ్ దేశద్రోహం, మాజీ ప్రధాని బేనజీర్ హత్య కేసును ఆలస్యం చేయకుండా పరిశోధన పూర్తి చేయాలని పాక్ ఉన్నత న్యాయస్థానం ప్రభుత్వాన్ని ఆదేశించింది. జూలై 3న అమెరికా మానవ రహిత విమాన దాడిలో అల్‌ఖైదా నెట్‌వర్క్ సంబంధిత ఆవరణలో పదిహేడు మంది మరణించారు. దీన్ని పాకిస్తాన్ సార్వభౌమాధికారాన్ని ధిక్కరించే చర్యగా ప్రభుత్వ వర్గాలు ఖండించాయి.

## ఈజిప్ట్ - మోర్సీ పతనం

ఈజిప్ట్‌లో 2011లో హోస్నీ ముబారక్‌ను పదవీచ్యుతుడిని చేసిన తరువాత ఎన్నికయిన సివిలియన్ అధ్యక్షుడు మోర్సీ ముస్లిం మతతత్వ బ్రదర్‌హుడ్‌ను ప్రోత్సహిస్తున్నాడని రాజకీయ ప్రత్యర్థి వర్గాల మద్దతుదార్లు జూన్ 30న మోర్సీ గద్దె దిగాలంటూ రెండు లక్షల మంది తెహ్రీర్ స్క్వేర్ వద్ద ఆందోళనలు చేశారు. దీంతో మోర్సీ మద్దతుదార్లకు, వ్యతిరేక వర్గాలకు మధ్య తీవ్ర ఘర్షణలు చోటు చేసుకున్నాయి. సైన్యం జోక్యం చేసుకొని, జాతీయ ప్రతిపక్షాల యువకులతో కలిపి ప్రభుత్వాన్ని పంచుకో వలసిందిగా మోర్సీని కోరింది. మోర్సీ అందుకు నిరాకరించడంతో ఆయనను తొలగించి ఉన్నత రాజ్యాంగ న్యాయస్థానం న్యాయమూర్తి అడ్లిమాన్సూర్‌ను మధ్యంతర అధ్యక్షునిగా జూలై 4న ప్రమాణ స్వీకరం జరిపించింది. దీంతో ఘర్షణలు మరింత తీవ్రతరం అయ్యాయి. సైన్యం జరిపిన కాల్పుల్లో నలభై మందికి పైగా మోర్సీ మద్దతుదార్లు ప్రాణాలు కోల్పోయారు. వందల సంఖ్యల్లో తీవ్రంగా గాయపడ్డారు. ఘర్షణలు ఇంకా కొనసాతునే ఉన్నాయి.

## బంగ్లాదేశ్ - గులాం అజాంకు జైలు

1971లో యుద్ధ నేరాలకు గాను అంతర్జాతీయ నేర విచారణ ట్రిబ్యునల్ జమాతె ఇస్లామీ అగ్రనేత గులాం అజాంకు 90 ఏళ్ల జైలు శిక్ష విధించింది. ఇదే నేరాలకు గాను జమాతె ఇస్లాం నాయకుడు మహ్మద్ మొజహీద్‌కు మరణశిక్ష విధించింది. మొజహీద్ నాయకత్వం లోని మిలిషియా చేతిలో జర్నలిస్టులు, మేధావులు నలభై రెండు మంది హత్యకు గురయ్యారు. మొజహీద్ మద్దతుదార్లు ఈ తీర్పును వ్యతిరేకిస్తూ నిరసన ప్రదర్శనలు చేపట్టారు.

## భూటాన్ - ఎన్నికలు

జూలై 14న భూటాన్ నేషనల్ అసెంబ్లీకి జరిగిన ఎన్నికలలో షెరింగ్‌టాడ్‌గె నాయకత్వంలోని పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీ (పిడిపి) నలభై ఏడు స్థానాలకు గాను ముప్పై రెండు స్థానాలను గెలుచుకొంది.

## యురోపియన్ యూనియన్

తమ యూనియన్‌కు చెందిన కార్యాలయ్యాల్లోని కంప్యూటర్‌లలో యుఎస్ బగ్స్‌ను అమర్చినట్లు, నెట్ చౌర్యానికి పాల్పడినట్లు తెలియడంతో ఫ్రాన్స్, జర్మనీ, గ్రీస్, ఇటలీలు అమెరికా పట్ల తీవ్ర ఆగ్రహాన్ని వ్యక్తం చేశాయి. ఫ్రాన్స్ అధ్యక్షుడు ఫ్రాంకొయిస్ హోలండే అమెరికా వెంటనే ఈ చర్యలను నిలిపి వేయాలని ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. బ్రిటన్ తమ దేశానికి చెందిన నెట్ చౌర్యానికి పాల్పడిందని జర్మనీ న్యాయశాఖ మంత్రి బ్రిటన్‌ను వివరణ కోరారు.

## ఇరాక్ - తిరుగుబాటుదారుల దాడులు

ఇరాక్‌లోని షియాల నాయకత్వంలోని ప్రభుత్వం సున్నీలను నిర్లక్ష్యం చేస్తోందని తిరుగుబాటుదారులు గత కొంతకాలంగా దాడులకు పాల్పడుతున్నారు. ఒక్క ఈ జూలైలో 340 మంది, సంవత్సర కాలంగా 2600 మంది చంపబడ్డారని, తాజాగా జూలై 14న జరిగిన దాడిలో మోసుల్‌లో రెండు జిల్లా కౌన్సిలర్లు ఎనిమిది మంది సాధారణ పౌరులు మరణించారని ఎఎఫ్‌పి వార్తా సంస్థ తెలిపింది.

## చైనాలో భూకంపం

చైనాలోని గాన్సు ప్రావిన్స్‌లోని డింగ్జి నగరంలో తీవ్ర భూకంపం సంభవించింది. రిక్టర్ స్కేల్‌పై దీని తీవ్రత 6.6గా నమోదయింది. ఈ భూకంపం తాకిడికి 94 మంది మరణించారు. ఐదు వందల మందికి పైగా గాయపడ్డారు. వేలాదిగా ఇళ్లు దెబ్బతిన్నాయి. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(1 జూన్ నుండి 30 జూన్ 2013 వరకు 12 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1475)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| **(1)** | **(2)** | **(3)** | **(4)** | **(5)** | **(6)** | **(7)** | **(8)** | **(9)** | **(10)** | **(11)** | **(12)** | **(13)** | **(14)** | **(15)** | **(16)** | **(17)** | **(18)** | **(19)** | **(20)** | **(21)** | **(22)** |
| ఆదిలాబాద్ | 2 | 3 | – | 14 | 16 | 5 | 7 | 3 | 1 | 1 | 2 | 3 | 1 | 3 | 16 | 24 | – | – | – | 2 | 4 |
| మహబూబ్‌నగర్ | – | 2 | 1 | 20 | 18 | 4 | 3 | – | 3 | 2 | 4 | 13 | 12 | 6 | 49 | 22 | – | – | 1 | – | 1 |
| హైదరాబాద్ | – | – | – | 11 | 7 | – | – | – | – | 4 | 6 | 8 | – | – | 26 | 20 | – | – | – | 9 | – |
| మెదక్ | – | 5 | – | 9 | 14 | 4 | 5 | 2 | 1 | 2 | 1 | 4 | – | 12 | 35 | 35 | – | – | – | – | 13 |
| నిజామాబాద్ | – | – | – | 5 | 12 | – | – | 1 | 2 | 5 | 1 | 9 | 6 | – | – | – | – | – | – | – | – |
| కరీంనగర్ | 1 | 7 | 11 | 30 | 27 | 5 | 7 | 4 | 4 | 7 | 8 | 10 | 5 | 8 | 50 | 34 | – | – | – | – | 62 |
| రంగారెడ్డి | – | 2 | – | 12 | 20 | 7 | 8 | 2 | 5 | 9 | 4 | 4 | 1 | 12 | 34 | 8 | – | – | – | – | 2 |
| వరంగల్ | 5 | – | – | 21 | 15 | 9 | 9 | 7 | 1 | 1 | – | – | 1 | 20 | 15 | 20 | – | – | – | – | 3 |
| ఖమ్మం | – | 2 | – | 6 | 13 | 1 | 3 | 1 | 1 | 3 | 2 | 4 | 1 | 7 | 12 | 16 | – | – | – | – | 26 |
| నెల్లూరు | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | |
| కర్నూలు | – | 3 | – | 5 | 3 | 9 | 6 | 12 | 8 | 4 | 4 | 5 | 9 | 7 | 29 | 26 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | – | – | – | 1 | 4 | 3 | 2 | – | 1 | 2 | 1 | 1 | 4 | 5 | 25 | 7 | – | – | – | – | 5 |
| విశాఖపట్నం | – | – | – | 4 | 11 | 1 | – | – | 5 | 6 | 1 | – | 8 | 2 | 45 | 11 | – | – | – | 2 | 8 |
| విజయనగరం | | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | |
| **మొత్తం** | **8** | **24** | **12** | **138** | **160** | **48** | **50** | **32** | **32** | **46** | **34** | **61** | **48** | **82** | **336** | **223** | **–** | **–** | **1** | **13** | **127** |



# తెలుగు అకాడమి

హిమాయత్‌నగర్, హైదరాబాదు - 500 029.




అధ్యక్షులు
మాన్యశ్రీ సి. దామోదర రాజనర్సింహ
ఉప ముఖ్యమంత్రి,
ఉన్నత, సాంకేతిక విద్య శాఖామాత్యులు,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

ఈ మెయిల్: info@teluguacademy.net
వెబ్: www.teluguacademy.net
ఫోన్‌నంబర్లు: 040-23225215, 23226041
ఫ్యాక్స్ : 040-23225359


## అకాడమి లక్ష్యాలు

భాషాప్రయుక్త రాష్ట్రాల ఆవిర్భావం తర్వాత ప్రాంతీయ భాషల అభివృద్ధి, వికాసానికి భారత ప్రభుత్వం తీసుకున్న కొన్ని చర్యల ఫలితంగా తెలుగు అకాడమి ఆవిర్భవించింది. తెలుగు అకాడమి ప్రధాన ధ్యేయం తెలుగు భాషను అభివృద్ధి పరచి విద్యా విషయక గ్రంథాలను విద్యార్థులకు అందించడం.

## అకాడమిలో లభించే పుస్తకాలు

ఇంటర్ నుంచి పి.జి.వరకు పాఠ్యపుస్తకాలు అందివ్వడం అకాడమి బాధ్యతలలో ప్రధానమైనది. మాండలీకాల వంటి భాషా గ్రంథాలు, నిఘంటువులు, పాఠశాల స్థాయి నిఘంటువులు, పదకోశాలు, పారిభాషిక పదకోశాలు, పోటీ పరీక్షలకు అవసరమైన గ్రంథాలు, తెలుగు బోధన శిక్షణగ్రంథాలు, వ్యక్తిత్వ వికాసగ్రంథాలు, స్వయం ఉపాధికల్పనకు ఉపకరించే పుస్తకాలు అకాడమి ప్రచురిస్తుంది. అకాడమి ప్రధానంగా భాషా వికాసం కోసం, భాషను పరిపుష్టం చేయడానికి ఉద్దేశించింది.

తెలుగు అకాడమి 40 సంవత్సరాలుగా "తెలుగు" త్రైమాసిక వైజ్ఞానిక పత్రికను కూడా నిర్వహిస్తున్నది.

## అకాడమి విక్రయ కేంద్రాలు

అకాడమి ప్రచురించే పుస్తకాలను హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్నం, తిరుపతి, అనంతపురం, వరంగల్, గుంటూరులలోని పంపిణీ కేంద్రాల ద్వారా రాష్ట్రమంతటా విద్యార్థులకు అందచేస్తున్నది.

## తెలుగు రానివారికి తెలుగు నేర్పించడం

పరిపాలన రంగంలో తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టి, దాన్ని సులువుగా అమలుపరచడానికి ప్రభుత్వం చేస్తున్న కృషిలో సహకరించడం అకాడమి లక్ష్యాలలో ఒకటి. అధికారభాషగా తెలుగును అమలుపరిచే ప్రభుత్వ విధానంలో భాగంగా, అకాడమి లక్ష్యాలకనుగుణంగా రెండోభాషగా తెలుగు బోధన కార్యక్రమం కింద తెలుగు భాషను నేర్చుకోవాలనుకునేవారికోసం, ప్రభుత్వ, ప్రభుత్వేతర ఉద్యోగుల తదితరుల కోసం గత 40 సంవత్సరాలనుంచి తెలుగులో పరిచయకోర్సును, ఉన్నత కోర్సులను నిర్వహిస్తుంది. బోధన కాల వ్యవధి 48 పనిరోజులు. కోర్సులు పూర్తి అయ్యేనాటికి తెలుగులో మాట్లాడడం, రాయడం, చదవడం కొంతవరకు అలవరచుకోవచ్చు. పరిచయ కోర్సులో ప్రవేశానికి విద్యార్హత ఎస్.ఎస్.సి., ఉన్నత కోర్సులో చేరడానికి పరిచయకోర్సు పూర్తిచేసి ఉండాలి. ఇప్పటివరకు 54 పరిచయకోర్సులు, 40 ఉన్నతకోర్సులను అకాడమి నిర్వహించింది. ఈ కోర్సు పూర్తిచేసి ఉత్తీర్ణులయి ఉన్నతస్థాయిలో నిలిచినవారికి బంగారు పతకం బహూకరించడం జరుగుతున్నది.

ఈకోర్సుకు సంబంధించి తెలుగు పరిచయవాచకం రూ.45/-లకు, రాత పనిపుస్తకం రూ.16/-లకు ఉన్నత వాచకం రూ.24/- లకు, లర్న్ తెలుగు సి.డి. రూ.60/-లకు తెలుగు అకాడమి విక్రయిస్తున్నది.

## అకాడమి అందించే విద్యార్థి పురస్కారాలు

2001 సంవత్సరం నుంచి తెలుగు అకాడమి ఇంటర్మీడియట్‌లో తెలుగు మాధ్యమంలో చదివి రాష్ట్రస్థాయిలో ప్రథమ, ద్వితీయ స్థానాలు సాధించిన విద్యార్థులకు పురస్కారాలు అందచేస్తున్నది.


ఉపాధ్యక్షులు
శ్రీ అజయ్‌మిశ్రా, ఐ.ఎ.ఎస్.
రాష్ట్రఉన్నత విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, హైదరాబాదు.

సంచాలకులు
ఆచార్య కె. యాదగిరి
ఎం.ఎ., పి.హెచ్.డి.



సం. 31/తెఅ/తవి/పుప్ర/2013-14, జారీ చేసిన తేది. 09.07.2013

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 145 - August 2013 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 29/7/2013 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణం మీ నుంచి కోరుతున్నది
# రచనా సహాయం, ఆర్థిక సహాయం

మీ వంటి వేలాది మంది పాఠకుల ఆదరాభిమానాలతోనే వీక్షణం నానాటికీ అభివృద్ధి చెందుతున్నదని మీకు తెలుసు. వీక్షణం తాను పెట్టుకున్న ప్రజా చైతన్య పురోగమన, విస్తరణ లక్ష్యాలకు మరింతగా చేరుకోవాలంటే మీవంటి అభిమానులు, పాఠకులు, రచయితలు, దాతలు మరింతగా చేయూత నందించవలసి ఉంది. మీ చేయూత రచనల రూపంలో కావచ్చు, ఆర్థిక సహాయం రూపంలో కావచ్చు.

వీక్షణంకు రచయితల నుంచి, అభిమానుల నుంచి రచనలు గణనీయంగానే అందుతున్నప్పటికీ ఇంకా ఎక్కువ, ఇంకా నాణ్యమైన రచనలు రావలసి ఉంది. అందుకు మీ పూనిక అవసరం. వీక్షణం మూడు రకాల రచనలకు ప్రాధాన్యతనిస్తుంది : 1) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలలో విరివిగా సమాచారం వస్తున్నప్పటికీ ప్రజానుకూల విశ్లేషణ లేని అంశాలపై ప్రజా దృక్కోణం నుంచి లోతైన విశ్లేషణలు. 2) ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు సాధారణంగా విస్మరించే ప్రజా జీవన పరిణామాల గురించి సమాచార, విశ్లేషణా రచనలు. 3) ఏ సమాచారాన్నయినా అర్థం చేసుకోవడానికి అవసరమైన పనిముట్లు అందించే దృక్పథ ప్రధానమైన రచనలు.

వీక్షణం ఆర్థిక స్థితి సమస్యాత్మకంగా ఉన్నదని, ఏ నెలకానెల అన్నట్టుగా సాగుతున్నదని మీకు ఎప్పటికప్పుడు నివేదిస్తూనే ఉన్నాం. ప్రతి సంచిక ఆర్థిక లోటుతో నడుస్తున్నది. వ్యక్తిగత చందాలు, సంస్థల చందాలు, పుస్తకాల అమ్మకాలు, విరాళాలు, ప్రకటనలు వంటి వనరులన్నీ ఇంకా పెరిగితే గాని పత్రిక మనుగడ సుస్థిరం కాదు. వీక్షణం అభిమానులు, పాఠకులు ప్రతి ఒక్కరూ పూనుకుని తమ వంతు బాధ్యతగా చందాలు చేర్పించడం, విరాళాలు, ప్రకటనలు సేకరించడం వంటి అన్ని రూపాలలో ఆర్థిక సహాయం అందించడం అవసరం.

**తెలుగు సమాజంలో ప్రగతిశీల ఆలోచనాధారలో, ప్రజానుకూల పత్రికల సంప్రదాయంలో కృషి చేస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక వీక్షణం**

**తెలుగు సమాజం తనతో తాను చేసుకుంటున్న సంభాషణ వీక్షణం**

**ఈ సంభాషణను విస్తరిద్దాం! తెగిపోకుండా కాపాడుకుందాం!**

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao